# మున్నూరు కాపుల అభ్యుదయము

## కార్యకలాపాలు
(1920-67)

సంకలనం :

బొజ్జం నర్సింలు

[అఖిల భారత తెలుగు మున్నూరుకాపు సంఘాధ్యక్షులు]

ప్రచురణ :

బొజ్జం నర్సింలు

4-2-789, రాంకోటి

హైదరాబాదు-1 ఆం. ప్ర.

ప్రచురణ : 1968

ప్రతులు : 2000

వెల :

మేలు ప్రతి : రూ. 6

సాదా ప్రతి : రూ. 5

ముద్రణ :

వేంకట్రామ్ పేపర్ ప్రోడక్ట్సు(ప్రై॥) లి.

నారాయణగూడ హైదరాబాదు-29

ప్రతులకు :

బొజ్జం నర్సింలు

4-2-789, రాంకోటి

హైదరాబాదు-1 ఆం. ప్ర.

# మనవి

మున్నూరు కాపుల అభ్యుదయ కార్యకలాపములు లభించినంతవరకు సంకలనముచేసి, గ్రంథరూపములో ప్రచురించ వలయునను, నా చిరకాల వాంఛను పూర్తిచేసికో గలుగుట నాకు సంతృప్తి కరముగానున్నది. ఇందలి విషయములు సరిక్రొత్తవికావు. ఇవి పరిశోధకుల కృషి ఫలితములు, మనవారిచే వ్రాయించబడి, కొన్ని తావులందు లభ్యమైన శాసనములు కూడ ఈ చరిత్ర రచనకు ఆధారములైనవి. 'మున్నూరు' వారి చరిత్రకు సంబంధించిన కొన్ని వితర్కములు, అపోహలు, ఊహాగానములుకూడ కలవు. మున్నూరు కాపు సంఘము ఏర్పడుటకు పూర్వదినములలో మన సాంఘిక వ్యవహారములు కడు విచిత్రములు. పూర్వదినములలో పరస్పర కక్షలకు, పంచాయితీలకు కుల బహిష్కారములు ఏకైక పరిష్కారములై యుండెడివి.

అట్టితరి, కీర్తిశేషులగు తుంగ బాలకిష్టయ్య, పోస్టుఆఫీసు వెంకటస్వామి, టి.ఆగయ్యగారలు మరియు నేను వీధి, వీధి తిరిగి, మనపురోభివృద్ధి కారణములు అన్వేషించి, కులమునకు సరియైన పేరుపట్ల అభిప్రాయములు సేకరించితిమి. వీరి ఏకీభావముతో 11-8-1340 ఫసలీన ఫీల్ఖానాలో కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన ఒక బ్రహ్మాండమైన సభ జరిగినది. తత్ఫలితంగా, మున్నూరు కాపు మహాసభలు జరుగుచు వచ్చినవి. సభల సమావేశమప్పుడు నిరాశావాదులచే ఆటంకములు, నిరోధకములు బహుముఖముగా కల్పింపబడినవి. బొంబాయిలోని వారు మన వారితో సంబంధ బాంధవ్యముల నెలకొల్పుకొను ఉద్దేశ్యముతో, మన సభలలో పాల్గొని, తమ అమూల్యాభిప్రాయములు వెలిబుచ్చినారు.

అఖిలభారత మున్నూరుకాపు తృతీయ మహాసభ హైదరాబాదులో జరిగినది.

మున్నూరు శబ్దోత్పత్తికి కారణములు పెక్కులు. వాటిని గ్రంథస్థము చేయబడినవి.

జనక చక్రవర్తి సీతాస్వయంవర సందర్భమున, విరుచుట కుద్దేశింప బడిన శివుని బరువైన విల్లును "ఒక మున్నూరు కదల్చి తెచ్చి"రట. జనకుడు కర్షక చక్రవర్తి-మున్నూరు వీరులము మనము. రావణాసురుడు విరవజాలని ఈ విల్లును శ్రీరాముడు విరచి జానకిని వివాహమాడెను. ఇది త్రేతాయుగము మాట. ఇది నిజమేకావచ్చును. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, చిలుకూరు వీరభద్రరావు, ఓగిరాల సుబ్బారావుగారల పరిశోధనా సారాంశము లిటులున్నవి:—

వీరు మిథిల, అయోధ్యా నగరముల నుండి గోదావరి ప్రాంతమునకు వలస వచ్చి క్రమముగా ఆంధ్రదేశమునందంతటను వ్యాపించిరి. నాటి ఆర్యుల నిర్దేశమువలన వైశ్యవృత్తి నవలంబించిరి. కొందరు క్షాత్ర ధర్మమును నిర్వర్తించుచుండిరి. అధిక సంఖ్యాకులు కాపుదనము వలన జీవించుచుండిరి.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము మూడువందల కుటుంబములు హైద్రాబాదు రాజ్యమునకు వచ్చినవి. వారే మున్నూరు వారని వ్యవహరింపబడుచున్నారు.

స్థానిక చరిత్రాంశమేమనగా, మరాఠాయుద్ధ సమయములలో నిజాం, బ్రిటిషువారితో జరుపుకొనిన సంధి ప్రకారము, తన సైన్యమును కొంత బ్రిటిషువారికి బంపినపుడు, నిజాం సైన్యములో మున్నూరు దళాలు ఉండిరి. అప్పుడు చాలమంది మున్నూరుకాపువారు బ్రిటిషు ప్రాంతములలో స్థిరపడిపోయిరి. నాగపూరు, బొంబాయిలో నున్నవారే ఇందుకు నిదర్శనము.

ఇటీవల మున్నీరు, తోటబలిజలు, కాపు, తెలగలు అను పేర్లుకూడ బయలుదేరినవి. కాని అవి తాత్కాలికములే అయిపోయినవి. అయితే, మనలో కొందరు శుద్ధకాపులుగనే వ్యవహరింపబడ దలచుకున్నారు.

నిజాం రాష్ట్రములో అసలు 'మున్నూరువారు' అని పిలువబడే వారు. వెనుకబడిన తరగతుల పట్టికలో చేరిన వారు. నాగపూర్‌లో

జరిగిన మహాసభలో "మున్నూరుకాపు" అను నామకరణము స్థిరపడినది. నిజాం రాష్ట్రములోని సమావేశములు 'మున్నూరుకాపు మహాసభలు' గా జరిగినవి.

మొత్తము పైన ఏబది సంవత్సరముల సుదీర్ఘ కాలమున కేవలము అయిదు సభలు మాత్రమే సమావేశమగుట శోచనీయమైనను, మన కృషి నిష్ఫలితము కాలేదు. మనలో విద్య, ఆచారవ్యవహారములలో ఎంతో సంచలనము కలిగినది. ఐతే, అది సంతృప్తికరముగా లేదు. ఇంకను ఎంతయో వాంఛనీయమై యున్నది. 'రోము నగరము ఒక దినములో నిర్మింపబడలే'దను ఒక ఆంగ్ల లోకోక్తి గలదు.

యువకులకు, రాబోవు సంతతి వారికి, ఈ చరిత్ర ఆదర్శ ప్రాయము కావలయునని నా ఆశయము. ఈ నా ప్రయత్నము ఎంత వరకు సఫలీకృతమైనదో సుహృద్భావపూరితులైన పాఠక మహాశయులే తీర్మానించెదరు గాక !

## మున్నూరుకాపు సంఘము వ్యవస్థీకరింపబడినప్పటినుండి మనము సాధించిన పనులు

### మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహము

మున్నూరుకాపు మహాసభల తీర్మానము ప్రకారము ఈ వ్యవస్థ నిర్మాణము కాచీగూడలో 3-3-43 నాడు చేపట్టబడినది. 17 మళ్గిలతో కూడిన ఈ వసతి గృహము యొక్క విలువ పచెలక్షలు అంచనా వేయ వచ్చును. మళ్గిలకుగాను దాదాపు రూ. 50,000లు అభిమానులచే నొసగబడినవి. భవన నిర్మాణముపై ఇంత వరకు అయిన వ్యయము రు. 3,50,000 ఇంకను పని జరుగుచున్నది. ఆంధ్ర, తెలంగాణా అన్ని జిల్లాల నుండి బొంబాయి, రాయచూరు, గుల్బర్గా, బీదరు, మహారాష్ట్రపు వెనుకబడిన తరగతుల నుండి 25 మంది వీరితో కలిపి వంద విద్యార్థులకు

అన్ని వసతులతో గదులునిర్మింపబడును. వీరందరిలో కేవలం సాంకేతిక విద్యార్థులకు వారి తలిదండ్రులు భరించగల మొత్తము పోగా, జామీనుల హామిపై కాలేజీ అయిదు సంవత్సరముల విద్యార్థులకు నె॥ రూ.40/లు, వృత్తి విద్యార్థులకు రూ. 30/-లు ఉన్నత పాఠశాలా విద్యార్థులకు రూ. 20/-లు, ప్రాథమికులకు రూ.10/-ల చొప్పున ధనము ఋణముగా నిచ్చుట ఆలోచింపబడు చున్నది. ఆకుల దుకాణములు గలవారికి బండ్లపై వ్యాపారము చేయు వారికి గూడ అప్పులివ్వబడును. ఋణములు, ఋణ గ్రాహకుల ఆర్థిక స్తోమతబట్టి వసూలుచేసికోబడును. పరీక్షలలో కృతార్థులైన విద్యార్థులు ఉద్యోగములు బడిసిన తరువాత వారిజీతముల నుండి 12శాతము ఋణము క్రింద చెల్లింతురు :

మళ్గీలు కిరాయపై ఇవ్వబడినవి. భవనపు పై భాగములు మరియు భవనపు లోపలిభాగమును కిరాయపై నిచ్చినచో మొత్తము నెలసరి ఆదాయము రూ. 10,000/- లు. రావచ్చును.

ఇందుకు ఖర్చులు, ఉత్తర ప్రత్యుత్తరములు, సాధారణ వ్యవస్థాపరిపాలనకు ఒక మేనేజరు వ్రాత పనులకు ఇద్దరు గుమాస్తాలు. ఇద్దరు భృత్యులు అవసరమై యుందురు. కొద్దిపాటి రిపేరింగు, ఆస్తి పన్ను వగైరాలకు నెలసరి ఆదాయములో 20 శాతము వ్యయము కావచ్చును.

## యువకమండలి

1930 లో మున్నూరుకాపు బాలభట సంఘము కాచిగూడలో శ్రీ గొల్లపల్లి కోనయ్యగారి అధ్యక్షతన ఏర్పడినది. 7-6-1930 నాడు యువకమండలి సర్వశ్రీ తుంగ సాంబయ్య,ఎట్టం సత్యనారాయణ గార్లచే స్థాపింపబడి ఇంతవరకు నిర్వహింపబడుచున్నది. ఇటీవలనే శ్రీ చున్నం శ్రీరాములు అధ్యక్షతన ఎన్నికలు జరిగినవి. వారే ప్రస్తుతము ఈ సంస్థను నిర్వహించుచున్నారు. కాని వీరికి ఉచితరీతిన ఉత్సాహము సహకారము లభించకుండుట శోచనీయము.

## మున్నూరుకాపు మహిళాసంఘము

అఖిలభారత తెలుగు మున్నూరుకాపు తృతీయమహాసభ 1946 లో హైదరాబాదునందు జరిగినప్పుడు మున్నూరుకాపు మహిళా సంఘము శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మ అధ్యక్షతన ఏర్పడినది. తదుపరి ఈ మహిళా సభ, శ్రీమతి A. R. సుజాతాదేవి అధ్యక్షతన భువనగిరిలో సమావేశమైనది. మహాసభలతో పాటు మహిళా సభలు గూడ జరిగినవి. 15-1-68 నాడు మహిళా సమావేశము కీ॥ శే॥ పెద్ది నరసయ్యా కూతురు డా॥ సరస్వతీబాయి అధ్యక్షతన జరిగినది. ఈ క్రింది వారు సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడినారు. డా॥ సరస్వతీబాయి సుభద్రమ్మ, శ్రీమతి పి. హేమవతి, శ్రీమతి రాంసెట్టి కమలాబాయి, శ్రీమతి బొజ్జం ఏకాంబరం, శ్రీమతి అక్కినపల్లి సుగుణ, శ్రీమతి ఈశ్వరమ్మ, శ్రీమతి సుజాతమ్మ ,శ్రీమతి నీలకంఠం సత్యనారాయణ నూరుమంది సభ్యులు ఈ సంఘములో చేరిన తర్వాత ఎన్నికలు జరుపు కొనుటకు తీర్మానింపబడినది.

## గ్రంథాలయము

ఈ మధ్యనే కాచీగూడ చౌరస్తా వద్ద మున్నూరుకాపు (కాపు) 'విద్యార్థి వాచనాలయము' స్థాపింపబడినది.

ఈ పుస్తక ముద్రణలో అనవసరమగు కాలహరణము జరిగినది. నా మనవిని ముగించుటకు పూర్వము నేను చెప్పదలచుకొనిన రెండు మాట లేమనగా, పాశ్చాత్య నాగరికతల మధ్య నలిగిపోవుచున్న సాంఘిక వ్యవస్థ మనది.

నేను వ్రాసిన ఈ చరిత్రలో సమాజములోని పూర్తి మంచినిగాని చెడునుగాని చిత్రించ దలచుకోలేదు. అది సాధ్యము కాదు కూడా. కాబట్టి వాటిని ఈ పుస్తకమునందు క్లుప్తముగా మాత్రమే వివరించ ప్రయత్నించితిని.

ఈ పుస్తకము నందు గల విషయములు గోలకొండ పత్రికా పాఠకులందరికి సుపరిచితములే. మిగిలిన విషయాలన్నియు నేటి సాంఘిక వాతావరణములో, అటు పూర్తిగా అజ్ఞానాంధకారములోనుండక, ఇటు సంపూర్ణ సంస్కరణను సాధించలేక, అయోమయావస్థలో నున్న మన సమాజమును విమర్శించ బూనుట కష్టసాధ్యమే. సామాన్య విషయములనే వ్రాసి నేను కులమును కించపరచలేదనే సంతృప్తిని పొందుచున్నాను.

ఇందలి ముద్రణాస్ఖాలిత్యములు, వదలిపోయిన అంశములు, అవసరమనిపించిన మరికొన్ని విషయములు, రెండవ కూర్పులో సరిచేయబడును.

ఈ గ్రంథ సంకలనముకై నన్ను ప్రోత్సహించి, నాకు పలు విధములుగా సహాయపడిన నా మిత్రులు శ్రీ కె. రాములు, శ్రీ ఎదిరె చెన్న కేశవులు, శ్రీ శీలా వీర్రాజు, శ్రీమతి సంగం లక్ష్మీబాయి ఎం. పి. తదితరులకు నేనెంతయో ఋణపడి యున్నాను. వారందరికి నావందనములు.

తమ అమూల్య అభిప్రాయముల నొసగిన శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కొండా వెంకటరెడ్డి, డా॥ చెన్నారెడ్డి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ శ్రీ తోట రామస్వామి, శ్రీ అరిగె రామస్వామి, సర్దార్ గౌతు లచ్చన్న శ్రీ ఎస్ ఎల్ శీలం లెఫ్టినెంట్ గౌర్నర్ గారలకు నా కృతజ్ఞతాన మోవాకములు.

విధేయుడు

బొజ్జం నరసింహులు

# ప్రముఖుల అభిప్రాయములు

## కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు
(గోలకొండ పత్రికా సంపాదకులు)

శ్రీ ప్రతాపరెడ్డిగారి స్వగ్రామము ఇటికాలపాడు. ఆలంపూర్ తాలూకా వీరు బి. ఏ. బి ఎల్. పట్టభద్రులు. హైదరాబాదులో ఒక ఎనిమిది



సంవత్సరములపాటు న్యాయవాది వృత్తిలో నుండిరి. కాని ఆవృత్తి వారికి అచ్చిరాలేదు. వీరు ఆంధ్రాంగ్ల సంస్కృత, ఉర్దు భాషలలో అశేష పాండిత్యము కలవారై యుండిరి. తెలంగాణమును మేల్కొల్పిన వైతాళికులలో ప్రముఖులు. ఇరువది నాలుగు సంవత్సరములు గోలకొండ పత్రికా సంపాదకులుగా నుండిరి. సారస్వత సాంఘిక రంగములలో రెడ్డిగారి సేవ చిరస్మరణీయము. తెలంగాణములో ఆంధ్ర మహాసభకు ప్రథమాధ్యక్షులు వీరే. గ్రంథ రచయితలు, పరిశోధకులు, విమర్శకులు. మున్నూరుకాపు సంఘపు సభలలో వీరు పాల్గొనుచుండిరి. 1340 ఫస్లీ (1931)లో ఫీల్ఖానాలో సమావేశమైన సభకు వీరు అధ్యక్షత వహించిరి. వీరి అమూల్యమైన సలహాలకు మున్నూరుకాపు సంఘ మెంతయో ఋణ పడి యున్నది. వీరు 1958 లో కీర్తిశేషులైరి.

### అభిప్రాయం

11 వ తీరు 1340 ఫస్లీనాడు ఫీల్ఖానాలో జరిగిన సభలో స్థితి పరులు ప్రబుద్ధులైన మీ కుల పెద్దలు పాల్గొని యుండిరి. ఇట్టి సమావేశ ములు మానవ సమాజములో చైతన్యముకలిగించుననుట తథ్యము. మీరు మున్నూరుకాపు సంఘాభ్యుదయమునకు చేయుచున్న కృషి నాకు తెలి యును - సభలను సద్వినియోగపరచి సాంఘికదురాచారములను రూపుమాపుటకు ప్రయత్నించితిరేని మీరు మీ సంఘమును అభివృద్ధి

మార్గమునకు తేగలరను ఆశకలుగుచున్నది. నా పరిశోధన వలన మీ కుల పెద్దల గతచరిత్ర, విజయనగరం, కాకతీయ సామ్రాజ్యకాలములో ఉజ్జ్వలమైయున్నట్లు తెలియుచున్నది.

మన మందరము ఆంధ్రులము. ఐతే, మన తెలుగు జాతి పతనావస్థయందున్నది. మున్నూరుకాపు సంఘపు భవిష్యత్తును ప్రకాశవంతము చేయుట నీ విధ్యుక్త ధర్మమైయున్నది.

## "ఆంధ్రపితామహ" శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

నా చిరమిత్రుడును, తెలంగాణా ఆంధ్రోద్యమమునందు నాకు కుడిభుజముగానుండి చాలా కాలము సర్వవిధముల సేవచేసిన సహకారియు నగు శ్రీ బొజ్జం నర్సిములుగారు ఇప్పుడు అఖిలభారత మున్నూరుకాపు సంఘమునకు అధ్యక్షపదవి నందుండి, సేవ జేయుచున్నారు. వీరు స్వకులాభ్యుదయమును గోరి 'మున్నూరుకాపుల అభ్యుదయము' అను పేర మొదటి నుండి ఈ విషయమున జరిగిన పత్రలేఖనములను పరిశ్రమతో సంపాదించి, వానిని గ్రంధ రూపమున ప్రకటించుచుండుట నాకు చాల సంతోష దాయకమైన విషయము. వీరు స్వకుల విషయమున సేవజేయుచున్న కాలమున నేను వీరితోనుండి శక్తికొలది తోడ్పడి యుంటిని.



వీరు సంపాదించిన కాగితములు చాలాముఖ్యములైనవి. బొంబాయిలోని మున్నూరుకాపు సోదరులు అందుముఖ్యముగా కీర్తిశేషులైన శ్రీ శంకరసాయన్న పర్యాగారు నాకు చాలాపాత స్నేహితులు. వారు బొంబాయి ప్రాంతంలోని పది తావుల నివసించుచున్న, ఇంచుమించు లక్షమంది యొక్క యోగక్షేమములను అరయుచు, వారి విజ్ఞానాభివృద్ధికై 'తెలుగు సమాచార్' అను మాసపత్రికను ప్రకటించు

చుండిరి. వారు ఆంధ్రకవులను గురించి మరాఠీభాషలో ఒక ఉత్తమ కావ్యమును రచియించియుండిరి. అంతేకాక తెలంగాణాలో నాద్వారా జరుగుచున్న ఆంధ్రోద్యమమును ప్రోత్సహించుచు, తత్సహాయముగా ఒకమారు రు. 500/రూపాయలు మరియొకమారు రు. 100/రూపాయలను పంపిరి. ఈ ధనమును నేను ఆకాలమున ఉద్యమ ప్రచారమునకు వినియోగించినట్లు జ్ఞాపకము. అదిగాక శ్రీ పర్యాగారి వ్రాతపైన ఆస్ట్రేలియాలో కూలివార్లుగా పనిచేయుచున్న కొందరు తెలుగు సోదరులు కూడా సుమారు రు. 50/-రూప్యములు నాకు పంపి యుండిరి.

బొంబాయిలోని ఈ తెలుగుసమాజంవారు కొన్ని శతాబ్దముల క్రిందట తెలంగాణములోని నిజామాబాద్, మెదకుజిల్లాలవారు అయ్యివుండి, బొంబాయి ప్రాంతమునకు వలసబోయి అక్కడనే స్థిరనివాసమును ఏర్పరుచకొనిరి. అట్టివారిలో కొందరు కంట్రాక్టర్లుగా, గొప్ప ధనవంతులై బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్‌లో ప్రఖ్యాతిచెంది యుండిరి. అట్టివారిలో బాలారామ్ అను మున్నూరుకాపు సోదరుడు వారిపేర బొంబాయి నగరంలో 'బాలారామ్ స్ట్రీట్' అను నొక వీధి నామినేట్ చేయబడినది. బొంబాయిలోని తెలుగువారు, మన తెలంగాణమువారు. అచటికిపోయినప్పుడెల్ల వారిని గౌరవించుచు, ధనసహాయము చేయుచుండిరి. అనేకులు మనవారు ఇక్కడి నుండి వెళ్ళినప్పుడు కూలివాండ్రుగా వెళ్ళినను, తర్వాత చాలా సంపన్నులై విద్యావంతులై వకీళ్లుగను, డాక్టర్లుగను, గొప్పపేర్లు సంపాదించిరి. బొంబాయి ప్రాంతంలోనే పేద తెలుగువారి పిల్లలకొరకు విద్యార్థి వేతనములు, 'లింగుబాయి'అనె తెలుగు స్త్రీపేర లక్షరూపాయలకు మించిన ధనము ఈ కార్యమునకై ఏర్పాటు చేయబడియుండెను. అక్కడి ప్రముఖులలో 'ఎల్. ఎల్. బి' ప్యాస్ అయి చాలాకాలం వకీలుగా ప్రఖ్యాతుడైన శ్రీయుత ఎస్. ఎల్. శీలంగారు ఇప్పుడు పాండుచెరి సంస్థానమునకు లెఫ్టినెంట్ గవర్నర్‌గా పనిచేయుచున్నారు. వీరందరు మన తెలంగాణమువారి

కుటుంబముల సంతతివారే. కనుక వీరి వైభవములు తెలంగాణావాసుల మగు మనకందరికిన్ని గర్వకారణములై యున్నవి. ఇట్టివారికి సంబంధించిన వ్రాతలు అనేకములు శ్రీ బొజ్జం నర్సిములుగారు సంపాదించి భద్రపరచి, ఈ పుస్తకమును ప్రకటించి యున్నారు. దీనివలన మున్నూరు కాపు కులమువారి కీర్తి భారతదేశమున అజరామర మగుచున్నది.

ఈ కృషి చాలా ప్రశంసనీయమైనది. వీరు సప్రమాణమగు మున్నూరుకాపు కులచరిత్రమును వ్రాయించి. ప్రకటింపదలచి, ఎంతో ధనమును వ్యయపరచి యుండిరి. కాని దురదృష్టవశమున ఆ ప్రయత్నం సఫలం కాలేదు. అయినను అంతకాకపోయినా, కొంతవరకైనను ఈ పుస్తకము వలన ఆ మహదోద్దేశం నెరవేరుచున్నదని నా అభిప్రాయము. ఈ పుస్తకము భారతదేశంలోనే సాతురుడగు ప్రతిమున్నూరుకాపు సోదరుని హస్తమునలంకరించు గాక. తెలంగాణంలో కులసోదరులందరియందును చదువుకొనిన సోదరీమండలియందును, ఈ గ్రంథంలోని విషయములు వ్యాపించి విద్యను అభివృద్ధికల్పించుగాక.

నేను శ్రీ నర్సిములుగారి సంఘసేవకు, వారిని ప్రశంసించుచు, వారికి దీర్ఘాయువును, చిరకీర్తిని లభింపజేయ, పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

## శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు

**మాజీ ఉప ముఖ్యమంత్రి ఆం. ప్ర.**

శ్రీ బొజ్జం నర్సిములు చిరపరిచితులు. వారు రచించిన 'మున్నూరుకుల అభ్యుదయము కార్యకలాపములు' అను గ్రంథమునకు నా అభిప్రాయము వ్రాయవలసినదిగా కోరినారు. నాదృష్టి బొత్తిగా పోయినది. అందువలన ఆ పుస్తకమును చదువలేక, వారితోనే ముఖ్యభాగములను చదివించి విన్నాను. బొజ్జం అంటే సామాన్యవ్యక్తికాదు. వారు ఏపని చేపట్టినను చాలా శ్రద్ధతో పూర్తిచేసేవారు. వీరు ఆంధ్రోద్యమము మొదలుపెట్టినప్పటినుండి ఆంధ్ర జనసంఘం, ఆంధ్రమహాసభ, తదుపరి కాంగ్రెస్‌నందు నాకు తోడునీడగాఉండి, అభివృద్ధి కార్యకలాపములందు సహాకరిస్తు వచ్చారు. ఈ పుస్తకములోని విషయములు

విన్నతర్వాత, వారు తమ అలవాటు ప్రకారము తమ కులమువారి అభి వృద్ధి గురించి, హైద్రాబాద్ రాష్ట్రములోనేగాక ఇతర రాష్ట్రములలో



గూడ అప్పుడప్పుడు చర్చింపబడిన, పత్రికలలో ప్రచురించిన విషయములు సమకూర్చుడములో వారి అపారమైన శ్రద్ధస్పష్టపడుచున్నది. వారి కులమువారైన శ్రీయుతులు ఎస్. ఎల్. శీలం, పుప్పాల నర్సింగ్ రావు, కీ.శే. పర్శా సాయన్న, కన్నవార్లను నేను బాగుగా ఎరుగుదును. వీరు హైద్రాబాద్‌కు వచ్చినప్పుడల్ల వీరి దర్శనము నాకు లభించేది. నేను బొంబాయి పోయినప్పుడు వారిని దర్శించేవాడిని. వారు బొంబాయిలో మున్సిపాలిటీలో, ఇతర ప్రజాహిత రంగములలో వీరుచేసిన సేవ, చూపిన పట్టుదల అపారమైనది.

వీరి పూర్వీకులు తెలంగాణా, ముఖ్యముగా తెలంగాణాలోనున్న నిజామాబాద్ జిల్లా వాస్తవ్యులు. వీరు తెలంగాణా నుండి పోయి బొంబాయి ప్రాంతములోనుండి, మూడువందల సంవత్సరములకు పైగా అయినప్పటికినీ వారిఇంటిలో తెలుగు మాట్లాడుదురు. వ్యవహారము మాత్రం మహారాష్ట్ర భాషలో జరుపుకొనుచున్నారు.

శ్రీ ఎస్. ఎల్. శిలంగారు బ్రిటిష్ ప్రభుత్వకాలమందు బొంబాయి హైకోర్టు న్యాయవాదవృత్తి చేయుచుండిరి. ప్రజాప్రభుత్వ మేర్పడిన తర్వాత బొంబాయి శాసనసభ అధ్యక్షులుగా ఎన్నికైరి. వారు తమ కాలమున చాకచక్యముతో పనిచేసి, కీర్తిసంపాదించిరి. ఇప్పుడు పాండీచేరి రాష్ట్రములో లెఫ్టినెంట్ గౌవర్నర్ గా పనిచేయుచున్నారు. కీర్తిశేషులగు కన్నంవార్ భారతదేశమునకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత నాగపూర్ (మధ్యప్రదేశ్) ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి; అతి సమర్థతతో తమపదవిని నిర్వహించి కీర్తిని గడించిరి. తర్వాత మంత్రిమండలిలో, మరియు ఛీఫ్ మినిష్టర్ గా పనిచేయుకాలమునసే పరమపదవినొందిరి. వారి ఛీఫ్ మినిష్టర్ పదవీ నిర్వహణను గురించి ప్రజలు శ్లాఘించిరి.

కీర్తిశేషులగు పర్షా సాయన్న బొంబాయిలో సాలిసిటర్ గా పని చేస్తు, తెలుగువారి అభివృద్ధికోసం నిధిని సమకూర్చి దానికివచ్చు ఆదాయంతో విద్యార్థులకు ఉపకారవేతనమిస్తు, ఇతరత్ర వారి అభివృద్ధికి సహాయ పడుతుండేవారు.

శ్రీ పుప్పాల నర్సింగ్ రావుగారు బొంబాయి పురపాలక సంఘమునకు అధ్యక్షులు (మేయర్)గా ఎన్నికై బొంబాయి పౌరుల మన్ననలను బడసిరి. ఈ విధముగా వలసపోయిన మున్నూరు కాపువారు తెలంగాణమునకు కీర్తితెచ్చిరి.

మున్నూరుకాపువారంటె కాపు (రెడ్డి)కులములోనివారే ఆంధ్ర ప్రదేశములో కాపు తెగలు 60కంటె మించి యున్నవి. దీని వివరణ 'రెడ్డికుల నిర్ణయ చంద్రిక'లో నున్నది. అందులో వీరొకరు. వీరిప్రత్యేక వృత్తిలేదు. అయినప్పటికిని వీరినిజమైన వృత్తి వ్యవసాయమనె స్పష్ట పడుచున్నది. ఇప్పుడు వీరు ఆంధ్రరాష్ట్రములో ముఖ్యముగా తెలంగాణములోని పట్టణాలలో నివసించి, తెలివితేటలు, చురుకుతనముతో వర్తకము చేస్తు, అనేకులు ధనము గడించినారు. గ్రామాదులలో వ్యవసాయము చేయుచున్నారు. వీరిలో ఇప్పుడిప్పుడు చాలామంది చదివి పండితులు, వకీళ్లు, డాక్టర్లు, ఇంజినీర్లు అయినారు. ప్రభుత్వ ఉన్నతోద్యోగులలో ప్రవేశించినారు. తెలంగాణంలోని ధనవంతులలో చెప్పుకో

దగినవారు శ్రీయుతులు ధడవై కిష్టయ్యా, అన్నం మంకయ్యా కీ. శే, నీలకంఠం నర్సములు మొదలైనవారు విద్యావంతులలో చెప్పుకోదగిన అడ్వకేట్లలో శ్రీయుతులు మిఠాయిక్మ్రి ర్సయ్యా, పి శివశంకర్. ఎస్. వెంకటస్వామి, బి. రంగారావు ఇత్యాదులు.

డాక్టర్లలో కీ. శే. టి. మల్లయ్యా, డా॥గోవిందరాజులు, డా॥ సరస్వతీబాయి మొదలైనవారు. ఇంజనీర్లలో శ్రీయుతులు కె. రామస్వామి చీఫ్ ఇంజనీర్ (రిటైర్డ్) పి నర్సయ్యా, నారం కృష్ణారావు, టి. స్వామి, వాసాల వెంటయ్యగార్లు

ఈజాతికి. తెలివి తేటలతో చేయుచున్న కృషినిబట్టి, భవిష్యత్తు చాలా ఉజ్వలంగా ఉన్నట్టు కనిపించుచున్నది.

శ్రీ బొజ్జం నర్సిములుగారు చతుర్ముఖ చతురతగలవారు. వీరికి ప్రత్యేకముగా ఏవృత్తిలేదు. వీరికి, కుల, మత, ప్రాంతీయ విచక్షణ లేకుండా, ప్రతిప్రజాహిత కార్యమునందు ప్రవేశించి శక్తివంచన లేకుండా పనిచేయుటయే బాల్యము నుండి ఇప్పటివరకు వీరివృత్తియై యున్నది. హైద్రాబాద్ ప్రజాహిత కార్యములు, వీరికి సంబంధములేనివి లేవని చెప్పుట, అతిశయోక్తికాదు వీరు చేసిన ప్రజాహితకార్యముల వివరణ పేర్కొనుటకు స్థలవిస్తరణ భీతిచే నేను ఇచట వ్రాయదలచలేదు.

వీరు గ్రంథమును రచించుటలో తీసుకున్న శ్రద్ధ, స్తోమతుల యందు చూపిన యభిమానమే దానికి నిదర్శనము.

దీనిని మున్నూరు కాపువారిలో ప్రతివ్యక్తి తప్పక తదితరులు అభిమానముతో చదువదగినదని నా అభిప్రాయం వెల్లడించుచున్నాను.

ప్రస్తుతం కులమతములన్ని నిర్మూలమై అందరు భారతీయులుగా చెప్పుకొను కాలము సమీపిస్తున్నట్టు మార్పులొస్తున్నవి. ఏబది సంవత్సరములలో ఒకే భారతజాతి ఏర్పడగలదని నా దృఢవిశ్వాసము. నేను భారతీయులందరితో కులమతములన్ని మరచి, వాటిని కేవలం చరిత్ర తెలుసుకొనుటకు, జ్ఞాపకముంచుకొని, సాధ్యమైనంత త్వరలో ఒకేభారత జాతి ఏర్పడుటకు కృషిచేయవలయునని కోరుచున్నాను.

# డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారు
(మాజీ కేంద్ర ఉక్కు, గనుల శాఖామాత్యులు)

"మున్నూరుకాపు కుల అభ్యుదయము కార్యకలాపాల చరిత్ర" పేరుతో శ్రీ బొజ్జం నర్సిములుగారు ఒక గ్రంథమును సమగ్రముగా ప్రచురించుటకు పూనుకొనుట ఎంతయినాముదావహము. ఆర్థికముగాను,



సాంఘికముగాను సమాజము బలపడినప్పుడే, సుస్థిరమైన రాజకీయ వాతావరణము నకు మార్గమేర్పడును. మనలౌకిక రాజ్యమునఅంతాసమానమే. అన్నికులములకు, మతములకు సమాన ప్రాతినిధ్యమువున్నది. సంకుచితమైన, స్వార్థపూరిత మైనదృష్టిలేకఅన్నిమతములు అన్నికులములు తమ తమ వికాసములకు పాటుపడ వచ్చును. అప్పుడే మనము లక్షించిన ఆదర్శ ప్రజా స్వామ్యము నెలకొనగలదు. సర్వమానవ సమానత్వము సిద్ధించగలదు.

అందువలన చారిత్రాత్మకమైన కారణాల వల్ల అనాదిగా అలక్షింప బడుతూవచ్చిన మున్నూరుకాపు కుల ప్రజల వికాసమునకు కృషి జరిగి, సమాజములోని యితర వర్గాలవారితో సమానస్థాయికి రాగలగ డానికి యీ విధమైన గ్రంథము ఎంతయినా ఉపయోగపడుతుంది. తమ తొల్లింటి ప్రాభవవైభవములను తెలుసుకొని, తిరిగి యీనాడు వెనకటి ఆ ఉజ్జ్వల స్థితికి చేరుటకు ప్రయత్నము చేయుటకు యిది బాగుగాతోడ్పడ గలదు.

తెలంగాణం నుండి వలసవెళ్లి పేరొందిన ప్రముఖులలో బొంబాయి మాజీ ముఖ్యమంత్రి కీ. శే. కన్నంవార్, లెఫ్టినెంట్

గార్నర్ పాండుచెరి శ్రీ ఎస్. ఎల్. శీలం, శ్రీ పుష్పాల నర్సింగ్ రావు మాజీ బొంబాయి మేయర్‌ను నేను బాగుగా ఎరుగుదును. నేనెప్పుడు బొంబాయికి వెళ్లినా వారు ఇక్కడికి వచ్చినా, ఒకరి నొకరం కలుసుకునె వారము. వీరు తెలంగాణ నుండి వలసవెళ్లినవారు. వీరు అచట పంచాయితీలు పరిష్కరించేటప్పుడు వచ్చీరాని తెలుగుభాషనే ఉపయోగించేవారు. అక్కడికి వెళ్లి పెద్ద పెద్ద ఉద్యోగాలలోనే గాక ప్రజారంగములో పాల్గొని అభ్యుదయాన్ని సాధించారు. వీరి అభిప్రాయము కార్యకలాపాలు ప్రజల మెప్పులను బడిసినాయి.

మున్నూరుకాపు కుల ప్రముఃఖులు, బహుముఖ సాంఘికసంక్షేమ కృషిలో భాగస్వాములు, రాజకీయ విజ్ఞులు అయిన శ్రీ బొజ్జం నర్సిములుగారు పైనపేర్కొనిన దృష్టితో తమకుల చరిత్రను సమగ్రముగా తెలిపే గ్రంథమును ప్రచురించుట ఎంతయినా ముదావహము. హైదరాబాదులో శ్రీ నర్సిములు గారిని తెలియని వ్యక్తివుండడు. చిన్ననాటి నుండి కాంగ్రెసులో వివిధ పదవులలో సేవలుజేశారు. నిజాము ప్రభుత్వమును వ్యతిరేకించారు. అన్నిటినీ మించి సంఘసేవకు తనజీవితాన్ని అంకితంచేసి, నేటికీ ఆకృషిలోనే నిమగ్నులై వున్నారు. వెనుకబడిన తరగతుల సంఘాన్ని నెలకొల్పి, వారి పురోభివృద్ధికి విశేషముగా సేవజేశారు. మా విద్యార్థిదశలో శ్రీ నర్సిములుగారి ఉత్సాహము, కార్యదీక్ష, నిరాడంబరత మాకుఎంతో ఆదర్శముగా వుండేవి.

అటువంటి శ్రీబొజ్జం నర్సిములుగారు ఈ గ్రంథ ప్రచురణకుపూనుకోవడము చాలా సంతోషదాయకము. మున్నూరు కాపుకులమువారు యీనాడు దేశములోని వివిధ ప్రాంతములలో ఉన్నతమైన పదవులను, ఉద్యోగములను చేపట్టి ప్రసిద్ధికెక్కుచున్నారు. వారందరినీ ఒకే వేదిక మీదకు తెచ్చిన ప్రయోజనము యీగ్రంథ ప్రచురణవల్ల ఒనగూడినది.

# శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ లేఖ

## ఆం. ప్ర. శ్రామిక, జనసంబంధశాఖ మంత్రి

పూజ్యులు శ్రీ బొజ్జం నర్సిములుగారికి

ఆర్యా !

నమస్కారములు :

"మున్నూరు కాపు కులాభ్యుదయము" అను శీర్షికతో 1920 నుండి 1967 వరకు జరిగిన కార్యకలాపములను అఖిల భారత తెలుగు



మున్నూరు కాపు మహాసభ ఆధిపత్యమున ప్రచురించబడుచున్న చిత్తుగ్రంథ ప్రతి చదివే అవకాశము నాకు కల్గించినందులకు మీకు నా ధన్యవాదములు. ఈ గ్రంథములో మున్నూరు కాపుకులానికి చెందిన చాల ముఖ్యమైన విషయములు మరి ఘట్టములు మరియు సాధారణంగా ప్రజలకు తెలియ నటువంటి అనేక సంగతులు పేర్కొనబడి నవి. మున్నూరు కాపు కులానికి అనేక విధాలుగా ఎంతో సేవచేసిన ప్రముఖుల వివరములు కూడా యీ గ్రంథంలో చేర్చబడినవి. యిది ఎంతో ఉప యోగకరమైన గ్రంథమైయుండి నిస్వార్థంతో సమాజ సేవ చేయుటకు ఉత్సాహం, దోహదం అనేక ప్రజలకు కల్గించగలదని నమ్ముచున్నాను. మున్నూరు కాపుకులం సమాజంలో ఒక చరిత్రాత్మకమైన వర్గం. ఈ వర్గ సమాజం అనేక రంగాలలో అనేక పాత్రలు వహించినటువంటి కాల పరిస్థితిలో యీ వర్గానికి చెందిన అనేకులు ఎన్నోవిధాలుగా సమా జంలో వెనుకబడి ఎన్నో యిబ్బందులకు, కష్టాలకు పాలైనారు, అభ్యు దయంగల వర్గాల సమాన స్థాయిని వీరంతా రు అందుకొనుటకు మీరు, మీ సహచరులు, యితర నాయకులు మరి కార్యకర్తలు ఎంతోకృషి చేస్తూవచ్చారు. యిట్టి కృషికి వెనుకబడిన యితర వర్గాల నాయకుల, కార్యకర్తల మరియు అభ్యుదయ వర్గాల కొందరి నాయకుల సహ

కారం లభిస్తూ వచ్చింది. తత్ఫలితంగా మున్నూరు కాపువర్గం వారిలోకూడా చైతన్యం పెరిగి, అభివృద్ధిచెంది, వారు అభ్యుదయ మార్గంలో అడుగు ముందుకు వేస్తూ, అనేక వెనుకబడిన వర్గాలవారికి కూడా ఎన్నో విధాలుగా ఆదర్శంగావుంటూ, వారి అభివృద్ధికి తోడ్పడుతూ వచ్చారు. అయినా, అభ్యుదయ వర్గాలస్థాయిని అందు కొనుటకు యింకా ఎంతో ప్రగతి చెందవలసియున్నది. ఈ గ్రంథం అట్టి ప్రగతికి దోహదం కల్గించగలదని ఆశిస్తున్నాను. ఈ చక్కని కార్య క్రమానికి నా శుభాకాంక్షలు.

## శ్రీ తోట రామస్వామి

ఆంధ్రప్రదేశ్ పంచాయత్ రాజ్ శాఖా మంత్రి

శ్రీ బొజ్జం నర్సింహులుగారు శ్రమతీసుకొని రచించిన "మున్నూరుకాపు కుల అభ్యుదయము- కార్యకలాపాలు (1920-67)"



అను గ్రంథము చాల శ్రద్ధగా చదివితిని చాల వెనుకబడిఉన్న మున్నూరుకాపు కులస్థులు తమ ఆర్థిక, సాంఘిక అభి వృద్ధి కొరకు చేసినకృషి చాల ప్రశంస నీయము. రాజబహదూర్ శ్రీ వెంక ట్రామారెడ్డిగారు వంటి ఉదారుల సహ కారముతో మున్నూరుకాపు నాయ కుల సంఘ అభివృద్ధికొరకు చేసిన కృషి అమోఘము. సంఘములో ఉన్నత పదవుల నధిష్టించిన వారి జీవిత చరి త్రలు కూడ వ్రాయుట ముందుతరాల వారికి ఆదర్శప్రాయంగా ఉండగలదు.

విశేషశ్రమ కోర్చి యీ గ్రంథము తయారుచేసిన పెద్దలు శ్రీ బొజ్జం నర్సింహులు గారిని నేను మనఃపూర్తిగా అభినందించు చున్నాను.

## శ్రీ అరిగె రామస్వామి

(ఆం. ప్ర. సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి

నేను ఏబది సంవత్సరముల నుండి శ్రీ బొజ్జం నర్సిములు గారిని వ్యక్తిగతంగా బాగుగా ఎరుగుదును. ఏబది సంవత్సరములకు పూర్వము నుండే హరిజనుల అభివృద్ధికై, ఆయన పని ప్రారంభించారు. అప్పటి నుండి హరిజనుల, వెనుకబడిన తరగతుల వారికి దృఢమైన కార్యకర్తగా నాయకుడుగా ఉంటు వచ్చారు. హైద్రాబాద్ వెనుకబడ్డ తరగతుల నిర్మాణమునకు మిగుల శ్రద్ధవహించారు. దానికి ప్రథమ అధ్యక్షులుగా ఉన్నారు. ఆయన వెనుకబడ్డ తరగతులకు చేసినసేవ ఎన్నటికీ మరువ జాలనిది. ఆరోజుల్లో హైద్రాబాద్‌లో మొత్తం నిషేధబహిష్కరణ సందర్భమున, సాంఘికాభివృద్ధికై శ్రీ బొజ్జం నర్సిములుగారు. ప్రజలలో చైతన్యం కలిగించుటకు పద్మభూషణ్ శ్రీ మాడపాటి హనుమంతరావు, తదితరులతో భుజము భుజము కలిపి అవిరళ కృషి సల్పారు.

శ్రీ బొజ్జం నర్సిములుగారు ఈ గ్రంథమునకు అవసరమైన విషయములను సేకరించుటలో ఎంతో పాటుపడ్డారు. ఈగ్రంథం అందరికి ఉపయోగకరమైనది. శ్రీ బొజ్జం నర్సిములుగారు వెనుకబడ్డ తరగతులతో సహా మున్నూరుకాపు ప్రజల అభివృద్ధికై ఎంతో కృషిసల్పారు. ఈ గ్రంథము ద్వారా అందరికి ఎంతో ప్రయోజనకరమైన సమాచారం, శ్రీ బొజ్జంగారు అందజేసినందులకు వారిని నేను అభినందిస్తున్నాను. అలక్ష్యం చేయబడిన తరగతుల వారికి ఈగ్రంథం ప్రయోజనకారిగా, మార్గదర్శకం కాగలదని నేను ఆశిస్తున్నాను. శ్రీ బొజ్జంనర్సిములుగారి సమాజంలోగల ఐక్యత సంఘీభావంవల్ల ఇంతగొప్ప కార్యాన్ని సాధించగలిగారనుటయే ముఖ్యమైన విషయం. భవిష్యత్తులో కూడా హరిజనులు, వెనుకబడిన తరగతులతోసహా అందరి ప్రజలలో సంఘీభావము, ఐక్యత గలిగియుండుట ఎంతో అవసరము. దానిద్వారానే మహాత్మాగాంధీ చూపించిన అభివృద్ధికరమైన లక్ష్యాన్ని వారు అందుకోగలరు.

# సర్దార్ గౌతు లచ్చన్న

**అ. భా. వెనుకబడిన తరగతుల అధ్యక్షులు**

కులాభిమానము నేరముకాదు. స్వకులాన్ని ఉద్ధరించుకొనుట ప్రేలెత్తి చూపదగిన స్వార్థంకాదు. దానిని కులతత్వ మనుట మాత్రము తప్పు. ఇతర కులాలను ద్వేషించుట, కించపరచుట నేరము. పరిపాలకులుగా వుండి న్యాయ విరుద్ధముగా స్వకులం పట్ల పక్షపాతముతో ప్రజా ధనము, అధికారము దుర్వినియోగము చేయుట అవినీతి.



ఎవరి కులాన్ని గురించి వారు తెలుసుకొనుట అవసరము. తమ తమ కులముల అభ్యుదయమునకై కృషి సల్పుట కూడా సంఘసేవలో నొక భాగమే. ముఖ్యముగా వెనుకబడిన తరగతులలోని అల్పసంఖ్యాక వర్గముల వారు వివిధ సంఘాలు పెట్టుకొని సంక్షేమం నిమిత్తం శ్రమించనిచో ముందడుగు వేయలేరు.

అఖిలభారత తెలుగు మున్నూరు కాపుల సంఘాధ్యక్షులైన శ్రీ బొజ్జం నర్సింలుగారు నాకు చిరపరిచితులు. చిన్నతనము నుండి సాంఘిక సేవలో పేరుపొందినవారు. ఆనాటి హైదరాబాదు నిరంకుశ ప్రజాపీడిత పరిపాలనలో ఒకవంక ప్రజాఉద్యమాలకు దోహదమిస్తూ, వెనుకబడిన తరగతుల సంఘాన్ని స్థాపించిన వారిలో ప్రథములు. శ్రీ నర్సింలుగారు మున్నూరుకాపు సంఘ కార్యకలాపాలలో మొదటి నుంచి ప్రధానపాత్ర వహించుచున్నారు.

అఖిలభారత తెలుగు మున్నూరు కాపుల సంఘాధిపత్యంలో ముద్రితమైన యీ "మున్నూరు కాపుకుల అభ్యుదయము" అను గ్రంథం ప్రయోజనకరమైన పద్ధతిలో వెలువరించబడినది. మున్నూరుకాపు కుల చరిత్రను తెలుసుకొనుటకు యీ గ్రంథము చక్కగా ఉపకరించు

గలదు. మున్నూరుకాపు సంఘ అవతరణ మహాసభలు, వానివిశేషాలు ఉపన్యాసాలు, తీర్మానాలతో సహా, కార్యకలాపాల సమీక్షలు సాధించిన అభ్యుదయం- ఇందులో చక్కగా విశదీకరించడం జరిగినది.

అధిక వ్యయప్రయాసలకోర్చి యీ గ్రంథమును ప్రయోజనాత్మకంగా ప్రచురించి విడుదల చేసిన మున్నూరుకాపు సంఘానికి నా అభినందనలు.

'జై హింద్'

## శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

"మున్నూరుకాపు కుల అభ్యుదయము" అనుగ్రంథము ఏతత్సంఘము వారి కార్య కలాపములను దెలుపు ఏబది సంవత్సరముల చరిత్ర. శ్రీ బొజ్జం నరసింహులుగారు ఎంతో శ్రద్ధతో కృషి సల్పి, తత్సంబంధమయిన వృత్తాంతమును ప్రామాణికమయిన లిఖితాధారములతో ఇందు పొందుపరిచినారు. ఈ గ్రంథ ప్రకటనమును గూర్చి శ్రమించిన శ్రీ బొజ్జం నరసింలుగారును, తదితరులును ఎంతయు ప్రశంసనీయులు.

ఈ గ్రంథస్థ విషయములను పరిశీలించగా, మున్నూరుకాపు సంఘమువారు ఆభిజాత్యులనియు, చులకనగా చూడదగిన వారు కారనియు విశదము కాగలదు. వీరు విద్యావిజ్ఞాన కోవిదులు. వితరణశీలురు. కర్మవీరులు. ధర్మవీరులు, యుద్ధవీరులని స్పష్టమగుచున్నది. వీరు వ్యాపార రంగమునందును, రాజకీయ రంగమునందును. సామాజిక రంగమునందును గణనీయముగ కార్యనిర్వహణ మొనర్చినట్లు స్పష్టమగుచున్నది. లక్షల రూపాయలు వెచ్చించి పాఠశాలలు వసతిగృహములు నిర్మాణము చేసియున్నారు. ఈ గ్రంథములో ఇంకొకవిషయమేమనగా. మున్నూరుకాపుల అభ్యుదయ పరంపరాభివృద్ధి గావించుటకు మహోదారబుద్ధితో. సదాశయములతో పాటుపడిన మహాశయుల జీవిత సంగ్రహములు, రూప పటములతో ఈ గ్రంథ పుటలను అలంకరించినారు. భావికాలమువారికి ఇదిఎంతగానో ఉపకరించగలదు.

'సర్వే జనాస్సుఖినోభవంతు' అను మున్నూరుకాపు వారి ఆదర్శము కొనియాడదగినది.

## శ్రీ ఎస్. ఎల్. శీలం
### లెఫ్టినెంట్ గౌర్నర్ పాండిచేరి

మీరు సంకలనము చేయుచున్న గ్రంథము ఇప్పుడు ముద్రణా స్థితికి వచ్చియుండుట మిక్కిలి సంతోషదాయకమైన విషయము. మన కులముయొక్క పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించిన సామగ్రి, లభ్య మైనంతవరకు, సమకూర్చుకొని, సరిచూచుకొని, భిన్నాభిప్రాయముల ప్రాబల్యమునకు గురియైన ఒక విషయమును పరిశోధించుట సామాన్య మైన పనిగాదు. సమగ్రమైన ఈ పనిని మీరు విజయవంతముగా దాదాపు ముగించగలిగినందుకు నాకు సంతోషముగా నున్నది విషయ బాహుళ్యము గల ఈ గ్రంథరచన, మనకుల చరిత్రలో మరియొక అధ్యా యమై మన భావి సంతతి వారికి ఒక గొప్ప ఆస్తి మరియు మార్గదర్శ కమై యుండగలదనుటలో నాకెట్టి సందేహము లేదు.

## శ్రీ కొత్త భావయ్య చౌదరి
### (సంగం జాగర్లమూడి కమ్మచరిత్ర గ్రంథకర్త)

మున్నూరుకాపు సంఘమునకు మీరుచేసిన విజ్ఞప్తి సందేశము కొరకు పంపినందుల కానందముగనున్నది. చరిత్రప్రసిద్ధి గల యీ సంఘ ములో పూర్వకాలము నందేకాక, నేటికిని చాలాయున్నత పదవుల లోను, గొప్ప గొప్ప వ్యాపార సంస్థలలోను ఉండి, దానధర్మపరాయ ణులై, పేరు ప్రఖ్యాతులార్జించి, దేశసేవచేయువా రనేకులున్నారనుట విదితమే. వారందరి చరిత్రలు కష్టపడి సంపాదించి ప్రకటించుట సంఘీ యులకేగాక, మనదేశీయులందరికి సంతోషము కల్గించుట గర్వకారణము. మీ ఉద్యమము సర్వవిధముల జయప్రదమగుగాకయని కోరెదను. ఇటీ వల ప్రకటింపబడిన బలిజకులచరిత్రలో నీ శాఖీయులలోని పెద్దల చరి త్రలు కానరాలేదు. ఆలోటు మీరు తీర్చి ఆంధ్రభాషాసేవలో ధన్యు లయ్యెదరుగాక యని కోరెదను. సంఘీయులెల్లరు తగిన ప్రోత్సాహ సహాయము లిత్తురుగాక.

## శ్రీ అల్లుమల్లు నారాయణ చక్రపాణి

మనము శ్రీ పంచాయతీరాజ్ శాఖామాత్యుల సమక్షమందు సమావేశమగుట మహద్భాగ్యంగా భావించుచున్నాము. తెలగ, బలిజ మున్నూరుకాపు సంఘీయులను సమీకరించి పురోగమించుటకు తమకు జేయుచున్న అమూల్యమైన కృషికి తమకు జోహార్లు.

తమరు తలపెట్టిన మహోద్యోగములో మేము కూడా తమసలహా ప్రకారం వుపయోగపడుటకు సిద్ధంగా యున్నాము.

## శ్రీ బి. యస్. శర్మ

ఆంధ్రవాణి సంపాదకుడు

మనయందు కాలవైపరీత్యమువలన యేర్పడిన నుదాసీనత వలననే మనభారతీయ ప్రాచీనయౌన్నత్యము సాపేక్షముగా కనపరచే చారిత్రక ప్రామాణిక గ్రంథములు లుప్తమైనవి. విదేశీయుల వైపరీత్య విధానములు దీనికి దోహదములైనవి. భావి సంతానమునందు నవ్యోత్సాహము పుంజీభవింపజేసి సంఘాభ్యుదయము ద్వారా జాతీయౌన్నత్య సంసిద్ధికి పురోగమింపజేసే చారిత్రక గ్రంథముల ప్రాముఖ్యత గ్రహించి క్షేత్రధర్మము, కృషీధర్మ నిర్వహణముతోబాటు రాజ్యరక్షణ, ప్రజారక్షణయందు ఆదర్శప్రాయముగా రాజ్యపాలనము గావించి, సీతామమహాదేవి స్వయంవర సమయమునందు శివధనుస్సును గదల్చి తెచ్చిన మున్నూరుమహావీరుల సంతానగౌరవము గడించిన మున్నూరుకాపు కులాభ్యుదయ'మను సగర్వనామముతో దేశసేవయే జీవితోద్దేశముగా నిర్ణయించుకొన్న మత్ మిత్రవర్యులైన శ్రీ బొజ్జం నరసింహులుగారు ప్రయాసాన్ని లెక్కించక, విసుగొందక సమకూర్చి సంకలన మొనర్చిన చారిత్రకాంశముల గ్రంథరూపమున వెలువరించుట యెంతయో శ్లాఘనీయము. చారిత్రకాంశముల పరిశోధకుల కిది వేగుచుక్క.

'రామాయణము' నందేగాక వ్యాసప్రోక్తమైన భారతమునందు, భాగవతమునందు గల 'త్రిశత' శబ్ద మీ మున్నూరుకాపుల వర్ణితము. విదేశములనుండి భారతదేశమునకు వలసవచ్చినవారుకారు వీరు. మున్నూ

టికి ఇది భారతీయ జాతీయాంతర్గత సంఘము. ప్రత్యేక సాంప్రదాయకముగాదు. దేశమునందు వర్ణవ్యవస్థ యేర్పడినప్పుడు వీరు వైశ్య వర్ణులుగా నుండిన యాధారములు గలవు. వాణిజ్య, వ్యవసాయ పశు పోషణ వైశ్యవృత్తులగుటం జేసి వాణిజ్యవైశ్యులు. భూవైశ్యులు, గోవైశ్యులను మూడువిధము లుండునటుల గలదు, వైశ్యవర్ణాంతర్గత మైన కాపులు భూవైశ్యులైరి. దేశమందలి కొన్ని భాగములను యావత్స్ప్రాయముగా పరిపాలించిన యానాటి కాపు మహారాజుల ధ్వజము నందు నాగలిచిహ్నా ముండి యుండెను. చాళుక్యుల, చోడుల రాష్ట్రకూటుల కులమే వీరి కులము.

కారణాంతరముల వలన ఉత్తర భారతమును వదలి దక్షిణాపథమునకు వచ్చి యీ మున్నూరుకాపులు స్థిరనివాస మేర్పరచుకొనిరి. 'రత్న గర్భ'యని ప్రాచీన కాలమునుండి సార్థకనామము కలిగిన తెలంగాణము నందు స్థిరనివాసమేర్పరచుకొనిరి. మధ్యప్రాంతమునకు, పశ్చిమ ప్రాంతమునకు, దక్షిణప్రాంతమును వెళ్ళి నిబిడీకృతమైయున్న కార్యదక్షత వలన రాజకీయరంగము, పారిశ్రామిక ప్రాంగణములం దున్నతస్థానములు పొంది జాతిసేవయందు గణనీయవర్గముగా పరిగణింపబడుచుండుట ముఖ్యముగా తెలంగాణమునకు గర్వనీయాంశము.

లౌకిక వాతావరణమునందు దేశపునర్నిర్మాణము జరుగుచున్న కాలములో సేవాదర్శముతో దేశ, జాతి యౌన్నత్యమునకు శాయ శక్తులా కృషిసలిపి, సత్పథాన్ని చూపెట్టిన యీ సంఘవివరణ గ్రంథమును ప్రతివారు మననంచేసికొని జాతీయాభ్యుదయ కృషిలో ముందంజ వేయుటత్యావసరము. ప్రజలలో సాంప్రదాయక భావము కులతత్వభావము ప్రకోపింపజేసి, సంకుచిత తత్వమును దీప్తపరచుటకని, కృషిని నిరర్థక పరచుటకు పూనుకొనిన,దుస్సాహసమగుట నిశ్చయము. మనప్రాచీనభారతీయ సర్వతోముఖాభ్యుదయ జాతీయాంతర్గతమై యుంటున్న వివిధ సంఘములు వివిధవర్గములు గడించిన సమిష్టి అభ్యుదయము. ఈనాడు నిర్విరామముగ జరుగుచున్న భారతాభ్యుదయమునకు గ్రంథమెంతమో నుపకరించి తీరును. శ్రీ బొజ్జం నరసింహులుగారీ రంగమునందు జరిపిన కృషి మిగుల ప్రశంసనీయము.

★



శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి (పంచ సహస్రావధాని)

# మున్నూరు కాపుకుల అభ్యుదయము

## పరిచయ వాక్యము

ఈ గ్రంథము మున్నూరు కాపుకులజుల అభ్యుదయ మగుటచే మున్నూరుకాపుసంఘము యొక్క పూర్వవృత్తాంతమును దొలుదొల్త పేర్కొనవలసినయున్నది. వీరు ఆంధ్రమునే గృహభాషగను, వ్యావహారిక భాషగను నుపయోగించుచు నాంధ్రదేశముననే స్థిరనివాసులుగానుండు నిదర్శనమును బట్టి వీరు ఆంధ్రులనుట సర్వసమ్మతమైనది.

ఆంధ్రులు భారత దేశమునందలి యాదిమనివాసులు. ఆర్యులు దేశాంతరములనుండి వచ్చి యందప్పటికి మనుచున్న యాదిమ నివాసులతో బోరాడి వారినిజయించి స్థిర నివాసములేర్పఱచుకొనిరని మనము వేనోళ్ల వినుచున్నారము. అందువలన నార్యులువారిని శత్రువులుగ భావించి దస్యులనిరి. ఆర్యులు సంస్కృత భాషాపరిచితులగుటచే వారు తమ సంస్కృత గ్రంథములయందు ఏ ఏ నామములొసంగినను, మనము వీరనార్యులని మాత్రము పేర్కొనవచ్చును. వేదములయందును నితర గ్రంథముల

యందును, వీరాంధ్రులని పేర్కొనఁబడిరి. అకారమునకు యుద్ధము నునర్థముగలదు. ఆంధ్రమతీతి ఆంధ్రః అనిభావించి యంధ్రి శబ్దమును వాడిరి. ఆంధ్ర సంబంధులే ఆంధ్రులు. వీరార్యులతోఁ బోరాడికొన్ని తావులజయమును గొన్ని తావులఁ బరాజయమును బొందియున్న వారగుటచే దేవభాషా ప్రగిష్టులగు నార్యులచే నాంధ్రులని పిలువఁబడిరి.

ఆర్యులతోడి పోరాటములందుఁ బరాజితులైనవారు కొందఱు వివిధ ప్రాంతములకుఁ బోయి క్రమక్రమముగా రాజ్యస్థాపకులైరి. కొందఱాంధ్రు లార్యులలోగలిసిరి. వారివారి సామర్థ్యములననుసరించి వారికి వృత్తులేర్పడినవి. బాహుబల సంపన్నులును, శౌర్యసాహస ధురీణులునునగు నాంధ్రులకుఁ దొలుతనుండియు రాజ్యస్థాపన సంరక్షణములందే యనురక్తులైయుండిరి.

రాజ్యరక్షణమును, ప్రజాపోషణమును రాజ్యమునకు రెండు ముఖ్యాంశములు. శత్రువుల నెదుర్కొని రాజ్యమును గాపాడుటయు, నాక్రమిత ప్రాంతములయందు నాహారోత్పత్తి నేసి ప్రజా పోషణము నేయుటయు దప్పనియంశములు, ఈ రెండంశములును గలిసినప్పుడే రాజ్యపాలనముగా గలదు, ఈ రక్షణమే కాఁపుదనము. కాఁపుఅను నాంధ్రశబ్దమునకు రక్షణమని యర్థము. ఇది శత్రువులనుండి రాజ్యరక్షణమును పదార్థవ్యుత్పత్తిచే ప్రజా రక్షణమునందు నైతము అన్వయించుచున్నది. ఈ భావము ప్రతి మానవునియందును సహజమైయున్నది. పదియకరముల భూమిగల సామాన్యమానవుడు, తొలుతఁదనక్షేత్రము నితరు లాక్రమింపకయుండునట్లు చుట్టు గట్లు కట్టుకొని వానిని ఇతరు లాక్రమించుకొనక యుండునట్లు కాపాడుకొనుచుండును. ఆ క్షేత్రమునందాహారవ్యుత్పత్తి నేసి తన్నుదాను రక్షించుకొనుచుండును. ఈ సత్యముననుసరించి యేర్పడిన కాపు శబ్దమునుఁగుల నామముగాగలవారు క్షాత్రధర్మమును, గృషీవల ధర్మమును నవలంబించిన వారని యూశయము కావుననే వీరిలోగొందఱు రాజ్యములేలిరి, కొందఱు కర్షకులైరి. ఉభయ వృత్తులవారి పట్లను నీ కాపుశబ్దము సార్థకమగుచున్నది సంగమవంశీయుడగు జంబుకేశ్వరుడను పేరు అప్పటి ఢిల్లీచక్రవర్తితో

బోరాడిన స్థానమైన కంపిలానగరము కొంతకాలము సౌభాగ్యవంతమై యనేక ప్రజాసంఘములకు నివాసస్థానమైయుండెను. ఆసమయమున దురుష్కుల దండగములకు నైపజాలక కంపిలానగరమునుండి తప్పుకొని పోవలసివచ్చినది. కంపిలానగరమే కాంపిల్యనగరము. కాంపిల్య వాస్తవ్యులను గాంపిల్యులనిరి. కాపులనిరి. పదంపడి కాపులనిరి. ఈ శబ్దోత్పత్తి వాదమువలన విషయవ్యత్యయము లేదు. అక్కడికి వలసవచ్చిన యాంధ్రులిప్పటికే కాపులనదగిన పరిస్థితి గలవారై యుండిరని పైన పేర్కొనబడినది.

విదేహ మాధవునిచే నాక్రమింపబడిన దేశము విదేహ రాజ్యమయ్యెను. విదేహరాజ్యమునకు మిథిలానగరము రాజధానియై యచ్చట నివసించిన కాపులను మిధిలకాపులనిరి. అయోధ్యానగరము కోసలరాజ్యమునకు రాజధానియై యుండెను. అయోధ్యానగరమున నివసించిన వారిని అయోధ్యకాపులనిరి.

తొలుత నాగలియే ధ్వజముగాఁగలిగి సీరధ్వజుడని నామకరణము చేసికొనిన జనకుడు వాని ధ్వజ చిహ్నము ననుసరించి కాపుదనమునే వంశానుగతవృత్తి గాఁగలయొక కాపుఱేడని భావింపవలసియున్నది. ఆ జనకునకు నాగేటిచాలున లభించిన సీతాదేవిని బరిణయమాడిన యయోధ్యాధీశతనయుడగు శ్రీరాముడును గాపురాజకుమారుడనియే ఊహింపవలసి వచ్చుచున్నది.

కాపులు మున్నూరు కాపులని యెట్లు పిలువబడిరో చర్చింపవలసియున్నది. ఆంధ్రదేశమున నాఱువేలవారు, పంచాగ్నులవారు చతుర్వేదులవారు మున్నగు వంశనామములఁ దిలకించుచో వంశనామములందు సంఖ్యావాచకములున్నట్లు విశదమగుచున్నది. ద్రవిడ దేశమున అష్ట సహస్రమువారు కలరని తెలియుచున్నది. అట్లే త్రిశత పదమునకు సరియైన మున్నూరు శబ్దము వీరి వంశనామమై యున్నది.

పదునేనవ శతాబ్దమున ఉదయగిరి చంద్రగిరి రాజ్యముల నాలించిన సాళువ నరసింహరాయని సామంత మండలాధీశ్వరుడగు నార్వీటి బుక్కరాయలు స్తవనీయుడై యుండెను. ఆయనను ద్దేశించి

దేవళరాజు అను భట్టుకవి చెప్పిన పద్యము వలనఁ గోత్రములలో ఐదు నాల్గు తెగలున్నట్లు తెలియుచున్నది. 1. మోటాటి, 2. వెల్నాటి, 3. మొరసు, 4. నేరడు, 5. అయోధ్య, 6. పంట, 7. పొంగలినాటి, 8. పాకనాటి, 9 భూమంచి, 10. కుంచేటి, 11. మున్నూటి, 12. గోనేటి 13. గండికోట, 14. యోరుగంటి అనునవియే యీ శాఖలు. ప్రతి శాఖవారును కాలాంతరమున జరిగిన వృత్తాంతములనుబట్టియో, ప్రాంతములబట్టియో తమ వంశనామము నేర్పరచుకొనిరి.

మున్నూరు అనునది సంస్కృత భాషాపదమగు త్రిశతమునకు అనువాదము. రాజ్యపాలకులకు సేద్యనిర్వహణము రాజ్యాంగమని నుడివి యున్నాము. మిథిలానగరమును రాజధానిగఁ జేసికొని విదేహ దేశమును పాలించిన జనకచక్రవర్తి సేద్యనిర్వహణము గావించు చుండెననుట సుప్రసిద్ధము. జనక చక్రవర్తి భూమిని దున్నించినపుడు నాగేటిచాలున సీతాదేవి యుద్భవించిన యంశము సర్వ సమ్మత మైనది. నాగలికి సంస్కృతమున సీరమందురు. సీరమున నుద్భ వించుటచే నాకన్యకు సీతయను నామమొసంగబడినది

సీరము ధ్వజముగా గలవాడు గనుక సీరధ్వజుడను నామమే జనకుని మొదటినామము. మహాలక్ష్మి అవతారమగు సీతాదేవికిని సర్వసామాన్యముగఁ ప్రజల నందఱిని దనబిడ్డలవలె నాదరించియుండుట వలన ప్రజలకందరికిని జనక ప్రాయుడగుటచే నా సీరధ్వజునకు జనకుడను నామ మాజనవరునకు బదంపడిగలిగెను.

విశ్వసనీయ పౌరాణిక గాథననుసరించి శివుని విల్లు సీరధ్వజు డగు జనకచక్రవర్తి యింట చిరకాలమునుండి పడియుండెను. ఈ విల్లును గదల్చుటకు సామాన్య మానవుడు సమర్థుడు గాకుండెను. శివదేవునిచే నుపయోగింపబడిన యీ చాపమును సామాన్య మానవ మాత్రుడగదల్చి చేఁబట్టజాలకుండెను. జనకుడు శివచాపము నెక్కు పెట్టి, తద్ధనుర్భంగము చేయువానికి సీతనిచ్చెదనని ప్రకటించెను. పరిణయ సమయమున శ్రీరాముడా చాపము నెక్కుపెట్టవలసి వచ్చెను. అసాధారణ భారముగల యావిల్లును రంగస్థలమున నుంచవలసి వచ్చెను దానిని వైవాహిక సభారంగమునకు దెచ్చుటకు మున్నూరు వీరులు కావలసివచ్చిరి. ఆ చాపను త్రిశతోపనీతమైనది. ఇట్లు సంస్కృత

భాగవతమున వ్యాసునిచే వ్రాయబడినది. ఆంధ్రభాగవతమున ఒక మున్నూరుగదల్చి తెచ్చిరని బమ్మెర పోతనామాత్యుడు లిఖించెను.

ఆ కాలమున విదేహ దేశమును, గోసల దేశమును క్షాత్రధర్మ నిరతులైన కాపులనబడు వేనవేలయాంధ్రుల కాలవాలములై యుండెను. అయోధ్యానగరమున నున్నవారికి అయోధ్యకాపులనియు, మిథిలానగరమున నున్నవారికి మిథిలకాపులనియు నామములు గలిగెను. మిథిలకాపులే యప్పుడీ కార్యమును నిర్వహించినవారు. వారిలో మున్నూరుగురు వీరులీ పవిత్రకార్యమును, మహాకార్యమును నిర్వహించిన వారగుటచే వారు మున్నూరుశబ్దమును దమకాపుశబ్దమునకు విశేషణముగా జేసికొని నాటినుండియు మున్నూరు కాపులను వంశనామము నుపయోగించుకొనుచుండిరి.

ఒక చాపమును గదల్చుటకు మున్నూరుగురు వీరులు కావలసి వచ్చిరాయను శంకవొడమవచ్చును. కాని యాచాపము శివదేవునిచే ధరింపబడి యుండుటచే దాని ప్రభావమటిదే యనవచ్చును. దశకంఠములును, నిరువది బాహువులును గలిగి దిక్పాలుర జయింపగలిగినంతటి మహాబల పరాక్రమ సంపన్నుడగు రావణుడీ చాపమును గదల్చలేకపోయెను. మానవమాత్రుడుగా నగుపడుచున్న శ్రీరామబాలకుడీ చాపము నెక్కుపెట్టి భంగము కావించినపుడు అసూయచే రావణుడిట్లనెను.

"క్షత్ర శైవంధనురిదం, క్వచాయం ప్రాకృతశ్శిశుః
భంగస్తు సర్వసంహర్త్రా, కాలేనైవ వినిర్మితః"

ఆ మహాకార్యము ననుసరించి మిథిలకాపులు త్రిశతవీరగణమని భావింపబడుట యనూహ్యామైన విషయముగాదు. ఆనాటి నుండియు నాంధ్రవీరులగు మిథిల కాపులు మున్నూరు కాపులమని వ్యవహరించు కొనుచున్నారు.

వీరు మిథిలాయోధ్యానగరములనుండి గోదావరి ప్రాంతమునకు వలసవచ్చి, క్రమ క్రమముగా నాంధ్రదేశమునందంతటను వ్యాపించిరి. నాటి యార్యుల నిర్దేశము వలన వీరు వైశ్యవృత్తినవలంభిం

చినను, కొందరు క్షత్రధర్మమును నిర్వర్తించుచుండిరి. అధిక సంఖ్యాకులు కాపుదనము నవలంభించి జీవించుచుండిరి.

ఈ మున్నూరుకాపులు తమ మూలవీరపురుషుల రారాజగు సీరధ్వజుని (జనకుని) ధ్వజచిహ్నమగు సీరమును (నాగలిని) నేటికిని గౌరవించుచున్నారు. వివాహ సమయమున పెండ్లికుమారుడు నాగలినో కాడినో భుజమునందుంచుకొని నాకబలి రంగమునకు ప్రదక్షిణము చేయును. మున్నూరుకాపు లెల్లరకును పెండ్లి ముగియు దినమున నీయాచారము నడుపుట సుప్రసిద్ధమై యున్నది.

క్షత్రధర్మ పరాయణులగు మున్నూరుకాపు స్త్రీలు వ్రాయించిన శాసనములు గలవు. కాపు కులజుడగు ఒడ్డాది అర్జున దేవుని దేవేరి, సూరమదేవి క్రీస్తుశకము 1272 సంవత్సరమున వ్రాయించిన శాసనమును, క్రీ॥శ॥ 1237వ సంవత్సరమున వెన్నయ చోడమహారాజు మహాదేవి, బిమ్మలదేవి వ్రాయించిన శాసనమును నందుకు తార్కాణములై యున్నవి. కులోత్తుంగ చోడసత్రమునకును భీమేశ్వర దేవర కైంకర్యమునకును, కాపుకుల సాధ్వులు భూదానములు చేసినట్లు కన్పించుచున్నవి మున్నూరుకాపు వంశస్థులయందు వివాహానంతరమున గావించు వెంకటేశ్వర దీపారాధన వీరి దైవభక్తిని చాటుచున్నది. వీరు కావించు వీరులకొలుపు పూర్వవీరనాయక సంస్మరణము తెలియించుచు, వీరక్షత్రధర్మ పరాయణతను ప్రకటించుచున్నది.

మిథిలాయోధ్యాది ప్రాంతములనుండి వీరు గోదావరీతీర ప్రాంతములకు దొలుతగా వలసవచ్చిరి. కాని విష్ణువర్ధనుని దౌష్ట్యము వలన నచ్చటినుండి మారువేషములు సైతము ధరించుచు వీరు గుంపులు గుంపులుగా త్రిలింగదేశమునకు వలసవచ్చిరి. ఇందిప్పుడు ఇంచుమించు ఆరులక్షల మున్నూరుకాపు వంశజులు నివసించుచున్నారు. తెలంగాణమున గల మున్నూరు కాపువంశజులు నూటికి డెబ్బది మంది వ్యవసాయ జీవనము చేయుచున్నారు. కొందరు గ్రామాధికారులు, మఱికొందఱు జమీందారులు, కొందఱు భూస్వాములయొద్దను, ధనికుల యొద్దను సేవకవృత్తిలో నున్నారు. మఱికొందరు

దినపరిశ్రమముచేసి జీవించుచున్నారు. పెక్కుమంది నేడు ప్రభుత్వ మున నుద్యోగియులుగను వర్తకులుగను నున్నారు.

ఇంతవరకుదహరించిన యంశముల ననుసరించి, మున్నూరు కాపువంశజులు క్షాత్రధర్మముల యందును, నౌదార్యమునందును, కర్షకవ్యాపారమునందును, వాణిజ్యమునందును నైపుణ్యముగలిగి ఆయాసమయములయందు, దేశ పరిస్థితులననుసరించి వలస వచ్చిన యాంధ్రులని పేర్కొన బడుచున్నది. ఒక్క తెలంగాణమున మాత్రమే యారులక్షల మందియున్నప్పుడు, ఇక త్రిలింగేతరాంధ్ర మండలము లయందును, నాంధ్రేతర రాష్ట్రముల యందును నెందరుగలరో చెప్ప నలవికాదు. అదియట్లుండ మిథిలాయోధ్యానగర ప్రాంతములనుండి, యిచ్చటికి వలసరాక, యన్యప్రాంతములకును, నన్యదేశములకును, నరుదెంచిన వారి సంఖ్య యెట్లుచెప్పగలము ?

మున్నూరు కాపులవంటి వీరవంశజులు పరిశ్రమతత్పరులు అనంతాభ్యుదయము నొంది, యాంధ్రప్రదేశ రాష్ట్రలక్ష్మికి నితోభి వృద్ధి సాధింతురని యభిలషించు చున్నాను.

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

( పంచసహస్రావధాని )



# మున్నూరు కాపువారు

శ్రీ వడ్లకొండ నరసింహారావు
హైదరాబాదు

ఇటీవలి జనాభా లెక్కల ప్రకారం ( 1910 సం. ) నిజాం రాష్ట్రములో నివసిస్తున్న మున్నూరుకాపులు (ఇప్పుడు తోటబలిజలని పిలవబడుచున్నారు). జనాభా 1,83,356. ముఖ్యంగా వీరు నిజామాబాదు, నాందేడ్, కరీంనగర జిల్లాలలో వున్నారు. హైదరాబాదు నగరములోను, దీని పరిసర గ్రామములలోను సుమారు 10,000 మంది వరకు యీకులంవారు వున్నారు. జిల్లాలలో నివసిస్తున్న యీ కులాలవారి ప్రధానవృత్తి వ్యవసాయమైనప్పటికి హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో నివసిస్తున్నవారు మాత్రం వివిధ వృత్తులను చేపట్టి వున్నారు. కొంతమంది డబ్బువడ్డీకిచ్చి ఆర్థికంగా స్థిరపడ్డారు. జిల్లాలలో వున్నవారుసైతం భూముల్ని, తోటల్ని, ఫలసాయాన్ని అనుభవిస్తూ భూస్వాములుగా ఉన్నారు. కొందరు గ్రామాధికారులుగా వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వంలో సాధారణంగా కోశాధికార పదవులు యీ కులాలవారికే కద్దు. విశ్వాసానికీ, నమ్మకానికి, క్రియాశీలతకూ యీ కులంవారు ప్రసిద్ధికెక్కినారు. హైదరాబాదు సెంట్రల్ ట్రెజరీలలో కేషియర్ పదవుల్ని యీ కులాలవారికి తప్ప యితరులెవరికీయివ్వకూడదని కొంత కాలంక్రితం నిబంధనఅమలులో వుండేది. చాలామంది బంగారం, వెండి ఆభరణాల దుకాణాలను పెట్టుకొని

గాజుల దుకాణాలు పెట్టుకొని జీవనభృతి సంపాదించుకొన్నారు.



## గతచరిత్ర

వీరు కాపుకులానికి చెందినవారు. వీరి వృత్తులనుబట్టి తోట బలిజలని [తోటపనిచేసేవారు], గాజులబలిజలని [గాజులు అమ్మేవారు] కూడా పిలువబడుతుండేవారు. ఈ మున్నూరుకాపుకులంవారు నిజాంరాష్ట్రంలో మాత్రమే కనిపిస్తారు. రాష్ట్రం వెలుపల ఎవరన్నా వున్నారంటే వారు యిక్కడినుంచే వలసవెళ్ళిపోయినవారై ఉండాలి. విజయనగరసామ్రాజ్య పతనానంతరం మూడువందలకుటుంబాలు [మున్నూరుకుటుంబాలు] హైదరాబాదు రాజ్యానికి వచ్చి స్థిరపడిపోగా వారే కాలక్రమేణా మున్నూరువారని వ్యవహరింపబడుతున్నారు.

విజయనగర సామ్రాజ్యములో వీరు బంగారు, వెండి, ఆభరణాలు, గాజులు, చందనం, వాసనద్రవ్యాల వర్తకముచేసేవారు. హైదరాబాదుకు వలసవచ్చేసిన తర్వాత రాజాచందులాల్ మంత్రిగా వుంటున్న కాలంలో వీరు ప్రభుత్వంలో ఉన్నతపదవులలో ప్రవేశించారు. మరాటాయుద్ధాలప్పుడు నిజాం బ్రిటిషువారితో జరుపుకున్న సంధి ప్రకారం తమ సైన్యాన్ని కొంత అక్కడకు పంపినప్పుడు నిజాం సైన్యంలో వివిధ ఉద్యోగాలలోవున్న మున్నూరుకాపువారు ఆ యుద్ధములో ప్రదర్శించిన వీరోచితవైఖరికి, ధైర్యసాహసాలకు బ్రిటిషు అధికారులు మెచ్చి తమవద్ద ఉద్యోగాలిచ్చి గౌరవించారు. చాలామంది మున్నూరుకాపువారు బ్రిటిషువారి ప్రాంతాలలోనే స్థిరపడిపోయారు. బొంబాయిప్రాంతములో ప్రస్తుతం ఉచ్ఛస్థితిలోవున్న మున్నూరు కాపువారే యిందుకు నిదర్శనం.

## సాంఘికఆచారాలు

మున్నూరుకాపులలో శైవులు, వైష్ణవులని రెండు తెగలు వున్నాయి. సాధారణంగా ఒక తెగవారికి మరొక తెగవారికి వివాహాది

కార్యాల మార్పిడి జరగడంలేదు. మత సంబంధమైన కార్యాలను స్మార్త బ్రాహ్మణులచేత జరిపిస్తుంటారు. అయితే అంత్యక్రియలప్పుడు జరిపించే కార్యాన్ని మాత్రం శైవులయిన మున్నూరుకాపువారు జంగమోలను పిలిచి జరిపిస్తుంటారు. వైష్ణవులు. సాతానులను పిలుస్తుంటారు వీరు పన్నూర్వరు గోత్రికులని చెప్తుంటారు. ఇంటిపేర్ల ప్రాతిపదికగా వివాహాలను నిశ్చయించుకోవడం వీరిఆచారం. మేనరికాలు చేసుకునే ఆచారం వీరిలోవుంది. బాల్యవివాహాలుకూడా ఆచరణలోవున్నాయి. తిరిగివివాహం చేసుకోవడం, విడాకులు ఇవ్వడం నిశేధమేమీ లేదు అంత్యక్రియలప్పుడు వీరు శవాన్ని పడుకోబెట్టి, తల దక్షిణదిక్కువుంచి తగలబెడతారు. పెళ్ళికాకుండానే చనిపోయినవారిని పూడ్చుతారు. అయితే పెళ్ళికాని పెద్దవయసువారు ఎవరైన చనిపోతే అట్టివారికి జిల్లెడిమొక్కతో వివాహక్రతువు జరిపిస్తారు.

మున్నూరుకాపువారితో సమాన సాంఘిక గౌరవప్రతిపత్తులను అందుకోవడానికని కొన్ని ఇతర కులాలవారు కూడా మున్నూరువారుగా తమనితాము చెప్పుకుంటారు. అయితే తోటబలిజలుమాత్రం యిలాకలువలేదు. తమవృత్తికి సంబంధించని పేరేపెట్టుకొని ఆ కులంగా పరిగణింపబడుతూ వుండేవారు.

## ప్రస్తుత సాంఘిక పరిస్థితులు

ఈప్రాంతములోని మున్నూరుకాపు ప్రజల స్థితిగతులు ప్రస్తుత పరిస్థితుల్లో ఏమంత తృప్తికరంగాలేవు. తాగుడుకు బాగా అలవాటు పడిపోయారు. బాల్యవివాహాలవల్ల జాతిమొత్తం చైతన్యరహితమై నిర్వీర్యమైపోయింది. విద్య ఆమడదూరానికి పారిపోయింది. పండుగలకు పబ్బాలకు అర్థంలేనిఖర్చులు విపరీతంగా పెరిగిపోయాయి. ఈపరిస్థితులన్నీ గుర్తించి పదిహేనుఏళ్ళక్రిందట కొందరు నవయువకులు హైదరాబాదులో తోటబలిజసంఘం అని ఒక సంఘాన్ని నెలకొల్పారు.

గాది బుద్ధన్న, పెద్ది లక్ష్మయ్య, అమిదాల వెంకన్న గార్లు

సాంఘికసంస్కరణలను అమలుజరిపి విశేషంగా కృషిచేసారు. వీరి మరణానంతరం సంఘబాధ్యత పద్మా ముకుందయ్యగారు తమ భుజ స్కంధాలమీద వేసికొని చక్కగా నిర్వర్తించారు. బాల్యవివాహాలను తొలగించాలని ఈ సంఘం బాలికల వివాహవయసును హెచ్చించింది. వివాహాలలో దుబారాఖర్చును తొలగించడానికి వివాహక్రతువునంతా ఒకరోజులో జరిపించాలని ప్రకటించింది. శుభకార్యాలప్పుడు, అంత్య క్రియలప్పుడు బాహటంగా మద్యపానాన్ని పుచ్చుకునే అలవాటును అంతమొందించింది శైవ. వైష్ణవ అనుయాయులమధ్యని వాహాల సం బంధాలను ఏర్పాటుచేసింది అంతేగాక పండుగలు, పబ్బాలప్పుడు అతిథులకు మద్యమాంసాలను ఇచ్చేసందర్భాలలో వాటిని ముట్టుకో మని సంఘసభ్యులు వెయ్యిమంది నిర్ణయించి ఆలా రాసిచ్చారు. హైదరాబాదు, సికిందరాబాదులలో నివసిస్తున్న మున్నూరుకాపు యువ కులు అనేకమంది యీ సంఘములో చేర తమకులంయొక్క అభి వృద్ధికి విశేషంగా కృషిచేసారు. సర్వశ్రీ గిరిపెంటయ్య, గిరివిశ్వ నాథం, పూజారి శ్రీనివాసరావు. బుర్మానారాయణస్వామి. రామగిరి వరదరాజులు. పుప్పాలపాపయ్య. నరసింహ. కామిసెట్టి నరసింహులు తిరుమలయ్య, నారాయణస్వామి, నందనంగోపాల్, బంద్రిరామ స్వామి. మారంనరసింహారావు కాసులవెంకన్న. మిట్టాలక్ష్మీనరసయ్య [హైకోర్టువకీలు]. కాసుల వెంకటస్వామి బి.ఏ., పర్వతాల యతిరా జులు. కూరెల్లి బాబయ్య, పెద్దినరసింహ. వెంకయ్య యింకాఅనేక మంది తమ కులాన్ని సంస్కరించడంలో విశేషంగా పాటుబడ్డారు. పైన పేర్కొన్నవారిలో కొందరు అక్షరాలా శాఖాహారులు.

## కార్యాచరణ కేంద్రము

మూసీనదికి దగ్గరలోగల జియార్‌గూడెంలోని దేవాలయం ఒకటి చాలాకాలంగా కంసాలుర ఆజమాయిషీలో వుంటూవుంది. అయితే దీని ధూపదీప నైవేద్యాల విషయంలో ఎవరు అట్టేపట్టించు కోకపోవడంవల్ల క్రమక్రమంగా ఈ దేవాలయంలో అర్చన మృగ్య మై మూలపడిపోయింది. ఆసందర్భంలో తోటబలిజలు ముందుకొచ్చి ఈ దేవాలయ నిర్వాహణ భారాన్ని తమభుజాలమీద వేసుకున్నారు. తమకులంవారి వద్దనుండి చందాలు, విరాళాలు సేకరించి నిత్య పూజా

పునస్కారాలను తిరిగి అమలుపరిచారు. ఈ విషయంలో సర్వశ్రీ శ్రీపతి రంగయ్య, గుమ్మళ్ళ నారాయణ స్వామి, కీసరి సత్తయ్య, సింగంసెట్టి వెంకటస్వామిగారలు ఎంతగానో కృషిచేసారు. ఈ దేవాలయపునరుద్ధరణకై వీరు ఈ దేవాలయములోని సువిశాలమంటపంలో ఏర్పాటుచేసిన అనేక సమావేశాలకు ఈ కులసభ్యులు వేల సంఖ్యలో హాజరవుతూ వచ్చేవారు. ఆరోజుల్లోనే ఈ కులవిద్యార్థుల నిమిత్తం ప్రత్యేకంగా ఒక పాఠశాలను ప్రారంభించడానికి కొంత కృషిజరిగింది. అయితే ఇది విజయవంతం కాలేదు. ఈ కులంవారికి హైదరాబాదులో ఈ దేవాలయం ఒక కార్యచరణ కేంద్రంగా పని చేసిందనడములో ఏ మాత్రం సందేహంలేదు.

## ప్రచార ఉద్యమం

జిల్లాలలోకూడా ఈ కులంవారి సర్వతోముఖాభివృద్ధికై తగు చర్యలను తీసుకోవడానికి ఈ సంఘం పూనుకుంది. అయితే ఈ సంఘ కార్యకర్తలు సాధారణంగా మధ్యతరగతి కుటుంబీకులు కావడంచేత ఆర్థికమైన చిక్కులవల్ల యీ కృషిప్రయత్నం వెనుకబడిపోయింది. పైగా యీ కులంవారిలో విద్యాభ్యాసం చేసినవారుకూడా అంతంత మాత్రంగానే వుండడంవల్ల తగినంతమంది కార్యకర్తలుకూడా కరువయ్యారు అందువల్ల విద్యావ్యాప్తికి తగుచర్యలు తీసుకోవడం జరువలసి వచ్చింది. ఈ కులంలోని బీదవిద్యార్థులకు స్కాలర్‌షిప్పులు మంజూరు చేసి తద్వారా వారికి విద్యాసౌకర్యాలు కల్పించవలసిన అవసరం ఏర్పడింది నిజామాష్ట్రంలోని ప్రతిజిల్లాలోను ప్రతితాలూకాలోను తోటబలిజ సంఘాలను నెలకొల్పి. వారిమధ్య సత్సంబంధాలను, అవగాహనను కల్పించవలసిన అవసరం కలిగింది. విద్యావ్యాప్తి ద్వారాసభ్యులను సంస్కార వంతులుగా రూపొందించవలసిన అవసరం ఏర్పడింది. దీనంతటికి డబ్బుకావాలి. కులంలో కొందరు డబ్బున్నవాళ్ళు వున్నారు. సర్వశ్రీ వేముల కిష్టయ్య. నర్రా వెంకన్న, అన్నం రత్నయ్య పొన్నాల అంతయ్య. అమరం రాజయ్య, చుక్కా రాజన్న, మూల గౌరయ్య. బీరం రామదాసు వంటివారు ఆర్థిక స్తోమతుగలవారు.

బాదేరామన్నగారు తమస్వంతఖర్చుతో ఈ కులంలోని 108

మంది పేదవారికి వివాహాలు జరిపించారు. వాటికి 10,400 వేయిలు వ్యయపరచిరి.

ఈ కులం లోని విద్యావంతులు, ధనవంతులు సంఘ కార్య కలాపాలలో అంతగా ఉత్సాహం చూపించనంతవరకు ఈ కులం స్థితిగతులు బాగుపడే వీలు లేదు.

తొలి, ద్వితీయ తెలుగు సమ్మేళనాలకు, నిజాంరాష్ట్రములోని మున్నూరువారు అనేకమంది హాజరయ్యారు. రెండువందల సంవత్సరాల క్రిందట నిజాంరాష్ట్రంనుండి జీవన భృతికై యితర ప్రాంతాలకు వలసపోయినవారితో సత్సంబంధాలను నెలకొల్పుకోవాలని భావించారు. బొంబాయిరాష్ట్రంలో స్థిరపడిన మున్నూరువారితో వివాహ సంబంధాలను ఏర్పాటుచేసుకున్నారు. చదువుకున్న కుటుంబాలవారికి తమబిడ్డల వివాహావిషయంలో తగిన సంబంధాలు లంభించకపోవడం వల్ల ద్వితీయ తెలుగు సమ్మేళనములో హైదరాబాదు మున్నూరు ప్రతినిధులు ఈ విషముపై ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఇక్కడి వారిలాగే బొంబాయిలోని మున్నూరువారు కూడా చిక్కులను ఎదుర్కొవలసి వస్తున్నందువల్ల వారుగూడా యీ తీర్మానాన్ని అంగీకరించారు. పద్మ, గందం, జీలకఱ్ఱ, పుప్పాల, వైదాల, భీరం, కీసరి, కామినెట్టి, లక్కవంటి యింటిపేర్లవారు బొంబాయిలోకూడా వుండడం గమనించదగినది. వీరందరు అక్కడ ఆర్థికంగానూ విద్యావిషయకంగానూ స్థిరపడినవారే.

బొంబాయి మున్నూరువారు, నిజాంరాష్ట్రంలోని మున్నూరు వారు పరస్పర స్నేహ, సౌహార్ద్రాలను నెలకొల్పుకొని వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకుంటే ప్రత్యేకించి తమ కులానికేగాక యావత్ ఆంధ్రప్రజానీకానికి కూడా యిది హర్షణీయము అవుతుంది.



## మున్నూరు కాపులు బలిజలు

దుమ్మ గురుమూర్తి నాయుడు

ఈ సంఘము యొక్క పేర్లను గురించిన వాదోపవాదములు పరిష్కారముగాక తికమక లాడుచున్న ఈ తరుణమున శ్రీ దుమ్మ గురుమూర్తి నాయుడు తన 'ఆంధ్రప్రదేశము-బలిజలు' అను గ్రంథమున మున్నూరుకాపులు బలిజలే యని నిరూపించ ప్రయత్నముచేసినారు. బలిజ పదోత్పత్తిని ఇట్లు నిర్వచించినారు.

బలిజనగా "బలి" వలన పుట్టినవారు లేక బలివంశమునందు బుట్టినవారు. చంద్రవంశ క్షత్రియుడగు యయాతి చక్రవర్తి యగు నాలుగవ కుమారుడు "అనువు" వంశములో అనువునుండి లెక్కించగా పదమూడవ ప్రముఖ వంశమువాడగు "బలి" అను మణిరాజు బంగాళదేశము లగాయతు దక్షిణముగా మద్రాసు దిగువ వరకు పాలించుచుండెను ఈ రాజ్యమునకు ప్రాచ్యక రాజ్యమని పేరు. బలి తరువాత వచ్చిన రాజులు బలి అంతటి ప్రయోజకులు కాకపోవటం వల్లను, దుర్బలులగుటవల్లను అనేక వృత్తులు ఆశ్రయించటం, కాలక్రమమున వృత్తులబట్టి ఆ వంశజులను పిలవటం జరిగినది. అందుచేతను ఓడబలిజ, గాజుల బలిజ పెరికబలిజ మొ॥ అనేక శాఖలు ఏర్పడినవి. బలియొక్క ఆరవ కుమారుడు ఆంధ్రరాజు, చంద్రవంశమునకుచెందిన రోమపాదు అనెడి రాజు దశరథునకు ప్రాణమిత్రుడు. ఈ ముగ్గురు సమకాలికులు ఆంధ్రరాజు కాలము నేటికి 1,46,00,000 సం॥

కావున ఈ బలివంశము సుమారు 1,15,00,000 సం॥ల పైచిలుకు కాలమునుండి యున్నది. కొందరెంచినట్లు ఈ 28 వ యుగములోని త్రేతాయుగమని ఎంచినప్పటికి ఈ బలి సుమారు 9,00,000 సం॥ లు పైచిలుకు కాలము అయివుండి యున్నాడు.

మున్నూరుకాపులనే వారుకూడ బలిజసంఘమునకు చెందినవారే. వీరిని కొన్నిచోటులలో మున్నూటి బలిజలని, మున్నూరుకాపులని పిలువబడుచున్నారు. బ్రాహ్మణులలో ఆరువేల శాఖ (నియోగులు) ఏర్పడిన విధముగ మున్నూరు (గోత్రములు) కుటుంబనులు చేరి సంఘముగా ఏర్పడి యుండును. కొండపల్లి సీమ పూర్వము మున్నూరునాడు అని వ్యవహరింపబడెను. మూడునూర్ల గ్రామము లుండుటచే ఈ దేశమునకీ నామము వచ్చియుండును. కావున ఇది సంఖ్యావాచక మగుచున్నది మున్నూరుకాపులు అను సంఘము బలిజ సంఘాంతర్భూత మైనదని చరిత్రకారుల అభిప్రాయము. అధిక సంఖ్యాకులతో కూడుకొనియున్న కాపుసంఘాలు ఆంధ్రదేశములో రెండు. అందు మొదటిది బలిజసంఘము రెండవది రెడ్డిసంఘము. ఇప్పుడు రెడ్లతో బలిజసంఘీయులకు సంబంధము కన్పించదు. కాబట్టి మున్నూరుకాపులు బలిజసంఘీయులేయని భావింపబడుచున్నారు.

ఇక ఇచట హైదరాబాదు, సికిందరాబాదులలో శ్రీయుతులు బిర్కా నారాయణస్వామి, పెద్ది నరసయ్యగారల నాయకత్వమున శ్రీయుతులు పద్మా ముకుందయ్య, కీసరి సత్తయ్యగార్లు అంగరక్షకులై 14 సం॥ ల పూర్వము తోటబలిజ నామకరణ మహోత్సవము జరిపిరి. సయ్యాజీ, నాగోజీగారు దివంగతులైన సందర్భమున వారి ఆత్మశాంతికి ప్రార్థనచేయుటకు సమావేశమగు ప్రకటనలో తోటబలిజతోబాటు మున్నూరుకాపు నామమును వాడుటచే కీ॥ శే నరహరి పటేలుగారి ఖండనకు తాళలేక తోటబలిజ నామము అంతర్ధానమైనది.

ఇక బలిజకాపు వ్యవహారము బయలుదేరగానే దివ్యజ్ఞాన సమాజమందిరమున జరిగిన కర్మకాండను ఖండించు నిమిత్తము పెద్దల అనుమతితో నేనుకొంత కృషిసలిపితిని. తత్ఫలితముగా పీలానా ఆంజ

సేయ దేవాలయ ఆవరణమున కీ॥ శే॥ మరవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన ప్రంచదసభ 1940 వ॥ లో జరుపబడి మున్నూరు కాపుకుల నిర్ణయసిద్ధాంతము దృఢపరచబడినది దీని విషయము సవిస్తరముగ మరొకచోట పొందుపరచనైనది.



కూర్చున్నవారు కుడి నుండి ఎడమ వరకు :

1. పొన్నాల నర్సింలు. 2. శ్రీపతి రంగయ్య. 3. పద్మాముకుందం, 4. పొన్నాల అంతయ్య. 5. లక్ష్మన్‌రావు పత్తూర్ (పూనా).

నిలబడిన వారుకుడి నుండి ఎడమ వరకు :

1. పొప్పాల జగ్గయ్య, 2. కారింగుల రామచంద్రయ్య, 3 కీ॥శే॥ సత్తయ్య. 4. గుమ్మల బాలకిష్టయ్య. 5. తుంగా సత్తయ్య, సింగం శెట్టి వెంకటస్వామి. 7. గొల్లపల్లి మంకయ్య. 8. ?

సూచన: మున్నూరుకాపు సంఘ నాయకులగు శ్రీ లక్ష్మన్‌రావు పత్తూర్ గారు 18. 9. 1934 నాడు హైదరాబాదుకు విచ్చేసినప్పుడు జరిగిన విందు సందర్భములో దీయబడిన ఛాయాచిత్రము.



# మున్నూరు కాపుకుల చరిత్ర పరిశోధనలు

శ్రీ బొజ్జం నర్సింలు

ఈశ్వర సృష్టిలో మానవుడు సంఘజీవి. అతడు తనతోటి మానవులతో గలిసి తన పుట్టుకనుండి గిట్టునంతవరకు, వారిసహకార సహచర్యాల ద్వారా జీవనోపాధి మార్గముల అన్వేషించుకొనును. ఈ అన్వేషణ అతని స్వాభావిక ప్రవృత్తి. ఐతే మానవునకు కేవలము జీవనోపాధియే లక్ష్యము కాదు. ఇతరావసరములు అనేకములు. ఉండుటకు ఇల్లు కట్టుకొనుటకు బట్ట మున్నగునవి జీవనోపాధిలోని అనివార్య భాగములు. అసలు మానవుడు ఒక వ్యక్తియేగాక తన అవసరములు, తన ఆలోచనలతో గూడుకొనిన ఒక సంఘమనదగును.

ఈ ప్రవృత్తి నాలుగు విధములు. వీనినే శ్రీకృష్ణభగవానుడు ద్వాపరయుగములో అర్జునునితో ఇట్లు ప్రవచించి యున్నాడు.

శ్లో: చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్యకర్తారమపిమాం, విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥

గీత జ్ఞానయోగము శ్లో॥ ౧౩

తా॥ సత్త్వరజస్తమో గుణముల భేదముల ననుసరించియును, వారివారి కర్మభేదముల ననుసరించియును, బ్రాహ్మణాదులను నాల్గు వర్ణములును నాచే సృష్టింపబడినవి నేను వానికి కర్తనైనను అవ్యయునైన అకర్తనుగా తెలుసుకొనుము.

దీనికి శంకరాచార్యుల వారి వివరణ తెలిసికొన దగినది:-

సత్త్వగుణ ప్రధానుడగు బ్రాహ్మణునికి శమము (ఇంద్రియ నిగ్రహము) దమము (అంతఃకరణ నిగ్రహము) తపస్సు మొదలగునవి కర్మములు, సత్త్వముతో గూడిన రజోగుణము ప్రధానముగాగల క్షత్రియునకు శౌర్యము, తేజస్సు (ప్రతాపము) మొదలగునవి కర్మములు. తపస్సుతోగూడిన రజోగుణము ప్రధానముగాగల వైశ్యునకు కృషి (వ్యవసాయము) కర్మము, రజస్సుతోగూడిన తమోగుణము ప్రధానముగాగల శూద్రునకు శుశ్రూష (పరిచర్య) కర్మ.

అనగా గుణకర్మలు మానవునకు స్వాభావికములు అసలు మానవుడు ఈ నాలుగు గుణకర్మల కూడికయే. సగుణ, నిర్గుణ బ్రహ్మోపాసనయనుడు, ప్రతిమారాధనయనుడు, మానవుడు తన సృష్టికర్తను గురించి విచారించుచుండును. ఇది ఆస్తిక లక్షణము-నాస్తికుడుకూడ ఒక విధముగా ఆస్తికుడే. కారణమేమనగా, నాస్తికుడు ఎల్లప్పుడు ఈశ్వరాస్థిత్వము గురించి శంకించుచు, భగవంతుడు కలడా లేడా యని ఆలోచించుచుండును. అది అతనిలో నిగూఢమైన దైవత్వమునకు ప్రతిబింబము. చార్వాక మతమునకు జెందిన కొందరు నాస్తికులుండవచ్చును. ఐతే వారు పామరులలోకన్న విద్యాభూషణ భూషితులలోనే కలరు.

శత్రువులనుండి తన్నుతాను రక్షించుకొనవలయును. కుటుంబ పోషణ, ధర్మనిర్వహణ దక్షతతో సాగించుకొనవలయును. దీనికి సత్త్వముతో గూడిన రజోగుణ ప్రధానమైన క్షాత్రమవసరము.

జీవనోపాధికి కృషి అనివార్యము ఇది తమస్సుతో గూడిన రజోగుణ లక్షణము శుశ్రూష లేక పరిచర్యగూడ మానవ స్వభావ

ములోనిదే. ఇవి శరీర నిర్మాణములోగల కర్మేంద్రియముల వలె తమతమచోట ప్రాముఖ్యత గలవే

గీతలోని శంకర వివరణలో కర్షకప్రవృత్తి శూద్రవర్ణమునకు జెందినదికాదు.

ఇక మనము మన ప్రధాన విషయమైన మున్నూరు కాపుకుల చరిత్రను పరిశీలింతము

మున్నూరు కాపుకుల చరిత్రవిషయమున పలువురు పరిశోధనలు చేసి తెలిపిన అభిప్రాయములు పలువిధములు, కొన్ని శాస్త్రీయములు, కొన్ని ఊహాగానములు, మరికొన్ని నర్మగర్భితములు.

ఈ సందర్భమున డా॥ చిలుకూరి వీరభద్రరావు, ఓగిరాల సుబ్బారావుగారల పరిశోధనలు ముఖ్యములు. ఆంధ్రచరిత్ర చతురానన డా॥ చిలుకూరి వీరభద్రరావుగారి పరిశోధనాఫలితముల చూతము. ఇవి కాకతీయాంధ్రరాజ యుగచరిత్రమునుండి గ్రహింపబడినవి.

వీరు తమ తొలిపలుకులలోనే "భారత వర్షమున యుగయుగమునుండి నాగరికతా విజ్ఞానములచే నొప్పుచు, జన్మభూమినే నమ్ముకొన, భూసేవకులై భూమిని సర్వసస్యాధిగ నొనరించి సమస్త ఐశ్వర్యములచేత భరతఖండమునకు వన్నెయు వాసియు కల్పించి ప్రపంచమున పేరుమోసిన కులములలో కాపుకులమునే ప్రప్రథమమున ఎన్నదగి యుండుననియు, కాకతీయ చక్రవర్తుల సేనానులలో ముఖ్యముగా గణపతిదేవ చక్రవర్తి గజసేనకు అధ్యక్షుడును, నృత్యశాస్త్రమను ఒక గొప్ప శాస్త్రగ్రంథము రచించినవాడును, ఆ చక్రవర్తి భార్యలకు తోబుట్టువునగు జాయపనాయకసాహిణి, దాదినాగయగన్న సేనానియు, విరియాల మల్లయ సేనానియు, కొసిగె ఈశ్వరదేవుడు మున్నగు ప్రసిద్ధ వీరసేనాలగు వారలీ కులశాఖకు సంబంధించినవారనియు, అలస భావముచేతనే మున్నూరుకాపుకులము వారు తమకు ప్రఖ్యాతమైన చరిత్రస్థానమున్నను గుర్తింపజాలకపోయినారనియు, బరిశోధన యందలి సత్యాసత్యము లెట్లున్నను, వీరిచరిత్రము

తెలుగుతల్లి కంఠమున ధరించిన మంగళసూత్రమువలె మెరయుచున్నట్లుగా నా కన్నులయెదుట మెరయుచున్నద”ని వ్రాసినారు

యువ సం॥ ర పౌష్య శు॥ ౨ సోమవారమునకు సరియైన 8 జన్వరి 1345 వ॥ యొక్క గోలకొండ ద్వైవార పత్రికలో “త్రిశత వంశాభ్యుదయము” అను శీర్షిక క్రింద శ్రీ ఓగిరాల సుబ్బారావు గారి (గౌరవ చారిత్ర పరిశోధకులు) వ్యాసము ప్రకటితమైనది. అందులో వారు మొదటి పేరాలో వ్రాసినదాని సారాంశమిట్లున్నది: “మనదేశములో అష్ట సహస్రము, షట్సహస్రము (ఆరువేలు) ఆరునూరులు, ఐదునూరులు, అష్ట, పంచ, చతుర్, త్రి, ద్వి, ఒంటు మొదలగు సంఖ్యా పూర్వక వంశ నామములవలె ఈ త్రిశతవంశము అను మున్నూటికాపు వంశనామముగూడ లోకములో నొకటిగ అలరారుచున్నది. వివిధ కాలములందు వివిధ కారణాంతములచే, ఆయా సంఖ్యావాచక శబ్దములు వంశనామములుగ నేర్పడి యుండినవి. వీనిలో కొన్నిటికి నిరాధారములగు పుక్కిటి పురాణములు, వంశనామములు ముడి పెట్టబడినవి. త్రేతయుగముననే యీ త్రిశతవంశము బలపరాక్రమ సంపన్నములగు మున్నూరు కర్షక (పంటకాపు) కుటుంబములు కారణాంతరములచే గూడి. ఒక ప్రత్యేక కర్షక (పంటకాపు) శాఖగా నేర్పడి లోకమున వర్తించుచు. క్రమక్రమముగ వీరి సంఖ్య లక్షలకు పెరిగి, ఆ ప్రాచీన త్రిశత (మున్నూటికాపు) వంశనామము నేటికిని ధరించి, వివిధ ప్రాంతాముల కెగబ్రాకి నేడు విరాజిల్లుచున్నవి. ఇట్లని ఈ వంశపు బుట్టుకను గూర్చి ఇదమిత్థమని నిర్ణయించి సిద్ధాంతము చేయుటకు కొన్నికొన్ని ప్రబల సాధనములేగాక. భాషాశాస్త్ర పురహాస్య చరిత్రకూడ మిక్కిలి తోడ్పడుచున్నది”. శ్రీ చిలుకూరి వీరభద్రరావు దీనిని ఒక విధముగా సమర్థించుచు. పదునేనవ శతాబ్ది మధ్యకాలమున మున్నూటి కులము పంట పదునాల్గు కులములలో నిదిగ పరిగణింప బడుచున్నట్లు ఉదయగిరి, చంద్రగిరి రాజ్యములను పరిపాలించిన సాళువ నరసింహరాయలకు సామంత మండాలాధీశ్వరుడైన నార్వేటి బుక్క భూపాలుని ఉద్దేశించి ఒక భట్టుకవి చదివిన సీసపద్యమును వారు పేర్కొనినారు ఇందులో వర్ణింపబడిన పదునాల్గు కులములివి :-

1) మొటాటి, 2) పాకనాటి, 3) గుడాటి (గోటేటి), 4)

వెలనాటి, 5) మొరసు, 6) పంట, 7) చిట్టెపు (పొంగలినాటి) 8) భూమంచి, 9) కుంచేటి, 10) మున్నూరు, 11) అయోధ్య, 12) నీరద, 13) గండికోట, 14) ఓరుగంటి

శ్రీ ఓగిరాల సుబ్బారావుగారు పై వ్యాసములో "ఈ వంశపు (మున్నూరు) కాపులు మొదట మిథిలకాపు లనబరగిరి. పై కారణాంతములచే మున్నూటికాపు వంశమువారిని వ్యవహారమునకు వచ్చిరి" అనిగూడా వ్రాసినారు కాని ధా॥ శ్రీ చిలుకూరు వీరభద్రరావు దీనిని సంశయాస్పదమనుచు, శ్రీ సుబ్బారావుగారి మొదటి కారణమును అంగీకరించవచ్చునన్నారు. కారణమేమనగా "క్షేత్రయుగమున విదేహ దేశము పంటకాపులకు ప్రధానమైన స్థానముగా నుండెను. వీరలకు ప్రభువైన జనకమహారాజు మిథిలానగరము రాజధానిగ విదేహ దేశమును పరిపాలించిన కాపుమహారాజు సీతాస్వయంవర సమయమున శివుని మహాధనస్సును గదల్చితెచ్చిన మున్నూరు మహావీరుల సంతానమే యీ మున్నూరుకాపుకులమని నిర్ణయింప వలసియున్నది. ఇట్టి విశిష్టవిషయము మున్నూరునకు అంటిపెట్టుకొని యుండుటచేతనే మున్నూరనునది కాపులలో నొకశాఖకు కులనామముగా నిలిచిపోయినది ఇదిఏదో సంఖ్యామాత్రముచేతనే జ్ఞాపకముంచుకోబడినది కాదని తోచును. మరియు మూడువందల సంవత్సరముల క్రిందట వామన పండిత కవీశ్వరులు మహారాష్ట్రభాషలో వ్రాసిన 'వామన పండితీయము'ను రామాయణములోగూడ 'త్రిశత' పదమునే ఉపయోగించినారు కాని సంస్కృతమున రామాయణములో త్రిశతకు బదులు 'శతానిపంచాశత్' (ఐదువేలు) అని, తెలుగు భాస్కర రామాయణములో ఐదు నూర్లుగా మార్చబడినది. ఇవి సత్యదూరములు వ్యాసప్రోక్తమైన భాగవతములోని "త్రిశత" బమ్మెర పోతనామాత్యుని ఆంధ్ర భాగవతములోని 'మున్నూరు' విశ్వాసార్హములు" అని వ్రాసినారు.

శ్రీ చిలుకూరివారు ఇంకా ఇట్లు వ్రాసినారు :

"భారతదేశమున వర్ణ వ్యవస్థ ఏర్పడుటకు పూర్వమే కాణ్డులు, కాణ్ణులు, కాలులు, అను తెగలవారు, పుణ్డులు, పుణ్ణులు, పులులు, పురులు అను తెగలవారితో సమ్మేళనము చెందిన వెనుకనే, కాంపు అను తెగ ఏర్పడినది. వీరు తొలుత వర్ణవ్యవస్థ ఏర్పడినప్పుడు వైశ్యవర్గ

ములోనికి వచ్చినారు వాణిజ్యము, వ్యవసాయము, పశుపాల్యము అను మూడువృత్తులు వైశ్యుల కేర్పడుటచేత వీరలు వాణిజ్యవైశ్యులు, భూవైశ్యులు, గోవైశ్యులు అను త్రివిధ వైశ్యులు ఏర్పడినారు. వీరిలో కాపులు లేక కాపులు భూవైశ్యులుగా నున్నారు. కాంపులది జనకుని సృష్టి. ఈ కాపుమహారాజు నాగలి ధ్వజమనందు గలిగి యుండి, భూమిని దున్నుటచేత వైశ్యుడై, వైశ్యవృత్తులగు వ్యవసాయము, పశుపాల్యము, వాణిజ్యములను పోషించి, యజ్ఞాది క్రతువు లాచరించుటచే రాజన్యుడై, పిమ్మట బ్రహ్మనుగూర్చి తర్కించుట చేత బ్రహ్మణ్యుడై, రాజర్షియు, బ్రహ్మర్షియైనాడు ఇందుకు వేదప్రమాణము గలదు".

ఇది త్రేతాయుగపుమాట. ఈ యుగకాలము 1296 సం॥ లు ఈ యుగమున వామన, పరశురామ, శ్రీరామావతారము లుద్భవించినవి. అనగా జనకుడు త్రేతాయుగపు మూడవ దశవాడు. ఆతరువాత ద్వాపరయుగము. ఈ యుగకాలము 8,64,000 సం॥ లు ఈ యుగమున కృష్ణ, బుద్ధావతారము లుద్భవించినవి. కలియుగ కాలపరిమితి 432000 సం॥ లు. ఇందులో ఇప్పటికి 5066 సం॥ లు. గడిచినవి. అనగా జనకుని కాలము 8,69,000 సం॥ ల పూర్వమునది.

ఇక కొంత మన దృష్టిని శ్రీ ఓగిరాల సుబ్బారావు గారిపై వ్యాసముయొక్క మిగత భాగమునకు మరల్చుదము.

("మొదట మిథిలకాపులనబడి కారణాంతరములచే మున్నూటికాపు వంశము వారని వ్యవహరింప బడిన) వీరు ఇతర ప్రాచీన కర్షకశాఖల తోబాటు ఉత్తర హిందూస్థానమునుండి దక్షిణము (దక్కన్) నకువచ్చి స్థిరనివాస మేర్పరచుకొనిరి. కొన్ని కొన్ని చాళుక్యుల శిలాశాసనములలో వీరు చతుర్థ కులజులు అని వ్రాయబడి యుండుటచే, చతురాన్వయులమని చెప్పికొనిన చాళుక్యులు, చోడులు, రాష్ట్రకూటులు ( రెడ్లు, కాపులు ) మొదలగువారు ఏకులపువారని చరిత్రకారులచే నిర్ణయింపబడిరో వీరును ఆకులపువారే. పెదమున్నూటి వంశము అని కొన్నిశాసనములలో, మున్నూటి వంశమని మరికొన్నింటను మున్నూర్వణ్ణియుత్రిశత వంశము, త్రిశతులు అని పూర్వపు గ్రంథాదులందు ఈ వంశనామము స్థిరపడియే యున్నది.

క్రీ॥ శ॥ 11 – 12 శతాబ్దములలో గౌతమీతీర నివాసులగు మున్నూటి వంశపు కుటుంబములు చాళుక్య మహారాజు కుటుంబముతోను, హైహాయ వంశప్రభు కుటుంబములతోను, మత్స్యవంశ భూపతుల కుటుంబములతోడను, సంబంధ బాంధవ్యముల నెరపుకొని, ఆ రాజరాజ సామంతరాజాది ప్రభుకుటుంబములతో సాటివియై శోభిల్లినవి మరియు ఆర్య, నాయక, గండరగండ, రడ్డి ఆది అసామాన్య నామ బిరుదావళులు మున్నూటికాపు వంశపు పురుషులు, దేవి, అంబ అంబిక, సాని, రాణి, వనితోత్తమ, పరాంగన, ఆది ప్రాతివ్రత్య సూచక ప్రాచీన నామ బిరుదావళులు స్త్రీలు అలంకరించినట్లు గూడ శిలాశాసనములు చాటుచు, నేటికిని కన్నులకు గట్టుచు, నేటి నిరాధార కల్పితగాధల యొక్క వ్యర్థపురటనమును రూపుమాప జాలియున్నవి.

నిజాంరాష్ట్రములో ఈ కర్షకవీర కుటుంబములు కొన్ని నూర్ల ఏండ్ల క్రితము తాత్కాలిక ప్రభువుల మన్నలకు పాత్రులై కొన్నికొన్ని జాగీర్లను, మాన్యములను, సంపాదించి, మన్నెల సర్దార్ మన్నెవీర్ మొదలగు శూరత్వ సూచక బిరుదముల బొంది, శూల, కరవాలము మొదలగు ఆయుధపాణులై, యుద్ధములుచేసి, దేశసంరక్షణకై వలసిన చోటులందు బలిష్ఠములగు చిన్న చిన్న కోటలు కట్టుకొని నివసించుచు శత్రు, చోరాది దుష్టజన భయంకరులగుటయేగాక లోకులకు సహితము అట్లే భయమును పుట్టించుచు వీరక్రియలను చేయుచుండునట్లును ఆ యా ప్రాంతీయ కూర్మ మొదలగు జాతుల వారు ఆ మున్నూటికాపు మన్నెవీరులకు వినయవిధేయులై యుండినట్లును, ఆయాకోటలపై కైఫియ్యతు ప్రకరణములు మొదలగునవియేగాక మిక్కిలి శిథిలావస్థయందున్నను ఆ కోటల శేషములును నేటికిని ప్రత్యక్షముగా సాక్ష్యమిచ్చుచున్నవి. కాకతీయ సామ్రాజ్య రక్షణకై, శత్రువులతో పోరాడి వీరస్వర్గ మలంకరించిన వీరనాయకులలో కొందరు ఈ వంశములోనివారు కలరు.

ఈ అంశములు శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారి మున్నూరు కాపు చరిత్రము వలనను, 25 ఆజూరు 1345 ఫ॥ నాటి గోలకొండ పత్రిక "కాకతీయ చరిత్ర"లో మున్నూరుకాపు చరిత్ర గురించి వారు ఒక మిత్రునకు వ్రాసిన లేఖవలనను చాలవరకు బలపడు చున్నవి.

మున్నూరుకాపు చరిత్రలో - "విదేహదేశమునకు మిథిలా నగరము రాజధానియైనట్లు, కోసలదేశమునకు అయోధ్య రాజధానిగ నుండెను. బౌద్ధయుగకాలమున ఆ దేశములందు మహావిప్లవములు సంభవించుటచేత, గంగాతీర ప్రాంతదేశముల నుండి అచటి కాపు జనులు వివిధ శాఖలవారు శాతవాహనాంధ్రులు దక్షిణాపథమును పరిపాలించుటకు పూర్వముననే గోదావరితీరస్థ తీరములకు వలస వచ్చి నివాసమునేర్పరచుకొనిరని చరిత్రమునుబట్టి తెలియుచున్నది. అప్పుడు శాక్యులు, వైదేహులు, మల్లులు, లిచ్ఛవీలు మొదలగువారు వజ్జియనులను పేరుతో ఈ దేశమునకువచ్చి స్థిరపడిపోయిరి. ఈ ప్రదేశమున వీరులందరును ఇక్ష్వాకులని వ్యవహరింప బడిరి తెలుగులో వీరినే రెడ్లని, రెడ్డికాపులని, తెలుగుకాపులని, కమ్మకాపులని, వెలమకాపులని వేర్వేరు కారణములచే, వేర్వేరునామములతో వ్యవహరించుచున్నారు వీరెల్లరును వైశ్యవృత్తులనే అవలంభించినను క్షాత్రమును వహించి, క్షత్రియ ధర్మమునుగూడ నిర్వర్తించుచుండిరని చరిత్రముగూడ వేనోళ్ళ చాటుచున్నది. వీరలు తమ పూర్వచరిత్రసంప్రదాయమును మరువక "త్రిశత" అనుటకు బదులుగా "మున్నూరు" అని దేశీయ భాషాపదమును గ్రహించి మున్నూరు కాపులమని వ్యవహరించుకొనుచున్నారు ఈ కులము వారి వివాహములను. అందు జరుపబడు చర్యలను, సంభాషణలను. ఆచారములను జూచినప్పుడు వీరు వీరకాపులని నిస్సంశయముగా బోధపడగలదు కీ. శే॥ అడివి బాపిరాజు తమ కాకతీయ చరిత్రాత్మక నవల 'గోనగన్నారెడ్డి' లో చరిత్ర క్రింద "కాకతీయ గుణపతి కుమార్తె శ్రీ రుద్రమదేవ చక్రవర్తినికి దక్షిణ హస్తముగా నున్న మహామాండలిక ప్రభువు. మహాసేనాపతి గోనగన్నారెడ్డిని ప్రస్తావించుచు ఇట వ్రాసినారు.

> "ఆనాడు ఆంధ్రదేశమంతా నిండియున్న రెడ్డి వెలమ. కమ్మ - బలిజ. మున్నూరుకాపు మొదలగు ఆంధ్రుల పూర్వీకులు, దుర్జయ కులజులునగు ఆంధ్ర క్షత్రియ జాతికి చెందిన గోన గన్నారెడ్డి మహావీరుడు"

"యాదవులు ఓరుగల్లునగరమును ముట్టడించినప్పుడు ఆంధ్ర

క్షత్రియులైన రెడ్లు, పంటవారు, మున్నూరుకాపులు, ముదిరాజు వారు యుద్ధసన్నద్ధులైరి'' ఈ సమయముననే జాతిమత భేదములేక అందరు దేశసంరక్షణకై పోరాడిరి.

"కాకతీయవీరులు, వీరభద్రులు, రెడ్డిభీములు, వెలమఅర్జునులు, మున్నూరురాములు, బ్రాహ్మణ పరశరాములు, ముదిరాజు హనుమంతులు, బోయాంగదులు, గొల్ల బలరాములు యుద్ధములో పాల్గొని యాదవ సైన్యమును భస్మ సలిపినారు''. ఇచట "మున్నూరు రాములు'' అనగా జనకచక్రవర్తి కాలపు శ్రీరామచంద్రుని బోలిన వీరబలులగు మున్నూరుకాపులని భావము

ఈ కాకతీయాంధ్రరాజ యుగమున మున్నూరుకాపు స్త్రీలు గావించిన శాసనములుగూడ కొన్నిగాన్పించినవి. అయ్యవి తూర్పు గోదావరీ మండలములోని దాక్షారామ భీమేశ్వరస్వామివారి ఆలయమున గలవు. (వీనిని శాసనముల శీర్షికక్రింద చూడుడు). ఈ శాసనములలో ప్రయోగింపబడిన అనుంగు, సాని, రెడ్డి, నేడు, సెట్టి శబ్దములు దేశీయభాషాపదములు. ఆర్య, నాయక దేవి, మహాదేవి అని పదములు సంస్కృత భాషాపదములు. ఈ శాసనములన్నియు పదునొకండవ, పండ్రెడవ శతాబ్దములలోనివిగ నున్నవి. వీరు ఆ మిత్రునకు వ్రాసిన లేఖలో ఇట్లు వ్రాసినారు: మున్నూరుకాపుకుల చరిత్రకు సంబంధిచిన చాలారికార్డు, కొన్ని శాసనములుగూడ లభించినవి. ఇవి వెయ్యిసంవత్సరముల నాటివై యుండుటచేతను, ఇందు ఒకటి రెండు దేశీయపదముల దుర్భిప్రాయములకు చోటిచ్చినను, రెడ్డి, ఆర్య, నాయక దేవ మొదలగు మర్యాద సూచకములైన పదములుండుటచేతను, హైహయ వంశీయులు మాత్స్యరాజ వంశీయులతో సంబంధముగల స్త్రీల దానశాసనములు కూడ కన్పట్టినవి. కావున అప్పటి వ్యవహార భాషాపదముల యొక్క అర్థములు మొదలగువానిని తెలిసికొనవలసియున్నది. మున్నూరు శబ్దము సంఖ్యావాచకమై యుండుటచేతను, చాలా పురాతన కాలమునుండి అనగా రామాయణ కాలమునుండి కన్పట్టుటచేత చాల శ్రద్ధవహించి పరిశోధన చేయుచున్నాను. మున్నూరునామము మార్చుకొను ప్రయత్నము ఆదేశమున నున్నట్లు కన్పట్టుచున్నది. ఇది వట్టి నిరర్థక ప్రయత్నము''

శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు ( సంగంజాగర్లమూడి ) రచించిన ప్రాచీనాంధ్రక్షత్రియులగు కమ్మవారి చరిత్రము ప్రథమ భాగములో (ప్రకటితము 1939) చోడ, చాళుక ,, హైహయ దుర్జయ వంశములనుండియే కమ్మవారేర్పడినారని, ఎన్నియో చరిత్రాంశముల వల్ల నిరూపించుచు కాపు మున్నూరుకాపువారిని గురించి ఇట్లు వ్రాసినారు.

"కోనరాజేంద్రచోడుని కుమారుడు వెన్నచోడరాజు ప్రేకేటి వీరప్పరెడ్డి కుమార్తె బిమ్మలదేవిని పరిణయమాడినట్లామె వ్రాయించిన శా॥ శ॥ 1159 సంవత్సరమునాటి భీమేశ్వరాలయ శాసనమువలన తెలియుచున్నది. వీరపరెడ్డి మున్నూటి కాపులలోనివాడు. కమ్మవారిలో ఇప్పటికిని మున్నూరువారున్నందునను కోనవారున్నందునను వీరు కమ్మవారనదగియున్నది.

"కాపుల గోత్రములు "పైడిపాల" మున్నగునవి కమ్మవారిలో గూడ కలవు కమ్మవారిలో మున్నూటికాపుల పేటికాబోలు మున్నూరివారున్నారు".

## ఇతర ప్రముఖుల అభిప్రాయములు

కీ॥ శే॥ డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారి అభిప్రాయము షోలాపూరు ఆంధ్రుల గురించి బొంబైలో నిజాంనుంచి వచ్చిన ఒకవేయి మున్నూరు కాపువారి సంఘమున్నది. వీరి పూర్వీకులు బ్రిటిషు సైనికదళాలలోచేరి, వారితో మహారాష్ట్రమునకు వచ్చినారు. బొంబై రాజధానిలో మొట్టమొదట నివాసమేర్పరచుకొన్న తెలుగువారు వీరె వీరు బొంబై, పూనా, అహ్మదాబాదు, షోలాపూరు, ఘోర్‌నది, కరాచి, బరోడాలో నివాసమేర్పచుకొన్నారు. బొంబాయి రాష్ట్రములో వీరు అల్పసంఖ్యాకులైనను వీరిలో కంట్రాక్టర్లు డాక్టర్లు ఇంజనీయర్లు, వర్తకులున్నారు. ప్రభుత్వములో ఉన్నతోద్యోగములో నున్నారు. వీరిలో చాలమంది కాంగ్రేసు అభిమానులు. ప్రజాసేవకులు తెలుగుభాష మాట్లాడు స్త్రీలలో కొంచమైనా విద్య గడించినవారు వీరిస్త్రీలే.

అల్యాభాదు మున్నూరుకాపు సంఘవార్షికోత్సవ సందర్భమున 1350 ఫ॥ బండారి బుచ్చయ్యగారు ఉపాధ్యక్షులు తమతొలిపలుకులలో ఇట్లు నుడివిరి.

„మనదేశమునుండి వలసపోయి బొంబాయి ప్రాంతములోను మధ్యపరగణాలలోను స్థిరనివాస మేర్పరుచుకొనిన మన కులసోదరు లిప్పటికిని మున్నూరు వారమని చెప్పుకొను చున్నారు ఛత్రపతి శివాజి మహారాజుగారి కాలములో సైన్యములందు చేరినటు చారిత్రక దృష్టాంతములు కలవు''.

పూనానుండి పగడాల వెంకటరామయ్యగారి సందేశము :

మన పూర్వులు విజయనగరరాజుల కాలములో జరిగిన యుద్ధములో ధైర్యముతో పోరాడి మున్నూరువారను బిరుదు సంపాదించినారు. ఆ పేరే వాడుకలో మున్నూరుకాపులైనది. ఇతరులు చేసిన అర్థములు తప్పు. ఈ ప్రాంతమువారికి మన కులజన్మచరిత్ర తెలియనందున మనతోగలిసి సంబంధ బాంధవ్యములకు ఇష్టపడలేదు. ఇప్పుడు ఇష్టపడుచున్నారు. మద్రాసులో ఓఢ్రభాషలో మనకు సంబంధించిన కొన్ని గ్రథములున్నవట. వానిని సేకరింపవలయును.



# మున్నూరు కాపువారి శాసనములు

*దివ్యవాణి - 3 వ మార్చి 1941 [1332 ఫ.]*

### తూర్పుగోదావరి మండలములోని దాక్షారామ భీమేశ్వరస్వామివారి ఆలయ మందలి శాసనములు

"చతుర్థవంశమున జన్మించిన వాడును, నూకనార్యుని పుత్రుడు వినయాకరుడును, విఖ్యాతుడును, నైన పెదమున్నూటి వీరపనాయకుడును, వీరపరెడ్డికిని, లక్ష్మీసమానురాలైన లక్ష్మాంబకును జనించిన ట్టియు స్త్రీలలో ఉత్తమరాలును, మత్స్యకులైకకుల భూషణుడును, శ్రీ మన్మహామండలేశ్వరుడును అగు ఒడాది జయంతిరాజు కొడుకు అర్జునదేవుని దేవియు అగు సూరమదేవియును, ఆమెతన తల్లిదండ్రులకు ధర్మువు (ధర్మము) గాను వడాది అలికట్టవాటిలోని "పంకు భీమాపురమును" భర్తయనుమతివి గైకొని తానును భర్తయుగలిసి దాక్షారామ భీమేశ్వరస్వామికి శా॥శ॥ 1174 (క్రీ॥ శ॥ 1252) సంవత్సరమున ధారాపూర్వకముగా విచ్చెను. (1) మరియు వీరపరెడ్డియొక్క మరియొక కొమార్తెయు. స్వస్తి సహస్ర బాహుప్రతాప వీర్యగుణసంపన్నులైన శ్రీ మన్మహామండలేశ్వరులయిన కోసరాజేంద్ర చోడుడైన పెన్నయచోడరాజు మహాదేవియైన బిన్నమలదేవి శాలివాహనశకము 1158 (క్రీ॥శ॥ 1237) నందుపై దాక్షారామ భీమేశ్వరస్వామికి శాంతకాంత విరాజిత మహాచంద్ర మండలాకారముగల అద్దము నొకదానిని సమర్పణము జేసికొని శాసనము వ్రాయించెను.

(2) శాలివాహనశకము 1008 సంవత్సరములు (క్రీ॥ శ॥ 1034) న చక్రవర్తి శ్రీ కులోత్తుంగ చోడదేవర అనుంగు గుద్దవాదినాణి పెద్దడాకరేమి, పెదమున్నూటి సమర మొదలి బేతినాయకు కూతురు జయమయిందుల యామినీశ్వర మహాదేవర సన్నిధానమున" (2) కులోత్తుంగచోడ సత్రమునకు గావించిన భూదానములగూర్చి వాక్రుణించుచున్నది. ఇందు పైరెండు శాసనములలో గన్పట్టెడి దేవి, మహాదేవి శబ్దములు గానరావు. కాని, అనుంగ శబ్దము గాన్పించుచున్నది

(3) శాలివాహనశకము 1185 (క్రీ॥శ॥ 1263) వ తాండితోటో త్సవమునకు పెద్దమున్నూటిసాని యైన వాసాసాని యెఱమనాయకు చిమ్మాసాని జావీర్తి ఉపేంద్రదేవుని మహాదేవుని దేవియైన అయా సాని భీమేశ్వరదేవరకు అంగ, రంగ, భోగ, నైవేద్యమునకు విశ్వ నాథ పట్నమును దానముచేసిన శాసనముగలదు.

(1) జయంతిపురశాసనము, కొండపల్లి అప్పిరెడ్డి శాసనము
శీలం హనుమంతు పునరుద్ధారణ ఆంజనేయ ప్రతిష్ట :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1528 అగు నేటికి ప్లవంగనామ సంవత్సర శ్రావణ శుద్ధ ౨ శనివారము నాడు కొండపల్లి మున్నూరు విషయవ్మాన్ మున్నూరుకులాలంకార పెద తిమ్మారెడ్డి కుమారుడు అప్పిరెడ్డి తమ పినతండ్రి పెదపిచ్చి పినతిమ్మారెడ్డిగారి అనుజ్ఞను ఆచంద్రార్కస్థాయిగా గరుడిగంభందం ప్రతిష్టించెను శ్రీముఖనామ సంవత్సర శ్రావణ బహుల ౧౩ ఆది వారం శీలం ఎల్లప్పరెడ్డి కుమాళ్లు హనుమంతు, బందు, అభిమాన భక్తి అభిమానంగను పునరోద్ధారిక ఆంజనేయుల ప్రతిష్ఠించెను.

వెంకన్న చేసినాడు : యల్లందశాసనము :

తిమ్మరాజయ్య శాసనము :

శాలివాహనశకము 1477 ( క్రీస్తుశకము 1555 )

సూర్యుడు

చంద్రుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1477 అగు నేటి రాక్షస సంవత్సర శ్రావణ బహుల ౧౧ గురువాసర శ్రీ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివ మహారాజులుంగారు విద్యానగరమందు రత్నసింహాసనాసీనులై పృథ్వీ సామ్రాజ్యముచేయుచుండగాను శ్రీ మన్మహామండలేశ్వర యర్రం తిరుమలరాజయ్య దేవమహారాజయ్య చక్రవర్తి శిద్ధిరాజుతిమ్మరాజయ్య

గారు కొండవీటిసీమలో యల్లమంద గ్రామానబండిగావించి పాలించి అవధపరిచి కట్టడి ప్రకారంగ్రామాన కాపురంవున్న వారికి పూర్వక్రమం సమశ్యకు కోరురొబ్బంఆయం యే యే కంబళ్ళభిట్టనారు ఆ ప్రకారం నడిపించువారు॰ గ్రామాల నుండి వచ్చివెళ్లిపోయినవారు తిరుగి గ్రామానకు వొచ్చియుందు ఆపూర్వోన భట్టినరొబ్బం గద్యాణులోను సగమంట పంగమునడుపువారం యీ రీ తి గా పరస్తలంవారు మున్నూరు కాపులు, రెడ్డికాపులు, కోమట్లు సాలేవారు, తొగటివారు జాంద్రవారు మొదలైనవారు పేటలోనుంచి కాపురం వొచ్చేయుందుకు, మూడే-శయిసాదుటనుపన్నులు ఆదూలు. వుద్యోగాన యిచ్చినారము

**2.** ఇజుపుర శాసనము—కదారనాగమనాయకుని శాసనము శా॥ శ॥ 1066 కీ॥ శ॥ 1144 స్వస్తికవ నంబరు 1066 అగునేటి ఉత్తరక్రోధి సంక్రాంతి నిమిత్తమున్న ఇజుపురి రాజ్యపాలకుడైన మున్నూరురెడ్డి మారుడైనవుండెనకడారినాగమనాయకుడు శ్రీశ్రీవిక్రమ దేవరకుంచెట్టిన అఖండవర్తి దేయకులో త్తుంగమాడలు 10 వ సంజే కొనికొమ్మనబోయిని కొడుకు సూరనబోయుండు సంతాన క్రమమున నిత్య మీనేండునెయ్యి పోయంగలవారు శ్రీ శ్రీ శ్రీ యుంజేడును.

నోటు:— విస్తరభీతిన కదమప్రస్తులు విడువబడినవి. ఇవి మెకంజీ ఇలియట్‌గార్ల కలేక్షశాలలో నకళ్లు వ్రాయబడియున్నవి. ఇంకను ఇతర శాసనాధారములుగలవు

ఇట్లు
మున్నారు కాపుపూర్వో చరిత్ర పరిశోధక
మండలి హైద్రాబాద్ గౌలిగూడ



ప్రదమ మున్నూరు కాపు మహాసభ సభ్యులు

# మున్నూరు కాపులు : కొందరి అపోహలు

## కేవలము కాపులని వ్యవహరింపబడుచున్న వారి వాదన

(1) "మున్నూరు కాపులు కేవలము ఒక నిజాంరాష్ట్రమందే యుండుటచే ఇది కులనామము కాజాలదనియు, సంఖ్యా వాచక మనియు శ్రీ చిలుకూరు వీరభద్రరావు ప్రకటించి యుండిరి. ఇది తప్పక యథార్థమై యుండవచ్చును. వీరు బొంబై, పూనా, షోలాపూరు నిజామాబాదు, మెదకు జిల్లాలలోనున్న వారు; నిజాంరాష్ట్రము నుండి వలస పోయినవారే. ఇతర కులస్థులు దేశమంతట నుండగా మన వారు నిజాం రాష్ట్రములోనుండి ఈ సంఖ్యా వాచకమునే పవిత్రమైన కులనామముగా భావించుచున్నారు. ఇది అవివేకము. ఈ సంఖ్యావాచక ప్రాధాన్యమువలననే ఆంధ్ర ప్రాంతపు కాపులు మనతో కలియుటలేదు."

దక్కన్ కాపు సోదరులు, ఆంధ్ర కాపు సోదరులతో స్నేహ బాంధవ్యములు అభివృద్ధి చేసుకొనవలయునన్న సంఖ్యావాచకముగ, ముందు వాడబడుచున్నటువంటి యీ పదమును తీసివేసికొనవలసి యుంటుంది; లేకపోతే స్నేహబాంధవ్యములు వృద్ధిపొందక పోవును. ముఖ్యముగా యువకులు ముందంజవేసి యడ్డుగానున్నటువంటి గోడను పడగొట్టుటకు ప్రయత్నించ వలసినదిగా నేను వారిని ప్రబోధించుచున్నాను.

ఇదివరకు ఆంధ్ర కాపులతో బాంధవ్యములు కలుగచేసుకున్న శ్రీయుతులు, బర్మా నారాయణస్వామి, కాసుల వెంకటస్వామి, మిట్టాన లక్ష్మీనరసయ్యగార్లెంతయో ప్రశంసనీయులు.

యం. వి. రత్నం.

19 ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తదుపరి సర్కారు జిల్లా రాయలసీమ తెలంగాణమువారు కలియుటకు ప్రయత్నముచేయగా సర్కారు జిల్లావారు కేవలము "కాపు"లమని, రాయలసీమవారు బలిజెలమని కొందరు తెలగాలమని పిలువబడె వారమని, వాదోపవాదములు జరుగుచున్నట్లు వినికిడి. గుంటూరు

జిల్లాయందు, తెల్గ, కాపు, బలిజె వసతిగృహము నడుపుచున్నట్లుగాను దానికి ఊటూరు రామయ్యగారు ప్రధాన కార్యదర్శిగా పనిచేయు చున్నట్లుగా తెల్సినది వారితో కల్సి మాట్లాడగా వారు అక్కడనుండి ఎన్నికైన M.L.A. లతో నన్ను కల్పిరి. తెలంగాణ, సర్కారు జిల్లా రాయలసీమ వారందరు ఒకచో సమావేశమగుటకు మహాసభ ఏర్పాటు చేయుట మంచిదనిరి. ఇప్పటికి ప్రయత్నములు జరుగుచున్నవి.

(2) శ్రీ కుంచేడు హేమాద్రి సత్య నారాయణ రావు గారు, బళ్లారి పర్యటించి వ్రాసిన లేఖలో బళ్లారిలోని మున్నూరు కాపులలో మూరు మనమునకు జన్మించిన వారను అపవాదులకు గురియై దాని నుండి తప్పించుకొనుటకు కాపు, తోటబలిజ, తెలగాలు మున్నూరు కాపులకు సంఘోప సంఘములుగా చీలిపోయినారను భావము కలిగి యున్నారని వ్రాసిన విషయమును మన మింతవరకుచదివి యున్నాము.

(3) తూర్పు గోదావరీ మండలములోని దాక్షారామ భీమేశ్వ రాలయములో కొన్ని మున్నూరు కాపుస్త్రీలు గావించిన శాసనములు కలవను విషయమును గూడ తెలిసికొనినాము. అందులో శా॥శ॥1185 (1263 A.D.) శాసనములో వాసాసాని, చిమ్మాసాని, ఆయాసాని అను మున్నూరు స్త్రీల పేర్లు గలవు. ఇచట 'సాని' యనగా వేశ్య అను అర్థము తీసికొన బడుచున్నది.

పై మొదటి రెండు విషయములటుండనిండు. ఈ సానిపదము నకు చెడు అర్థము లేదని శ్రీ చిలుకూరువారే సూచించిన కొన్ని నిదర్శనములను పరికింతము :

(1) మనలో దొర, దొరసాని అనుపదములు వాడుకలోనున్నవి.

(2) శ్రీమదాంధ్ర భారతమున ఆదిపర్వమున సప్తమాశ్వాస ములో ద్రౌపదీ స్వయంవరమునకై పాండవులు బ్రాహ్మణవేషములతో ద్రుపద పురమున ఒక కుమ్మరి వాని గృహమున నున్న కాలమున అర్జనుడు మత్స్యయంత్రమును గొట్టిన తరువాత ద్రౌపదిని వెంటబెట్టుకొని తాము బసచేసియున్న యింటికి మరలివచ్చినప్పుడు దృష్టద్యుమ్నుడు వీరిని జూడ వచ్చి, తిరిగి తనతండ్రికడకుబోయి వీరి నిజవృత్తాంతము చెప్పు సందర్భ ములో—

" అయ్యిద్దరును గృష్ణ నట్లొప్ప దోడ్కొని
చనియొక్క ముదుసలి సానికపుడు
మ్రొక్కి, యక్కన్యను మ్రొక్కించి, మరియొక్క
గౌరవర్ణుడు పంపగడక తోడ."

కుంతి అనుటకు బదులుగా ముదుసలి సానికని అన్నాడు. సాని శబ్దము నకు చెడు అర్థమున్న యెడల నన్నయభట్టు ఆ ప్రయోగము చేసి యుండునా?

గుంటూరు మండలములో మాచర్ల మూల స్థానేశ్వరాలయములోని యొక శాసనమున 'సూరమసాని' అనియు, అదేమండలములో అమరా వతీ గ్రామమందు అమరేశ్వరస్వామి ఆలయములోగల శాసనములో 'గువిద్ధాసాని' అనియు వ్రాయబడియున్నది. పోతన తెలుగు భాగ వతమున 'లక్కసాని' అని ప్రయోగించినాడు-దీనికి విపరీతార్థమేమైన నున్న యెడల పోతన ఇట్లు ప్రయోగించి అపహాస్యభాజనుడగునా?

ఇక మున్నూరు పదమువలన మున్నూరుకాపు ఉత్పత్తి సందే హాస్పదమైనదను విషయము గురించి శ్రీ చిలుకూరువారిచ్చిన సమర్థనలు, సమాధానముల నుండి మచ్చునకు కొన్ని ఈ క్రింద ఉదహరింప బడు చున్నవి:—

"మున్నూరు శబ్దము సంఖ్యావాచక శబ్దమగుటచే పెక్కు విష యములలో, పెక్కు సందర్భములలో గాననగును. త్రిపురాంతక శాస నములలో ఒకదాని యందు ఒకమంత్రి పెటికివాంద్రకు మున్నూరు నివేశనముల నొసంగినట్లు గలదు. అప్పుడు మున్నూరు కాపులు పెటిక లగుదురా?

దక్షిణా పథమును పరిపాలించిన ఆంధ్రశాతవాహనుల కాల మున, పశ్చిమ సముద్ర తీరమునుండి ఓడల మీద ప్రాక్సముద్రతీరమున ఉత్తరపినాకినీ నదీ ముఖద్వారము నందలి యొకరేవు పట్టణమునకు మున్నూరు మంది తమ కుటుంబములతో వలస పోయినట్లు బౌద్ధ గాథలలో గలదు. దానికి ముడిపెట్టుట ధర్మమగునా? ఇట్టివెన్నో గలవు. మనము యుక్తాయుక్త విచక్షణ జ్ఞానముతో పరిశీలించవలయును. కాని, మున్నూరు శబ్దము గాన్పించిన మాత్రమున తెలియనప్పుడు దేనికో ముడిపెట్ట జూచుట న్యాయముగాదు"-

పై విషయములతోబాటు మన మింకొక విషయము నాలోచింతము—ఆది బ్రౌన్ (Charles phillip Brown) తన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో ( A Dictionary of the mixed dialects and foreign words used in Telugu with an explamation of the Telugu alphabets—1840 A. D.) మున్నూరు పదమునకు వ్రాసిన అర్థము:

"మున్నూరు - N S Three hundred - త్రిశతము INFI మున్నూటి THE మున్నూటికులము or 300 Caste is a phrase for the బలిజవారు See the నిజలింగ చిక్కయ్యకథ. దీనివలన 'మున్నూరుకాపు' అనునది ఒక నూతనకల్పన కాదనుట స్పష్టమగుచున్నది.

ఒక్కవిషయము మనము సమస్యయొక్క లోతుకకు బోక బాహ్యముగా చిత్త శుద్ధితో విచారించినచో, ఏ కులనామముతో మన తాత ముత్తాలు అనాది నుండి పిలువబడుచున్నారో, అది ఇప్పుడెందుకు అవలంబనీయము కాదో తెలియకున్నది.

*మున్నూరుకాపులు : నర్మ గర్భితాభిప్రాయులు*

ఇంతవరకు మనము సుప్రసిద్ధ ఆంధ్ర చరిత్ర పరిశోధకులచే పరిశీలింపబడిన చరిత్రాంశములను, ఇతర ప్రముఖుల అభిప్రాయములను తెలిసికొన గలిగినాము. ఇప్పుడు మున్నూరు కాపు సంఘముచే ప్రకటింపబడిన మరికొన్ని అంశములను తెలిసికొందము. ఇవి 'ఒక చరిత్రాన్వేషి' యొక్క కృషిఫలితములు. ఇవి ఎంతవరకు శాస్త్రీయములో, చారిత్రాత్మకములో లేక ఊహాగానములో పాఠకులే తీర్మానించు కొనవలయును. ఇప్పటికే కుల నిజనామము గురించి మనలో గల వైరుధ్యము శిఖపట్లగోత్రమునకు దారి తీయుచుండ, ఇటువంటి ఊహాగానములు అగ్నిలో ఆజ్యము చల్లినట్లుగా ఉండును. 'కురువంశ నాశనమునకు మూలము శకుని' అన్నట్లు ఇతరుల శబ్దమే చిన్న చూపుకు మనలోగల భేదాభిప్రాయములకు మున్నూరు మూలకారణమగుచున్నది. ఐతే మనలో ఎవరికిగాని, నిశ్చలబుద్ధితో సమాలోచించుకొనుటకు వేళలేదు. ఓర్పు అంతకుముందే లేదు. "తాను బట్టిన కుందేటికి మూడేకాళ్లు" అన్నట్లు అంధుడు ఏనుగును తడిమిచూచి ఏర్పరచుకున్న అభిప్రాయములాగున్నది మన వ్యవహారమంతా.

1. తెలంగాణములో జైనమతాచార్యుడు, అవతారపురుష తుల్యుడు అగు మహా వీరస్వామి మత ప్రచారము చేయుచుపోగా, ఒక గ్రామములో మూడు వందల శిష్యులతో ఒక గురువు నివసించుట చూచిరి. మహా వీరస్వామికి, శిష్యగణ సమేతుడైన గురువునకు మత వాదములు జరిగినవి. ఆ గురువు చిత్తుగా ఓడింపబడెనట. అప్పుడు నిర్ణీతపద్ధతి ప్రకారము మన గురువు తన మూడు వందల శిష్యులతో జైన మతము స్వీకరించిరట. తరువాత జైన మతంమంతరించినది. అట్టి మూడు వందల శిష్యసంతతివారే ఈ మున్నూరు తెగవారుగా వ్యవహరింపబడుచున్నారా? అని మన చరిత్రాన్వేషి ప్రశ్నించుచున్నాడు.

2. 'మున్నూరు వారి వెంబడి మూడు రాళ్లు,'

ఇదియొక సామిత, భాష లిఖిత రూపమున లేక, మౌఖికంగా అభ్యసించుచు రోజులలో ఇట్టి సామితలు రూపొందినవి. ఇవి సూక్ష్మములో మోక్షమునిచ్చునవి; భావగర్భితములు.

"ఒక గ్రామములో కొన్ని కుటుంబములుండెడివట. వారివృత్తి వ్యవసాయము. ఆ గ్రామమున కొంతమంది స్త్రీలు గర్భిణులై, కొందరు ఏడు మాసములకు, మరి కొందరు పది నెలల తరువాత ప్రసవించిరట. ఈ రెండు తరహాల జన్మించిన బాలురు ఆటలాడు కొనునప్పుడు, ఏడు నెలలకు పుట్టిన పిల్లలు, దశమాసగర్భిణులకు జన్మించినవారిచే ఓడింపబడుచుండిరట. అప్పుడు ఓడింపబడిన అర్భకులు తమ తల్లులతో మొర బెట్టుకొనగా వారి తల్లులు (ముప్పది పదులు) మున్నూరు వారితో నున్నప్పుడు, మూడు రాళ్లు దగ్గరనుంచుకొనవలయునని సలహా నిచ్చిరట. ఇప్పుడు వ్యవహరింపబడుచున్న మున్నూరు శబ్దమునకీ సామిత ఆధారమా ? అని మన చరిత్రాన్వేషి అడుగుచున్నాడు.

3. మూడు నూర్ల రైతులలో ఒక స్త్రీ.

ఒక గ్రామములో కరువు సంభవించినది. అక్కడి మున్నూరు కర్షకులు శిస్తు చెల్లించజాలనందున గ్రామ కరణము వారినందరిని తహసీలుకు తీసికొని వెళ్లుటకు బయలుదేరెను. వారిలో ఒకస్త్రీ నిండు

చూలాలు. మగదిక్కులేని కారణమున, వెళ్లక తప్పినదిగాదు. వ్యవహారము పరిష్కారమునకు కొంతకాలము పట్టినది. ఈ మధ్యకాలమున ఆగర్భవతి ప్రసవించిన అనూత్నోదయ శిశువుతో ఎట్లో స్వగ్రామము చేరుకొనినది. కాని, ఆబీదరాలు, గిట్టరానివారి నిందలకు గురి కావలసి వచ్చినది.

ఈ కట్టు కథచే మున్నూరు వంశజులమని భ్రమించుట హాస్యాస్పదము గాకుండునా ?

---

# మున్నీరు కాపులు

## శ్రీ టి. ఏ- ఆగయ్యగారి పరిశోధనలోని కొన్ని అంశములు

(1931 AD)/1340 F

కీ.శే. టి. ఆగయ్యగారు ఇటీవల వ్రాయ నుద్దేశించిన చంద్రవంశజుల చరిత్రలో మున్నీరు సిద్ధాంతమును లేవదీసిరి దీనిని గురించి కరపత్రములు బహిరంగలేఖలు ప్రశ్నావళులు వెలువడినవి. ఈ సిద్ధాంతము పూర్వ పక్ష వాదో వాదములకు మూలమైనది. పర్యవసానము తేల్చువారెవరు ? అని ప్రకాశకులు పృచ్ఛించుచున్నారు.

మున్నూరు కాపులు, మున్నీరు కాపులని గూడ పిలువబడు చున్నారు. వీరు ప్రప్రథమమున ద్రవిడ దేశీయులు. కావున వీరికి వెల్లాన్, మైనార్లు, వెల్లాలవారనియు నామము కలదు.

వెల్లం, మున్నూరు అనమాయె జలార్గళ శాస్త్ర ప్రకారము జల ముందుస్థళమును పరీక్షించి వాపీ కూప, తటాకముల నిర్మింపజేయుటచే మున్నీరు కాపులను నామము సార్థకమగుచున్నది.

వ్యవసాయమునకు జలమే అత్యావసరమగుటచే, ఇట్టి జలమును భూమి యందలి జలనాడుల నుండుట ఎరింగి, జలార్గళ శాస్త్రము ప్రకారము, కాపుల కెల్లరకు జలవసతుల నేర్పరుచుటయందు మున్నీరు కాపులు ప్రథములని వచించెదరు.

వీరిలోనుండి కొన్ని కుటుంబములవారు 'తోడుపూజ' తాలూకా యందు నివసించియుండు నపుడు, మహారాష్ట్రీపు దొరతనము వారు, ఈ తాలూకా యందు మున్నీరు కాపులవెన్ని కుటుంబములున్నవి? అనిలెక్కించి మూడువందల కుటుంబములవారు కలరని నిర్ణయించిరి. నాటినుండి వీరు మున్నీరుకాపులని పిలువబడుటకు బదులు 'మున్నూరు' వారనియు, అపుడు మహారాష్ట్రీల దొరతన మైనందున 'మున్నూటిర్ కర్', అనియు పిలువబడుచుండిరి.

వీరు సేనానాయకులై తమ పాలెగాండ్లను గొని నివసించు స్థలమునకు మున్నీరుపాళె యమనియు, వీరు మున్నూరు కుటుంబముల వారుగా లెక్కింపబడిన అనంతరము నివసించిన ప్రదేశమునకు మున్నూరు పాళెమనియు నామ మేర్పడెను. మున్నూరు దక్షిణ ఆర్కాటునందు గలదు. వీరు ప్రథమమున దక్షిణదేశ నివాసులగుటచే వీరి చరిత్రాంశము లెల్ల ఆ భూభాగమందలి చరిత్రలందే కలవు.

కృష్ణదేవరాయల వద్ద మున్నీరు కులజుడగు, అంభలేక అముల్తాన్ మొదల్యార్ విజయనగర మందు ముఖ్య ప్రధానిగానుండెను. వీరు చంద్ర సూర్యవంశ క్షత్రియులే గాని శూద్రులు గారు.

వీరు త్రేతాయుగమున శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తి పట్టాభిషేక సమయమున చక్రవర్తికి కిరీటముబెట్టుటకు అర్హులు, వీరే యని వశిష్టునితో తీర్పు పొంది, స్వామివారికి పెట్టిరని కంబ రామాయణమున కలదు. కంబరామాయణము వెయ్యి సంవత్సరములకు పై చిలుకు కాలమునకు పూర్వము వ్రాయబడినది.

దీనికి శ్రీయుతులు పెద్ది నరసయ్య, కామిశెట్టినరసిములు, బర్మ నారాయణస్వామి, మదాసు కిష్టయ్య, గొళ్యాల పెంటయ్య, మాచా

వెంకటరత్నం, రాముగిరి వరదరాజులు, కాముల వెంకటస్వామి, పుజారి కన్నయ్య, కామిశెట్టి నారాయణస్వామి గారలు తమ సందేహములను తెలుపుచు, శాస్త్రీయముగాను, చారిత్రికముగాను సమాధాన మివ్వమని కోరిరి.

పది దినములలో ప్రత్యుత్తరము ప్రకటింపబడనిచో, వారు ప్రకటించిన ఈ అంశములు, మరియు 1934 లో ప్రకటించిన అంశములు, తదుపరి అగయ్యగారి ఆక్షేపణలు అంగీకరింపబడజాలవని స్పష్టపరచిరి.

ఇది యట్లుండ యువ సం॥ ఆశ్వీజ శు॥ ౧౦ సోమవారం (1935) విజయదశమి నాడు, మున్నీరుకాపు సంఘమువారు న్యాయవిచారణసభ జరుప ఒక ప్రకటన జేసి యుండిరి. అందులో వారు "పండిత ఓగిరాల సుబ్బారావుగారిచే వ్రాయబడిన విజయదశమి మున్నూరు, మున్నీటి, పెదమున్నూటి, మున్నుడి, వంశచరిత్ర పత్రికారూపముగా ప్రకటించారు. కావున ఆ కులజులకును, మున్నీరుకాపు కులమువారికిని, స్వర్గ, మర్త్య లోకములకున్న దూరమున్నది. కావున మున్నీరుకాపు సంఘములవారు మున్నూరు, మున్నూటి, పెదమున్నూటి, మున్నుడి వారితో, వారి చరిత్రతో సంబంధములేదని గ్రంథాధారములు పెక్కులు గలవని నమ్మవలసినది. వాటిని ముందు ముందు ప్రకటింపగలము" అని వ్రాసిరి,

ఇది ముప్పదియొక్క సంవత్సరముల కిందటి మాట. పెద్ది నరసయ్య ప్రభృతుల ఆక్షేపణలకు సమాధానమేమి రాలేదు, సరిగదా వారి ముందు ముందు ప్రకటించదలచిన గ్రంథా ధారములు కూడ ఇంతవరకు ప్రకటింపబడలేదు. ఈ ప్రస్తావనకు కాలదోషము పట్టినది.

---

## పీఠ్లానా సభా సమావేశము

అవి చారిత్రక పరిశోధనా ఫలితములనుడు, ఆ శాస్త్రీయము లనుడు, ఊహాగానములనుడు, నర్మగర్భితములనుడు, మనమింతవరకు,

మున్నూరుకాపులు, మున్నీరుకాపులు, బలిజలు, కాపుల చరిత్ర గురించి కొంత తెలిసికొనినాము. ఈ భిన్నత్వమును సమన్వయపరచు ఆవశ్యకతను గూడ మనము గ్రహించుకొనినాము. శ్రీయుతులు బర్మా నారాయణస్వామి, పెద్ది నరసయ్యా గారల నాయకత్వమున, శ్రీయుతులు పద్మా ముకుందయ్యా, కీసరి సత్తయ్యా గారలు అంగరక్షకులై. 1331ఫ॥లో తోటబలిజ నామకరణోత్సవము జరిగినది. బలిజకాపు వ్యావహారము జరుగగానే, దివ్యజ్ఞాన సమాజ మందిరమున ఒక సభ జరిగినది. దీనిని ఖండించుటకు నేను కొంత ప్రయత్నముచేసి ఫీల్ఖానా ఆంజనేయ దేవాలయావరణమున, 11-8-40 ఫ నాడు సుప్రసిద్ధ ఆంధ్రనాయకులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన ఒక ప్రచండ సభ సమావేశ పరచగలిగితిని. ఈ సభకు మన కులసోదరులు 600 ల వరకు హాజరైరి వీరేగాక ఇతర ఆంధ్రప్రముఖులు గూడ సభోద్దేశముల పట్ల సానుభూతి పరులు ఈ సభకు విచ్చేసిరి. సభలో మున్నూరు కుల నిర్ణయ సిద్ధాంతము దృఢపరచబడినది. ఒక మహాసభ జరుగవలయునని గూడ తీర్మానింపబడినది.

అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసమున, చాతుర్వర్ణ్య వ్యవస్థోద్దేశ్యములను విశదీకరింపుచు, కాపుశబ్దము 'కాంపిల్ల' నుండి వచ్చినదనియు, కాపులలో రెడ్లుగూడ చేరియున్నారనియు, రెడ్లు క్షత్రియులుగా నిర్ణయింపబడుటచే, కాపులు గూడ క్షత్రియులు, బ్రాహ్మణులు కావచ్చుననిరి. అయితే, ఆ యోగ్యత సంపాదించుకొనవలయుననిరి.

శ్రీ మాడపాటి హనుమంతరావు గారుపన్యసించుచు,

"మున్నూరు కాపు సోదరులు మన రాష్ట్రమున గల ఆంధ్రులలో సంఖ్యను బట్టి చాలముఖ్యమైనవారు. కావున వీరి అభివృద్ధికై జరుగు ప్రయత్నములు ఆంధ్రుల సమష్టి అభివృద్ధికి దోహదమిచ్చును. వర్ణ వ్యవస్థ ఒకప్పుడెట్టిదైనను, నేటి కాలమున జీవితమునందు కలిగిన మార్పుల వలన ఏ వర్ణమువారును మన పూర్వీకులు విధించిన నియమములను పాటించజాలరు" అనిరి. ఐనను, ఉన్నంతలో సంఘీభావముతో సద్విద్యార్జించి, దురాచారముల తొలగించుకొనుట అవసరమని బోధించిరి.

శ్రీ వడ్లకొండ నరసింహారావుగారు దీర్ఘోపన్యాసము చేసిరి. వారి ఉపన్యాసములోని ముఖ్యాంశములు :

"రాష్ట్రములో మున్నూరు కాపుల సంఖ్య 1,89,000. మీ కొరకు ఒక ప్రత్యేక వృత్తి నవలంబింప వలయునన్న నిర్బంధము లేదు. వ్యవసాయము, వర్తక వ్యాపారములు మీవృత్తులు. మీలో కార్మికులు, ఉద్యోగస్థులు వగైరా కలరు ముఖ్యముగా, ప్రభుత్వపు ఖజానా పని విశేషముగా మీరే చేయుచున్నారు. మున్నూరు కాపులు నమ్మకమైన వారను ఖ్యాతి మీకు గలదు. మీలో ఇతరుల బాధించు నట్టి కుల కట్టు బాట్లుగాని, నాయకత్వము వహించి, పుస్తెలనమ్మించి పంచాయతీలను తీర్పు చెప్పు పద్ధతి గాని లేదు. మీలో ధనవంతులు ఎందరో కలరు. అయితే దీన్నిని స్వార్థమున కుపయోగించుకొనినచో సంఘాభివృద్ధి కాదు. బీదవారికి క్షేమకరములగు కార్యములందు పాల్గొనుట మీ కర్తవ్యము. కొన్ని సంవత్సరముల క్రిందట పూనాలో జరిగిన తెలుగు సమ్మేళనమునకు మేము ఇచ్చటి నుండి వెళ్లియుంటిమి. మాతో హైదరాబాదులోని మున్నూరు కాపుసోదరులు పెక్కండ్రు విచ్చేసిరి. బొంబై రాజధానికి ఈ ప్రాంతము నుండి 300 సం॥లు పూర్వము వెళ్లి స్థిరనివాస మేర్పచుకొనిన కొన్ని, తెలుగు కుటుంబములు గలవు. అచటి వారి ఇంటి పేర్లను, ఇచటి వారి ఇంటిపేర్లను కనుగొనగ, మీరు ఏక కుటుంబీకులని తెలియుచున్నది. వారిలో ఎందరో గొప్ప విద్యావంతులు, ధనవంతులు బయలు దేరి, సంఘముగా నేర్పడి సమిష్టిగా అభివృద్ధికై కృషి చేయుచున్నారు. వారు ఇప్పటికి తెలుగే మాట్లాడుదురు. అచట మున్నూరు వారి సంఘము కూడ కలదు.

"తెలుగుసమ్మేళమునందు ఈప్రాంతము వారితో వారు వివాహ బాంధవ్యమును జరుపుకొనవలయుననియు, ఎక్కువ నాగరికత జెందిన కుటుంబముల వారికి ఈ ప్రాంతమున తగిన కన్యలు, వరులు దొరుకుట లేదనియు, నేనొక తీర్మానము ప్రవేశపెట్టితిని. సదాచార సంపన్నులైన విద్యావంతులైయున్న కుటుంబములవారి దృష్టిని ఈతీర్మాన మాకర్షించినది. ఈ ప్రాంతములో పురుషుల కున్నతవిద్య, బాలికలకు విద్య నేర్పించుట మున్నగు విద్యా విషయములందును, సంఘమునందు వేరు పురుగు

వలె ప్రబలియున్న దురాచారాల నిర్మూలించుట యందును, విద్యా, వైజ్ఞానిక, సాంఘికాభివృద్ధికై సమిష్టిగా కృషి సలుపుటకును, మీలో నుండు భేదాభిప్రాయములను బోనాడి, ఏకాభిప్రాయులై సంఘమును అభివృద్ధికి తెచ్చు ప్రయత్నములందు, సంఘమునకు చెందిన ప్రతివ్యక్తి పాల్గొనుట పవిత్ర ధర్మమైయున్నది. ఈ విషయములను గురించి ఆలోచించుటకును, రాష్ట్రములోనున్న వారిని కలిసికొని సంఘ పరిస్థితులను గమనించుటకును, మహాసభ సమావేశము లాభప్రదమగును."

పిమ్మట శ్రీ వెంకటగిరి గారు ఈక్రింది తీర్మానమును ప్రతిపాదించిరి:

"ఈ రాష్ట్రములో నుండు మున్నూరు కాపు సోదరుల సర్వతో ముఖాభివృద్ధికై కృషి సలుపు సాధనములను గురించి ఆలోచించుటకు. మున్నూరు కాపు మహాసభను సత్వరముగ సమావేశ పరచవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు."

ఈ తీర్మానమును శ్రీ వెంకటస్వామి వకీలు గారు ఆమోదించుచు చెప్పిన అంశముల సారాంశమిది:

"మున్నూరు కాపులు కొన్ని సంవత్సరముల నుండి ప్రబోధము గావించి, తమ అభివృద్ధికై యత్నములారంభించి యుండిరి. కొందరు తోట బలిజలు అను పేర ఒక సంఘము నడుపుచుండిరి. మరి కొందరు కాచీగూడెములో మున్నూరు కాపు సంఘము పేర స్వకులాభివృద్ధికై కృషి చేయుచుండిరి. మరికొందరు చాలకాలము నుండియు శ్రీ రంగనాథస్వామి దేవాలయమున (పాతవారధి వద్ద) ఉత్సవములు, సభలు జరుపుచుండిరి. ఈ సభలలో దేశభక్త వామనసనాయకు గారు, మాడపాటి హనుమంతరావు గారు పాల్గొనుచుండిరి. ఈ విధముగా మున్నూరు కాపు సోదరులలో ఉద్బోధన ఆరంభమై కొన్ని సంవత్సరములు గడచినవి. ఇట్టి ప్రయత్నములు, ఏకోన్ముఖములై, సంఘమునకు కులమునకు బలము కలిగించుటకును, విద్య, విజ్ఞానము వ్యాపించుటకును, దురాచార నిర్మూలమునకును ఈ మహాసభ చాల ఉపయోగపడును."

తరువాత శ్రీయుతులు సింగిశెట్టి బాబయ్య, ఎర్రం సత్యనారాయణ గారలునూ, పై తీర్మానమును బలపరచుచు స్వసంఘాభివృద్ధికై

మున్నూరు కాపుల మహాసభ యొక్క అవసర మెంతేని కలదని నిరూపించిరి. ఈ తీర్మానము ఏకగ్రీవముగ అంగీకరింపబడెను.

ఈ సందర్భమున, శ్రీ తుంగా రామన్నగారు మహాసభా కార్యకలాపములకై రు 500/- ల విరాళము, శ్రీపతి రంగయ్యా గారు కుల సోదరుల కార్మిక విద్యాభివృద్ధి కొరకు రు 1000/- ల విరాళము వాగ్దానము చేసిరి. అటుపిమ్మట హైదరాబాదు, సికింద్రాబాదు అన్ని బస్తీల నుండి ఈ క్రింది ప్రముఖులు ఆహ్వాన సంఘ సభ్యులుగా ఎన్నుకొనబడిరి. కాని, సభా సమావేశము విషయమున భేదాభిప్రాయములు కలుగుటచే, విరాళములు వసూలు చేయబడలేదు. సభ జరుగలేదు.

ఆహ్వాన సంఘ సభను ముందు సమావేశపరచుట కొరకై నన్ను (శ్రీ బొజ్జం నర్సింహులు) ఎన్నుకొనిరి.

అతిథులను పుష్పమాలాలంకృతుల జేసి, వారికి కృతజ్ఞత తెలుపుటతో సభ ముగిసినది.

## ఆహ్వాన సంఘసభ్యులు :

*హైదరాబాదు నుండి :*

(1) ఈ సామియా బజారు — శ్రీయుతులు తుంగ రామన్న, ఎర్రం సీతారాములు. నీలకంఠం రామన్న.

(2) మలకపేట-సర్వశ్రీ చాకి నరసయ్యా, మనికొండ వీరయ్యా, బర్మా నారాయణస్వామి.

(3) చాదర్‌ఘాటు - సర్వశ్రీ పర్వతాల వెంకయ్యా, పులుప బాలయ్యా.

(4) బోడిలెసాబుఖిడ్కి-సర్వశ్రీ అర్కతాల పెంటయ్యా, నూనె క్రిష్టయ్యా.

(5) యాకూత్‌పుర — సర్వశ్రీ మడిగెల నారాయణస్వామి, యేచన రామయ్యా.

(6) గౌలిపురం — సర్వశ్రీ అడికె మాణిక్యం, చల్లా నారాయణస్వామి.

(7) లాల్ దర్వాజ-సర్వశ్రీ సున్నం మంగయ్య, వెంకటగిరి.

(8) అలియాబాదు - సర్వశ్రీ కావేటి లక్ష్మీపతి, రెబ్బన నరసింహులు.

(9) ఉందా బజారు - సర్వశ్రీ పుల్లా బాల్ రెడ్డి గారు, చిల్కా రాజయ్య గారు.

(10) ఆసిఫ్ నగర్-శ్రీయుతులు దడువై రామన్నగారు, దడువై శాయన్న గారు.

(11) రామకోట్ - సర్వశ్రీ ఆముదాల చంద్రయ్య గారు, బాదె రామన్న గారు.

(12) గొల్లఖిడ్కి - సర్వశ్రీ గుమ్మళ నారాయణస్వామి గారు, మూల గౌరయ్య గారు.

(13) బహదూర్ ఖాన్ డొంగ - సర్వశ్రీ పాశం రామన్నగారు, కొప్పుల యల్లయ్యగారు,

(14) పచ్చబాలి-శ్రీ కొటిక ముత్యాలు గారు.

(15) గోషామహల్-సర్వశ్రీ మందుల అంజయ్య గారు, బాసం అమరప్పగారు.

(16) ఫీల్ ఖానా - సర్వశ్రీ పద్మముకుందం గారు, గూటాల వీరన్నగారు.

(17) వడ్లబస్తి - సర్వశ్రీ శ్రీపతి రంగయ్య గారు, మారు సెట్టి బాల్ రెడ్డి గారు.

(18) జింసే చౌరాహా - సర్వశ్రీ హకీం బాలా కిష్టయ్య గారు, దండు బాలయ్య గారు.

(19) ధూలుపేట - సర్వశ్రీ కంటం బాలకిష్టయ్య గారు, పన్నుల తుజ్జయ్య, సకినాల శెట్టిగార్లు.

(20) సబ్జిమండి - శ్రీ ప్యాట పురుషో_త్తం గారు.

(21) బాగ్ లింగంపల్లి - సర్వశ్రీ గొల్లపల్లి రామస్వామి గారు, చామకూర (హాకీం) మోనయ్య,

(22) త్రూప్ బజారు-సర్వశ్రీ మిట్టా లక్ష్మీనరసయ్య గారు, పెద్ది నరసయ్య.

(23) గౌలీగూడ-సర్వశ్రీ సేరి జగన్నాయకులుగారు, లవంకాల లక్ష్మి నరసయ్య గారు.

(24) బొల్లారం - సర్వశ్రీ కాసుల వెంకట స్వామిగారు, మల్లెల నారాయణ గారు.

(25) కార్వాన్ సాహు-శ్రీ రావుల బాల కిష్టయ్యగారు.

(26) ఖైరతాబాదు — సర్వశ్రీ కూర వెంకయ్యగారు, దానం నరసయ్య గారు, అర్కతాల గుండయ్య గారు.

(27) ఉస్మాన్ షాహి — సర్వశ్రీ బీరం లింగన్నగారు, తుంగా బుచ్చయ్య గారు.

(28) బాలాగంజ్ - శ్రీ నాగం జగ్గయ్య గారు.

## సికిందరాబాదు సభ్యులు:

శ్రీయుతులు పొన్నాల నరసింహులు, పొన్నాల కుప్పయ్య, పొన్నాల రామస్వామి, అన్నం రత్నయ్య, శాకెల్లి నరసయ్య, దేవుని పల్లి పుల్లయ్య, తోట అప్పయ్య, కొంపెల్లి బాలయ్య, జాలన చెన్నయ్య, ప్రతాబు హనుమంతరావు, శాకెల్లి రామయ్య, నర్ర గణేశం, మిఠాయి దుర్గయ్య, మరిపల్లి మానయ్య, యేర్పులస్వామి, పుప్పాల నరసింహులు, గున్నాల రాజయ్య, సూర్యం రాజయ్య, అల్లాడి

పాపయ్య, ఆలుగడ్డల కిష్టయ, పుల్లి బాగయ్య, పగడం వెంకన్న, గాదె నాగయ్య, తాడ్ల కిష్టన్న - చింతల స్వామి, పట్టెము లక్ష్మీ నారాయణ, బారు వెంకటస్వామి, అనంతుల రాజయ్య, యల గందుల రామన్న, పోతన్ బాలయ్య, తోటరాజన్నగార్లు

## మున్నూరు కాపులలో వైవాహిక దురాచారములు : మూఢాచారములు

మున్నూరు కాపులలో వైవాహిక దురాచారములు, మూఢాచారముల గురించి ఒకసారి శాంతముగా, చిత్తశుద్ధితో సింహావలోకనము చేసినచో, మనము సాంఘికముగా, సాంస్కృతికముగా ఎట్టి దుస్థితికి జారిపోయినామో, పోవుచున్నామో తెలిసికొనగలము. పూర్వాచారము, సంఘము యొక్క కట్టుబాటుల పేరట జరుగు కర్మకాండ క్షమింపరాని అపరాధము. సభలు జరుగుచున్నవి. తీర్మానములు లామోదింపబడుచున్నవి. కాని, పరిణామము మృగ్యము. ఉపన్యాసవేదికలపై జేయు ప్రసంగములు అరణ్య రోదనములు; తీర్మానములు గ్రంథస్థములు, దీనికి అజ్ఞానము, స్వార్థమే ముఖ్యకారణములు.

మన సంఘపు స్థితి గండిపడిన చెరువును బోలియున్నది. ఒక చోట గల గండిని పూడ్చినచో, కట్టయొక్క దౌర్బల్యమువలన వేరొక చోట గండిపడి నీరు తప్పుకొని పోవుచున్నది. అయితే ఒక విషయము సుస్పష్టము. ఈ దురాచారములు, కట్టుబాట్లు, నిజమైన విద్యాసంస్కారము లేని ధనికుల యిండ్లలోనే ఎక్కువగా పాటింపబడుచున్నవి.

కొంతకాలమునకు పూర్వము వివాహము వరుని ఇంటిలో జరుగుచుండెడిది. అనగా వివాహమునకు ముఖ్యాంగము 'ప్రధానము' వధువు ఇంటిలో జరిగి, 'లగ్నము' వరుని ఇంటిలో జరుగవలయునను నియమముండెను. కాని, వేదమూర్తులైన బ్రాహ్మణోత్తములు ఆ పద్ధతిని మాన్పించి, దానికి ప్రత్యామ్నాయముగా, వైవాహిక కర్మకలాపమంతయు, కన్యాదాత గృహమున

జరుగుటవలన పుణ్యమని శాసించిరి. దీనినే సాలంకృత కన్యాదాన మనిరి. ఇందులో కన్యాదాత వరునకు పాదప్రక్షాళనము చేయవల యును. ఇది కన్యాదాతకు పుణ్యప్రదము. స్వర్గ సీమకు పాస్పోర్టు అనిరి. ఇంతకు ఇది వేదోక్త కర్మ కాదు. మూఢాచారములలో ఇది యొకటి. ఇందు వరుస, వయస్సుతో నిమిత్తములేదు. ఇప్పటికి బొంబాయి మున్నూరుకాపులు వధువు ఇంటిలో ప్రధానము జర్పి, లగ్నము వరుని ఇంట్లో జరుపుదురు.

ఇక శుల్కములు పూర్వము కన్యాశుల్క పద్ధతియుండెను. అనగా వధువు విక్రయింపబడుచుండెడిది. వేరు మాటలలో, వధువు తల్లికి శుల్కము చెల్లించి, ఆమెను కొనవలయు నన్నమాట. కాని కాలముతో బాటు ఆచారములు మారినవి. ఇప్పుడు కన్యా దాత వరునకే, ప్రత్యక్షముగనో, ప్రచ్ఛన్నముగనో శుల్కము (కట్నము) చెల్లించవలయును. వర కట్నము, సాలంకృతములోని అలంకరణ ఆర్థిక నష్టమైతే, అల్లుని కాళ్ళు కడుగుట మానసిక కష్టము. ఫలితము ఋణగ్రస్థత. ఎన్ని మధ్యతరగతి కుటుంబము లిట్లు ఆర్థిక ముగా నాశన మగుచున్నవో తెలిసికొనుటకు మనవద్ద లెక్కలు (Statistics) లేవు. ఆర్థిక స్తోమత లేని కుటుంబములలో 30- సంవత్స రముల వయస్సునకు వచ్చిన స్త్రీలు అవివాహితులై యుండుట మనము చూచుచున్నాము. ఇది పాపకార్యములకు, భ్రూణహత్యలకు దారి తీయుట బహిరంగరహస్యమే. ఈ అమానుషకృత్యములను అరికట్టుట ఇక సంఘములోని వయోవృద్ధులకు శక్తికిమించిన పని. దీనిని కేవలము రూపు మాపుట యువకుల ధర్మమై యున్నది.

ఇంకొక విషయము. వరకట్నములు నిర్ణయింపబడియున్నవి. ఇవి వరుని విద్యాయోగ్యత, వరుని తండ్రి దర్జా బట్టి యుండును. ప్రభుత్వోద్యోగుల కరువుభత్యము పెరుగగానే, మార్కెటులో నిత్యావ సరముల ధరలు పెరుగునట్లు, వరుని విద్యాయోగ్యత లెక్కువైన కొలది కట్నము పెంచబడును. కావున విద్యాభూషణుల మని చెప్పికొను వారు వరకట్నమును తిరస్కరించి, కేవలము వేద సమ్మతమైన పద్ధతిన వివాహమున కంగీకరించువారే, నిజమైన విద్యాభూషణ భూషితులు. ఇప్పట్లు తలిదండ్రుల దురాశల కియ్యకొనకుండుట క్షంతవ్యమే.

ఇది యొక త్యాగము, అనివార్యము, ఆవశ్యకమైన సాంస్కృతిక విప్లవము.

చెవి నిల్లు గట్టుకొని ప్రబోధము చేయగా చేయగా మనలో కొంత సత్ఫలితము కలిగినది. పంక్తి భోజనములు జరుగుచున్నవి. యువకులలో మధు సేవ చాలవరకు తగ్గినది. విద్యావ్యాప్తి హెచ్చుచున్నది. కాని ప్రగతి, ముఖ్యముగా విద్యారంగమున, సత్తగమనమున సాగుచున్నది ఢిల్లీ ఇంకను దూరముగనే యున్నది.

## శ్రీయుత మాడపాటి హనుమంతరావు గారి పత్రికా ప్రకటన

మున్నూరుకాపు ప్రథమ మహాసభ (25-26/8/44 F) జరుగుటకు సరిగా ఒక నెలముందు శ్రీ మాడపాటి హనుమంతరావు గారు 24-7-44 F నాటి గోలకొండ పత్రికలో ఒక పకటన జేసిరి. శ్రీ మాడపాటి వారు ఆంధ్ర పితామహులు.

ఆ ప్రకటనలో ఇలా ఉన్నది.

"మున్నూరు జాతివారి అభివృద్ధి ఆంధ్రుల యభివృద్ధి యనుటకు సంశయము లేదనియు, మున్నూరు కాపు సోదరుల మహాసభ యొకటి మన రాష్ట్రములో జరుగుట సమష్టి ఆంధ్రజాతి యొక్క అభ్యుదయమునకు ఉపయోగముగా నుండుట నిస్సంశయము" అన్నారు.

"కులము యొక్క పేరును గూర్చి కలిగిన అభిప్రాయ భేదములు, కుల సోదరులు మహాసభ రూపమున ఒక్కచోట చేరినప్పుడు పరిష్కరించుకొనవచ్చును. కాపు జాతి యొక్క ప్రస్తుత స్థితిగతులు తెలిసికొనుటయు, బాలబాలికల విద్యాభివృద్ధికి తగిన ఏర్పాటు చేయుటయు, సంఘ దురాచారములున్నచో వానిని రూపు మాపుకొనుటయు, జాతి యొక్క మితవ్యయ జీవనమును బలపరచి, ఆర్థిక స్థితిని సంస్కరించుకొనుటయు, మాతృ భాషాభివృద్ధికిని, తత్ప్రచారమునకును తగిన కట్టుదిట్టము లేర్పరచుటయు, నిరక్షరతను, మూఢ విశ్వాసములనుపారద్రోలుటయు, మహాసభ యందు ఆలోచించి, తీర్మానింపదగిన ముఖ్య విషయ

ములు-కనుకనే, మున్నూరుకాపు సోదరుల మహాసభ జయప్రదముగా జరుగవలయునని తదితరులగు ఆంధ్రులందరు ఎదురుచూచుచుందురు" అని ఉద్బోధించిరి.

"కావున మున్నూరుకుల సోదరులారా! పవిత్రమగు ఈ కార్యమున ముందంజవేసి పూర్వుల గౌరవమును బలపరచి, యువకులందుత్సాహమును పెంచి, ఇతర కులములవారి ఎదుట గౌరవమును అజరామరముగను స్థాపించి ఆంధ్రజాతికి ముఖ్యముగా నిజాము రాష్ట్రములోని మన ఆంధ్రజాతికి, జవ సత్త్వములు కలిగించుడు; ఇదే నా ప్రార్థన".

శ్రీహనుమంతరావుగారి సందేశము ఎంత సుహృద్భావపూరితమో మో మనము గమనించవలయును; కాని కొందరు మన కులసోదరులకు ఈ బ్రాహ్మణ జోక్యము హితోపదేశము నచ్చలేదు. అభ్యంతర పరంపరలు ప్రకటింపబడినవి. ఇతరులసద్బోధ మనకు గిట్టకుండుటదురదృష్టము.

ఎట్లైననేమి, సదుద్దేశ పూరితమైన ఈ మహాసభ జయప్రదముగా ముగిసినది. సభా వృత్తాంతము వేరొక ప్రకరణమున కాననగును

## 1920 లో శ్రీ సయ్యద్ సిరాజుల్ హసన్

"మహా ఘనత వహించిన నిజాంప్రభుత్వ మందలి కులములు, జాతులు" అను గ్రంథము రచించియున్నారు. ప్రభుత్వఆర్థిక శాఖ వీరికి పని అప్పగించి యుండెను. వీరి గ్రంథము విద్యాశాఖకు జెందిన కీ॥ శే॥ శ్రీ కాలేగారు నిజాం రాష్ట్రమంతట పర్యటించి, నిజాంరాష్ట్రమున నివసించు జాతుల, కులముల గురించి సమకూర్చిన విషయములపై ఆధారపడి యున్నదని గ్రంథకర్తగారు తమ ఉపోద్ఘాతములో వ్రాసియున్నారు.

మున్నూరు, మున్నూర్ వాడ్, మున్నూరుకాపు లనబడువారు, వ్యవసాయము వృత్తిగాకలిగి, నిజాం రాష్ట్రపు స్వదేశీయులై, రాష్ట్రపు పలుతావులందు, తెలగాలు, యాచకులు, సేవకులుగా విస్తరించి యున్నారని గూడ తెలిపియున్నారు.

మున్నూరువారి ఉత్పత్తి. వారి ఆంతరంగిక నిర్మాణము, వారి వివిధ శాఖలు, ఇంటి లేక వంశపు పేర్లు, వైవాహికములు, స్త్రీల యౌవనప్రాప్తి, వితంతూద్వాహములు, వివాహచ్ఛేదము వారసత్వము, ప్రసవము, మతము, (శైవము, వైష్ణవము) ప్రేతసంస్కారము, వృత్తి మున్నగు విషయములు విపులముగా ప్రస్తావింపబడినవి. మత విషయములో మున్నూరువారిలోను ఇతర తెలగ వర్ణమువారిలో అంతగా భేదము లేదనియు, సాంఘికముగా మున్నూరువారు కాపుల, రెడ్ల, వెలములకు పోలియున్నారనియు, వ్యవసాయము వారి ఆదిమ వృత్తియైనను వారిలో కొందరు గ్రామ పటేళ్ళుగాను, భూస్వాముల, జమీందార్ల స్థాయిలో నున్నారనియు, గ్రంథకర్తగారి అభిప్రాయము.

కాని అధిక సంఖ్యాకులు శాశ్విత కౌలుదారులు, మరికొందరు భూములు లేక భాగ్యవంతుల ఇండ్లలో దైనందిన కూలీలుగా క్షుద్రమైన జీవితము గడుపుచున్నారు. ఇటీవల వారు వ్యవసాయమును వదిలి వ్యాపారము, ప్రభుత్వోద్యోగము చేయుచున్నారు.

వీరు తోటబలిజలకు తమ కూతుళ్ళను వివాహమున కిచ్చెదరు. కాని వారికి గల విశేషాధికారము వీరికి లేదు. మున్నూరువారి దందరిది పస్పునూరి గోత్రము. వీరు యజ్ఞోపవీతము ధరించరు.

మున్నూరు వారి ఉత్పత్తికి సంబంధించిన వివిధ ఇతిహాసములు, కథల గురించి గ్రంథకర్తగారి వివరములు క్లుప్తముగా నిట్లున్నవి:—

మున్నూరు వారి సాంఘిక కర్మకాండను గురించి గ్రంథకర్తగారు తెలిపిన విషయములు పెక్కు దురాచార భూయిష్ఠములు. అవి తాత్కాలికములు. వీరి గ్రంథము దాదాపు అర్ధ శతాబ్దము పూర్వము రచింపబడినది. ఈ సుదీర్ఘ కాలములో మున్నూరు కాపువారి సాంఘిక వ్యవహారములలో ప్రశంసనీయమైన బహుముఖ మార్పు కలిగినది.

గ్రంథకర్తగారు 1911 జనాభా లెక్కల ప్రకారము, జంట నగరములతో కలసి 17 జిల్లాలలో గల మున్నూరువారి సంఖ్య (పురుషులు-స్త్రీలు) దాదాపు 2,30,000లని తెలిపియున్నారు. కాని, ఈ యాభైఆరు సంవత్సరములలో జనాభా విపరీతముగా పెరిగినది. కావున ఈ సంఖ్య గణనీయము కాజాలదు. ప్రస్తుతము జంట నగరములలోనే మున్నూరు కాపుల సంఖ్య దాదాపు 15 లక్షలు.

# మహాసభను గూర్చి సమకాలిక అభిప్రాయము

## గోలకొండ సంపాదకీయము

త్వరలో సమావేశము కానున్న మున్నూరుకాపు ప్రథమ మహా సభ పట్ల కొందరు కులస్థులనుకొనువారే ద్వేషము వెలిబుచ్చు చున్నట్లు విని మాకు చాల విచారము కలుగుచున్నది. వారి ఆక్షేపణలను విమర్శింపగా, అవి దుర్బలములైనవిగాను, కులాభిమానమునకు మించిన స్వార్థమే ప్రధానముగా గలవిగా నున్నట్లు కన్పించుచున్నవి. వీరి మొదటి ఆక్షేపణ మహాసభయొక్క పేరును గురించినది. మున్నూరు కాపు మహాసభ పేరుతో, కాపు, బలిజ, మున్నూరు కాపులను గూడ, సమావేశ పరచుట వారికి నచ్చలేదు. కాని, అన్ని సంఘముల వారికి సమ్మతమగు ఒక పేరుతో సమావేశపరచుటెట్లు ? పత్రికలలో ప్రకటించుటకు పూర్వమే అన్ని జిల్లాలలోని వారలను గాకున్నను జంట నగరములలోని వివిధ వాడలలో గల కులపెద్దలను సమావేశపరచి, చర్చ జరిపినచో విషయము పరిష్కారమగునని కొందరి అభిప్రాయము. కాని, ఇంతకుపూర్వ మిట్టి సమావేశములు అనేకములు జరిగినవి. ఇప్పటికి నాలుగైదు సంవత్సరముల క్రితము తోటబలిజసంఘము పేర రెండు సభలు సమావేశమై, భేదములు మాని ఒక్క సంఘముగా వ్యవహరించుట మంచిదని తీర్మానింపబడుటయు, ఈ తీర్మానము ప్రకారము నగరముల యొక్క వివిధ ప్రాంతములవారి అభిప్రాయములు గైకొనగా, అధిక సంఖ్యాకులు 'మున్నూరు' అను పేరును ఒప్పుకొనుట ఇదివరకు జరిగినదే. ఏకాభిప్రాయమునకు రాజాలని సమావేశముల వలన కాలహరణము తప్ప లాభములేదని చివరకు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, పెద్ది నరసయ్య గారల అధ్యక్షతన జరిగిన రెండు సభలలో శీఘ్రముగా మహాసభ సమావేశపరచుటకై తీర్మానింపబడెను. తత్ఫలితముగా నియమింప బడిన ఒక ఉప సంఘముచే నిర్ణయింపబడినదే, యీ 'మున్నూరు' అను పేరు. జంటనగరములలోని వివిధ ప్రాంతములవారిచే విశ్వాసముతో నియమింపబడిన ఉపసంఘమువారి తీర్మానము ఏకపక్షమనియు, ఏదో ఒక వాడవారు మాత్రము చేసినదనియు తక్కినవారికి సమ్మతము కాదనుట, మరల ఉభయనగర కులసోదరులతో గూడిన ఒక అంతరంగిక

సభా సమావేశము కావలయుననుట బాధ్యతగలవారు చెప్పదగినది కాదు. ఒకవేళ అట్లు జరిగినను ఆ సమావేశమునకు హాజరగు వారు కొందరు కులపెద్దలే కావున, మాకు ఇట్టి సభతో సంబంధము లేదని హాజరుకాని సోదరులు వ్యక్తిగతముగా అనవచ్చును. అప్పుడు ఇక పరిష్కార మార్గమేమి ? ఇది అసలు జరుగవలసిన పనిని జరుగనీయ కుండుటకు అవలక్షణము. కాబట్టి, ఆక్షేపణ గలవారందరు మహా సభలో పాల్గొనుటే శ్రేష్ఠతమ మైన మార్గము. సంశయ పరిష్కారము నకు అందరికీ అవకాశముండునని ఆహ్వాన సంఘమువా రిదివరకే స్పష్టము చేసి యున్నారు. మహాసభను సమావేశపరచు వారి నిష్పాక్షిక ప్రవర్తనకు ఇంతకంటె ఇంకే నిదర్శన మక్కరలేదు. ఒకవేళ మహాసభ సమావేశకర్తలు (సంఖ్యాబలముచే) తమ అభిమాన పక్షమును నెగ్గించు కొందురను భయము బలిజ, కాపు, మున్నీరుకాపు సంఘమువారి కున్నచో వారు గూడ సభలో అధిక సంఖ్యలో పాల్గొని తమ పక్ష మును నెగ్గించుకొనవచ్చును.

ఇంకొక ఆక్షేపణ ఈ మహాసభలో జాత్యేతరులు జోక్యము కలిగించుకొనరాదనుట. జాత్యేతరులు కేవలము హిత చింతకులై వచ్చెదరు. ఈ సభకు తనను బ్రతిమిలాడి పెద్దతన మివ్వలేదను ఈర్ష్యతో కులస్థులలో ఎవరైనను సభోద్దేశములను నెరవేరకుండ ప్రయత్నిం చినచో అట్టివారి ఆశయములు ఫలించక బోవుటేగాక, వారు నలుగురు పెద్దలలో పరిహాసింపబడుదురు.

మన రాష్ట్ర ప్రభుత్వము సభల సమావేశములపై 'గష్తీ' నెం. 53 ద్వారా ఎన్నియో నిర్బంధములు కలిగించినది. ఎట్లో కొంత సుము ఖతతో ఒక సదవకాశము లభించినప్పుడు, దానిని మనలో మనము కీచులాడుకొని, జారవిడిచికొనినచో ప్రభుత్వము మనలను అనరు లుగాను, అయోగ్యులుగాను భావించి, తమ కఠినమైన నిర్బంధములను కఠినతరము చేయును. కావున, అట్టి పరిస్థితి ఏర్పడకుండ జూచు భారము కాపు, తోటబలిజ మున్నగు సంఘ నాయకులపై కలదు.

*

నిజాం రాష్ట్రీ

# మున్నూరు కాపు ప్రథమ మహాసభ

31-మే - 1వ జూన్ 1935 } శుక్ర - శనివారములు
25-26 వ తీర్ 1344 F

శ్రీ సింగంశెట్టి వేంకటస్వామి వకీలు ఆహ్వాన సంఘాధ్యక్షులు
డాక్టరు తులా కనక సుందరం - (నాందేడు) మహా సభాధ్యక్షులు

## రాజా బహదూర్ వెంకటరామిరెడ్డి, సిటీ పోలీసు కమిష్నరు ప్రారంభోపన్యాసము:

R. B. V. Reddy తమ ప్రారంభోపన్యాసమున, సభ జయప్రదముగా జరుగుటకు దైవమును ప్రార్థించవలయునని ప్రవచించుచు, ప్రభుభక్తి ఐకమత్యము, విద్యాభివృద్ధి, వర్తక వ్యాపారాభ్యుదయము పట్ల శ్రద్ధ వహించవలయునని ప్రబోధించిరి. వారుతను ప్రసంగములో రెండు ముఖ్యవిషయముల నొక్కిచెప్పిరి. ఒకటి పెట్టుబడిలేని వారికి సహకార సంఘముల నెలకొల్పుకొని, పరస్పరము ఆర్థిక సహాయము చేసికొనుచు వ్యవసాయము, వర్తకను, కళలను బాగుపరచుకొనుట, రెండవది ఇతరుల అభివృద్ధి విజయమును అసూయతో చూడక శాంత హృదయముతో వారి ననుసరించ యత్నించుట, ఒకరికొకరు తోడ్పడుటకు సర్వదా సంసిద్ధులై యుండుట, బాలబాలికలకు విద్య, ఉస్మానియా విశ్వవిద్యాలయములో వ్యవసాయ పారిశ్రామిక, కళావిషయములలో ఆయాశాఖల నుండి లాభము పొందుటకును, ఆరోగ్యము కాపాడుకొనుటకును, అంటువ్యాధుల తొలగించుకొనుటకును ప్రభుత్వ వైద్య శాలల నుపయోగించు కొనుడని గూడ సలహానిచ్చిరి.

## ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసము:

శ్రీ సింగం శెట్టి వెంకటస్వామిగారి స్వాగతోపన్యాస సారాంశము:

"నిజాం రాష్ట్రమందు మన వారి సంఖ్య సుమారు నాలుగు లక్షలు. మనవారిలో ధనవంతులు, వణిక్సామ్రాట్టులు కలరు. కానిదొక్క శుద్ధిలేనివారి సంఖ్య విశేషము. ఉన్నత విద్యావశ్యకత మనము గ్రహింపవలయు. ఇది నాగరికత లక్షణము. వ్యాపారముతో బాటు, విద్యాగంధము గూడ అబ్బినచో వ్యాపారమే కాదు, ఏ వృత్తి యైనను భాసించును. కావున వృత్తి విద్య గూడ అనివార్యము. మన యువకులు మన మాతృభాషలో శుభ్రముగా మాటాడుటకు, నిర్దిష్టముగా వ్రాయుటకు నేర్చికొనవలయును. బాలికలకు వారి గృహ జీవితమునకు అనుకూలమైనంత వరకు విద్య గరపవలయును.

## సంఘ దురాచారములు:

"వర శుల్కములు, బాల్య వివాహములు, శుభాశుభ కార్యము లందు, ఆడంబర వ్యయము, మద్యపానము, నిర్బంధ వైధవ్యము, ఇవియన్నియు తొలగించవలయును. బాల వితంతువుల నిర్బంధ వైధవ్యము అవినీతి ప్రవర్తనలకు దారి తీయుచున్నది. త్రాగుడుకు, ఆరోగ్యమునకు అవినాభావ సంబంధ మున్నది. దీనిని, సంఘమునుండి ఎంత త్వరగా నిర్మూలించిన అంత శ్రేయస్కరము.

## ప్రజాహిత కార్యాభిలాష

మనలో ప్రజాహిత కార్య ధురంధరులు కలరు. హైదరాబాదులో ఒక దేవాలయము బాగుచేయుటకు పైసాఫండుక్రింద చుక్కా రాజన్నగారు రు. 1500/ల విరాళ మొసగినారు.

గొల్ల ఖిడ్కీలో ఒక పాఠశాలకు గుమ్మళ్ళ నారాయణ స్వామి గారు ద్రవ్య సహాయము చేయుచున్నారు.

వడ్లబస్తీలో, గొల్లఖిడ్కీలో శ్రీపతి రంగయ్య యాజమాన్యమున బాలుర పాఠశాలలు నడపబడుచున్నవి. గొల్లఖిడ్కీలో మనవారే ఒక గ్రంథాలయమును నిర్వహించుచున్నారు.

ఒక వంద పెండ్లిండ్లు చేయించి, బీదవారికి తోడ్పడిన కీ॥ శే॥ బాదె రామన్నగారు మన కులమునకు అలంకార ప్రాయులు. ఇట్లే బొజ్జం నరసింహములుగారు. పెద్ది నరసయ్యగారు ఇంకా ఎందరో మనవారి సర్వతో ముఖాభివృద్ధికి కృషి చేయుచున్నారు.

## కుల నామములో మార్పు

ఇటీవల కొందరు పూర్వ వంశ చరిత్రను పరిశోధించి, "తోట బలిజలు అను నామకరణ మొనర్చిరి. తరువాత మున్నీరుకాపు సంఘములు స్థాపితములైనవి. సికింద్రాబాదులో శ్రీ అమరం రాజయ్యా యాజమాన్యమున కాపు సంఘము పనిచేయుచున్నది. ఈ మార్పు యొక్క ఆవశ్యకత, అనావశ్యకత సహేతుకముగా సర్వజనసమ్మతముగా చీలికలకు దారి తీయకుండునట్లు పరిష్కరింపబడవలయును.

సుమారు నాలుగైదు సంవత్సరముల క్రిందట జరుగవలసిన ఈ మహాసభ నేడైనను జరుగుట, శ్రీయుతులు తుంగా సాంబయ్యా, బొజ్జం నరసింహులు, ఎర్రం సత్యనారాయణగారి కృషి ఫలితమే.

"మనము మున్నూరు కాపులను విషయమును మొదలు ఆలోచించ వలయును. ఆ తరువాత ఆంధ్రుల మన్న మాట మరువరాదు. మనము ఆంధ్రులము. మనది ఆంధ్రజాతి; మనభాష ఆంధ్రభాష. మనది ఆంధ్రోద్యమము, సమష్టిగా అందరి అభివృద్ధి కొరకై జరుగుచున్నది."

సభా సదులకు, అతిథులకు, స్వచ్ఛంద సేవకులకు సభా సమావేశమునకు అనుజ్ఞ నిచ్చిన ప్రభుత్వమునకు కృతజ్ఞత తెలుపుచు, మన ప్రభువుకు, వారి కుటుంబమునకు ఆయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుటకు భగవంతుని ప్రార్థించుచు, ఆహ్వాన సంఘాధ్యక్షులు తమ ఉపన్యాసమును ముగించిరి.

## సభాధ్యక్షులు డాక్టరు తులా కనకసుందరంగారి అధ్యక్షోపన్యాస సారాంశము :

అధ్యక్షుల ఉపన్యాసము క్లుప్తమైనను భావగర్భితమై యుండెను.

"మనలో కొందరు పేరునకు పెనుగులాడుచుందురు. పేరుపెట్టు కొనుటయే ముఖ్యముగ నెంచి పోరాడుట 'ఊకదంపుడు' వంటిది. అమూల్యమైన మనశక్తి మన సమయమును ఇట్టి వృథా ప్రయత్నము లందు వినియోగించుట, రేగుపండ్లకై రత్నములు వెలపోసినటులుండును. పేరు పెట్టునప్పుడు, మన పూర్వ చరిత్ర, ప్రస్తుత స్థితి ముందటి ఆదర్శ ములను నిర్ణయించునవిగా నుండవలయుననియు, భేదాభిప్రాయములు కొలదివైనను, వానిని తొలగించనిచో మున్ముందు ఐకమత్యమునకు భంగము కలుగుననియు, అధ్యక్షులు నొక్కి వక్కాణించిరి. "మన సంఘమునకు బలము, పలుకుబడి, వ్యాప్తి కలుగవలయునన్న సంకే తము, ఆదర్శము కార్య ప్రణాళిక మొదలైన వన్నియు ఔదార్యమును సూచించవలయును. మన విశాలమైన సంఘమును కొలది భేదములచే చీలికలుగా చేయకూడదు. ఇది స్వార్థ మగును. అప్పుడు మన ప్రయత్నమునకు మనమే భంగము కలిగించు కొనినవారమగుదుము. ఐకమత్యము కలిగి మనము చేయజాలని పనిగాని, దాటజాలని కష్టముగాని యుండదు. సంఘ శక్తికి తల యొగ్గిన ఈ యుగమున నష్టదాయకమైన కట్టుబాట్లను పెంచి సంఘ మును బలహీనము చేయరాదని ఉద్బోధించిరి.

"కాపు సంఘము అనాదిగా తక్కిన వర్ణములవారికి కాపుగా నుండెడిది. వీరి వర్ణ ధర్మము వృత్తి ననుసరించియే కలిగినది. అట్టి ఈ ధర్మము ప్రత్యేక శాఖకు చెందిన దనుకొనగూడదు. మన మెల్లరము కాపు సంఘ సభ్యులమని గ్రహించుకొనవలయును. కాపుఅను మాటలో ఎంతేని ఉదారమైన ఆశయము ఇమిడి యున్నది. దీనిని ఏ మార్పు చేతను హీనపరచవలదని ప్రబోధించిరి.

## సంఘోన్నతి

"హిందూజాతి క్షీణతకు కారణమైన విషయములే మన సంఘ పతనమునకు కారణమైనవి. కాలము మారుచున్నది. ఈ మార్పులను మనము ప్రతిఘటించలేము. ఒక దేశమున ఒక కాలమున అనుకూల మైన కొన్ని నియమాచారములు వేరొకపట్ల ప్రతికూలము కావచ్చును. పౌరుషేయములైన నియమములు మారనక్కర లేదని తలచుట ప్రమాదకరము. కాలమునకు సరిపడిన మార్పులను కలిగించుట, వానిని ఆదరించుట, సంఘమున ప్రబోధము కలిగిననే కాని సాధ్యము కాదుఅని సలహానిచ్చిరి.

## విద్యావ్యాప్తి

"నాగరికతకు విద్య సోపానము. విద్యాహీనుడు సంఘమునకు శత్రు తుల్యుడు. అర్థరహితమైనట్టియు, అమితవ్యయసాధ్యమై, పరాధీనతా హేతువైనట్టి, ప్రస్తుత విద్యావిధానము మన సంఘమున కక్కర లేదు. ప్రతియువకుడు విదేశ విద్య నభ్యసించి ఉద్యోగమునకై యొరుల నాశ్రయించు స్థితి కలుగరాదనిరి.

"మన వృత్తి దేశమున నూటికి ఎనుబది మందికి ఆశ్రయము. వృత్తి విద్య నేర్వనివారు ఒకరి సంపాదనపై జీవించవలసి యుండును. అందువలన మాధ్యమిక విద్యానంతరము, వృత్తివిద్య అనివార్యము, అని అభిప్రాయపడిరి.

"బాలుర విద్యతో బాటు బాలబాలికల విద్యగూడ అత్యావసరము అనాదినుండియు మనకులములో భార్యాభర్తలుకలిసి పనులు నిర్వహించుకొనుచుండెడివారు. ఇంటి, బయటి పనులు స్త్రీ పురుషు లిరువురును నేర్చియుండుటే, ప్రాపంచిక జీవన సౌఖ్యమునకు మూలము. బాలికల విద్యలో మంచి మాతృభాషా పరిచయము, సంగీతము, చిత్రలేఖనము, శిశుపోషణ చేరి యుండవలయును. ఇవి మాధ్యమిక విద్యతో బాటు నేర్పబడవలయును. కాని, కొన్ని వృత్తులు ఉద్యోగములందు స్త్రీల ఆవశ్యకత ప్రత్యేకముగా నుండును."

# ప్రథమ మహాసభా తీర్మానములు

## విద్యావ్యాప్తి

విద్యావ్యాప్తి: విద్యావ్యాప్తికై ఎక్కువ పాఠశాలలను నెలకొల్పుటకు కుల సోదరులు కృషి చేయవలయును. బాలబాలికలకు మాతృభాషద్వార ప్రారంభవిద్య నిర్బంధము చేయుటకును, సెకండరీ విద్య మాతృభాషద్వారానే గరపుటకును, వృత్తివిద్యలు అనివార్యముగా బోధించుటకు ప్రభుత్వమును కోరుట, వయసు మీరిన బీదలు పగలు పాఠశాలలకు వెళ్ళజాలరు కావున వీరికై రాత్రి పాఠశాలలు నెలకొల్పుటకును గృహపరిశ్రమలు ప్రోత్సహించుటకును కుల సోదరులను కోరుట. జిల్లాలలోని మన కుల విద్యార్థులకు ఉన్నతవిద్య నభ్యసించు సౌకర్యములు నగరములో లేవు, కావున, ఇచట ఒక వసతి గృహముస్థాపించుట ఈ పనికై రు. 10,000. ల విరాళములు సేకరించ వలయు ననియు, కుల సోదరులు ఉదార భావముతో విరాళము లొసంగ వలయు ననియు తీర్మానింపబడినది.

శుభాశుభ కార్యములందు మనవారు మత్తుపదార్థముల వాడుట గర్హించుచు, దీనిని బొత్తిగా నిషేధించుటకు తీర్మాన మామోదింపబడినది.

అమ్మవారి పండుగల సందర్భములలో పవిత్రమగు దేవాలయములందు జీవహింస మానివేసి సాత్త్వికపూజ నవలంబించుట.

మన కులములో బాల్య వివాహములవలన, బాల బాలికల విద్యాభ్యాసమునకు వారి ఆరోగ్యమునకు తీరని నష్టము కలుగుచున్నది. కావున బాలికల వివాహ యోగ్యమైన వయస్సు 14 సంవత్సరములు; బాలకుల వయస్సు 20 సంవత్సరములు నిర్ణయింప బడినది. అప్పట్ల శ్రీ నర్రా వెంకయ్యాగారు ఉపన్యసించుచు, బాల్య వివాహములను మాన్పినచో యువతీ యువకుల నైతిక ప్రవర్తన సంశయాస్పద మగునని తమ అనుమానము ప్రకటించిరి. కాని, ఆంధ్ర మహిళా సంఘ అధ్యక్షురాలు శ్రీమతి వై. సీతా

కుమారి గారు, అనారోగ్యము, దుర్బల సంతానమును అరికట్టుటకు ప్రౌఢ వివాహముల ఆవశ్యకతను నొక్కిచెప్పిరి. బహుజనాంగీకార ముతో ఈ తీర్మాన మామోదింపబడినది.

వివాహములందు వరదక్షిణ: ప్రస్తుతము వరుడు మెట్రిక్యు లేషను పాసైనచో రు. 1000-లు, పట్టభద్రుడైచోన రు. 3000-లు వరకట్నము వసూలు చేసికొనబడుచున్నది. ఇది వధువువారికి నష్ట దాయకము కష్టదాయకముకూడా గావున ఈపద్ధతి మాని వేయబడ వలయు ననియు, ఆడంబరములు, అనవసర వ్యయము తగ్గించ వలయు ననియు, అశాస్త్రీయాచారముల మానవలయుననియు తీర్మానింప బడినది. అట్లే బాలికలు రజస్వలయై నప్పుడు, పుష్పాలంకా రోత్సవము బహిరంగము చేయు పద్ధతిని మానివేయవలయునని గూడ తీర్మానింప బడినది.

మన కులములో వితంతూద్వాహములు చీర రవిక, మారు మనుము పేరుతో అశాస్త్రీయ పద్ధతిన జరుగుచున్నవి. ఇట్టి దంపతులకు కలుగు సంతానము అగౌరవముగా చూడబడుచున్నది. కావున వితంతూద్వాహములు శాస్త్రీయముగా జరుగవలయునని తీర్మానింప బడినది. హైదరాబాదు నగరములో ఒక వితంతు శరణాలయము స్థాపించుటకు కుల సోదరులను కోరబడినది.

మన కులపు స్త్రీ పురుషులు సాధ్యమైనంతవరకు దేశీయ వస్త్రములను ఇతర దేశీయ వస్తువులనే వాడవలయును. దీనివలన దేశీయ పరిశ్రమ ప్రోత్సహించబడును. కావున ఈతీర్మానము ఆమోదింపబడినది.

కుల నామము గురించిన భిన్నాభిప్రాయముల దృష్ట్యా, ఈ విషయమును పరిశోధించి ఉచితమైన నామము నిర్ధారణ చేయు టకు, శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులును సలహాదారుగా నుండుటకు కోరగా శ్రీ పంతులవారు ఈ క్రిందివారిని స్థాయి సభ్యులుగా నుండుటకు కోరిరి.

(1) డాక్టరు తులా కనకసుందరం గారు - అధ్యక్షుడు
(2) ఎస్. సింగంశెట్టి వెంకటస్వామిగారు - ఉపాధ్యక్షుడు
(3) బొజ్జం నరసింహులుగారు - కార్యదర్శి

ఈ సభా తీర్మానములను అమలులో పెట్టుటకును, రెండవ మహాసభ జరుగువరకు అవసరమగు పనుల నిర్వహించుటకు, ఒక సంఘము నియమింపబడినది.

కుల నామము నిర్ణయించి, మూడునెలలలోగా స్థాయిసంఘమునకు ఒక నివేదిక పంపుటకై ఈ క్రిందివారితో కూడిన ఒక ఉప సంఘము నియమించుచు ఒక తీర్మానమామోదింపబడినది.

1. శ్రీ ఏ. పాపయ్య, 2. శ్రీ బొజ్జం నరసింహులు.
3. శ్రీ కె. నారాయణస్వామి, తదితరులు,

---

# సమకాలిక అభిప్రాయము

## గోలకొండపత్రిక సంపాదకీయం

ప్రథమ నిజాం రాష్ట్రి మున్నూరుకాపు మహాసభ శాంతముగా కార్యభారమును ముగించి, వివిధ పత్రికల ప్రశంస బడసినందుకు సంతోషించెదము. ఈ సభను గూర్చి ప్రకటనలు చేయబడగనే కొందరు అందు పాల్గొనుటకు ఆక్షేపణ గలవారు, తమ తమ అభిప్రాయములను వివరించు కొన్ని కరపత్రములను పంచిపెట్టి యుండిరి. ఈ కరపత్రములు నగర రక్షక శాఖవారి దృష్టికి వచ్చినవి. ఈ కరపత్రము కలిగించు భావోద్రేకములపై మహాసభలో అల్లరి యేమైనను సంభవించ వచ్చునేమో యని రక్షక శాఖవారు అనుమానించి, ఆ విషయము నంతయు విచారించి, అల్లరులేవియు జరుగకుండ ప్రత్యేక శ్రద్ధ వహించిరి, అని మేము వినియున్నాము. ఏ కారణములచే నైననేమి, ప్రస్తుత మహాసభలో పాల్గొనకుండుటకు నిశ్చయించుకొన్న వారిలో

అల్లరిచేసి తమ యుద్దేశ్యములను సాధించుకొనదలచువారు లేకుండు రనియే మాయాశ, విశ్వాసమైనను, అసలు భిన్నాభిప్రాయ కులస్థులు కొందరు గలరని అవకాశమును గమనించి, మూడవవారెవరైనను స్వార్థపరులు అల్లరి చేయుటకు అవకాశము ఉండవచ్చునని యైనను, నగర రక్షక శాఖాధికారులు ప్రత్యేక శ్రద్ధ వహించియుందురు. ఏలైనను యిక్కడ అధికారులు సభా సమావేశకులకు ఖమ్మంలో ఆంధ్ర మహాసభకు అక్కడి అధికారుల కంటె చాల యెక్కువ తోడ్పడినారనవచ్చును.

ఈ సభయందు కులస్థులలో తక్కిన హిందువులతో పాటు అవసరములగు కొన్ని సంస్కరణములు గావించ తీర్మానించబడినవి. వీటిని గూర్చి యిదివరకే అనేక సభలలోను, పత్రికలలోను వివరముగ చర్చింపబడి యుండుటచే పునర్చర్చ అనవసరము. మహాసభను గూర్చి ముఖ్యముగా కనబడిన ఒక విశేషమును గురించి మాత్రము చెప్పెదము. బాధ్యతగల పెద్దలయందు కులనామమును గూర్చి భిన్నాభిప్రాయములు గలవారు తమ అభిప్రాయములను వివరించుటకు, రాకపోయిరే అని మనస్సుకు కొఱవ యొకటి కనపడినది. భిన్నాభిప్రాయములన్నియు సకారణముగ, వివరముగ, మరియొకసారి శాంతముగా ఆలోచించు అదృష్టము లభించియుండిన యెంత బాగుండెడిది, అని వారి కొఱవ. భిన్నాభిప్రాయకులయెడ యిట్టి సానుభూతి గలవారును మహాసభలో నున్నందుకు సంతోషించుచు వారల ప్రయత్నముచే కుల నామము విషయమైన విభేదములు పరిష్కృతములై మరల రెండవ మహాసభ సమావేశ మగునప్పటికి అన్నిపక్షములవారును సంతోషముతో, ఐకమత్యముతో పాల్గొందురని ఆశించుచున్నాము.

ఈ సందర్భమున, ఇంకొక యంశము చెప్పవలెదము. కొందరు మేము మున్నూరు అను పేరును ఆమోదించువారి పక్షమునే నిష్కర్ష చేసి పక్షపాతము చూపించితిమని అనుమానించుచున్నట్లు మా దృష్టికి వచ్చినది. ఆ కులస్థులు యే పేరు నిష్కర్ష చేసికొన్నను మాకేమియు ఆక్షేపణ లేదు. ఎందుకనగా, పేరు నిర్ధారణచే కులస్థుల అభివృద్ధి హెచ్చజాలదు. మేము కోరునదంతయు నలుగురును కలిసి

పేరు విషయమున వివాదములను పెరుగకుండునట్లు చేసి, అందరి శక్తులను అసలు కర్తవ్యముల పైకి మరలించి పనిచేయుటయే, ఇక సభ సమావేశకులను ప్రోత్సహించుట పక్షపాతమా, యను అంశము. వివిధాభిప్రాయములు గలవారందరును పాల్గొని కులస్థుల క్షేమాభివృద్ధి అవసరములను చర్చించి, కర్తవ్యమును నిర్ణయించుటకు ప్రస్తుతము జరిగిన మహాసభ సాధనము కాజాలదా? ఏదో యొక పక్షములో వారు మొదలుపెట్టవచ్చు గాక! తలపెట్టిన కార్యము అందరి మేలు కొరకు పాల్గొని సదుద్దేశ్యముతో వ్యవహరించుచు శుభమునకు సాధకమైనది. అట్టి దానిని ప్రోత్సహించుట తప్పు కాజాలదు. ఇక ఆ సభ మొదలుపెట్టిన ఒక పక్షము వారికి మాత్రము ఉపయోగించిన యెట్లు? అను ఆక్షేపణ. ఏ మహాసభగాని ఉద్దేశింపబడిన వారి పేరుతో కొందరి యొక్క మాత్రము అధికారమునకు తోడ్పడకుండునట్లు చేయుటకు, ఆ సభలో ఉద్దేశింపబడిన అన్ని పక్షములు పాల్గొని అన్యాయము జరుగకుండునట్లు చూచుట విధి. అట్లు పాల్గొనవలెననియే మేము కోరినది.

## సమకాలికాభిప్రాయము

(కాపుకుల ప్రథమ మహాసభ గురించి హైదరాబాదు బులిటిన్ ఇంగ్లీషు పత్రిక, 8 జూన్ 1935 నాటి సంచికలో చేసిన విమర్శనకు స్వేచ్ఛానువాదము :)

ప్రజాజీవితములో, ముఖ్యముగా హైదరాబాదులో ప్రజా శ్రేయోదాయకమైన ఏ ఉద్యమమైనను, అది తలయెత్తకపూర్వమే వైరుధ్యములు అలుముకొని, దాని ప్రగతికి భయోత్పాతము కలిగించుట శోచనీయము. నగరపోలీసు అధికారులు జోక్యము కలిగించుకొనని చో, గతవారము సమావేశమైన మున్నూరు కాపు మహాసభ జయప్రదము కాకుండెడిది. సభా సమావేశమునకు అను[illegible]తించుటేగాక, విరోధుల లొంగదీయ బడజాలని విద్రోహచర్యలు జరుగకుండ బందోబస్తు చేసినారు. ఇటువంటి సంఘటనయే ఖమ్మంలో సమావేశమైన ఆంధ్ర మహాసభ పట్ల జరుగగా ఎన్నియో తీర్మానములు చర్చింపబడజాలక పోయినవి. మున్నూరు కాపుసభ అస్తిత్వమునకు వచ్చినందుకు మేము

సంతోషించుచు, హిందూ, ముస్లింల వంటి పెద్ద జాతులవారు కూడ మున్నూరుకాపు సభను ఆదర్శముగా తీసికొందురని నమ్ము చున్నాము. ఏవో ఒకటి రెండు తీర్మానములు, సభల సాంప్రదాయ ములకు భిన్నమైయున్నను, మిగతా వన్నియు, హిందూజాతికి వర్తించు నవై యున్నవి. సభాధ్యక్షులు డాక్టరు కనకసుందరం, హిందూ సమాజ మంతటికి పాత్రై, మున్నూరు కాపు సంఘమును ఎదుర్కొను చున్న క్లిష్ట సమస్యలను తుణ్ణముగా పరిశీలించుటయే గాక, వానిని విడదీయుటకు తనకులముయొక్క పరిస్థితి దృష్ట్యా కొన్ని ప్రయోజన కరములైన ప్రతిపాదనలు చేసినారు. తీర్మానములలోనే కులనామము సమస్య వచ్చినది. తర్జన భర్జనల తరువాత అన్నిపక్షములవారికి అంగీకార యోగ్యమైన పేరు, సిఫారసు చేయుటకు ఒక ఉప సంఘము నియమింపబడినది. ఐతే, ఈ కులము, కులనామము నిర్ణయించుట పైననే ఆధారపడిలేదు. సంఘము తన భవిష్యత్తును ఉజ్జ్వలము చేయుటకై తీర్మానములను అమలు పరచుటపై యున్నది.

ఆర్థిక స్తోమతగూడ ముఖ్యమైన విషయమే. అయితే, మన స్ఫూర్తిగాపనిచేయు కార్యకర్తలున్నచో, సంవత్సరమున ఒక రూపాయ చందా నిచ్చు 5000 సభ్యులు లభించుట కష్టమైన పనిగాదు. నిర్మా ణాత్మకమైన నిబంధనలు, వీనికి తోడు ఆర్థిక స్తోమతు కలిగి యున్నచో, ఈ సభ, కులమువారికి నిజమైన సేవ చేయగలదనియు, రెండవ సమావేశము వరకు ప్రయోజనకరమైన పని చేయగలదని మేము విశ్వసించుచున్నాము.

# నిజాం రాష్ట్ర మున్నూరు కాపు ద్వితీయ మహాసభ

ఈ మహాసభ సికింద్రాబాదులో 25-26 జూన్ 1936 న జరిగినది. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీయుత పొన్నాల రాజయ్య - మహాసభాధ్యక్షులు శ్రీ సింగంశెట్టి వేంకటస్వామి గారలు.

ఈ సభ రాజా బహాదుర్ వెంకటరామా రెడ్డి గారిచే ప్రారంభింపవలసి యుండెను. కాని కారణాంతరమున వారు సకాలమునకు రాజాలకందునను, వారి ప్రారంభో పన్యాసమును శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు చదివిరి. రాజా బహాదురు గారి ఉపన్యాసము ప్రబోధ పూరితమై యుండెను. "సంఘ దురాచారములకు మూఢనమ్మకములకు కారణము విద్యా విహీనత. ప్రభుత్వములో మతకుల విచక్షణ లేక, వ్యవసాయ, వాణిజ్య విద్యలకు తావున్నది. స్త్రీలలో విద్య లేనిదే శిశు సంరక్షణ, సంఘ సంస్కరణ అసంభవము. అంతర్విభేదముల మాని, హైదరాబాదుకు విద్యాభ్యాసమునకై వచ్చు విద్యార్థులకు తోడ్పడవలయును. వ్యవసాయాభివృద్ధి, శిశు సంక్షేమము. పశు పోషణ పట్ల శ్రీ వైస్రాయి గారిచ్చిన ప్రోత్సాహము ఆదేశముల ప్రకారము నడుచుకొనవలయును అని ఉద్బోధించుచు, మహోన్నత వహించిన నిజాం ప్రభువుకు, వారి కుటుంబమునకు ఆయురారోగ్యైశ్వర్యములు కలుగునట్లు భగవంతుని ప్రార్థించుచు, తమ భాషణమును ముగించిరి.

## అధ్యక్షోపన్యాసం

మహాసభాధ్యక్షులు తమ ఉపన్యాసమున 'మనమందర మే పేర్లతో వ్యవహరింపబడుచున్నను, పరస్పర భేదములను విస్మరించి, వృథా వాగ్వివాదములతో కాలము వృథ పుచ్చక, సత్వరపురోగాములగుటకు ఏకముఖముగా ప్రయత్నింపవలసి యున్నది. కొందరు మనకు విఘ్నము లాపాదించినను మనము వానిని లెక్క జేయక శాంతముతోను పూనికతోను మన కార్యము నిర్వహించవలయుననిరి.

'స్త్రీ పురుషవివక్షత లేక, విద్యాప్రచారము గావించకుండనిచో కులములో ప్రగతి కలుగజాలదు. విద్య, ప్రభుత్వకార్యాలయ ములకు పనికివచ్చునది మాత్రమేయైన చాలదు. వృత్తి విద్యలు, చేతి పనులు, నూతన వ్యవసాయ సాధనములు, ఆర్థిక విధానమందలి రహస్య ములు, ఆత్మవికాసమున కవసరములగు కళలు, – ఇవి యన్నియు కులస్థుల అందుబాటులో నుండున ట్లొనర్చుటకు ప్రయత్నించవల యును.'

ప్రాథమిక నిర్బంధవిద్య, మాతృభాష, బాల్యవివాహములు, సంఘ దురాచారముల గురించి గూడ తమ అమూల్యాభిప్రాయముల వెల్లడించిరి. విద్యాబలము, కుటుంబ నిర్వాహకశక్తి సంపాదించనిదే యువకులు వివాహ మాడరాదు. బాలికల వివాహయోగ్యమైన వయస్సు పద్నాలుగు సంవత్సరము లుండవలయుననిరి. చీర రవిక, మారు మనుము, పద్ధతిన జరుగు అశాస్త్రీయ వివాహములు శాస్త్రీ యము చేయవలయునని చెప్పుచు, బ్రిటిషు ఇండియాలోని 1856 సం వత్సరపు 15-వ చట్టము వలె మనవద్ద గూడ పౌనర్భవుల (మారుమనుము వలన కలిగిన సంతానము) పౌరస్వత్వములను కాపాడుట కొక శాసన నముకై మన ప్రభుత్వమును కోరవలయునని సలహా నిచ్చిరి.

అధ్యక్షోపన్యాసము ముగియునంతలో రాజా బహాదుర్ వారు శ్రీ పింగిలి వెంకటరామారెడ్డితో కలసి సభకు విచ్చేసిరి. వారు హిందూ వితంతువుల పునర్వివాహములకు సంబంధించిన బిల్లు హైదరా బాదు శాసన సభవారి ముందున్నదని కొంత ప్రస్తావించిరి. ఆ తరువాత శ్రీ పింగిలివారు వృత్తివిద్యావశ్యకతను గురించి నొక్కి చెప్పిరి. శ్రీకృష్ణస్వామి ముదిరాజు హై ద రా బా దు పురపాలక సంఘ సభ్యులు, దుష్టశక్తులను లెక్కచేయక పని సాగించుకొనుడని ఉద్బో ధించిరి. బొంబైనుంచి వచ్చిన ప్రతినిధులలో నొకరైన శ్రీ నారా యణరావు మున్నూరు కాపుల ప్రాచీనౌన్నత్యము గురించి ప్రసం గించుచు, ఈ రాష్ట్రపు మున్నూరు కాపులు కొన్ని శతాబ్దముల క్రితము బొంబై, మధ్య పరగణాలకు సైనికోద్యోగములపై వచ్చినారనియు, ఇప్పుడు వారు ఉన్నతపదవుల పై నున్నారనియు, ఇచటి స్థానిక మున్నూరుకాపువారు గూడ వారి ననుకరింపవలయునని ఉద్బోధించిరి.

## తీర్మానములు

మొదటి తీర్మానము మహా ఘనతవహించిన నిజాంప్రభువు పట్ల రాజభక్తి ప్రకటించు తీర్మానము.

రెండు, మూడు తీర్మానముల ఎక్కువతక్కువతో మిగత తీర్మానము లన్నియు మొదటి మహాసభ తీర్మానములకు పునరావృతములు.

ప్రథమ మహాసభలో ఆమోదింపబడిన మూడు తీర్మానాలు :

1; వితంతుశరణాలయ స్థాపన,
2. దేశీయవస్తువులనే ఉపయోగించుట
3. వ్యవసాయవిద్య.

కొన్ని అననుకూల పరిస్థితుల దృష్ట్యా, కొట్టివేయబడినవి.

(1) ధర్మదాయము నుండి వర్తకులు ఇరువదైదుశాతము చొప్పున మున్నూరుకాపు మహాసభయొక్క స్థాయిసంఘమునకు చెల్లించవలయును. ఈ ధనము సంఘహిత కార్యముల కుపయోగింపబడును.

(2) కాకతీయాంధ్ర చరిత్రలో మున్నూరుకాపు కులచరిత్ర రచించిన చిలుకూరి వీరభద్రరావుగారికి జోహారులర్పించుచు, కృతజ్ఞత తెలుపు తీర్మానము.

(3) గొల్లఖిడ్కీలో బాలికల పాఠశాలను నడుపుచున్న ఉదారులైన మనకులాభిమానులకు కృతజ్ఞత వెల్లడించుచు, అదనపు ఆర్థిక సహాయము కోరుట.

(4) అస్పృశ్యతా నివారణ - మతపరివర్తన మొనరించి హిందువుల సాంఘిక ఉద్యమమునకు భంగము కలిగించకుండుటకు డా॥ అంబేద్కర్ గారిని కోరుచు, అస్పృశ్యుల న్యాయమగు కోరికలను మన్నించి, వారికి సంఘమునందు కలుగుచున్న కష్టముల దూరమొనర్చుటకు సవర్ణులను ప్రార్థించుట.

(5) బాల్య వివాహములను ఆపివేయుటకు సంబంధించిన తీర్మానము ప్రథమ మహాసభలో ఆమోదింపబడినను, ఈ సభలో సుల్తాన్ బజారులోని బాలికల ఉన్నతపాఠశాల శ్రీమతి ఏకాంబరమ్మగారు ఈ తీర్మానమును ప్రతిపాదించిరి. ఈ మహాసభలో ఉపన్యాసవేదికపై వచ్చిన ప్రథమ మహిళ ఈమెయే.

## స్థాయిసంఘము

పై తీర్మానము కార్యరూపము దాల్చునట్లు చూచుటకు ఈ క్రింది సభ్యులతో కూడిన ఒక స్థాయి సంఘము నియమింపబడినది :—

(1) శ్రీ సింగంశెట్టి వేంకటస్వామి అధ్యక్షులు
(2) పొన్నాల రాజయ్య ఉపాధ్యక్షులు
(3) అల్లాడి నాగయ్య సభ్యులు
(4) బొజ్జం నరసింహులు ,,
(5) తోటా అప్పయ్య ,,

3 - 4 సభ్యులు కార్యదర్శులు - 5 - కోశాధ్యక్షులు

ఈ మహాసభలో విద్యావ్యాప్తినిధికై రు 800 ల విరాళముల వాగ్దానములు జరిగి రు 200/ లు తక్షణమే వసూలైనవి.

అతిథులకు, సభ్యులకు, స్వచ్ఛందసేవకులకు ధన్యవాదము లర్పించుటతో రెండురోజుల సభాచర్య ముగిసినది.

# సమకాలికాభిప్రాయములు
## (గోలకొండ పత్రిక - 27 - 9 - 1345 F గురువారం)
### నాటి సంపాదకీయమునుండి

ద్వితీయ నిజాంరాష్ట్రీ మున్నూరుకాపు మహాసభ శుభముగాను, సంతోషముగాను ముగిసినందుకు, దాని సమావేశకులను అభినందించు చున్నాము. కొందరు ప్రతికూలురు, ఈ సభవలన వృథావ్యయము దప్ప మరి యేలాభములేదని దూషించుచు పంచిన కరపత్రములు మూడు మాకు పంపబడినవి. ఆహ్వానసంఘమువారు,సంఘాభివృద్ధి తప్ప వేరొకవుద్దేశము లేదనియు, ప్రతికూలపక్షము వారినిగూడ ఈ సభకు ఆహ్వానించుచున్నామని సమాధానమిచ్చిరి. ఇంతకు ఈ వైరమంతయు సభను ఏ పేరుతో జరుపవలెనను విషయమున ఏర్పడిన భేదములే.

మున్నూరు, మున్నీరు, కాపు — ఈ భేదాభిప్రాయముల సమన్వయించుటకు చేసిన ప్రయత్నములు ఫలించలేదు. ఈ నిరుత్సాహ స్థితిలో బొంబాయిలో మంచిస్థితిలోనున్న కులసోదర ప్రముఖుల రాక ఈ సభయందు చాల ఉత్సాహముతో పాల్గొని ప్రథమ మహాసభకు లేని ఒక క్రొత్తశోభ కలిగించినది.

ఈసారి సభయందు గమనించదగిన ఒక ప్రశంసనీయమగు లక్షణ మేమన, మున్నూరుకాపుల విద్యాభివృద్ధికై ఒకనిధి స్థాపింప బడినది. మొదటిదెబ్బకే రు 800/ ల వరకు విరాళములు లభించినవి.

మొదటి మహాసభలో ఒక ఉపసంఘము చారిత్రిక పరిశోధన జరిపి, కులముపేరు నిర్ణయించి, స్థాయిసంఘమునకు నివేదించవలయునని తీర్మానింపబడెను. ఈ నివేదిక ఈ రెండవ మహాసభలో ప్రవేశపెట్టవలసి యుండెను. కాని, ఆప్రయత్నమే ఇపుడు కనుపించలేదు. బహుశః భిన్నపక్షవాదులందరి సహకారములేనిదే ఈవిషయమున ఏమియు చేయ జాలమని ఉపేక్షించినారేమో ? ఇది వివేకమంతమైన పనియే. ఈ విషయము శ్రీ మాడపాటి హనుమంతరావుగారు విని "ఇక పేరు విషయమై గల వివాదములన్నియు సమసిపోవును. ఏలననగా గట్టినిర్మాణ కార్య క్రమము ప్రారంభించబడినదిగాన అది దృష్టిని మరలించును" అని నుడి విరి. వారివచనములు ఋషివచనములగుగ్గాక యని భగవంతుని ప్రార్థించు చున్నాము.

# అఖిల హైదరాబాదు మున్నూరు కాపు తృతీయ మహాసభ

ఈ తృతీయమహాసభ అలియాబాదు (హైద్రాబాదు)లో 7–8 జూన్ 1952నాడు నా అధ్యక్షతన జరిగినది.



పురపాలక సంఘసభ్యులు శ్రీ ఎర్రం సత్యనారాయణగారీ మహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షులు. బొంబాయి, చాందా, రాయచూరు, వరంగల్లు, కరీంనగరం, మెదకు, గుల్బర్గా, నిజామాబాదు, మహబూబునగరం, నల్లగొండ, భువనగిరినుండి మన కులసోదరులు హాజరైరి. మన కులసోదరులేగాక పలువురు ఇతరప్రముఖులు, నాయకులు మంత్రులుగూడ విచ్చేసిరి.

శ్రీసాయిబి లక్ష్మణ్ శీలం. బి. ఎ., ఎల్. ఎల్. బి. (M. L. A. బొంబాయి) సభను ప్రారంభించిరి. వీరు తమ ప్రారంభోపన్యాసములో మహాసభా కార్యకర్తల అభినందించుచు, కులసేవతోపాటు, దేశసేవ

గూడ చేయవలయుననియు, కులసంఘములు తమ పరస్పరవిభేదములను విస్మరించి, కులముయొక్క సర్వతోముఖాభివృద్ధికి తోడ్తోడు, వర్గ హితసమాజ నిర్మాణమునకు తోడ్పడవలయునని ఉద్బోధించిరి.

శ్రీ ఎర్రం సత్యనారాయణగారు సభాసదులకు స్వాగతము పలుకుచు, తమఆహ్వానోపన్యాసమున "ఇదివరకు మున్నూరుకాపుసభలుకొన్ని మహరాష్ట్రమున, అఖిలభారత తెలుగు మున్నూరుకాపు మహాసభలు ఇతరత్రా జరిగినవి. ఇదివరలో చర్చింపబడిన సామాన్య విషయములు గాక ఈ మహాసభలో ప్రత్యేకముగ మనకులాభివృద్ధికి కొన్ని నూతన పద్ధతుల అన్వేషించ వలసియున్నది. భారతీయులందరు ఒకేజాతియని సగర్వముగ నిరూపించవలసిన ఈకాలమున మనకులస్థులు నామరూపముల లోని విభేదము, జీవితములో వివిధరంగములలో గల వ్యత్యాసము భిన్నభావములు కలిగియుండుట శోచనీయము, అన్యాయము, స్వకుల నాశకారణముఅనిరి. ప్రాచీనకులపెద్దల పేరుప్రతిష్ఠలు, ధైర్యసాహస ముల తలచుకొని సంతసించుట సరిపోదు. వారి పేరుప్రతిష్ఠలు నిలబెట్ట వలెనన్న మనము వారిస్థితికి రావలయును. అప్పుడే వారిప్రతిభ నుగ్గడించుటకు మన మర్హుల మగుదుము; మనకులము ప్రాచీనవైభవములతో విలసిల్లగలదని వక్కాణించుచు, బొంబాయి మున్నగుప్రాంతములకు వలస పోయిన మనకులస్థులు సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక దృష్టిని మన కంటె ఉన్నతస్థాయిలో నుండి, స్వకులాభివృద్ధికై వారు చేయుచున్న కృషిని ప్రశంసించిరి. వారు సానుభూతితో మన కన్నివిధముల తోడ్పడ గలరను ఆశాభావమును వ్యక్తపరచిరి.

వెనుకబడిన జాతులగురించి ప్రసంగించుచు "ప్రభుత్వము వెనుక బడినజాతుల సర్వతోముఖాభివృద్ధికై మార్గము లన్వేషించు చున్నది. ఉచితవిద్య, విద్యావేతనములు మున్నగు సౌకర్యములు సమకూర్చు చున్నది. మనకులమువారు కూడా రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విషయములలో చాల వెనుకబడి యున్నాము. మనలో పలువురు కర్షకులు, మరికొందరు చిన్నచిన్న వ్యాపారములు చేయువారు గలరు. కాని ఫలితము ఆర్థికముగా శూన్యము. ఇక వారు తమబిడ్డలను చదివించు టెట్లు? మన జాత్యభివృద్ధికి అవకాశమేది ? ఈ దుస్థితికి ఏకైకమార్గము ప్రభుత్వసహాయము పొందగలుగుట, ఇందుకుగాను మనజాతికూడ

వెనుకబడిన జాతులపట్టికలో చేర్పబడునట్లు చూచుట. ఇప్పట్లి ప్రయత్నము జరుగుచున్నది; అది ఫలోన్ముఖమునకు వచ్చినదని తెలియుచున్నది.

"ప్రభుత్వసహాయము మనజాతికి లభించినంతనే మనపని ముగియదు. అధికసంఖ్యాకులుగల ప్రతిజిల్లాలో జిల్లాసంఘముల స్థాపించి, అవి సంఘనిధికి విరాళములు, చందాలు వసూలుచేయునట్లు చూడవలయును. సంఘమునకు కొంతనిధి సమకూర్చి, దానిని ప్రభుత్వసహాయమునకు తోడుజేసినచో బీదవిద్యార్థులకు సౌకర్యము లెక్కువ చేయుటకు దోహదమగును" అని సలహానిచ్చిరి.

సంఘదురాచారములలో ముఖ్యముగా విధవా పునర్వివాహము గురించి క్రియాత్మకమైన సలహానిచ్చిరి. "యువకులు సాహసించి విధవలను వివాహమాడుటకు ముందంజ వేయవలయును. దీనివలన, ప్రాచీనపద్ధతులను పట్టుకొని ప్రాకులాడు పెద్దలలో పరివర్తనము కలుగును. ఇట్లే, వరశుల్కమును యువకులు స్వీకరించరాదు. పెద్ద లంగీకరించనిచో, అట్టివివాహమే అక్కరలేదని సత్యాగ్రహము చేయవలయును. కట్నరూపమున, పిల్లతలిదండ్రుల రక్తముపీల్చుట ద్రోహము అమానుషము, అహింసాసిద్ధాంతమునకు విరుద్ధము"అని ఉద్ఘాటించిరి.

మద్యపానమును గర్హించిరి. విద్యావ్యాప్తికై పాఠశాలల నెలకొల్పి నిర్వహించుచున్న కొందరు మనవారిని ప్రశంసించిరి.

మనసంఘము పక్షమున సహకారపరపతి సంఘముల స్థాపనావశ్యకతను గురించి నొక్కివక్కాణించుచు, హైదరాబాదునగరమున ఒక కేంద్రసహకార పరపతిసంఘము స్థాపించి, దానిని రిజిష్టరుచేయించవలయును. సంఘసభ్యులు, ధనవంతులు, ఆసంస్థలో ఎక్కువమొత్తములను దాచికొనవలయును. ప్రభుత్వపు సహాయముకూడ పొందుటకు తగినకృషి చేయవలయును. కేంద్రసంస్థక్రింద ప్రతిజిల్లాలో దానిశాఖలు స్థాపించుట అవసరము. ఆయా సంఘములవారు బీదరైతులకు చిన్నచిన్న వ్యాపారస్థులకు దీర్ఘకాలపువాయిదా ఋణములనిచ్చి స్వల్పమొత్తములను ప్రతినెల వసూలు చేసికొనవలయును అనిరి. అలియా

బాదులో మనవారు ఒక సహకారపరపతి సంఘముస్థాపించి నిర్వహించు చున్నందుకు ఆ సంఘసభ్యులను, నిర్వాహకులను ప్రశంసించి తమ ఉపన్యాసమును ముగించిరి.

## అధ్యక్షోపన్యాసము

సభాధ్యక్షుడనగు నేను, సాధ్యమైనంత వరకు చర్విత చర్వణము లైన విషయములను వదలి, ముఖ్యములని తోచినవాని గురించియే ప్రస్తావించితిని. అవి గూడ సదస్సులలో చాలమందికి తెలువని



క్రొత్త విషయము లేమి కావు. ప్రపంచ పరిస్థితులు త్వరితగతిని మారు చున్న ఈ కాలమున మన మెదుర్కొనుచున్న క్లిష్టపరిస్థితులను కాలాను గుణ్యముగ శాంతముగ ఎదుర్కొనవలయునని సూచించితిని. ఆంధ్రో ద్యమము గురించి నేను చెప్పిన దాని సారాంశము :

'పాతిక సంవత్సరములు పోరాడిన తరువాత మనము ఒక యుగము దాటి మరియొక యుగమున ప్రవేశించుచున్నాము. కొంద రెవరైనను ఆంధ్రుల గురించి సందేహములను, అనుమానములను వ్యక్తపరచినచో ఆశ్చర్యమేమియు లేదు. పైగా, మనము వారి సందేహానుమానములకు సంతసించి, మనము మన నిజాభిప్రాయము లను స్పష్టపరచవలయును. ఇదివరకు ఆంధ్రమహాసభలలో 'ఆంధ్రుడు' అను పదము నిర్వచించబడినది. నిర్వచనము ప్రకారము ఆంధ్రులమని చెప్పికొనువారు జాతి, మత, భేదముల పాటింపక, తెలంగాణములో స్థిరనివాస మేర్పరచుకొని, మాతృభాష యేదైనను తెలుగు నేర్చి కొని, ఆంధ్రులనుండి విడిపోవుటకు వీలుండదు. ఈ కారణమున, తెలంగాణములోని వివిధ ప్రభుత్వ కార్యాలయములందు మాతృభాష ద్వారా, వ్యవహారము జరుపుటకు ప్రభుత్వముపై ఒత్తిడి కలిగించ వలయును. ఇదివరకు రాజకీయములలో హైదరాబాదు రాజధాని యందుండు ఆంధ్రులకు చాల నష్టము కలిగినది; మనము అణగద్రొక్క బడినాము. అఖిల హైదరాబాదునందు మున్నూరు కాపుల సంఖ్య సుమారు ఆరు లక్షలు. ఒక లక్ష మంది వలసబోయిన మన వారు బొంబాయి మధ్య పరగణాలలో నున్నారు. వారి స్త్రీలు ఇప్పటికిని మాతృభాషయైన తెలుగును కాపాడగలిగినారు. పురుషులు అచటి వేషభాషల నలవరచుకొని ఉన్నతోద్యోగములందున్నారు. ఉదాహ రణమునకు శ్రీసాయాజి లక్ష్మణ్ శీలం బి. ఏ., ఎల్. ఎల్. బి., బొంబై కాంగ్రెసు ఉన్నత పదవికి ఎన్నుకోబడినారు. మొదట నేను ఆంధ్రుడను. తరువాత భారతీయుడను ఇది మన లక్ష్యమై యుండ వలయును. హైదరాబాదు మూడు భాషలలో విభాగములు కలుగుట వలన ప్రాంతీయాభివృద్ధికి తోడ్పడును. ప్రాంతీయ విభాగము వలన యావద్భారత జాతీయతకు ఆటంకము కలుగజాలదు."

*మన కుల చరిత్ర :* భూమినే జీవనోపాధికి సాధనముగా జేసి కొని భాగ్యనగరమందు పేరు మోసిన కులములలో మున్నూరుకాపు కులము ఎన్నదగినది. ఒకప్పుడు వీరు పాలకులుగా నుండిరి. సైనిక జీవితము గడుపుచున్నట్లు నిదర్శనములు గలవు. వివిధ కారణములచే కాపు కులము వేర్వేరు శాఖలుగా చీలిపోయి వేర్వేరు నామములతో

వ్యవహరింపబడిరి. ఎవరికి తోచిన విషయములను వారు గ్రంథస్థము చేసిరి. సత్యము తెలిసికొనుట అసాధ్యము. ఐనను లభ్యమైనంతవరకు కొన్ని ఆధారములు ఈ క్రింద పొందపరచనగుచున్నవి :

1) ప్రభుత్వపు 1818 సం॥ జనాభా లెక్కలలో వీరు ఎలగందల పరగణాల యందు పాలకులుగా నుండులట్లు నిదర్శనలు గలవు.

2) 'సోమనాద్రి' 1704 A. D గద్వాల సంస్థాపకుడు- శ్రీ సురవరము ప్రతాపరెడ్డి B. A, చే 'రెడ్డిరాణి' పత్రికలో ప్రకటింప బడిన వ్యాసము.

3) "బలిజ కులచరిత్ర" నెల్లూరువాసి శ్రీ కంటె నారాయణ దేశాయి, బలిజ సంఘారాధ్యుల రచన.

4) "అభినవ సరస్వతి" మాసపత్రిక 29వ సంచికలో శ్రీ జాన పాటి పట్టాభిరామశాస్త్రి విమర్శన.

5) 'కమ్మవారిచరిత్ర' శ్రీ కొత్త భావయ్యాచౌదరి. (సంగం జాగర్లమూడి) రచన.

6) 'జన్మభూమి' (తెలుగు) పత్రిక - మొదటిసంపుటము 170 సంచికలో 'విశాలాంధ్ర' అనుశీర్షికను షోలాపూరు ఆంధ్రులను గురించి కాంగ్రెసు అధ్యక్షులు పట్టాభి శీతారామయ్యచే వ్రాయబడినది.

7) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, డా॥ పుట్టా శ్రీనివాసరావు, జయంతి రామయ్యపంతులు, శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ అడివి బాపిరాజు, పరిశోధించి సమకూర్చిన రికార్డు ఎంతో కలదు. ఈ గ్రంథములోనే ఆంధ్రచరిత్ర చతురానన శ్రీ చిలుకూరు వీరభద్ర రావు, ఓగిరాల సుబ్బారావుగారలు పరిశోధించి వ్రాసిన చరిత్రాంశ ములు, డాక్టరు పట్టాభి సీతారామయ్య, వడ్లకొండ నరసింహారావు, బ్రౌన్‌గారి తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో మున్నూరు కులపదమున కర్థము ఇతర ప్రముఖుల అభిప్రాయములు "మున్నూరుకులచరిత్ర - మున్నూరుకాపులు, కొన్ని అపోహాలు అను ప్రకరణము లో వ్రాయబడినవి."

## మన వ్యావసాయక జీవనము

మనవారి వ్యావసాయక జీవితముగురించి నేను కొంత విపులము గానే చర్చించితిని - దానిసారాంశము :—

మనవారిలో చెప్పుకోదగిన భూస్వాములు తక్కువ - పట్టా భూములు లేని కౌలుదారులు, కూలీలుఎక్కువ. మన ప్రభుత్వము ఇంత వరకు చేసిన శాసనములు ప్రజానీకమునకుగాని మన కులస్థులకుగాని లాభదాయకమైనట్లులేదు. అవి గ్రామీణుల ఆర్థిక దుస్థితిని బాగు పరచ జాలవు - దీనికిగాను విద్యావంతులైనవారు ఒక ఉపసంఘముగా ఏర్పడి గ్రామములందు పర్యటించి, ప్రజలు సుఖజీవితము గడుపుచున్నారా ? భూస్వాములకు కౌలుదార్లకు మరియు కౌలుదార్లకు కూలీలకు, పరస్పర ఆర్థిక సంబంధము లెట్లున్నవి ? మొదలగు భోగట్టా సంపాదించి ప్రభుత్వమునకు నివేదించవలసి యుండును. తెలంగాణములో వ్యవసాయ పద్ధతులు, కర్షకుల దుస్థితి అతి ఘోరముగానున్నవి. దీనికి తోడు తెలంగాణారైతులు. వ్యవసాయక క్రియాకలాపములు లేనప్పుడు తమ మిగతకాలమును అభియోగములందు వినియోగింతురు. గ్రామాధి కారులకును రైతాంగమునకును పూర్వపు సత్సంబంధము లిప్పుడు మృగ్యములు. ప్రభుత్వోద్యోగులను సంతోషపెట్టుటకు గ్రామాధికారులు రైతులను కొల్లగొట్టుదురు. ఇది చాలనట్లు, అతివృష్టి, అనావృష్టి మొదలగు ప్రకృతి బీభత్సములు వేరు. వీటన్నిటికి తరణోపాయము సహకారసంఘములు ఈ సంఘములు నగరవాసులైన వ్యాపారస్థులకు గూడ తోడ్పడవలయును. అలియాబాదులో మన కులసోదరులు గత 20 సంవత్సరములనుండి ఈ సహకారసంఘము ద్వారా మనవారి సేవ చేయుచున్నారను విషయము హర్షించదగినది.

## విద్యా విషయములు

జన సామాన్య విద్యా విధానము యావద్భారత దేశమునకు సంబంధించినది. దేశ స్వాతంత్ర్యానంతరము నిర్బంధ ప్రారంభ విద్యా విధానము అమలునకు రావలసియుండెను. కాని కారణములేమైనను ప్రభుత్వ మట్లు చేయలేదు. నేటి విద్యావిధానము లోపభూయిష్ఠము;

వ్యయ ప్రయాస పూరితము. ప్రాంతీయభాష, నాగరికత, సభ్యతను అణగద్రొక్కి వాని స్థానమున ముస్లిం నాగరికత, సభ్యతను, ఉర్దును, ప్రజలనెత్తిపై రుద్దు ఉద్దేశముతో అప్పటి నిజాం ప్రభుత్వము ఉస్మానియా విశ్వవిద్యాలయమును స్థాపించినది. ప్రభుత్వములో కలిగిన మార్పు తరువాత ఈ విద్యాసంస్థను స్థానిక భాష, సంస్కృతులను పెంపొందించుటకు సాధనముగా ఉపయోగించుకొనవచ్చునని ఆశించు నంతటిలో కేంద్ర ప్రభుత్వము దానిని హిందీ విశ్వవిద్యాలయముగా మార్చ నిశ్చయించినది. హిందీ మన జాతీయభాష; దాని నన్నివిధాల పెంపొందించవలసినదే. కాని, హిందీ ఇంతవరకు భారతదేశములో ఏ విశ్వవిద్యాలయములో బోధనా భాషగా అంగీకరింపబడలేదు. అసలు హిందీ సాంకేతిక, వైజ్ఞానిక విషయములు బోధించుటకు తగియున్నదా అను విషయమున భేదాభిప్రాయములు కలవు. ఇటువంటివే మరికొన్ని విషయములను తుణ్ణముగా కనుగొని కేంద్రప్రభుత్వమునకు తెలుప వలయును. ప్రస్తుత పరిస్థితుల ననుసరించి ఉన్నత విద్యావిధానమును సంకుచితపరచుట అవాంఛనీయము. ఇంతకుముందున్న ప్రభుత్వము మనలను అణగద్రొక్కుటకు ప్రయత్నించినది. ఇప్పటికి గూడ అదే సమస్య ఎదురగుచున్నది.

విద్యతోపాటు శారీరక వికాసమునకు వ్యాయామమావశ్యకతను గురించి, మరియు సైనిక శిక్షణ విషయమై హైదరాబాదు నగరమున జరిగిన అఖిలభారత తెలుగు మున్నూరు కాపు మహాసభ తృతీయసమావేశమున డా॥ విఠ్ఠల్‌రావు భూసరత్ విపులముగా చర్చించినారు. కావున ఆవిషయమై ప్రస్తావించుట పునరావృత మగునని ఇచట మరల చర్చించుట లేదు.

## ఉద్యోగములు

ప్రజాపరిపాలనకు ముందు నిరాధారమైన పునాదులపైన విద్యాసౌధము నిర్మింపబడి నందున, ఉన్నత విద్యావంతుల నిరుద్యోగ సమస్య చాల ప్రాముఖ్యత వహించుచున్నది. ఉద్యోగముల విషయములో ముల్కీ నిబంధనలు కఠినముగా పాలింపబడవలయును. చిన్న ఉద్యోగము లైనను సంఖ్యా నిష్పత్తిని బట్టి నియామకము జరుగవలయును,

ప్రస్తుత పరిస్థితుల ననుసరించి ఉద్యోగ నియమములను జట్టి ప్రభుత్వము ఒకకమిషనును ఏర్పరచవలయును. ఐతే, ప్రభుత్వములో ఉన్నతో ద్యోగముల ద్వారా అధికారము లభించినచో వృత్తి గౌరవము దెబ్బ తినునేమో యను భయము కలదు. కావున ప్రభుత్వోద్యోగసమస్యను విడదీయు నప్పుడీ విషయమును దృష్టియందుంచుకొనవలయును.

## సంఘ దురాచారములు

మద్యపానము శారీరకముగా, ఆర్థికముగా నష్టదాయకము. బాల్యవివాహములు చేయుట, వితంతూద్వాహములు లేకుండుటవలన సంఘమునకు కలుగు దుష్పరిణామములు మీకు తెలిసినవే. భాగ్యవంతుల ఇండ్లలో సంతానము లేని విధవలు, 20-22 సం॥ల వయస్సు వరకు వివాహములేనివారున్నారు. ఇవియన్నియు అరిష్టములే. భారత రాజ్యాంగములో పురుషులతోబాటు స్త్రీ సంతానమునకు సమాన వారసత్వపు హక్కులుండునట్లు ప్రవేశబడిన తీర్మానమున్నది. స్త్రీల విద్యావిధానము పట్ల శ్రద్ధవహించి వారిని ఉన్నత విద్యావతులుగ జేసి, ప్రభుత్వోద్యోగములందును, పురపాలక సంఘములందును వారికి తగినంత ప్రాతినిధ్యముండునట్లు చూడవలయును.

అస్పృశ్యతా నివారణపట్ల శక్త్యానుసారము నేను చేసిన సేవకు ప్రతిఫలముగా నేను 'పంచముడు'గా అనుమానింపబడినాను.

మొత్తము మీద మనవారు పెద్దలు, యువకులు, చేయుచున్న సేవ ప్రగతిమార్గమున పురోగమించుచున్నది. వీరిసేవ అకుంఠితమైనచో మన గమ్య స్థానము అనతిదూరములోనే యున్నది.

ఇక కొన్ని ప్రతిపాదనలు చేయుచు నా యుపన్యాసమును ముగించుచున్నాను.

1. మన కులస్థుల ఋణ బాధానివారణ సాధనములుగా సహకార సంఘములు స్థాపించుట. 2. మన కులస్థులలో విద్యావ్యాప్తి 3. మన కులస్థులలో ఆరోగ్యపారిశుద్ధ్యములను పెంపొందించుట. 4. పంచాయితీ బోర్డు స్థాపన 5, సహకార సిద్ధాంతములపైన సమష్టి వ్యవసాయక, వ్యాపార నిర్వహణ.

కులస్థుల సేవ, వారిసర్వతోముఖాభివృద్ధికి, సదా నా సంసిద్ధతద్ది. నిష్పాక్షిక జాత్యభిమానము నాధ్యేయములు. నాతో ఎంత సేవ తీసి కొనిన నే నంతకృజ్ఞుడనై యుందును.

ఈ సభలో పై తీర్మానము లా మోదింపబడినవి.

మహాసభా దేశానుసారము, స్థాయి సంఘము, విద్యాసంఘము, ప్రచార సంఘములు నియమింపబడినవి.

నాల్గవ మహాసభ భువనగిరిలో పై తేదీలలో అతి వైభవముగా జరిగినది. హైదరాబాదు-సికిందరాబాదు జంటనగరముల నుంచి మరియు మెదకు - నిజామాబాదు, కరీంనగరం, వరంగల్లు, బీదరు, నాందేడు, ఆదిలాబాదు, దెగులూరు, మహబూబునగరం, నల్లగొండ, రాయచూరునుంచి దాదాపునాలుగైదువందల ప్రతినిధులు, ప్రేక్షకులు ఈసభకు హాజరైరి. వీరేగాక రెండువేలకుమించినస్థానికులుగూడయుండిరి. కులసంఘసభ్యులే గాక, భూమ్యాదాయ, ఆబ్కారిఅటవీశాఖామంత్రి. శ్రీ కె వి. రంగారెడ్డి గారు, విద్యాశాఖా ఉపమంత్రిణి శ్రీమతి సంగం లక్ష్మిబాయమ్మ గారు హైదరాబాదు పురపాలక సంఘ ఉపమేయరు శ్రీ కృష్ణస్వామి ముదిరాజుగారు, శ్రీ కొండా లక్ష్మణ బాపూజి ఎం. ఎల్. ఏ., నగర సంఘాధ్యక్షులు శ్రీ కె. వెంకటాచలం బి.ఏ.ఎల్.ఎల్.బి. అడ్వొకేటు, హైదరాబాదు ప్రదేశ ముదిరాజు సభాధ్యక్షులు శ్రీ బి. వెంకటస్వామి గారు, మేరువ సంఘాధ్యక్షులు శ్రీ టి. నరసింహులుగారు, యాదవ జనసంఘాధ్యక్షులు శ్రీ పోలం వీరయ్యగారు, మరియు వెనుకబడ్డ వర్గాల ఉపాధ్యక్షురాలు శ్రీమతి సామ్రాజ్యలక్ష్మిగారు, సభలో పాల్గొనిరి.

శ్రీ ఎస్. చెన్నయ్యగారు, తమ ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాస మున, మహాసభాధ్యక్షులు, ప్రతినిధులు ఇతర ప్రముఖులకు స్వాగతము తెలుపుతు, మున్నూరు కాపువారినేగాక వెనుకబడియున్న అన్నిజాతుల యొక్క సామాజిక విద్యా ఆర్థికస్థితికి సంబంధించిన వివిధ విషయములను గురించి తమ అభిప్రాయము వెలిబుచ్చిరి. అధ్యక్షోపన్యాసము తరు వాత శ్రీ కె. వి. రంగారెడ్డిగారు సభాకార్యక్రమమును ప్రారంభించిరి. మానవ సమాజము యొక్క అన్ని తెగలలో కొన్ని కష్టములుండున్న

వాటిని తొలగించి సౌకర్యము కలిగించుకొనదలచినచో వర్గీయ వ్యవస్థ లవసరమనియు, వానిలో సంకుచితమైన కులతత్త్వముండరాదనియు చెప్పిరి. సభలో శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ, శ్రీ కే. కృష్ణస్వామి ముదిరాజుగారు, ఆహారశాఖ ఉప మంత్రి శ్రీ అరిగె రామస్వామి, శ్రీ శంకరదేవు మంత్రిగారు ప్రసంగించిరి.



మున్నూరుకాపు తృతీయ మహాసభాధ్యక్షులు శ్రీ బొజ్జం నర్సిములుగారు, చతుర్థ మహాసభాధ్యక్షులు శ్రీ బీరం రంగారావుగార్కి తమపదవిని అప్పగించు సందర్భమున తీసిన చిత్రం.

మహాసభాధ్యక్షులు శ్రీ బి. రంగారావు బి.ఏ., ఎల్.ఎల్. బి. గారు తమ ఉపన్యాసము యొక్క పూర్తి పాఠము:

ఆహ్వాన సంఘాధ్యక్ష మహాశయా!

సోదర సోదరీమణులారా!

మీచే ప్రసాదింపబడిన ఈ గౌరవమునకు నేనెంతయు కృతజ్ఞుడను. ఈ పదవిని నేను ఎంతయో నమ్రతా సుహృద్భావములతో అంగీకరించు చున్నాను. ఈ బాధ్యతను అంగీకరించుటకు మీ సంపూర్ణ సహకారమే నన్ను ప్రోత్సహించినది. ఇట్టి సమయములో మనము కుల రహితమైన సమాజము యొక్క దృఢత్వము పట్ల మన శ్రద్ధను కేంద్రీకరించుట స్వభావసిద్ధము. కొందరికి జాతీయతా దృష్టితో ఇట్టి విషయమును సాధించుట సాధ్యమా అను సందేహము కలుగ వచ్చును. మన జాతీయత అవిభాజ్యము. మన ముందు స్వాతంత్ర్య సముపార్జనమునకు

ముందుగల కొన్ని సమస్యలు ఉన్నవి. మనము ఇచ్చట ఆర్థిక సమత్వము, నిరక్షరాస్యతా నిర్మూలనము మరియు సమాజములో గల హెచ్చుతగ్గులను ఎట్లు నిర్మూలించ వలయునో అను విషయములను ఆలోచించుటకు సమావేశమైనాము.

## కులతత్వము: జాతీయత

స్వాతంత్ర్యమును సంపాదించుటకు మనము ఎట్టి విధానమును అవలంబించినామో అది మన జాతీయతకు ప్రతిబింబము. మనము అహింసా తత్వమునకు అలవడినవారము. కావున మన ఎదుట నున్న సమస్య లన్నియు స్వాభావికముగ ఒక తీరుగ నుండజాలవు. అయితే కొన్ని వేల సంవత్సరముల నుండి మన ముందున్న కులవిషయములను ఉపేక్షింపజాలము. ఈ కుల సంస్థ ఎన్నియో శతాబ్దముల నుండి, సుస్థిరముగ వచ్చుచున్నది. దాని ప్రత్యేకమైన ఉపయోగము కూడ అప్పటి నుండియే కాన్పించుచున్నది. అయితే అట్టి కుల సిద్ధాంతములను శ్లాఘించుట గాని అవి సుస్థిరముగ నుండవలయునని చెప్పుటగాని నా ఉద్దేశము కాదు.

మన దేశము కులమును ప్రతిఘటించిన ప్రతి విషయమును చూచినది. ఆతర్వాత అది ఒక ప్రత్యేకతగా మారినది. ఇట్లు కుల భేదములు నిర్మూలింపబడుటకు బదులు అవి జీర్ణీకరింపడినవి, లేక అందులో వృద్ధి అయినవి. ఈ రోగ విధానము సరియైనది కాదనియు, తత్ చికిత్స నిష్ఫలమైనదనియు తెలిసికొనుట ఎవరికైనను అశక్యము కాలేదు. ప్రస్తుత కులసంస్థా విధానము వర్ణాశ్రమ పద్ధతులపై ఆధారపడి యున్నది.

ప్రప్రథమమున దీని ఉద్దేశము వృత్తులపై ఆధారపడి యుండెను. కాని కులము అనునది ఈ విభాగమునకు తావిచ్చినది, మొదటి నుండియు భారతదేశము ఆధ్యాత్మికమునకు పుట్టినిల్లు. మతము జీవితము యొక్క ముఖ్య భాగమైపోయినది. ఈ మత తత్వము ఒక సామాజిక స్మృతియై వర్ణములుగ మారినది. ఇట్లు మనము మత దృష్టిని స్వతంత్రులమైనను కులమను వలలో చిక్కుకొనినాము. సామాజిక విప్లవము

కావలయునన్నచో హింసాత్మకమైన పద్ధతులను నిరోధించుచు ఈ సాత్త్వికపుసుగు పట్టును నిర్మూలించవలయును.

మన సమస్యలు సామాజికములు; ఆర్థికములు కూడాను. జాతి, కుల విధానముల ద్వారా వ్యక్తిగతముగా చేయబడిన యత్నములన్నియు, నిష్ఫలములైనవి. కావున, స్వీయ చైతన్యము కలిగించుటకు, మరియు సత్యాసత్యములను ఎక్కువ ఉచితరీతిని గ్రహించుటకు, కుల సంస్థల నూతన నిర్మాణము అవసరము. ఇట్లు మన పురోభివృద్ధిలో ప్రతిబంధకములు కలిగించుచు ఎంతేని హాని కలిగించుచున్న కుల కాఠిన్యములను ఎదుర్కొనుటకు ఈ నూతన నిర్మాణములు ప్రథమ సోపానములు కావలయును. ఈ ఉద్దేశమును బడయుటకు, వ్యక్తిగత ప్రయత్నములే గాక, ఈ నూతన నిర్మాణము ద్వారా, వర్ణాంతర భోజనములను వర్ణాంతర వివాహములను ప్రోత్సహించి, దానిని అమలులో నుంచుట ఆవశ్యకము. కుల తత్వము నిర్మూలమగుటకు ఎంతో కాలము పట్టును. అంతవరకు మత విషయక అసమత్వము అన్యాయము లేని ఒక సమాజమును నిర్మించుటకును, ఈ కులాభిమానులను పారదోలుటకును మనము తోడ్పడవలయును. ఒక ముఖ్య విషయమేమనగా, వెనుకబడి యున్న వర్గములను మన దేశములో సామాజికముగా అభివృద్ధి జెందిన వర్గముల శ్రేణికి తెచ్చు మన విధ్యుక్త ధర్మమై యున్నది.

## మన సమస్యలు: వానిని విడదీయు విధానము

వర్ణాంతర భోజనములు, వర్ణాంతర వివాహములు అమలులోనున్న మనజాతి, మన రాష్ట్రము యొక్క వివిధ ప్రదేశములలో వివిధ పేరులతో అనగా మున్నూరు, మున్నూరుకాపు, తోట బలిజ, తెలగ, తుల్లీరు; పూల్ మాలి, కాపు, మున్నీరు, అని పిలువబడుచున్నది. బొంబాయి మరియు మధ్యప్రదేశ రాష్ట్రములలో మనము మున్నూరువారు, తెలగ మున్నూరు వారు, కాపియావారు అని పిలువబడు చున్నాము. హైదరాబాదు రాష్ట్రములోనే మన జాతి సంఖ్య పది లక్షలకు మించి యున్నది. మనలో ఎందరు అక్షరాస్యులు గలరు ? ఎందరు గెజిటెడు ఉద్యోగములలో నున్నారు ? వారి ఆర్థిక స్థితి ఎట్లున్నది ? అను విషయములను మనము ఆలోచించినచో, మన వారిలో ప్రతిశతము ఒక వ్యక్తిగూడ ప్రభుత్వో

గములలో లేరని, మనకు తెలిసినప్పుడు ఆశ్చర్యమునకు మేరముండదు. ఇక గెజిటెడు ఉద్యోగములా, అల్పాతి అల్పములు. విద్యా విషయమున చూచినచో : మన అక్షరాస్యత ప్రతి శతము ఒకటికంటెగూడ తక్కువై యున్నది. ప్రతి వ్యక్తి తాను వెనుక బడియున్న వాడని రుజువు చేయుటకు ప్రయత్నించగలడు. కాని, అతనిఅసహాయత అశక్తత, ఒక మరువ రాని విషయమని మనము గ్రహించ వలయును. కేవలము, ప్రభుత్వము మనకై ఏమియోచేయుచున్నదని భ్రమించి వారిపై ఆధారపడి యుండ రాదు. అయితే, ప్రభుత్వము మనదుస్థితిని నిర్మూలించుటకు చేయుచున్న ఇతోధిక అనుకూలతల నుండి తప్పక లాభము పొందవలయును.

2. మనకు ముఖ్యాలి బాధ కలిగించు ఒక విషయమేమన, ప్రతి శతము ఒక్కరు గల మన వారిలో ఎందరో నిరుద్యోగులు గలరు. వారికి జీవనోపాధియేలేదు. ఇది విద్యా విషయమున మన ఉపేక్ష, నిరుత్సాహ మునకు కారణమగుటయే కాక, నిరక్షరాస్యతా నిర్మూలమునకు ప్రతి బంధకమగుచున్నది. విద్యా పూర్తితోడనే, ప్రతి వ్యక్తికి ఉద్యోగ ప్రాప్తి కావలయునని నేను కోరుటలేదు. కాని, ప్రస్తుత విద్యావిధానములో, కృషికిగాని సాంకేతిక సామర్థ్యమునకుగాని ఎట్టి గౌరవము లేదు; అట్టి గౌరవమునకు అవకాశము గూడలేదు. పాఠశాలలో నేర్పబడు లెక్కలతో తదభ్యర్థులకు లాభము శూన్యము. ఇతరత్రా మనము ఎంతయో కాలమును, శక్తిని మిగిలించుకొనెడి వారము ? గ్రామ ములలోను నగరములలోను నేర్పబడు విద్యఖిన్నమై యుండ వలయును. ఈ విద్యావిధానము నిత్యజీవితమునకు ఉపయుక్త మగునట్లుగా నుండవలయును. కేవలము సిద్ధాంతములను బోధిం చునదిగా నుండకూడదు. కావున, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానము కలిగించు విద్య అవసరమై యున్నది. ఇట్టి విద్య ఉచితముగాను, స్కాలరు షిప్పుద్వారా, మరియు పాఠ్యగ్రంథములను పరికరములను ఉచితముగా సరఫరా చేయుచు, గరపబడవలయును. యోగ్యత లేక అయోగ్యతకు ఇందు తావుండగూడదు. తాలూకా ప్రదేశములలో ఉచిత భోజనము వసతికి అనుకూల్యములు కలిగింపబడవలయును ఇతర రాష్ట్రములలో నున్నట్లు వెనుక బడియున్న జాతులకు ప్రభుత్వములో ప్రతి శతము 25 చొప్పున ఉద్యోగము లివ్వబడవలయును.

3. మనము విశేషముగా కర్షకులము. కొన్ని నగర ప్రాంతము లలో మాత్రమే మనవారు ఇతర వృత్తుల అవలంబించి యున్నారు. మనలో ప్రతి వ్యక్తికి, ఒక ఎకరము చొప్పున గూడ భూమిలేదు. అచ్చటచ్చట కొన్ని అల్పభూవసతులు కలవు. కాని వానిపై విశేషమైన భారము కలదు. పెద్దపెద్ద జమీందారులు మనలను ఈ కొద్దిపాటి భూవసతుల నుండి కూడ భ్రష్టుల చేయుచున్నారను విషయము, పత్రికల ద్వారా మరియు ఇతరథా ప్రజానీకమునకు తెలుపుచున్నాము. ఇప్పట్ల గ్రామాధికారులగు పటేలు, పట్వారీలు మనకు కలిగించుచున్న సహాయము అల్ప విషయము కాదు? కులాధిక్యము గూడ ఎంతయో నిరోధకమునకు కారణమగుచున్నది. భూసంస్కరణలు ఇంతవరకు అమలునకు తేబడలేదు. ఈ విషయమున ఎక్కువ కాలహరణమైనచో, ప్రజాప్రభుత్వములో మన విశ్వాసము సన్నగిల్లును. కావున, నలుగురు వ్యక్తులకు మించకయున్న ప్రతి కర్షక కుటుంబమునకు కనీసము నాలుగు ఎకరముల భూవసతి కలిగింపబడవలయును.

4. కర్షకులలో ఋణ బాధ ఎంతయో కలదు. దీనికి కర్షకులే కారణము కాదు. శోచనీయమగు ఈ దుస్థితికి ఎన్నియో కారణములు కలవు. శాసనముల ద్వారా వీరికి సహాయము కలిగించనిచో, వంశపారంపర్యముగా వచ్చుచున్న ఈ ఋణ బాధనుండి వారు తప్పించుకొనజాలరు. కావున, మన పొరుగు రాష్ట్రములలో నున్నట్లు గ్రామీణ ఋణ నివారణ సమితులను (Rural Debt Settlement Boards) నిర్మించవలయును. రిజర్వు బేంకు యొక్క సిఫారసుల ప్రకారము గ్రామీణ ప్రాంతములకు ద్రవ్యసహాయ సౌకర్యములు కలిగింపబడవలయును.

5. పాశ్చాత్య దేశములోవలె, ప్రతి గ్రామములో చలన శకటముల ద్వారా ఉచిత విద్య, మరియు రోగ చికిత్సా సౌకర్యములు కలిగింపబడ వలయును.

మన సామాజిక, ఆర్థిక విషయముల గురించి నేను ప్రసంగించుచున్నాను. వెనుక బడియున్న మన జాతిసంఖ్య మన రాష్ట్రములో ప్రతి

శతము ౯౮ వంతున నున్నది. వీరిలో అక్షరాస్యులు ప్రతి శతము 6 చొప్పున గూడ నున్నారోలేదో, ఎక్కువ నాగరకు లనబడు వారిసంఖ్య ప్రతి శతము కేవలము 2 యున్నను, వారిలో అక్షరాస్యులు ప్రతిశతము 74 చొప్పునగలరు. వీరి ఆర్థికస్థితి హర్షణీయము. ఇది మనదేశపు నాగరిక జాతులు మరియు రాష్ట్రప్రభుత్వపు దీర్ఘాలోచనను రేపించు విషయము. కొన్ని జాతులు వెనుక బడియున్నంత వరకు సుఖప్రద రాష్ట్రమునునది కేవలమొక పగటి కల; మరియు ప్రజాప్రత్వమును తిరస్కరించుటయే యగును.

ఈ జాతీయ సమస్యను విడదీయుటకును, అధిక సంఖ్యాక ప్రజానీకము యొక్క శ్రేయస్సు కొరకును, నాగరక జాతులు తమ భయమును కాని సందేహమును కాని వదలి. వెనుక బడియున్న వర్గములతో సహకరించుచు వారికి చేయూత నొసగవలయునని ప్రార్థించుచున్నాను.

ఈ నా అభిభాషణమునకు ఓర్పుతో చెవి యొగ్గినందుకు మీ అందరకు నా కృతజ్ఞతాభివందనములు.

జై హింద్



అ. ప్రై. మున్నూరుకాపు చతుర్థ మహాసభ (భువనగిరి) దృశ్యం

## సభలో చేయబడిన తీర్మానములు

1) విద్యనభ్యసించు బాలబాలికల విద్య, వసతిగృహ సౌకర్యములకు ధనము ప్రోగుచేయుట;

2) వెనుకబడిన వర్గాల వారిస్థితి గతులకు సంబంధించిన నివేదికను ప్రభుత్వమునకు సమర్పించిన శ్రీ కాకా సాహెబు కాలేల్కారుగారికి అభివందనము లర్పించుట ;

3) కాలేజులలో మున్నూరుకుల విద్యార్థులకు నూటికి 35 చొప్పున సీట్లు ప్రత్యేకించుట

4) వరశుల్కము లంగీకరించిన వారిపై తగు చర్య తీసికొనుట;

5) వర్ణాంతర వివాహములను ప్రోత్సహించుట-

6) రైతులు పండించు ధాన్యముల ధర నిర్ణయించుట ;

7) పంటలకు కలుగు రోగముల నిర్మూలమునకు ప్రభుత్వమును కోరుట-

8) పశు సంపదను వృద్ధి చేయుటకు రైతులకు ఉత్తమ జాతికి చెందిన ఆబోతులను ప్రభుత్వము సరఫరా చేయునట్లు చూచుట-

9) గోదావరి నదిపై ప్రాజెక్టు నిర్మాణము-

10) సహకార సంఘముల ద్వారా రైతులకు అప్పులిచ్చుట-

11) పది సంవత్సరములకు పైగా బాకీపడి యున్న తకావీ ఋణములను మాఫీచేయుట-

12) రైతులకు వ్యవసాయమందు ఆధునికపద్ధతిన శిక్షణనిచ్చి, ఆధునిక వ్యవసాయ పనిముట్లను ప్రభుత్వము నుండి తకావీల ఇప్పించుట.

13) కుటుంబ నియంత్రణను అమలులో పెట్టుట

14) కాసాగ్రిఫారాలలో పటేలు, పట్వారీల అవక తవక వ్రాతలను అరికట్టుట

15) Lower Primiary రెండవ తరగతి వరకు బాలురకు విద్యా వేతనము ఇప్పించుట—

1. అర్హతగల పైతరగతుల విద్యార్థులకే విద్యా వేతనములు ఇప్పించుటకై ప్రయత్నించుట-
2. మున్నూరు కాపుకులచరిత్రను గురించిన గ్రంథములను ప్రోగుచేసిన సభ్యుల కందజేయుట
3. మహాసభలలో పాల్గొను సభ్యులకు రేల్వేకన్సెషను యిప్పించుటకు ప్రయత్నించుట
4. మొదటిభార్య జీవించియుండగ ఏవ్యక్తి ద్వితీయ వివాహము చేసికొనగూడదు.



మున్నూరుకాపు ప్రథమ మహాసభ ప్రముఖులు

# మున్నూరుకాపు సంఘ ఐదవ మహాసభ

## శ్రీ అన్నం విశ్వనాథ రావు బి. ఎ.ఎల్ ఎల్.బి.

## అధ్యక్షోపన్యాసం

ఆహ్వాన సంఘాధ్యక్షులు, శ్రీ శీలంగారు మరియు సోదర, సోదరీమణులారా!

ఈసంఘపుభారం వహించడానికి మీప్రేమ, ఆదరం నాకు ప్రోత్సాహాన్ని ఇస్తున్నాయి. మిక్కిలి సంతోషంతో నేను ఈ పదవిని అంగీకరిస్తున్నాను. మీ సహకారంతోనూ దీవెనలతోనూ నేను ఈపద విని నిర్వహించ కలుగుతానని ఆశిస్తున్నాను. నా మేలుకోరే మీ అందరికీ నేను కృతజ్ఞుణ్ణి.

లోతుగా ఆలోచించి, సామ్యవాద సమాజం ఏర్పర్చడానిగ్గాను ఈ రోజు అందరూ కులాలనూ, వర్గాలనూ నిర్మూలించడానికి చర్యలు తీసుకుంటున్నారు. స్వాతంత్ర్యం వచ్చింది. అయినా కులాలూ, వర్గాలూ సంఘంఅనేకట్టుబాట్ల క్రింద శ్రామికవర్గం నలిగిపోతూంది. అది స్వాతంత్ర్యఫలాలు అనుభవించలేక పోతూంది. మనం ఇందు విషయంలో పక్షపాతం లేకుండా చర్యలు తీసుకోవలసిందిగా అధి కారులను కోరవలసివుంది. మనప్రజల్లో ఎక్కువ సంఖ్యగలవారి విష యంలో ఇంకా సరియైన శ్రద్ధతీసుకోక పోవడం మిక్కిలి విచారించ వలసిన విషయం. ప్రభుత్వంవారి ప్రగతికిగాను సాధారణ కార్య క్రమాలు చేకొనవచ్చు. కాని అందువల్ల పెద్దలాభం ఏమి కనుపించదు. కాబట్టి మన సామాజిక, ఆర్థిక, విద్యావిషయకమైన ప్రగతి సాధించడా నికిగాను మనం ఏకం కావలసివుంది. ఇందుకుగాను మొదటి మెట్టుగా కులపు సంఘాలు ఏర్పర్చవలసివుంది. అలా చేసేటప్పుడు మనం ఇతర వర్గాలవారి కార్యక్రమాలకు అడ్డుపోకుండా వుండాలి. అంతేకాక ప్రభుత్వంవారూ, ప్రైవేటు ఏజన్సీలూ చేసే అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొంటూ అన్నిరకాల అభివృద్ధికే తోడ్పడాలి. కులాల ఏర్పాటు వృత్తివ్యాపారాల ఆధారంగా జరిగింది. అదేవిషయం యిక్కడ పేర్కొన వలసివుంది.

మనదేశం ముందడుగు వేయడంలో మన వెనుకపాటుతనం ఒక అడ్డుగోడలాంటిది. పంచవర్ష ప్రణాళికద్వారా మనం సాధించే విజయాలను గురించి పైవారు పెద్దపెద్ద ఆశలు పెట్టుకున్నారు. వారు ఆశించినట్లు దేశమంతా ముందడుగు వేయకుండా కొందరు వెనుక పడటం జరుగుతే వారి ఆశలు కలలు అవుతాయి. అలాజరుగుతే అసలు మనం ప్రగతిని గురించి చెప్పుకోవడానికే వీలుండదు. సామాజిక, రాజకీయ సమానత సాధిస్తున్నామని చెప్పుకుంటే వెనుకబడినవారి సంక్షేమాన్ని గురించి ఆలోచించడం మనందరి మొట్ట మొదటిపని అయి వుంటుంది. అలాకాని పక్షంలో అర్థంలేకుండా జరిగిన మన ప్రగతి అసమానతకు దారితీస్తుంది.

నేడు మనం కులాలు, వర్గాలు అనేభేదాలను రూపుమాపదలచాం. ఇందుకుగాను మనంఅంతా ఒక ప్రణాళిక సిద్ధంచేయాల్సివుంది. ఒకేగడ్డ బిడ్డలుగా మనంఅంతా ఒకేదారిన పయనించాల్సివుంది. మన ప్రస్తుత రాజ్యాంగం ఎవరిదోపిడీని సహించదు. కుల, వర్గ విభేదాలను పెరికివేయడం మన ధ్యేయం కావాలి. మనందరికి కృషివల్ల హెచ్చు తగ్గులను తగ్గించవచ్చు.

అణచివేయబడిన జనంలో మున్నూరు కాపులమైన మనవర్గం ప్రధాన పాత్ర వహించవలసివుంది. నగరాల్లోనూ, పట్టణాల్లోనూ వుండే ఏకొద్ది మందో తప్ప పల్లెల్లో మనసోదరులైన అనేకులు బాగా అభివృద్ధి చెందిన వర్గాల అంతస్థుకు తేవడానికి బాటలు వేయవలసివుంది. కాబట్టి కులాలను శాశ్వతం చేయడానికి కాక, సామాజిక, ఆర్థిక రంగాల్లో అదృష్టవంతులైనవర్గాలవారితో సమానంగానిలువడానికి ప్రయత్నించడానికి, మీరంతా ఏకంకావాలని మిమ్ము కోరుతున్నాను. దురదృష్టవశాత్తుమనజాతిలోనే అనేక పేర్లతోకొన్ని అవసరమైన విభేదాలూ, అడ్డుగోడలూ కల్పించబడినాయి. అసలు మనవర్గం వివిధప్రాంతాల్లో మున్నూరు, మున్నూరుకాపు, మున్నీరుకాపు, కాపు, బలిజకాపు, తెలగాలు. కుంబి, ఫూల్‌మాలి, తుల్లేరు మొదలైన పేర్లతో పిలువబడుతూంది. కాని యివన్నీ ఒకటే. అందరివృత్తి వ్యవసాయమే, పూర్వపు

ఆంధ్రరాష్ట్రంలోని తెలగాలు అనేవారి పరిస్థితి తప్ప మిగతా అందరి పరిస్థితి విచారణీయంగానేవుంది. వారి సామాజిక, ఆర్థిక విద్యావిషయక పరిస్థితులను మెరగుపర్చడానికి సానుభూతితో ఆలోచించాల్సివుంది. మన కష్టాలను గురించి ప్రభుత్వానికి తెలియజేస్తూనే, మన పరిస్థితి బాగుచేసుకోవడానిగ్గాను, సాధ్యమైనంత ప్రయత్నం చేయాలని మీ అందరినీ కోరుతున్నాను.

సంఘం తరువాత మిక్కిలి ముఖ్యమైనది విద్య. మనం మనపిల్లలకు విద్యకోసం ఏర్పాట్లు చేయకపోతే మనం ఎలాంటి ప్రగతిని సాధించలేం. ఎన్ని ఇబ్బందులు ఉన్నా మనపిల్లవాండ్లను చదివించడానికే, రాత్రి పాఠశాలలు ప్రారంభించడానికే, వసతిగృహాలు ఏర్పరచడానికే, అర్హులైన విద్యార్థులకు విద్యార్థివేతనాలు ( Scholarships ) ఇవ్వడానికే ప్రయత్నించాలి. బాలులకు చదువుచెప్పించాల్సిన అవసరాన్ని గురించి పల్లెల్లోని మన పెద్దలకునచ్చచెప్పాలి. కాబట్టి ఇందును గురించిమనపెద్దలూ, యువకులూ సంపూర్ణంగా సహకరించాలని కోరుతున్నాను.

అప్పుడప్పుడు సామాజిక, సాంస్కృతిక ఉత్సవాలు జరపడం ద్వారా మనసమస్యలను అర్థంచేసికోవడానికి వీలుకలుగుతుంది. ఉత్త ఉపన్యాసాలు ఇవ్వడానికి ఇది సమయంకాదు. మన నిర్ణయాలను అమలు జరపాల్సి ఉంది. మన పెద్దల ఆశీర్వాదంతోనూ, యువకుల కార్యదీక్షతోనూ మనం మన ధ్యేయాన్ని సాధించకలుగుతామని నాకు నమ్మకం ఉంది.

పరస్పర ప్రేమతోనూ, గట్టినిర్ణయంతోనూ పనిచేయాలి. మానవ సేవయే మాధవసేవ. మనకు విజయం కలగాలంటే, మన సమస్యలను జాగ్రత్తగా అర్థంచేసుకుని, వాటిని పరిష్కరించడానికి ప్రయత్నించాలి. మనవారిలో వివిధ ప్రాంతాలవారికి వివిధసమస్యలు ఉన్నాయి. అన్ని గురించి ఇక్కడ చర్చించడం సాధ్యంకాదు. అందుకుగల కారణాల్ను బాగా ఆలోచించి వాటిని పరిష్కరించడానికి ప్రయత్నించాలి. ఐకమత్యం మనధ్యేయంకావాలి. ఐకమత్యమే మనను మన ధ్యేయంకు చేరుస్తుంది.

నేను మీ సమయం ఎక్కువగా తీసుకోదల్చలేదు. వెనుకపడిన మన సోదరుల పరిస్థితులు బాగుపర్చడానిగ్గాను, ఈ మహాసభలో తగు నిర్ణయాలు చేయవలసి ఉంది. మీ అందరి సహకారం ఉంటే నేను పని చేయగలుగుతాను. కాని మీ ఆశీస్సులు, సహకారం, సద్భావం లేకుంటే నేనే మీ చేయలేను.

నన్ను ఈ పదవికి ఎన్నుకున్నందుకు మీ అందరికీ కృతజ్ఞుణ్ణి. మన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికిగాను, నాకు సాధ్యమైనంతవరకు, ఉన్న అవకాశాలన్నీ వినియోగించుకుంటాను.

ఆహ్వాన సంఘాధ్యక్షులైన శ్రీ అనంత బుచ్చన్నగారు మరియు ఆహ్వానసంఘ సభ్యులూ ఈ పర్పాట్లన్నీ చేశారు. అందుకు నేను వారందరికీ కృతజ్ఞుణ్ణి. మన అభివృద్ధికిగాను పనిచేయడానికి మనకు శక్తిసామర్థ్యాలు ప్రసాదించాలి అని భగవంతుని ప్రార్థించాల్సి ఉంది.

నాకంటేముందరి అధ్యక్షులు శ్రీ బీరం రంగరావు మరియు కార్యవర్గ సభ్యులు చాలపనిచేసి నా సోదరుల సేవచేయడానికి దీనిని నాకు అప్పగించారు.

ఈ సమావేశానికివచ్చి, మన చర్చలను శ్రద్ధగావిన్న వారందరికీ నేను కృతజ్ఞతలు సమర్పిస్తున్నాను.

—: జై హింద్ :—

ఇంతకు పూర్వం అంగీకరించబడిన తీర్మానములనే పునరుద్ఘాటిస్తు మళ్ళీ తీర్మానించడమైనది.

—o—

# అఖిలభారత మున్నూర్‌వార్ మహాసభలు

ప్రథమ మహాసభ బొంబాయిలో 1939 సంవత్సరమున శ్రీ రాజ రత్న బాగన్న బాలాజిరౌతాల్ M. I. E. E., M. E. E. అధ్యక్షతన జరిగినది - ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారిచే ప్రారంభోత్సవము చేయబడినది.



అఖిలభారత ప్రథమ తెలుగు మున్నూరు వార్ మహాసభ దృశ్యం
(బొంబాయిలో జరిగినది)

రెండవ మహాసభ నాగపూరులో 1941 లో జరిగినది. దీనికి గూడ వీరే అధ్యక్షులు. ప్రారంభోత్సవము చేసినది శ్రీ హనుమంతరావు నాగపూర్ హైకోర్టు చీఫ్ జస్టిస్. 1946 లో పూనాలో స్థాయిసంఘము సమావేశమైనది. ఈ సభలోనే మున్నూరువారు పేరు తెలుగు మున్నూరుకాపుగా మార్చబడినది.

ఈ మూడు సమావేశములకు హైదరాబాదునుండి పలువురు ప్రతినిధులుగా వెళ్ళియుండిరి.

# అఖిల భారత తెలుగు మున్నూరు కాపు స్థాయి సంఘం పూనా

## ఉపోద్ఘాతము

అఖిలభారత తెలుగు మున్నూరువారి మహాసభకు హైద్రాబాదు పక్షమున 1 శ్రీయుతులు మిట్టా లక్ష్మీనరసయ్యా, 2 పెద్ది నరసయ్యగార్లు స్థాయిసంఘ సభ్యులుగా నుండిరి. తృతీయ మహాసభను హైద్రాబాదుకు ఆహ్వానించబడిన తరువాత పూనాలో జరిగిన స్థాయి సంఘ సమావేశమునకు పూర్వము తమ సభ్యత్వమునకు రాజీనామాను బెట్టి వీరిరువురును పూనాసభలో పాల్గొనలేదు. స్థాయి సంఘమువారు రాజీనామాల నుపసంహరించుకొనవలెనని కోరిరి. అందు ముఖ్యముగా మహాసభాధ్యక్షులగు శ్రీయుత రాజరత్న బాగన్న బాలాజీ రవుతల్‌గారు భేదాభిప్రాయములను తొలగించుటకు ప్రయత్నించిరి. కాని తుట్టతుదకు రాజీనామాలను అంగీకరించవలసినదనియే పట్టుదల గనబరచుటచే వారిస్థానే ఇతరులను నియోగించుట తప్పనిదయ్యెను. అధ్యక్షులు ౨౬-౧-౧౯౪౨ నాటి లేఖలో వివాదగ్రస్తమగు నామకరణ విషయమున మున్నూరు కాపుకు బదులు, కాపు అని యుండవలెననెడి ప్రతిపక్షుల వాదనను గురించి ఈవిధముగా శ్రీయుతులు మిట్టా లక్ష్మీనరసయ్యా పెద్ది నరసయ్యగార్లను సంబోధించిరి.

తాము ౧౦-౨-౪౨ నాడు వ్రాసిన లేఖ చేరినది. మిక్కిలి అవసరమైన సమయమున తమ సహాయ నిరాకరణము నిరుత్సాహముగా నున్నది. తృతీయ మహాసభ మీ ప్రాంతమున జరుగునప్పుడు మీవంటినాయకులు కృషిసలిపి మహాసభను జయప్రదముగా జేయుదురని ఆశించుట సహజము. గత మహాసభలో మీ ఆలోచనలాభము మీరు సభలలో పాల్గొనుట వలన గలిగినది. మహాసభచర్యలందు మీరు ప్రముఖులై యుండి పాల్గొనియుంటిరి. రాబోవు మహాసభలోగూడ మీ సహాయమును బడయకుండ నుండజాలము. వ్యయప్రయాసల కోర్చి సాంవత్సరిక సమావేశములకు మీరు వచ్చుచుండుట మేము నిర్లక్ష్యముగా చూచుటలేదు. కనుకనే మీ ప్రాంతమున జరుగనున్న సభలోనే మీరు యథాప్రకా

రము త్యాగము సానుకూలమును గలిగియుందురని ఆశించుట తప్పని సరియైయున్నది. స్థానిక ప్రముఖులగు తమబోటివారు మహాసభ కార్యముల నుండి విరమించుకొనుటవలన సాదర భావము లోపించును.

నేను మీ లేఖలోని యంశములను విశాల హృదయముతో జదివి అర్థము చేసికొనుటకు యత్నించితిని. చాలావరకు మీ యాక్షేపణలు విషయములను సరిగా అవగాహన చేసికొనకుండు పునాదిపైన నాధారపడినవనియే నేను భావించుచున్నాను. నేను తెలిసికొనగలిగినంతవర కవి ఈ ఈదిగువ నుదహరింపబడుచున్నవి:-

౧ రెడ్లు, వెలమలు, కమ్మవారిని వేరుపరచినచో మన సంఘము మున్నూరుకాపు పేర వ్యవహరింపబడుచున్నది. గనుక కాపు సంఘమునకు జెందిన ఇతరులు గూడ దీనిలో చేరవచ్చును.

౨ వీరిలో అంతర్వివాహములు, భోజనాది సంబంధములు గలవు.

౩ మున్నూరుకాపువారి సంఖ్య రెండులక్షలు; ఇతరులను కలిపినచో నీసంఖ్య ౭౮ లక్షలు.

ఇదమిద్ధమను సిద్ధాంతీకరణ భావమును వెల్లడించుచున్నానని తాము తలంపక యనుజ్ఞ నిచ్చినచో నీదిగువ ప్రశ్నలను తమరి నడుగ నుద్దేశించుచున్నాను.

౧ ఇతర సంఘములవారు వివిధ కులనామములతో వేర్వేరు సమూహములుగా నేర్పడి మున్నూరుకాపు నామమును వదలిన తరువాత వారినిమిత్తము మున్నూరుకాపు సంఘమువారు తమవ్యక్తిత్వము నేల వదలుకొనవలెను?

౨ అంతర్వివాహములు, భోజనాదికములు వ్యక్తిగతమైన సానుకూలము సాంఘిక సామీప్యమును, సమభావమునే సూచించును గాని ఒకసమూహముయొక్క ఏకకులనామముతో సంబంధ హేతువు కాజాలదు. తోటబలిజ, గాజులబలిజ సంఘములు కాపు తెగకు చెందినవై మున్నూరు శాఖకే సంబంధించి యుండినట్లయిన పూర్వో

త్పత్తికి సంబంధించిన మున్నూరు నామముతో నేల వ్యవహరింప గూడదు ?

౩. పై సంఘమువారి జనాభా 78 లక్షలైన ఇతరులను తమతో జేర్చుటకెట్లు? ఏ విధమున సమ్మిళితము జేయుటకు ప్రయత్నించిరి ?

పూనా సమావేశమున జేయబడిన తీర్మానము అక్రమమైన దనియు చట్టవిరుద్ధమైనదనియు తాము ఆక్షేపించియున్నారు. ఇయ్యది గూడ విషయమును సరిగా అవగాహన చేసికొనక పోవుటచేత సంభవించినది. దీనికి సరియైన సమాధానము చెప్పనిండు.

నాగపురము మహాసభయొక్క రెండవ తీర్మానము ప్రకారము మున్నూరుకాపు ఉత్పత్తిని గురించిన శ్రీయుత పెంటయ్యగారి నివేదిక మన సంఘముయొక్క కేంద్రములకన్నింటికిని బంపి, వారి అభిప్రాయములను సంగ్రహించి మా కార్యాలయమునకు అందజేయవలెనని యున్నది. విషయమునకు సంబంధించిన ఇతర వివరములను ప్రోగుచేసి స్థాయిసంఘ సమావేశములో చర్చించుటకై పంపుటకు శ్రీ పెంటయ్యగారి కధికార మీయబడినది. కేంద్రములకు, స్థాయిసంఘ సభ్యులకు పై విధముగా కార్యదర్శులు లేఖల నందజేసిరి. తీర్మానముయొక్క తుదిభాగములో సూచించబడిన ప్రకారము మున్నూరుకాపు పక్షమున అభిప్రాయములు వచ్చినవి. శ్రీ పెంటయ్యగారు గూడ మున్నూరు సంఘోత్పత్తిని గురించియు, కాపు సంఘమునకు నద్దానికిగల స్థానమును వివరించిరి. ఈ విధముగా నాగ పురము మహాసభ తీర్మానము (౨) ననుసరించియే పూనా సమావేశమున తుదినిశ్చయము జరిగినది. కొంత మంది సభ్యులు తెలుగుప్రాంతములకు వెళ్ళి ఈవిషయమున భోగట్టా చేసెదమని స్వయముగా చెప్పిన మాట వాస్తవమే. అయితే ఈ సూచన ఐచ్ఛికమే గాని తీర్మానములో నొక భాగముగా నుండలేదు.

బొంబాయి మహాసభ తీర్మానము ౩ ను మీరవలోకించినచో కాపు నామముతో మార్పు చేయబడవచ్చునన్న సంగతియే లేదని తమకు విశదమగును. మున్నూరు కులము చరిత్రాత్మకమైన సంఘోత్పత్తికి సంబంధించినదైయున్నది. మున్నూరు, మున్నూరువారు

మున్నూరుకాపెవారు, మున్నూరు కాపుయను నాలుగు పేర్లుమాత్రమే సూచింపబడియుండెను. మున్నూరు వారుకు బదులుగా మున్నూరు కాపు యని యుండవలెనన్న మార్పును గురించి నాగపూరు మహాసభలో ప్రతిపాదించబడెను. ఇష్టాగోష్ఠిగాను చట్టబద్ధముగాను చర్చలు జరిగినవి. మున్నూరువారని యుంచుటయా లేక మున్నూరుకాపు అను సవరణ అంగీకరించుటయా యనునంతవరకే చర్చనీయాంశమేర్పడియుండెను. మనసంఘముయొక్క ప్రత్యేక వ్యక్తిత్వమున్నూరుపదప్రయోగమును సూచించును. ప్రస్తుత సంఘ పరిస్థితిని బట్టి "మున్నూరు"నుపూర్తిగ త్రోల గించి పరిశోధక మండలివారి పరిశోధనల ప్రకారము పదునాలుగు శాఖలకు జెందిన "కాపు" నామమును ధరించుటయా? యనునదే ముఖ్యమైన ప్రశ్న. పూనా సమావేశమునందు వివిధ కేంద్రములవారి యభిప్రాయానుసారము మున్నూరుకాపు అని వ్యవహరించవలెననెడి మార్పు అంగీకరించబడినది. బొంబాయిలోని ప్రథమ మహాసభ యొక్క కరపత్రమున ప్రకటితములైన ఉద్దేశములతోను ఆశయముల తోను సంపూర్ణమైన ఐక్య భావమును ఈ తీర్మానమున గలిగియున్నది. నాగపురము మహాసభలో నా అధ్యక్షోపన్యాసమునందు నేనీ విషయమును సమగ్రముగ వివరించియున్నాను. ఏ ప్రాంతములో నుండువారైనను, ఏ భూభాగమునకు జెందినవారైనను సరే మున్నూరు సంఘమునకు జెందిన అన్ని శాఖలవారితో చేతులు కలుపుటకు ఈ మహాసభ సంసిద్ధము-నున్నది. శ్రీ పెంటయ్యగారి నివేదికాంశములతో గాని, స్థాయిసంఘతీర్మా-ముతోగాని మీరు వ్యతిరేక భావముగలవారై యుండి వాదించదలచినచో అట్టి ప్రతిసభ్యునకుగానిసమూహామునకుగానిహైద్రాబాదులో జరుగనున్న మహాసభలో పునరాలోచన నిమిత్తము ఈ విషయమును ప్రవేశపెట్టు నధికారముండును. యథోచితమైన వాతావరణము గలిగి మున్నూరు సంఘమునకు ఉత్పత్తి స్థానమైన హైద్రాబాదులోనే ఈ యంశమామూలాగ్రముగ చర్చించబడవచ్చునుగదా! వివిధ ప్రాంతములందు సంచారముచేసి మన సంఘోత్పత్తిని గురించి పరిశోధించు విషయమున స్థాయిసంఘ సభ్యులెక్కువ పట్టుదలతో శ్రద్ధతో కృషి సలుప లేదన్న సంగతిని నేను ఒప్పుకొనుచున్నాను. నిజాము రాష్ట్రము, ఆంధ్ర దేశము మన సంఘమున కుత్పత్తిస్థానమగుటచే స్వాభావికముగా ఈ విషయమును గురించి ప్రకాశవంతమైన జ్యోతి

అచ్చటినుండియే రాగలదని ఆశించితిమి. దూర ప్రాంతములలోనుండు వారు సరియైన సాధన సంపత్తిని బడసి ఆశాజనకములైన ఫలితములను దేల్చజాలరు. అట్లూహించుటయు సగాదు. వివిధ కేంద్రములలో నుండు సభ్యులకు పూర్తిగా నాలోచించుటకు స్థాయి సంఘముచే ౧౧ మాసముల గడవీయబడెను. అటు తరువాత సాభిప్రాయముగా తేల్చ బడిన తుది తీర్మానము తొందరపాటుతో చేయబడినదనుట కెంత మాత్రము వీలులేదు.

౧౦. స్థాయిసంఘముయొక్క కార్యక్రమమున మహాసభ యొక్క పేరును మార్చు విషయమునకు ముందుకు దెచ్చుటయు అద్దానిని ఏడవ వరుస సంఖ్యతోబాటు చర్చించకుండుటయును గురించి, తాము చేసిన ఆక్షేపణ సక్రమముగానే యున్నది. తామీ లోపమును దెలియపరచినందుకు కృతజ్ఞుడను. వరుస సంఖ్య ౫, ౭ రెండింటి ననుసరించియే తుదినిశ్చయము జరిగినదని తమకు రూఢిగా దెలుప వేడుచున్నాను. నాకు జ్ఞాపకమున్నంతవరకు శ్రీయుత వెంటయ్యగారు పరిశోధక మండలి నివేదికలోని అంశములన్ని విషయ ములనకు సంబంధించినంతవరకు వివరించుటకు గోరబడిరి. ఇది సంఘో త్పత్తికి సంబంధించినవి. ఆచరణయోగ్యమగునంతవరకు 5, 7 విష యములేక ముఖముగనే, ఒకే పర్యాయము ఆలోచించబడినవి. శ్రీ వెంటయ్యగారు తమ నివేదికలోని అంశములను చదివెదమనుటచే తరు వాత జదువుటకు కోరబడిరి. పూనా సభాచర్యలు గ్రంధస్థము చేయ బడిన విధ మొకింత పొరపాటున కవకాశము గల్పించుచున్నది.

౧౧. మున్నూరు, మున్నూరు కాపు అను పేర్లను గురించి మాత్రమే పూనా సభా చర్యలలో చర్చించుటకు సంకుచిత విధాన మవలంబింపబడినదని తాము సూచించుట గూడ విషయమును, నా మూలాగ్రముగ నవగాహన చేసికొనక పోవుటవలన నేర్పబడినది. నాగపురములో మహాసభ పేరును మార్చబడవలెనన్న చర్చ నీ రెండు పేర్లకు మాత్రమే సంబంధించియుండెను. మున్నూరను పదమును పూర్తిగా తొలగించి సర్వసామాన్యమైన "కాపు" పేరు బెట్టవలె నన్న విషయమే అప్పుడు ప్రస్తావింపబడలేదు. పేరు విషయము హైద్రాబాదు కేంద్రమువారే మున్నూరుతో బాటు కాపు పద

మును చేర్చవలెనని గోరియుండిరని సుస్థిరమైన నా మనోభిప్రాయమై యున్నది. పూనా సమావేశమున చర్చకు వచ్చుటకు పూర్వము హైద్రాబాదులో నిట్టి భేదాభిప్రాయమున్నదని నిజముగా నాకు దెలియదు. ఈ పరిస్థితులలో "కాపు మహాసభ" యను మూడవ పేరునకు ప్రకటితమైన కార్యక్రమ పట్టికలో తావు లేకపోవుట సహజమేగదా!

౧౨. కాపు సంఘముయొక్క దృక్పథమున కవకాశమీయ బడలేదన్న ఆక్షేపణకు (౫వ ప్యారా) సమాధాన మీయవలసి యున్నది. పూనా సభ కరుదెంచిన సభాసదులందరును, ఇతర నాయకులును ఈ విషయమున అత్యంత శ్రద్ధ, అభిమానమును గనబరచిరే గాని తూష్ణీభావముతో రెండవ రకము సమస్యను నిర్లక్ష్యము చేయలేదు. శ్రీయుత జగన్నాయకులుగారును, హైద్రాబాదునుండి విచ్చేసి సభలో పాల్గొనిన ఇతర హైద్రాబాదు ప్రముఖులును కాపు సంఘమువారి దృక్పథమును వివరించిరి; భేదాభిప్రాయములను విశదపరచిరి. వారి విశాలమైన ఉదారభావ మెంతయో ప్రశంసనీయమై యొప్పారినదని తెలుపుటకు చాలా అవసరము. ఈ ప్రతిపాదన ఆమూలాగ్రముగ పరిశీలించబడినది. మీరు అప్పుడు ఆ సభలోనుండిన మన సంఘముయొక్క అభ్యుదయము కొరకు చేయబడిన తీర్మానముతో ఏకీభవించుటకై సిద్ధపడుటకు ప్రోత్సహింప బడియుందురు. అమూల్యమైన మీ సహాయము, ఆమోదమునకు కేవలము లాంఛనీయమైన ఆక్షేపణ నిమిత్తము అడ్డు రాజాలదు. మనయందరి యుద్దేశములు, ఆశయములు ఒకటే. ఏతత్కార్య సిద్ధికై మన మనుసరించు మార్గములు వేరై యుండవచ్చును. స్థాయి సంఘాధ్యక్షుని స్థానముననున్న నేను తమను రాజీనామాల నుపసంహరించు కొనవలసినదని, కోరుచు హైద్రాబాదు కీర్తిప్రతిష్ఠలను నిలుపుటకై రాబోవు మహాసభను జయప్రదముగ చేయుటలో సద్భావముతో తోడ్పడవలెనని కోరుచున్నాను.

౧౩. ఈ లేఖను ముగించుటకు పూర్వము కాపు సంఘముయొక్క విశాలమైన దృష్టి సమంజసమైనదని తెలుపుచున్నాను. కార్యారంభమును విశాలపరచుటకు పూర్వము మనము మన సంఘముయొక్క చరిత్రాత్మకంబైనట్టియు, సాంఘికమైనట్టియు పూర్వ సాంప్రదాయములను త్రోసివేసి తీవ్రమైన ఆందోళనకు తావొసగుటకు కలిగిన

సామాన్యమును మనవెంట నిడికొని, తీసికొనిపోవుట అత్యంత అవసరమై యున్నది. సాంప్రదాయములు వ్రేళ్లతో బిగిసియున్నవి. గనుక వానిని క్రమక్రమముగా వృద్ధి మార్గోన్ముఖమునకు త్రిప్పవలసి యున్నది. గాని తొందరగా పెకలించినచో మంచి ఫలితమున కవకాశము తక్కువయగును. మున్నూరుకాపు సంఘముయొక్క దృక్పథము పూర్వము నుండి వచ్చుచున్న కులనామమును విస్మరించి త్రోసివేసి సాంఘిక సాంప్రదాయములను నిర్మూలించగలిగినట్టిదై యున్నదన్న నమ్మకము నాకు లేదు. వివిధ ప్రాంతములందు వివిధ నామములతో వ్యవహరింపబడుచున్న మున్నూరు కాపుల నందరి నేకముగా చేయుటకై తాము చేయుచున్న కృషి ప్రశంసనీయమేగాని మాతృ సంస్థయొక్క మున్నూరు కాపుయను ప్రత్యేక నామమును మార్చుకొనుమని పలయడుగ వలెనో నాకు మీ ప్రతిపాదనయొక్క అంతరార్థము బోధపడుటలేదు. ప్రస్తుత పరిస్థితిలో ఇట్టి సాంఘిక పరివర్తనౌషధమును జనసామాన్యము జీర్ణించుకొనుటకు వేనుదీయునని శంకించుచున్నాను. సర్వజన సమ్మతిని బడయుటకు వేర్వేరు ప్రాంతములందున్న సంఘములన్ని ఏకమై మహాసభలో దీక్షగా బనిజేయు నుద్దేశముతో బాల్గొనుట అత్యంతావసరమై యున్నది. సామరస్యము, సహకారము, సహనము అను త్రిగుణాత్మకమైన లక్ష్యము అవసరమైన సాధనము. మీరు ఏయే వర్గముల వారిని సమ్మిళితము జేయ నుద్దేశించుచున్నారో వారి పక్షమున మీ కనుకూలమైన విషయములను సంసిద్ధతతో కృషి జరుపబడుచున్నదా!

మనలోనుండు స్వల్పభేదములను ప్రాంతీయ కట్టుబాట్లను తొలగించి మన సంఘముయొక్క సర్వతోముఖాభివృద్ధికి కృషిసలుపుట కనుకూలమైన విధానము నేర్పరిచిరి. సాంఘిక సమస్యలను చర్చించు టనుకూలమైన కార్యరంగమును మన మహాసభచే కల్పింపబడినది. కాలమాన పరిస్థితులనుబట్టి మనలో మనము సర్దుబాటు చేసికొనుచు సర్వజన సమ్మతితో భేదములను తొలగించి, సాంఘిక పునర్నిర్మాణమునకు గడంగుట మేలు. హైద్రాబాదులోని కాపుసంఘమువారి సహాయము లభించుననియే మేమాశించుచున్నాము. కాపు సంఘముయొక్క అధ్యక్షులుగానున్న మిమ్మును, స్థాయిసంఘ సభ్యత్వముయొక్క రాజీనామా నుపసంహరించుకొనుడని వేడుచున్నాను,

69 అ. కామాటిపురం రెండవవీధి
బొంబాయి 28 మార్చి 1942.

అస్మత్ప్రియమిత్రులగు మిత్తా లక్ష్మీనరసయ్యగార్కి-

"కాపు మహాసభ" పేర తాము మరియొక్క ఉద్యమమును లేవదీయుచున్నారని తెలిసి నాకాశ్చర్యము గలిగినది. మున్నూరువారి మహాసభయొక్క స్థాయిసంఘ సమావేశమున "తెలుగు మున్నూరు కాపు కాన్ఫరెన్సు" అను పేరును "కాపు మహాసభ"గా మార్చవలెననెడి ప్రతిపాదనను తామే ప్రవేశపెట్టినట్లు నాకు జ్ఞాపకమున్నది. అత్యధిక సంఖ్యాక సమ్మతులచే నా ప్రతిపాదన వీగిపోయినది. చాలినంత ప్రచారము చేయబడని కారణముగానోపు స్థాయిసంఘ సభ్యుల ఆమోదమును బడయజాలక పోయెననుట స్పష్టము. ఏ యుద్యమమునకైనను పేరు నామమాత్రమే గాని సంస్థయొక్క ముఖ్యోద్దేశము ఫలించుటకును ఉద్యమ వ్యాప్తికిని పేరు అంత ముఖ్యమైనది గాదనుట ఒప్పుకొనక తప్పదు. ప్రజామోదము వలన ఉద్యమమునకు బలము చేకూరును. క్రమేణ బాధ్యతాయుతమైనదిగా నొనర్చుట కదియొక కారణమగును. తెలుగు మున్నూరు సంఘమునందు విడదీయునట్టి ఫలితమును గలిగించునట్టి ఉద్యమమును తాము లేవదీయుచున్నారను విషయము విచారమును గలిగించినది.

ఈ సందర్భమున కొన్ని విషయములవైపు తమ దృష్టిని మరల్చి వానిని తాము ఆమూలాగ్రముగా నాలోచించెదరని ఆశించుచున్నాను. ఈ ప్రతిపాదన స్థాయిసంఘము వారిచే తర్కింపబడినది. మీ దురదృష్ట వశమున వీగిపోయినది. స్థాయిసంఘ తీర్మానము తరువాత మహాసభలో ప్రవేశపెట్టుట కనుమతి నొసంగ బడునని అధ్యక్షులు వాగ్దాన మొనర్చిరి. చట్టబద్ధముగానెంతవరకు వీలగునో అంతయు చేయబడుటయే గాక ముందుచేయుటకు గూడా వీలుకల్పింపబడెను. మున్నూరు సంఘాభ్యుదయమునకై కాపు మహాసభ పేర ఉద్యమవ్యాప్తికి కృషిసలుపు అవకాశము ఇంకను తమకు గలదు. ప్రజాభిప్రాయమును తాము సుముఖముగా చేయవచ్చును. నేనేగాదు సంఘ శ్రేయోభిలాషులగు వారందరును వ్యతిరేకులుగా నుండరని నాకు నమ్మకముగలదు. తాము తలపె

ట్రీక ఉద్యమమునకు ఇంకను బలము చేకూర్చు టవసరమని ఒప్పుకొనక తప్పదు. హైద్రాబాదులో సమావేశముగా నున్న మహాసభలో తామీ విషయమును ప్రవేశపెట్టవలెనని సూచించుచున్నాను. ప్రజామోదమైన శిష్టాచారము ననుసరించిన సూత్రముతో నీపద్ధతి ఏకీభవించి యుండును. మన సంఘమును భిన్నమైన వేర్వేరు ఉద్యమములతో చీల్చి విడదీయుట క్షేమకరముగాదని తహతహపడుచున్న హృదయముల నుండి వెలువడు నీయభిప్రాయము. మున్నూరు మహాసభచే నింతవరకు చేయబడిన అభివృద్ధి ప్రయత్నములకు భంగము కలుగునన్న భయమును వ్యక్తీకరించుచున్నది. న్యాయవేత్తలును, యుక్తియుక్త వివేచనా సంపన్నులునగు తాము ఈ విషయమును సూక్ష్మదృష్టితో పరిశీలించి, సంఘమునకు నష్టకారకమైన ఉద్యమమునుండి విరమించెదరని హృదయపూర్వకముగ వేడుకొనుచున్నాను. ఈ విషయము కృషిసలుప నుద్దేశించిన తదితరులను గూడ తాము తమ ప్రయత్నముచే విరమించునట్లు చేసెదరుగాక, ఈ సంఘముయొక్క భావ్యాభివృద్ధికి మనమందరము ఏకీభావముతో కృషి సలుటకు నిర్మల హృదయముతో నడుముకట్టి ముందంజవేయుదముగాక !!.

ఇట్లు,

**డాక్టర్ వి. ఆర్. భూసరత్**

ఆల్ ఇండియా తెలుగు మున్నూరు కాపు సంఘ సెక్రటరీ.



అఖిలభారత మున్నూరుకాపు తృతీయ మహాసభాధ్యక్షులు డా॥ భూసరతీ కి. శే. ఎ. ఆర్. బాబయ్య శ్రీ కె. రంగారావు (అడ్వకేట్) గార్లను ఈ దృశ్యంలో చూడనగును.

## అఖిల భారత తెలుగు మున్నూర్ వార్ మహాసభలు

మూడవ మహాసభ 28-ఏప్రిల్ 1946 లో హైదరాబాదులో డాక్టరు విఠల్‌రావు భూసరత్ M. B. B. S., M. R. S. (లండన్) అధ్యక్షతన జరిగినది. ఆ తర్వాత సభ ప్రారంభింపబడెను. దీనికి ఆహ్వాన సంఘాధ్యక్షులుగా శ్రీ గోళ్ళాల పెంటయ్యగారు ఉండిరి.

### అధ్యక్షోపన్యాస సారాంశము :

"ఈ మహాసభ నిజాంరాష్ట్ర రాజధానియగు హైదరాబాదులో జరుగుచు, మన కులస్థుల పూర్వచరిత్రను మన స్మృతిపథమునకు దెచ్చుచుండుటచే ఇది మనకు పుణ్యక్షేత్రము. ఛత్రపతి శివాజీతండ్రి ఈ ప్రాంతపువారు. భవానీమాత ఈ ప్రాంతములోని తుల్జాపూరునందు నివసించుచున్నది. ఈ సభలో మహాసభకు నామకరణము చేయబడుచున్నది. ఇతర కార్యక్రమములో కాపుసంఘమను పేరుతో మనలోనుండి పనిచేయుచున్న సోదరులతో మన మెట్టి తత్వముతో వర్తింపవలయునో తీర్మానించ వలసియున్నది. అఖిల మహారాష్ట్ర ప్రాంతమున నుండు కులసోదరుల ప్రాముఖ్యత ఎట్లుగొప్పదో దానిని మదింపు చేయవలయును. ఈ కారణముల దృష్ట్యా ఈ మహాసభకు ప్రత్యేక ప్రాముఖ్యతకలదు. మన కులసోదరులలోని అనైక్యతను, భేదభావము, పోటీ, ద్వేషములను సమన్వయ పరచవలయును. ఐతే, కర్తవ్య నిర్వహణమందు మనము మన ఆత్మశక్తిని పరిశీలించు కొనవలయును.

"విద్యావిషయమున మనము ఎంతో వెనుకబడియున్నాము. మహారాష్ట్ర ప్రాంతమున నాలుగైదు విద్యానిధులు కలవు. బీద విద్యార్థులకు విద్యావేతనము లిచ్చుచున్నారు. ఎక్కువ నాగరికులతో పోటీజేయుటకు మనవద్ద తగినంత ద్రవ్యసహాయముకలదు. కాని మనలో విద్యావ్యాప్తి సంతృప్తికరముగాలేదు. దీనికి కారణము మనలో ధనవంతులు ఎక్కువగా నుండకుండుటచే మో! బొంబాయిలో బీదలకొరకు విద్యానిధులు ఎట్లు స్థాపింపబడి యున్నవో, నాగపురము, హైదరాబాదులోగూడ విద్యానిధులు స్థాపింపబడినచో బాలబాలికలకు మాధ్యమిక, ఉన్నతవిద్య నార్జించుటలో అనుకూలము కలుగును, పూనాలో

నలభై యాభై సంవత్సరములు పూర్వము నెలకొల్పబడిన విద్యానిధి వృద్ధిగా లేదు కాని ఒక సార్వజనీన పఠనమందిరము సాగుచున్నది. బొంబైలో 1864నుండి విద్యాసంస్థలు, విద్యానిధులు, ప్రారంభమైనవి. 1905 లో హైదరాబాదునందు కలిగిన కరువు సందర్భమున పెద్దనిధి సమకూర్చబడినది. బాధితులకు సహాయముచేయగా మిగిలిన ధనముతో 1910 లో రెండవ విద్యానిధి ఏర్పడినది. ఇప్పటికిని చాలమంది లాభము పొందుచున్నారు. ఇట్లుండియు ఉన్నత విద్యాభూషితుల సంఖ్య అతి స్వల్పమగుట సిగ్గుచేటు.

"మనము శారీరకముగా దుర్బలమగుచున్నాము. పాఠశాలలలో ప్రస్తుతము నేర్పుచున్న శారీరక విద్య చాలదు. శాస్త్రీయపద్ధతిని వ్యాయామమెట్లు చేయవలయునో నిపుణులచే ప్రదర్శన పూర్వకముగా బోధించవలయును. ఇట్టి ముఖ్యకార్యమును మూలకుత్రోసి తక్కిన దేశోద్ధారక కార్యము లెన్ని చేసినను వ్యర్థములే.

"సైనికశిక్షణములో మన మింకను క్రిందిమెట్టు పైననే యున్నాము. మనదేశపు ప్రతిపౌరుడు సైనికుడై యుండవలయును. సైనిక శిక్షణముకొరకు ప్రభుత్వముపై ఆధారపడక వ్యాయామ శాలలద్వారా ఈపని ఆరంభించవచ్చును. పురుషులగువారు సీవిల్ ఉద్యోగములకుబోక, సైనికవృత్తిలో చేరవలయును. ఐతే, దీనికి విద్యా ప్రచారమవసరము. వ్రాయను, చదువను వచ్చినంతమాత్రమున ఈపని నెరవేరదు. ఉన్నత విద్యనేర్పి సమర్థులుగ సిద్ధపరచ వలయును.

"దేశాభివృద్ధి పారిశ్రామికాభివృద్ధిపై ఆధారపడియుండును. మన కులస్థులు వృత్తినిబట్టి వ్యవసాయకులైనను స్వభావము బట్టి యోధు లనునది మున్నూరుకాపు శబ్దము సూచించుచున్నది. మున్నూరుకాపు అనగా మూడునూర్ల గ్రామములను రక్షించు సామర్థ్యము కలవాడని భావము.

కాని నేడు ఈస్వభావ ప్రదర్శనమునకు మన దేశములో కార్య క్షేత్రము లేదు. మన పరిశ్రమల ద్వారా ఆర్థికముగా అభివృద్ధి జెందవలె నన్న కర్మాగారములవసరము. ఇది పరస్పర సహకారము వలన సాధ్య

మగును. కర్మాగారముల వలన నిరుద్యోగ సమస్య చాలవరకు పరిష్కార మగును. స్వదేశీ వస్తువులు తయారగును; ముడివస్తువుల వలన దేశములో పై వస్తువులు తయారగుటచే మన ద్రవ్యము మన దేశమందే నిలచియుండును. మన పూర్వపు వృత్తి గృహ పరిశ్రమలు. ఇప్పుడీ వృత్తిని ఇతరులు మనుండి తీసికొనినందున మనము మరేదైన లాభదాయకమగు ఇతర వృత్తుల అవలంబించవలసి వచ్చినది. రంగులు తయారుచేయుట, వనమూలికలతో ఆయుర్వేదౌషధములు చేయుట మున్నగు అనేక పనులు మనము చేయవచ్చును.

"సరియైన విద్య లేమిచే మనలో బాల్యవివాహములింకను ప్రబలియున్నవి. వైద్యశాస్త్రానుసారము స్త్రీయొక్క గర్భాశయపు పూర్ణవికాసము 16 సంవత్సరముల తరువాతనే జరుగును. కావున బాలికల వివాహములు 16 సంవత్సరములు కానిదే చేయగూడదు. కానున్న దంపతులు తరుణ వయస్కులై, విద్యాగంధమబ్బినవారైనచో, వరశుల్కములు, ఆడంబరములు, మూఢాచారములు తమంతట అవియే నిలిచిపోవును. విద్యావంతుడైన యువకుడెవడైన తన మాతాపితల నుల్లంఘించినను అతడు క్షంతవ్యుడే.

"పల్లెటూళ్ళ విద్యార్థుల నివాసము, భోజనాది సౌకర్యములకు వసతి గృహముల నేర్పరచినచో కుల సోదరులకు విద్యావిదానము చేసినవారమగుదుము. నాగపూరు మహాసభలో హైదరాబాదునందు వసతి గృహము నెలకొల్పుటకు కొంత ద్రవ్యము సమకూర్చబడియుండెను. దీని నిర్వహణకు ధనికుల చేయూత అవసరము.

"సంఘ దురాచారములలో మద్యపాన వ్యసనము భయంకరమైనది. బొంబాయి కాంగ్రెసు ప్రభుత్వము మద్యనిషేధోద్యమము జయప్రదముగా సాగించినది. ఒక చోట సాధ్యమైనది వేరొకచోట అసాధ్యము కాజాలదు.

"బహుభార్యాత్వము ఆపివేసినచో వారసత్వపు చిక్కులు బయలుదేరవు. ఈ విషయమున బరోడా ప్రభుత్వము వారి శాసనము అనుకరణీయము. స్త్రీల వారసత్వము, వారి తదితర హక్కుల గురించి గూడ మనము జాగ్రత్తపడవలయును.

నేను చెప్పునదేమనగా మనము కాలానుసారము మనల చక్కదిద్దుకొనుచు, సుగుణముల పెంపొందించుకొందుము గాక !

# అఖిలభారత మున్నూరుకాపు తృతీయ మహాసభ

## కార్యవర్గకమిటీ సభ్యులు

మహాసభానంతరం డా॥ ఖూసరత్ ఎం.బి. బి.యస్. అధ్యక్ష పదవి నుండి విరమించుకున్న తర్వాత, శ్రీ బొజ్జం నర్సింహులుగారు ఆధిపత్యమున ఈ క్రింది కార్యవర్గ సభ్యులు ఎన్నుకోబడినారు.

1. శ్రీయుత రామచంద్రరావు. అడ్వకేట్ గులుర్గ్భ
2. శ్రీ డా॥ కనుకసుందర నాందేడు
3. కొండిమ్మాళ భూమయ, హైకోర్టు సి. శిల్లా
4. జి. నూకయ్య ఫోటోగ్రాఫర్ సికింద్రాబాద్
5. హకీం. రమేశ్ చంద్ర నిజామాబాదు.
6. అల్లాడి నాగయ్య జివలర్ సికింద్రాబాదు
7. నర్సప్ప తిమ్మప్ప గంజ్ రాయచూరు
8. వెంకట్ రాజయ్య, అలియాబాదు.
9. సేరి జగన్ నాయకులు, హైద్రాబాద్
10. అంబడి నారాయణ, హనుమకొండ
11. ఎట్టం సత్యనారాయణ క్లాత్ మర్చంటు సుల్తాన్ బజార్.
12. A. R. బాబయ్య, B. A. రాంకోటి హైద్రాబాదు.
13. గంగిశెట్టి బాబయ్య, (హైద్రాబాదు జిల్లా)

తదితర కార్య వర్గ సభ్యులను అధ్యక్షులు నియమించుటకు అధికారం యివ్వనైనది.

నిజాం రాష్ట్ర

# మున్నూరుకాపు నవయువక మండలి

హైదరాబాదు

# నియమావళి

1. పేరు—ఈ మండలికి మున్నూరుకాపు నవయువక మండలి అని పేరు.

2. ఉద్దేశము—మున్నూరుకాపు నవయువకుల సాంఘిక ఆర్థిక విద్యాభివృద్ధికొరకు కృషి సలుపుట, పరస్పర సహానుభూతిని సంపాదించుట, శుభ, అశుభ కార్యములలో తోడ్పడుట నిజాంరాష్ట్ర ప్రథమ మున్నూరు కాపు మహాసభ తీర్మానములను అమలులోనికి దెచ్చుట, మండలియొక్క ముఖ్యోద్దేశములు.

3 మండలి సభా సదులు—మున్నూరు కాపు నవయువకులు మాత్రమే ఈ సంఘమునకు సభ్యులుగా నుండదగుదురు.

(అ) యావజ్జీవన సభ్యులు:—సంవత్సరమునకు ఇరువది అయిదు రూపాయలకు తక్కువకాని మొత్తము నిచ్చువారు యావజ్జీవ సభ్యు లనబడుదురు.

(ఆ) పోషకులు:—సంవత్సరమునకు పది రూపాయలకు తక్కువకాని మొత్తము నిచ్చువారు పోషకులుగా నుందురు.

(ఇ) సహాయకులు:—అయిదు రూపాయలకు తక్కువకాని మొత్తమునిచ్చువారు సహాయకులుగా నుందురు.

(ఈ) అభిమానులు:—సంవత్సరమున కొక రూపాయి నొసగువారు అభిమానులు.

4. సభ్యులు:—ప్రతినెలకు ఒక్కఅణా యిచ్చువారు సభ్యులుగా నెంచ బడుదురు. ప్రతి చందాదారుడును ప్రతి చాంద్రమాసారంభము నందే శుక్లపంచమిలోగ చందా చెల్లించవలెను.

5. సభ్యుల హక్కులు—సాధారణ సభలన్నిటిలో సమ్మతి నిచ్చుట, సభాసదులు కాగోరు వారికి సమ్మతినిచ్చుట, కార్యనిర్వాహక సభవారు ఏర్పరుచు విధులకులోబడి నడచుట.

తాము బాకీయున్న మొత్తమును వ్రాతమూలకముగా కార్యదర్శిగారికి తెలిపి, ఏ సభాసదుడేనియు తనసభాసభ్యత్వమును మానుకొన వచ్చును. అతడు తిరిగి ప్రవేశించ దలచిన పాతబాకీ చందాయే గాక ఆనెల చందా ముందుగా నిచ్చి ప్రవేశించనగును.

6. వ్యవస్థ—సభాసదు లందరు కలిసి సమావేశమగు సభ మహాసభ యనబడును. ఈ మహాజన సభవారికి మండలి విషయములందు సంపూర్ణ స్వాతంత్ర్యము కలదు. నియమిత సంఖ్య ప్రకారము సభాసదులు రాక పోవుటచేత నిల్పివేయబడిన మహాజనసభ రెండవసారి సమావేశమైనప్పుడు సభాసదుల సంఖ్యను గురించిన నియమమును పాటింపకయే కార్యమును జరుపవచ్చును.

7. ఎన్నికలు, ప్రతి సంవత్సరారంభమునందు నూతన ఎన్నికల నిమిత్తము మహాసభను సమావేశపరచి మండలికి ఈ క్రిందివారిని ఎన్నుకొనవలెను.

8. అధ్యక్షుడు, 2 ఉపాధ్యక్షుడు, 3 కార్యదర్శి 4 సహాయకార్యదర్శి, 5 కోశాధ్యక్షుడు, 6 ప్రతి మహల్లానుండి ఒక్కొక్కరికి తక్కువ కాకుండ పదిమంది కార్యనిర్వాహక సభాసదులు ఎన్నుకొనబడుదురు,

9. కారణమేమియు తెలుపక కార్యనిర్వాహక సభకు మూడు పర్యాయములు వరుసగారాని సభాసదుని తొలగించి వారి స్థలమున యితరుల నేర్పరచు స్వాతంత్ర్యము కార్యనిర్వాహకసభ వారికుండును.

8. కార్యనిర్వాహక సభలయందు, ఉద్యోగస్థులుగాక ఇతర సభ్యులలో మూడవవంతు, హాజరుండిననేగాని సభ జరుగజాలదు- ఈకారణమున ఆపివేయబడినసభ రెండవసారి సమావేశమైనప్పు డీనియమమును పాటింపకయే సభజరుపవచ్చును. కాని రెండవసారి సమావేశమగు తేదిసభ్యులకందరకు మూడురోజులు ముందుగా తెలుపబడవలెను.

9. సభ అవసరమైన ముగ్గురు కార్యనిర్వాహక సభ్యులు కార్యదర్శికి వ్రాతమూలమున తెలిపి కార్యదర్శి సమావేశపరచనిచో వారే సభను సమావేశపరచవచ్చును.

10. అధ్యక్షులు రానిసమయమున వుపాధ్యక్షులు సభాధ్యక్షత వహించెదరు. ఇద్దరురాని యెడల సభ్యులలో నొకరిని ఎన్నుకొనవచ్చును.

11. అత్యవసరముగా దోచినపక్షమున అధ్యక్షుడు కార్యనిర్వాహక సభను, తానే సమావేశపరచవచ్చును.

12. కార్యదర్శులు, మండలియొక్క కార్యనిర్వాహక సభానుమతిపై సమస్త వ్యవహారములను జరుపుచు మండలికి వుత్తరవాదులుగా నుందురు.

(అ) మండలియొక్క ప్రతిసభయందును చర్చింపబడువిషయము లన్నిటిని వ్రాసియుంచుట, ప్రతిమాసము ఆదాయ వ్యయముల లెక్కలను సమర్పించుట,

(ఆ) కార్యనిర్వాహక సభవారి సభవారి యుత్తరువుచొప్పున ధనము వ్యయముపరచుటకు ఆవశ్యకమైనప్పుడు కార్యనిర్వాహక సభవారి యుత్తరువును నిరీక్షించుచు అయిదురూపాయలకు మించ నిధనమును ఖర్చుచేసి రాబోవు సభయందు అంగీకారము పొందవలెను.

(ఇ) మండలియొక్క ప్రతిసభను సమావేశపరచుట,

) వసూలైన ధనము అయిదురూపాయల వరకు కార్యదర్శివద్ద నుండవచ్చును. అంతకుహెచ్చుగానుండు ధనము కోశాధిపతిగారు మండలిపేర బ్యాంకులో జమకట్టవలెను.

) కార్యదర్శిలేని సమయమున సహాయకార్యదర్శి మండలి పనులను చూడవలెను.

13 వివిధ విషయములు :

) ఈమండలిలో సభ్యులుగాజేరు యువకుల ప్రాయము కనీసము 12 సంవత్సరములకు తక్కువగను 30 సంవత్సరములకు ఎక్కువగను ఉండగూడదు. యావజ్జీవసభ్యులు, సహాయకులు అభిమానుల యెడ ఈనియమము పాటింపబడదు.

) ఈమండలి సభ్యులు, సదాచార వర్తనులై యుండవలెను. అమిత వ్యయము, నిందలకు లోనుగాకూడదు.

ఈ మండలిలోచేరు సభ్యులు సభలయందు బీడీలు సగరేటులను త్రాగకూడదు, మరియు మత్తుపదార్థములను త్రాగిరాగూడదు. నిశ్శబ్దముగ నుండవలెను.

) ఏసభ్యుడు మండలియొక్క చట్టములకు విరుద్ధముగా నడచిన లేక ఆతనిచర్యల వలన సభ్యత్వమునకు అనర్హుడని బహుజనాభిప్రాయమును బట్టి నిర్ణయింపబడినటువంటి సభ్యునికి రెండు మాసముల వరకు అయిదుగురు నియమితసభ్యులు హితోపదేశముచేసి సఫలీకృతులు కానిచో సభవారి అంగీకారముతో తొలగించవచ్చును.

) ప్రతిసభ్యుడు విద్యనభ్యసించుట ఇతరులను ఈవిషయమున ప్రోత్సహించుట విధిగా తలంచవలెను.

# యువకమండలి

మున్నూరుకాపు యువకులలో పరస్పర సానుభూతిని కలిగించి, వారి సాంఘిక, ఆర్థిక, విద్యాభివృద్ధి దృష్ట్యా 7—6—1935 (41 ) నాడు మున్నూరుకాపు యువకమండలి స్థాపింపబడినది. ఇది ముఖ్యముగా శ్రీయుతులు ఎం. సత్యనారాయణ, తుంగ సాంబయ్య గారల కృషిఫలితము. ఈ మండలివారు విద్యార్థుల కొరకొక వసతి గృహము ఈసామియా బజారులో స్థాపించిరి. చందాలు, విరాళములు సేకరించి, విద్యార్థులకు బడిఫీసు, చెల్లించుట వారి పాఠ్యపుస్తకములు వగైరాల కొరకు ధనసహాయము చేయుట వసతిగృహము నెలకొల్పుట మున్నగు విషయములు. ఈసామియబజారు వాస్తవ్యులైన పి. జగన్ మోహన్, పి. నర్సయ్యగార్లు నల్లకుంటలోని శ్రీ జి. వెంటయ్యగారి గృహమునందు వసతి గృహము ఏర్పాటుచేసిరి. కొన్నిసంవత్సరములు అతి వైభవముగా నడిపిరి. పడకలు, తల్లెలు, చెంబులు పిల్లలభోజనసదుపాయములు కల్గజేసిరి. మూడు సంవత్సరములు వారి శక్త్యానుసారము నడిపిరి. తదుపరి నదియు ఆపివేయబడినది.

# విద్యార్థులనిధి

23 మే 1946 (55 f) నాడు ఈ క్రింది సభ్యులతో గూడిన ఒక సభ శ్రీ పి. నరసయ్య బి. ఇ. గారి గృహమున సమావేశమై అర్హతగల బీద విద్యార్థులకు, మెట్రిక్యులేషన్ తరువాత ఉన్నతవిద్య నభ్యసించు వారికి విద్యావేతనము (స్కాలర్ షిప్పు)ల అప్పురూపమున ధనసహాయము చేయుటకు ఒక విద్యానిధి ఏర్పరచుటకు తీర్మానింపబడినది.

1) శ్రీ ప్రొఫెసర్ శ్రీకిషన్ (2) శ్రీ కె. రామస్వామి ఛీఫ్ ఇంజనీర్ (3) శ్రీ పి. అంజయ్య బి. ఏ., బి. టి. (4) శ్రీ పి. నరసయ్య బి. ఇ. (మెకానిక్) (5) శ్రీ బి. రంగారావు బి. ఎ., ఎల్. ఎల్. బి. (6) శ్రీ ఎ. ఆర్. బాబయ్య బి. ఏ.

ఈ సభలో పై ఆర్గురే కార్యనిర్వాహకులుగా ఎన్నుకొనబడిరి ఇట్లు ఈ విద్యానిధి 23 మే 1946 నాడు స్థాపింపబడినది.

విద్యార్థులకు విద్యావేతనము యొక్క చెల్లింపు ఈక్రింది షరతులకు లోనై యుండెను :—

(1) విద్యార్థి, తనకు చెల్లింపబడిన విద్యావేతనమునకు స్టాంప్ పేపరుపై ఒక అప్పు పత్రము వ్రాసియివ్వవలయును.

(2) విద్యార్థినిధి నిబంధనల నుల్లంఘించినచో, లేక, కళాశాలలో అభ్యసించు విషయము (Subject) మధ్యన మార్చినచో, విద్యావేతనము ఆపివేయబడును. విద్యార్థి తాను పుచ్చుకొనిన డబ్బు ఉద్యోగానంతరం అతని ఆదాయంలో ప్రతి మాసం నూటికి 12 శాతం ఈ అప్పుక్రింద చెల్లించవలయును. తిరిగి చెల్లించవలసి యుండును.

(3) విద్యార్థి తనతండ్రి లేక పోషకులలో నొకరిని, మరియు వేరొక స్థితిపరుడైన వ్యక్తిని జామినుగా చూపెట్టి, వారిచే జామీను పత్రములు వ్రాయించి ఇవ్వవలయును. అందులో విద్యార్థి డబ్బు చెల్లించనిచో తాము స్వంతముగా జామీను చెల్లించునట్లు ఒప్పుకొనవలయును.

ఈ కార్య నిర్వాహక వర్గము 'గవర్నింగ్ కౌన్సిలు' పేరుతో వ్యవహరింపబడినది.

ఈ నిధి పక్షమున సమర్పింపబడిన ప్రథమ వార్షిక నివేదిక (23-5-46 నుండి 22-3-47) ప్రకారము, నివేదిక కాలములో చేయబడిన కొన్ని తీర్మానముల ప్రకారము నిబంధనలలో ఈ క్రిందిమార్పులు చేయబడినవి.

(1) విరాళములు స్వచ్ఛందములై యుండవలయును.
(2) గవర్నింగ్ బోర్డు సభ్యులు జామీను కాగూడదు.
(3) విద్యావేతనములు ఒకేసారి మొత్తముగా గాక, ప్రతినెల చెల్లింపబడ వలయును.

నివేదిక కాలములో శ్రీ కిషన్‌గారు కొన్ని అనానుకూల కారణము వలన తమ పదవికి రాజీనామా యిచ్చిరి. కాని వారి స్థానే, ఎవరి నియామకముకాలేదు. శ్రీ పి. అంజయ్యగారికి నల్లగొండకు బదిలీ అగుటచే వారిచోట డా॥ గోవిందరాజ్ ఎన్నుకోబడిరి. శ్రీ పి. నరసయ్య విదేశముల కేగుటచే వారిస్థానమున శ్రీ పి. నారాయణస్వామి ఎన్నుకో

బడిరి. నిబంధనలయొక్క 8 వ సూత్రము ప్రకారము శ్రీ పి. నారాయణ స్వామి సింపతైజర్ (సానుభూతికలవారు)గాను, 9 వ సూత్రముక్రింద శ్రీ జగన్నాయకులుగారు వెల్‌విషర్ (హితచింతకుడు)గాను ఎన్ను కొనబడిరి.

విద్యానిధియొక్క ఆర్థికస్థితి మిక్కిలి దుర్బలముగా నుండుటచే, రాబడి మార్గములు అన్వేషించుటకును, విరాళములు వసూలు చేయుట కును శ్రీ బి. రంగారావు, శ్రీ పి. నారాయణస్వామితో కూడిన ఒక ఉపసంఘము నియమింపబడినది. శ్రీ కిషన్‌గారి సంతకముతో సమర్పింప బడిన ఈ వార్షిక నివేదిక ప్రకారము, ఈ సంస్థయొక్క లెక్క లిట్లున్నవి :—

*రాబడి*

చందాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కే. రామస్వామి గారి నుండి | రూ. 300-00 |
| 2. | శ్రీ పి. నరసయ్య | ,, 245-00 |
| 3. | ,, పి. నారాయణ స్వామి | రూ. 200-00 |
| 4. | శ్రీ ఎస్. జగన్నాయకులు | రూ. 50-00 |
| | మొత్తము | రూ. 795-00 |

*నిలువ వివరములు :-*

| | |
|---|---|
| ప్రొఫెసర్ శ్రీకిషన్ వద్ద | రూ250-00 |
| శ్రీ బాలయ్య వద్ద | ,, 15-000 |
| మొత్తం | రూ. 400-00 |

వ్యయము :

చెల్లింపబడిన విద్యావేతనములు :

| | | |
|---|---|---|
| 1. | శ్రీ డి. రాజయ్యకు | రూ. 300-00 |
| 2. | ,, పి. విశ్వనాధము | ,, 95-00 |
| | నిలువ | ,, 400-00 |
| | | రూ. 795-00 |

రెండు అప్పుపత్రములున్నవి. ఒకటి పి. విశ్వనాధము (మాసాబులైన్సు ఖైరతాబాదు)కు చెల్లించిన విద్యావేతనముబాబతు రెండవదిరాజయ్య కుమారుడు బి. పాపయ్య (నాగర్ కర్నూలు) వ్రాసి యిచ్చినది. కాని వీరికి వేతనము చెల్లించినట్లు పై లెక్కలవలన విదితమగుటలేదు. శ్రీ డి. రాజయ్యకు చెల్లించిన రు 300/- లకు దస్తావేజు లేదు.

ప్రతినెల వారి శక్త్యానుసారము అప్పు పత్రములపై విద్యానిధి విని యోగించిరి. రెండు సంవత్సరముల తరువాత అది ఆపివేసిరి.

# మున్నూరుకాపు సంఘం వరంగల్

అఖిల హైదరాబాదు మున్నూరుకాపు సంఘముయొక్క కృషి ఫలితముగా వరంగల్లుయందు 1-4-1955 న మున్నూరుకాపు సంఘ- వి. మధుసూధన్‌రావుగారి అధ్యక్షతన, మేర్పడినది. శ్రీ పర్సా పాపయ్యా ద్వారా మహబూబునగరం జిల్లాలోని తాలూకా నాగర్ కర్నూలులో సంఘాలు స్థాపించబడినది.

సంఘోద్దేశములు:

1. ఈ కులము సాంఘిక, ఆర్థిక, నైతికాభివృద్ధికి కృషి సలుపుట. 2 విద్య, వ్యావసాయక స్తోమతను పెంచుట; 3. రాజకీయములతో సంబంధములేకుండ సాంఘికరంగంలో సర్వతోముఖాభివృద్ధిని సాధించుట. 4. వివిధ వృత్తులలో మెలగు మనవారిని సుసంఘటితపరచి కులాభివృద్ధికై ప్రభుత్వముచే అవసరమగు సహాయము పొందుట. 5. వార్షికోత్సవముల ద్వార కులజులందరు పరస్పరముగా కలిసి తమ సమస్యలను పరిష్కరించుకొనుట; 6. తాలూకాలలో, గ్రామాలలో మున్నూరుకాపు సంఘములేర్పరచుకొని వాటిద్వార కులము నుద్ధరించుకొనుట, 8. తమ కష్టనిష్ఠురములను జిల్లా సంఘములకు నివేదించి పరిష్కరించుకొనుట. 9. వార్డ్ కమిటీలద్వార సంఘశ్రేయస్సుకై పాటుబడుట. 10. రాత్రిపాఠశాలలు వయోజనవిద్యాసౌకర్యము లిత్యాది సామాజిక సేవలొనర్చుట. 11. గ్రంథాలయములు, వ్యాయామశాలలు, సహకార సంఘములు స్థాపించి సంఘాభివృద్ధికై కృషి సలుపుట. 12. అధిక సంఖ్యాకులగు మనలోని వ్యవసాయదారుల కష్టములను తొలగించుటకై అన్నివిధముల ప్రయత్నించుట. 13 ముఖ్యముగా విద్యార్థుల సౌకర్యార్థము విద్యార్థి వసతి గృహము స్థాపించుటకై కృషిచేయుట. 14. మన శాఖవారిని అత్యధికముగా సభ్యులుగా జేర్చుట. 14. సంఘ దురాచారములను రూపుమాపుట.

భువనగిరియందు 4,5, జూన్ 1855 జరిగిన అఖిలహైదరాబాదు చతుర్థమహాసభకు ఈ సంఘమునుండి దాదాపు పదిమంది సభ్యులు ప్రతినిధులుగా వెళ్లిరి.

30 వ నవంబరు 1956న అఖిల హైదరాబాదు మున్నూరుకాపు సంఘాధ్యక్షులైన శ్రీ బి. రంగారావుగారి అధ్యక్షతన తెలుగు గ్రంథాలయము హనుమకొండయందు స్థాపింపబడినది.

మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహనిర్మాణమునకు శ్రీ హడ్గిల్ రామయ్యగారు కృషి సల్పారు.

శ్రీ గొల్లపల్లి అంజయ్యగార్ని ప్రచారకులుగా నియమించి నిర్మల్ లక్షటి సేవిబోత్ మున్నగు స్థలాలలో సంఘములు స్థాపించిరి. మెదకు జిల్లాలోని ఎల్లారుడ్డి తాలూకాలలో సంఘము స్థాపించిరి.

## కరీంనగరం జిల్లా మున్నూరుకాపు ప్రథమ మహాసభ

ఈ మహాసభ పెద్దపల్లిలో 16 జూన్ 1961 న శ్రీ అన్నం విశ్వనాథంగారి అధ్యక్షతన జరిగినది. శ్రీ డి. సంజీవయ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సభకు ప్రారంభోత్సవము జేసిరి.

తమ అధ్యక్షోపన్యాసపు తొలిపలుకులనే, ఈ సభ వెనుకబడి యున్న తరగతుల వ్యవస్థయనియు, వెనుకబడియున్న వివిధ తరగతుల వారు ఒకచోట అప్పుడప్పుడు సమావేశమై, తమ అందరకు సంబంధించిన సమస్యల గురించి చర్చించుకొనవలసి యుండుననియు, వెనుకబడియున్న తరగతులన్నియు, ఆంధ్రప్రదేశ్ వెనుకబడియున్న తరగతుల సంఘమునకు అధ్యక్షులగు శ్రీ గౌతు లచ్చన్నగారి నాయకత్వమున, తమ పురోభివృద్ధికి కలసికట్టుగా పనిచేయుచున్న వనియు ముఖ్యమంత్రికి హామీనిచ్చిరి.

### సభాధ్యక్షుల ఉపన్యాస సారాంశము

"తెలంగాణా ప్రాంతమున మున్నూరు కాపుల జనాభా 35 లక్షలకు మించియున్నది. కరీంనగరం జిల్లాలో నివసించు మున్నూరు కాపుల ప్రధానవృత్తి వ్యవసాయము. మన ముఖ్యమంత్రిగారు వేరే

యొక సభలో నెలవిచ్చినట్లు, ప్రభుత్వము వ్యవసాయరంగములో సత్వర పురోభివృద్ధికై పెద్దమొత్తముల కేటాయించుచున్నది. కాని మధ్యవర్తులు, ముఖ్యముగా గ్రామాధికారులు ప్రభుత్వము నుండి తకావీ రూపమున సహాయము బొందుచున్న బీదరైతులను కొల్లగొట్టుచున్నారు. ఐతే మనకిప్పుడు శక్తివంతమైన ముఖ్యమంత్రి కలరు. కావున ఇకముందైనను ఇట్టి అన్యాయములు జరుగవని మన మాశించుచున్నాము. వెనుకబడిన తరగతులవారు దృఢనిశ్చయముతో వీరి అక్రమములను ప్రతిఘటించ దలచినచో, ప్రపంచములోని ఏ శక్తియు వారిని అపజాలదని గ్రామాధికారులు తెలిసి కొనవలయును. రైతుల ఈ కష్టనిష్ఠురములకు సంబంధించి, ఇట్టి సభలలో చేయబడు తీర్మానములు ప్రభుత్వమునకు పంపుచున్నాము. ప్రభుత్వ మిప్పట్ల మా సహాయమునకు వచ్చునని ఆశించుచున్నాము.

"మన ప్రియతమ ముఖ్యమంత్రి వెనుకబడియున్న తరగతుల విద్య, ఉద్యోగముల విషయమై ధైర్యమైన చర్య తీసికొనినందుకు నేను వారె నభినందించుచున్నాను. ఉద్యోగముల కేటాయింపు, నిర్ణీతకాలానంతరము ఇవ్వబడు భృత్యాభివృద్ధి (Promotion) విషయమై సుప్రీం కోర్టు తీర్మానము ప్రకారము వెలువడిన 4 మే 1961 నాటి G. O. (ప్రభుత్వాజ్ఞ) వెనుకబడియున్న అన్ని తరగతుల వారిని సంతృప్తి పరచినది. కొందరు, తమ స్వంత ప్రయోజనముల దృష్ట్యా, ఈ జి. ఓ. యొక్క ఉద్దేశ్యమును నెరవేరకుండ చూచుచున్నారు. కాని, మొత్తము జనాభాలో ప్రతిశతము డెబ్బదికి మించిన వెనుకబడియున్నవారు ముఖ్యమంత్రిగారి దృఢ నిశ్చయమునకు, వారొసంగు సహాయమునకు, వారెఅండ నుండగలమని హామీ నిచ్చుచున్నాము. ఉద్యోగములను రెండు సంవత్సరముల వరకు కాళీగా నుంచుటచే పాలనాయంత్రము దెబ్బతినునని కొందరు విరోధుల వాదన. కాని, నిక్కువ మేమనగా, కాళీలవలన కంటె, అధికారములో నున్నవారు, స్వబంధు పక్షపాతముచే అనర్హులగువారిని ఉద్యోగములో తీసికొనుటవలననే పాలనాయంత్రము దెబ్బతింటున్నది. వెనుకబడిన తరగతులలో యోగ్యతగల వారి కొరత లేదు.

"యోగ్యత, తెలివితేటల పేరిట తమవారి పట్ల పాక్షికముగా ప్రవర్తించుట అధికారములో నున్నవారి ఐతిహాసికం ప్రభుత్వము డిసంబరు 1960 లో వెనుక్యాలు కులాలవారికి, వెనుక్యాలుపై గిబ్బనవారికి కేటాయింపు శాతమును 16 నుండి 17 వరకు, వెనుకబడియున్న వారికి ఈ శాతమును 25 నుండి 38 వరకు, పెంచినను అది కోస్తాప్రాంతములు, రాయలసీమ, తెలంగాణములలో గల విద్యాసంస్థలందు, వైద్య, ఇంజనియరింగు కళాశాలలో అమలుజరుగుటలేదు. ఇది 1961-62 నుండి అమలునకు వచ్చునట్లు చూచుటకై నేను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, తెలంగాణా రీజనల్ కమిటి, ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులతో విజ్ఞప్తి చేయుచున్నాను. ప్రభుత్వపు ఈ ఆజ్ఞ పాటింపబడునట్లు కనిపెట్టుటకు ఒక ప్రత్యేకాధికారిని మరియు వెనుక్యాలు కులాల వారి నుండి ఒకరిని, వెనుకబడిన జాతుల నుండి ఒకరిని – ఇట్లు ఇద్దరిని నియమించ బడవలయునని నేను ప్రతిపాదించుచున్నాను. దీనివలన, దొంగసాక్ష్యము, దొంగసర్టిఫికెట్లు అరికట్టబడును.

"వెనుకబడినతరగతులకు, రాష్ట్రముఖ్యమంత్రిగా, గౌరవనీయులు శ్రీ సంజీవయ్య చేసిన సేవ, అణగత్రొక్కబడిన, విస్మరింపబడినా వారి చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడును.

"ఈ సమస్యలను ధైర్యముగా ఎదుర్కొనుటకును, ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికై తమలోనే గాక, వెనుకబడియున్న అన్ని తరగతులలోను విద్యావ్యాప్తి చేయుటకు, నేను నా మున్నూరు కాపు సోదరులతో విజ్ఞప్తి చేయుచున్నాను. నేను మీకు చేదోడు వాదోడుగా నుండగలను. మన ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్యగారి అభిమానాదరము వల్ల మనము ముందంజ వేయగలమని నా విశ్వాసము.

"వోటర్లలో నూటికి డెబ్బదిమంది వెనుకబడిన తరగతులవారున్నను వారికి, రాష్ట్రస్థాయినగాని కేంద్రస్థాయినగాని వీరిప్రాతినిధ్యము అతిస్వల్పము. దురాదృష్టకరమైన విషయమేమనగా, మన వోట్ల వలన ఎవరు పదవుల కెన్నుకొనబడుచున్నారో వారినే మనము భిక్ష మడుగవలసివచ్చుచున్నది. అధికారములో నున్నవారు, రాబోవు

ఎన్నికల సందర్భమున, ఈ విషయమును మరవకుందురుగాక. వెనకబడిన తెగవారి కేదేని అన్యాయము జరిగిన, పరిణామమెట్లుండునో ఎవ రెరుగుదురు ?

నా కీ సదవకాశమిచ్చిన, ఆహ్వానసంఘ సభ్యులకు, ఈ మహా సభను దయతో ప్రారంభించిన మన ముఖ్యమంత్రికి నా ధన్యవాదములు. మన ముఖ్యమంత్రి నాయకత్వమున మనము మన లక్ష్యమును సాధించు కొందుముగాక !



మున్నూరుకాపు మహాసభ అధ్యక్ష, కార్యదర్శులు
శ్రీ దేపాల రామకృష్ణారావు, కార్యదర్శి, శ్రీ అన్నం విశ్వనాథన్ అధ్యక్షులు
శ్రీ అముదాల శ్రీరాములు కార్యదర్శి



# మున్నూరుకాపు భవనము

ఈ భవన నిర్మాణమును గురించి ఎన్నియో సంవత్సరముల నుండి ప్రయత్నించగా శ్రీయుత పొన్నాలరాజయ్య సికింద్రాబాదు గారు ఈసామియాబజారు రామదాస్ మందిరము వద్ద 100 గజాల భూమి. మిరపకాయల యల్లయ్యగారిది, 1000-00 రూపాయలకు నా పేర రిజిస్ట్రీ చేయించిరి. విజయదశమినాడు శ్రీయుత నీలకంఠం నర్సింహులుగారితో శంకుస్థాపితము చేయించగా, దానిపైన రామదాస్ దేవాలయ ధర్మకర్తలగు తుంగ బాలకిష్ణయ్య మదన్‌లాల్ గార్లు వ్యతిరేకించుతు పురపాలక సంఘమునందు దరఖాస్తు పెట్టిరి. అప్పటి పురపాలక సంఘ కమిషనర్ శ్రీ యం. రామప్పగారు నన్ను పిలిపించి, సంగతులు విచారించిరి. నేను ఉన్నది వున్నట్లుగా చెప్పితిని. భవనము కట్టడము వల్ల వారికి యే విధమైన నష్టము కాని. కష్టము కాని కలుగనియ్యమని సమాధానము చెప్పితిని. నా సమాధానమును విని "ఆ భూమిని మున్సిపాలిటీ తీసుకొనును. మీకు వేరే భూమి నొసగెదను. అభ్యంతర మున్నదా" అని అడిగెను. నేను, అందరము రాజీపడితిమి. దానిపైన భూమి చూచుటకు తేది నిర్ణయించిరి. నిర్ణీత తేదినాడు కొన్ని భూములను చూస్తు రజిడెన్సి కోఠి వెనక ప్రక్కనున్న స్థలమును చూపితిని. దానిని ఇచ్చుటకు అంగీకరించిరి. కొలతలు చేయించిరి. దేవాలయం వద్దనున్న భూమి కొలత ప్రకారము పోగా మిగత భూమి గజము నాల్గు రూపాయల చొప్పున డబ్బుకట్టి భూమిని స్వాధీన పర్చుకుంటిని. మంచి దినము చూచి శ్రీ తుంగ సత్తయ్యగారితో శంకుస్థాపనము చేయించితిని. పని మొదలు పెట్టబడినది. సభ్యులు విరాళము లిచ్చుటకు వాగ్దానములు చేసిరి. పూర్తిగా డబ్బు వసూల్ కాలేదు. భవనమును నిలబెట్ట కల్గితిమి. పై భాగము శ్రీయుత ఎంగల అంతయ్యగారు (అసుబస్టస్ సిమెంటు రేకులు) కప్పు వేయించిరి. మిగత తలుపులకు ఇతర పనులకుగాను అప్పుతెచ్చి పూర్తిచేయబడెను. ఇంతలో పిడుగువంటి వార్త వినవచ్చినది. డా॥ మల్లయ్య కాలధర్మము జెందిరి. నా అనారోగ్య కారణమున నేను ఆస్పత్రిలోనుండగా కిందిభాగము కిరాయలు అప్పులో

కట్టబడెను. పై భాగము కిరాయకు యిస్తె దాని కిరాయి డాక్టర్ కుటుంబీకులకు జెందునట్లుగా కొందరు పెద్దలు నిర్ణయించిరి.

కొందరు పెద్దలు మరియు మహాసభ వారు చర్చలు జర్పి విడివిడిగ నడుపబడుచున్న సంఘముల ఆస్తిని విక్రయించి ఒకే స్థాయికి తెచ్చుటకు తీర్మానించునట్లుగా నా వద్దకి కొందరు సభ్యులు వార్త తెస్తు, పై విషయములో నన్నే ముందంజ వేయవలెనని కోరిరి. ఆపై కొన్ని సమావేశములు జర్పబడినవి. ఇంతట్లోనే కాచిగూడలో నిర్మించబడు భవనము కొనుటకు ప్రయత్నము జరుగగా, దానిని కొనుటకు సంసిద్ధులైరి. ఈసామియా బజారు భవనమును రు. 40,000 లకు విక్రయించి, కాచిగూడలోని భవనం రు. 2,40,000 లకు రిజిస్ట్రి చేయించుకోబడెను.



ముమ్నారుకాపు భవనం, ఈసామియా బజార్.

## ఆస్తుల వివరాలు :

1. సికింద్రాబాదులోని కాపు భవనము శ్రీ అన్నం మంకయ్య, సాకెల్లి నర్సయ్యగార్ల స్వాధీనమునందున్నది, సుమారు రు॥ లక్ష రూపాయలది గలదు.

2. గూటాల వీరన్న ట్రస్టు జాయదాదు 100,000 రూపాయలది వేరే ధర్మకర్తల స్వాధీనమున ఉన్నది.

3. గొల్ల ఖిడ్కిలో నున్న వివాహ మండపం (కాపు భవనము) రు. 50,000 సుమారు గలది శ్రీ సంగిలక్ష్మయ్య, డా॥ గోవిందరాజుల స్వాధీనమున నున్నది.

4. అలియాబాదు నందు సహకార పరపతి పద్ధతుల పైన నడప బడుచున్న మూల ధనము సుమారు రు. 40,000 లున్నది. రు. 10,000 విలువచేసే కంపౌండుతోసహా భూమి కూడ గలదు.

## కీ॥ శే॥ గూటాల వీరన్నగారి

## లక్షరూపాయల ఆస్తికి ధర్మకర్తల నియామకము.

ఫీలుఖానా నివాసులు శ్రీ గూటాల వీరన్న బ్రతికియున్నప్పుడు సుమారు లక్ష రూపాయల ఆస్తిని, ట్రిస్టు దస్తావేజు వ్రాసి రిజిస్ట్రేషన్



కీ. శే. గూటాల వీరన్నగారు

కార్యాలయము నందు 1353 F న భద్రపరచి యుండిరి. వారి మరణానంతరము శ్రీ గొల్నాల పెంటయ్యగారు అట్టి దస్తావేజును, రిజిస్ట్రేషను కార్యాలయము నుండి, దాని నకలు తీసికొని వచ్చిరి. అందులో ఈ క్రింది విధముగా వ్రాయబడినది. వారు తమ ఆస్తిని మూడు విధములుగా విభజించిరి :

1. సుమారు నూరు తులముల బంగారము మరియు ఫీలుఖానా లోని ఒక ఇల్లు తమ ధర్మపత్నియగు రాజమ్మ పేర, ఆమె స్వంతమునకు వ్రాయబడినది.

2. సుమారు రు. 25,000/-ల విలువగల ఇల్లు ఫీలుఖానాలోనిది, దాని రాబడిని, మున్నూరుకాపు బాలబాలిక విద్యార్థుల కొరకు వినియోగించుటకు అయిదుగురు సభ్యుల ట్రస్టును నియమించిరి. ట్రస్టు సభ్యులకు ఈ యిల్లును విక్రయించుటకు అధికారము లేదని స్పష్టముగా వ్రాయబడి యున్నది. ఈ ఇంటికి ప్రక్కన 104 గజముల ఖాళీభూమి కలదు. అదియు దీనిలోనే చేరియున్నది.

3. సుమారు రు. 50 వేలు విలువగల స్థిరాస్తి - ఇది సీతారాంపేటలో గల 225 గజముల భూమి. మరియు అమీరుపేటలో 16 గదులు గల పదునందల గజముల ఇల్లు, సుమారు 25 వేల అప్పు పత్రములు, రాజమ్మగారికి సంతానము లేనికారణమున ఎవరినైన దత్తుతీసికొనినచో ఈ ఆస్తి ఆతనికి జెందును. ఏ కారణమువలననైన రాజమ్మ దత్తుదీసికొనకయే మరణించినచో, ఆమె ఆస్తిని మున్నూరుకాపు విద్యార్థుల విద్యాభివృద్ధి పౌకర్యముల కొరకు ట్రస్టుల స్వాధీనములో నుండును.

ట్రస్టు సభ్యులు :

1. శ్రీ గొల్నాల పెంటయ్య- ఓవర్‌సీర్ సిటీ ఇంప్రువ్‌మెంటు బోర్డు, హైదరాబాదు.

2. శ్రీ సేరి జగన్నాయకులు, మదద్‌గారు - కో ఆపరేటివ్ సొసైటీసు డిపార్టుమెంటు, హైదరాబాదు

3. శ్రీ ఎస్. వెంకటస్వామి, హైకోర్టు వకీలు, హైదరాబాదు.
4. శ్రీ ఎఱ్ఱం సత్యనారాయణ, బట్టల వర్తకులు, హైదరాబాదు.
5. శ్రీ హరికిషన్ సింగ్, అడ్వొకేటు, హైదరాబాదు.

శ్రీ గూటాల వీరన్న కాలధర్మము నొందగా, వారిఆస్తిని రెండవసారి వ్రాయబడినదానిని, ట్రిస్టు సభ్యులు స్వాధీన పరచుకొనుటకు ప్రయత్నముచేసి, ఇంటి కొంతభాగములో నుండు కిరాయదారుల నుండి కిరాయనామాలు వ్రాయించుకొనుటకు ఇంకొకనాడు వచ్చెదమనిచెప్పి వచ్చిరి. ఇంతలో కీ॥శే॥ వీరన్నగారి మాసికము రోజు వారు చనిపోయిన చోట ధూపదీపములు పెట్టుటకు గాను రాజమ్మగారు ట్రిస్టుసభ్యుల నుండి తాళముచెవితీసికొనిఇల్లును స్వాధీనముచేసికొని, అందులో ప్రవేశించిరి. 'నాభర్తను బుజ్జగించి దస్తావేజు వ్రాయించుకొనినారు. ఇంటిపై ఎవరికిని ఎట్టి హక్కులేద'నిరి. కొన్నిసంవత్సరములు గడిచిన తరువాత 'ఎండోమెంటు'(ప్రభుత్వ మతశాఖ)లో మొక్కరిచేయగా, ఎండోమెంటువారు వీరన్నగారు మరణించుటకు పూర్వము వ్రాసిన ట్రిస్టు పత్రిము ఆధారముతో ఇంటిని రిజిస్టరులో నమోదుచేసిరి. మతశాఖవారు ఇంటిని స్వాధీనములో తీసుకొని, రాజమ్మకు నోటీసు జారీచేసిరి. రాజమ్మను మరియు కిరాయదారులను వెళ్ళగొట్టుటకు చర్య మొదలుపెట్టిరి. ఇంటి ఒక భాగము వేరేవారి స్వాధీనములోనుండగా, మిగతాభాగమును రాజమ్మగారు అమ్ముకొనిరి. దానిని తిరిగి రాబట్టుకొనుటకు మత శాఖవారు న్యాయస్థానమున చర్యతీసికొనిరి. అయిదు, ఆరు సంవత్సరములు గడిచిన తరువాత, ఇల్లును కొనినవారు పరిష్కారము చేసికొనిరి. రాజమ్మగారు నెలకు రు. 15/-లకిరాయ ఇచ్చునట్లు, మిగతాకిరాయలు ఆమెయే రాబట్టుకొనునట్లు ఒప్పందము కుదిరినది. ఇంతలో రాజమ్మగారు మరణించిరి. దత్తు తీసికొనకయే మరణించిన కారణమున, ఆమె స్వాధీనములోనున్న ఆస్తినిగూడ ఎండోమెంటులో చేర్చుటకు చర్యతీసికొనగా, ఎండోమెంటువారు ఆ ఆస్తిని ఔఖాఫ్ రిజిస్టరులో నమోదుచేసికొనిరి. పరిస్థితులిట్లుండగా గూటాల వీరన్నగారి తమ్ముని కుమారుడు విశ్వనాథం ఈచర్యనునిరోధించెను. "రాజమ్మగారికి, వీరన్నగారికి నేను కర్మచేసినాను కావున, రాజమ్మగారిఆస్తి నాకు చెందవలయును. ఆమె నన్ను దత్తు

కొనినదని” అతడు వాదించెను. నాలుగైదు సంవత్సరముల తరువాత అతడు చనిపోయెను. ఆయనభార్య ఆస్తి తనకు చెందవలయునని వాదించెను. ఇట్లు దాదాపు పది సంవత్సరములు ఈ జగడము నడచి, ఇప్పుడు ఫీలుఖానాలోగలయిల్లు, అమీరుపేటయిల్లు, సీతారాంపేటలోగల భూమి సుమారు లక్షరూపాయల విలువగలఆస్తి ఎండోమెంటులో నున్నది. అందులో నివసించు కిరాయిదారులు న్యాయశాఖావారి సహాయముతో తొలగింపబడినారు.

గత ఇరువది సంవత్సరముల నుండి పోరాటమునందు పాల్గొనిన శ్రీ బొజ్జం నరసింహులు లక్షరూపాయల ఆస్తిని ఎండోమెంటు స్వాధీనములో నుంచినారు. ఇంటికిరాయల బాబతు వచ్చిన ఆదాయం దాదాపు రు 4000/-లు ఎండోమెంటులోనున్నవి. అమీరుపేటలోని ఆస్తి శిథిలమైనది. ఫీలుఖానాలోని యిల్లు గూడ శిథిలావస్థలో నున్నది. దీనిని బాగుచేసినచో సుమారు వేయిరూపాయల కిరాయి రాగలదు.

ట్రస్టుసభ్యులలో నొకరగు శ్రీ హరికిషన్‌సింగ్ అడ్వొకేటు ఇటీవల మరణించినారు.

అలియాబాదులోనున్న మున్నూరుకాపులు సుమారు మున్నైవేల వరకు సహకారపరపతి పద్ధతులప్రకారము లావాదేవీలు చేయుచు మూలధనము అభివృద్ధి పరచుచున్నారు. కీ. శే. కావేటి లక్ష్మీపతి, రెబ్బ నర్సింలు, భండారి బుచ్చయ్యగార్లు మూల పురుషులు. ఇప్పుడు సుమారు ౩౦౦ వందల గజముల కంపౌండుకూడ ఖరీదుచేసి భవనమును నిర్మించు తలంపులో నున్నారు.

గోల్లఖిడ్కి దూదుబావులివద్ద సుమారు రు 20000 వేయిలు పోగుచేసి, వివాహవేదిక, కళ్యాణ మంటపముకట్టి, కులసోదరుల వివాహములకు ఉపయోగపడుటకు వినియోగించు చున్నారు. దీనికి డా॥ గోవిందరాజుగారు అధ్యక్షులు.

# హైద్రాబాద్ సిటీ సివిల్ కోర్టు
# మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జికోర్టు

## అనుబంధం.

ఎమ్. పి. నెంబరు 308 / 1955
1964 ఐ. ఎ. నెంబరు. 881
అంజదుల్లా సిద్దీఖీ......వాది
తేది : 4 - 3 - 65

కోశాధికారి సత్యనారాయణ, శ్రీ శంకర్ ప్రసాద్ మరియు గార్డియన్ అంజదుల్లాసిద్దిఖీ హాజరయి ఎక్కువ పాటపాడుటకు మరె వ్వరూ రారని స్థిరపడగా, మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహం సంస్థయొక్క కోశాధికారియైన శ్రీ ఎన్. సత్యనారాయణ పేర రు 2, 04, 000 /- లకు వేలంపాట ముగింపబడినది.

(సం) ఎమ్. రామమూర్తి, 4 - 3 - 65
మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జి,

తేది : 4 - 3 - 65

నజారత్ ధనభాండాగారంలో జాగ్రతపరుచుటకు యాభై ఒక వేయిల రూపాయిలు ముట్టినవి.

(సం) నాజర్, 4 - 3 - 1965

ఈ విక్రయ దస్తావేజు 5-మే 1965 నాడు ఈ క్రిందివారిచే వ్రాయబడినది.

(1) షమీయుల్లాసిద్దీఖి కుమారులైన (1) అసదుల్లాసిద్దీఖిఉరఫ్ ఆరిఫుల్లా: (2) మరియు మొహమ్మద్ తిలావతుల్లాసిద్దిఖీఉరఫ్ అజ్మతుల్లా; (3) కీ॥ శే॥ అసదుల్లాసిద్ధిఖి కుమార్తె అనీస్‌ఫాతిమా ఈ ముగ్గురు మైనర్లైనందున, హైదరాబాదు సిటీ సివిల్ కోర్టు మొదటి అడిషనల్

జడ్జిచే, ఎం. పి. నం. 308 ప్రకారము, ప్రస్తుతము హైదరాబాదుకు వచ్చియున్న తెనాలిలో సబార్డినేటు జడ్జిగా పనిచేయుచున్న శ్రీ సిద్దిఖి యార్ జంగు కుమారుడగు మొహమ్మద్ అంజదుల్లాసిద్దిఖిని గార్డియను (రక్షకుడు)గా నియమించినారు. వీరు ఇకముందు ఈ దస్తావేజులో ఒక పక్షమున విక్రేతలుగా వ్యవహరింప బడుదురు.

వ్రాయించుకొన్నవారు :—

1. మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతిగృహము పక్షమున (1) నీలకంఠం నర్సింలు కుమారుడైన ఎన్. సత్యనారాయణ వృత్తి వ్యాపారం- నివాసము, సుల్తాన్ బజారు, హైదరాబాదు.

2. అన్నంర త్నయ్య కుమారుడు రామలింగం, వయస్సు 54 సం॥ లు, వృత్తి వ్యాపారం, నివాసము మహంకాళివీధి, సికిందరాబాదు.

3. ఏనుగుల పురుషోత్తం కుమారుడు సత్తయ్య, వయసు : 52 సంవత్సరాలు, వృత్తి : వ్యాపారం; నివాసం : ఇంటినెంబరు : 13-2-445, ధూల్ పేట, హైద్రాబాద్.

4. ధడువై రామన్న కుమారుడు కిష్టయ్య, వయసు : 47 సంవత్సరాలు, వృత్తి : వ్యాపారం; నివాసం : ఫీల్ ఖానా, హైద్రాబాదు.

5. మోర రంగయ్య కుమారుడు రాజయ్య, వయసు : 53 సంవత్సరాలు. వృత్తి : వ్యాపారం. నివాసం : రామ్ కోట్, హైద్రాబాద్ (ఆం. ప్ర.)

ఇకముందు వీరు క్రయకులు (కొనువారు)గా వ్యవహరింప బడుదురు.

దిగువప్రకారం సాక్ష్యాధారం:

1. షెడ్యూల్ లో వివరంగా పేర్కొనబడి, ఇందు వెంట జత పరచబడిన ప్లానులో చూపబడినట్టిది, కాచిగూడాస్టేషన్ మెయిన్ సిమెంటురోడ్ లో, ఇంటి నెంబరు : 3-3-43 గల భవనమునకు పైన

పేర్కొన్న మైనర్లు సంపూర్ణాధికారం గల యజమానులు; హైదరాబాద్ సిటీ సివిల్ కోర్టు మొదట అడిషనల్ ఛీఫ్ జడ్జిచే, 1955 ఎమ్. పి. నెంబరు 308 లో ఇద్దరు వ్యక్తులకు మరియు మైనర్ల ఆస్తికి ఉత్తర్వులనిచ్చిన ప్రకారం పైన పేర్కొన్న శ్రీ అంజదుల్లా సిద్ధిఖిని గార్డియన్‌గా నియమించ నైనది.

మైనర్లకు చెందిన షెడ్యూల్ ఆస్తిపై వారికి మంచి ఆదాయం రానందున అట్టి ఆస్తిని బాగుచేయవలసి వున్నందున, మొదటి ఛీఫ్ జడ్జికి గార్డియన్ శ్రీ అంజదుల్లాసిద్ధిఖి, 1961 ఐ. ఎ. నెంబరు 69 లోని షెడ్యూల్ ఆస్తి అమ్మకమునకు దరఖాస్తుచేసి యున్నారు. మొదటి అడిషనల్ జడ్జి మారిపోయినందున, రెండవ అడిషనల్ ఛీఫ్ జడ్జిచే 6-3-1961 న అట్టి పిటీషన్ రద్దు చేయబడినది. కావున గార్డియన్ అయిన శ్రీ అంజ దుల్లాసిద్ధిఖి యీ విషయాన్ని 1961, సి. ఎమ్. ఎ. 331 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు అపీలుచేయగా హైకోర్టు వారు అట్టి పిటీషన్ పరిశీలించి, 1961 సి. ఎమ్. ఎ. 331 లో గల షెడ్యూల్ ఆస్తిని, హైదరాబాద్ సిటీసివిల్‌కోర్టు మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జిచే షుమారు రెండు లక్షల రూపాయిలకు అమ్మవలసినదిగా, 2-4-1963 న ఉత్తర్వుచేసియుండిరి. హైకోర్టు ఉత్తర్వుల ప్రకారం మైనర్లగార్డియన్ శ్రీ అంజదుల్లాసిద్ధిఖి షెడ్యూల్ ఆస్తిని బహిరంగవేలం ద్వారా అమ్మేటకు మొదటి అడిషనల్ జడ్జికోర్టులో, 1964 ఐ. ఎ. నెం. 881లో పిటీషన్ దాఖలు చేసియున్నాడు. దాని ప్రకారం సివిల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం ముఖ్యమైన అన్ని వార్తా పత్రికలలో అమ్మకపు ప్రకటనలు ప్రచురితమైన తర్వాత షెడ్యూల్ ఆస్తి కోర్టు ఆవరణలో 4-3-1965 న బహిరంగవేలం జరిగినది.

పైన పేర్కొన్నవేలంలో రు. 2,04,000/- (రెండు లక్షల నాలుగు వేల రూపాయిలకు) ఎక్కువ పాటతో క్రయకులు పాడియున్నారు. మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జి అట్టి పాటను ఆమోదించి, షెడ్యూల్ ఆస్తిని క్రయకుల పేర ముగించినారు.

క్రయకులు మొత్తం పైకం రు. 2,04,003/-లు మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జి కోర్టులో డిపాజిట్ చేసినారు. (రు: 51,000/-

4-3-65 న 53,000 రూపాయులు, 18-3-65 నగదు చెల్లింపు చలాన్ నెంబర్లు: 18394,18395,18396.) తదుపరి, 5-4-1965 న మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జిగారిచే అమ్మకం స్థిరపరచబడినది.

అమ్మకం స్థిరం అయిన తర్వాత గార్డియన్ (శ్రీ) అంజదుల్లా సిద్దీఖీచే ఆస్తి అమ్మకం దస్తావేజు చిత్తు ప్రతి వ్రాసి, రిజిష్టరీ చేయుటకు, హైద్రాబాద్ సిటీ సివిల్ కోర్టు మొదటి అడిషనల్ జడ్జి కోర్టు సమక్షంలో వుంచబడినది. అది ది. 24-4-65 న ఆమోదించబడినది. తర్వాత, ఆమోదించిన ప్రకారం అమ్మకం దస్తావేజు వ్రాసి, రిజిష్టర్ చేయుటకు 24-4-65 న గార్డియన్‌కు అనుమతి నొసంగబడినది.

దిగువ ప్రకారం ఈ దస్తావేజుకు సాక్ష్యాలు:

1. 1964 ఐ. ఎ. నెం. 881 విషయంలో పైన పేర్కొన్న హైకోర్టు ఉత్తర్వులు మరియు మొదటి అడిషనల్ ఛీఫ్ జడ్జిచే నిర్వహించిన వేలం ప్రకారం క్రయకుల పేర షెడ్యూల్ ఆస్తి అమ్మకం ఖాయం చేయుట మరియు షెడ్యూల్ ఆస్తి యొక్క విక్రయ పైకం రు: 2,04,000/ మైనర్ల పేర క్రయకులచే డిపాజిట్ చేయుటకు ఆమోదించుట, హైద్రాబాద్ సిటీ సివిల్ కోర్టు మొదటి అడిషనల్ జడ్జిచే యివ్వబడిన సూచనల ప్రకారం మైనర్ల గార్డియన్ ద్వారా కొన్న వారికి అమ్మకం దస్తావేజు వ్రాసియిచ్చుట.

2. దిగువ ప్రకారం విక్రేతలతో క్రయకుల ఒడంబడికలు:

(ఎ) మాచే విక్రయించబడిన షెడ్యూల్ ఆస్తికి చెందిన కిరాయిలు, లాభములు, ఇకముందునుంచి క్రయకులు పరిపూర్ణమైన హక్కులతో అనుభవించవచ్చును. అట్టి వాటికి మేముగాని మాన వారసులుగాని ఏ విధమైన అభ్యంతరములు చేయము. న్యాయసమ్మతముగా ఆస్తి అనుభవించుటకు అంగీకరించియున్నాము.

(బి) విక్రేతలు క్రయకుల ఖర్చులతో విక్రయదస్తావేజు వ్రాసి, రిజష్టర్ చేసి పై షెడ్యూల్ ఆస్తిని పూర్తి హక్కులతో అనుభవించుటకు క్రయకులకు, వారి వారసులకు హామీనొసగుచున్నాము.

(సి) ఇట్టి ఆస్తిని కాచిగూడ ప్రభుత్వ బాలికల ఉన్నతపాఠశాల వారు ఆక్రమించుకొని నెలకు రు: 400/- కిరాయి చెల్లించుచున్నారు. అది మినహా, పై ఆస్తికి, వివిధమైన అభ్యంతరములు కలుగకుండా హక్కు యివ్వబడింది.

(డి) పై షెడ్యూల్ ఆస్తిని క్రయకులకు సంపూర్ణ హక్కులతో స్వాధీన పరచబడి అట్టి దానిపైనవచ్చే కిరాయి 1-4-1965 నుండి ప్రభుత్వం నుండి వసూలు చేసుకొనుటకు అంగీకరించబడినది.

(ఇ) షెడ్యూల్ ఆస్తికి చెందిన వారసత్వాల, న్యాయశాస్త్ర సమ్మతమైన ప్రతినిధులు, వారసులైన వారు, నిర్ణయాలతో సహా ఇంతకుముందు ఉపయోగించిన "విక్రేతలు మరియు క్రయకులు" ఉద్దేశ్యాలను ఆమోదించి, కంట్రాక్టు సంబంధించి వివిధమైన అనుమానాలను పూర్తి సహకారంతో సంప్రదింపుల ద్వారా పరిష్కారం చేసుకొనుటకు అన్ని బాధ్యతలతో ఆమోదించుచున్నాము.

ఈ దస్తావేజునకు పార్టీలైన వారు 5-5-65 నాడు సాక్షులుగా సంతకము చేసినారు:

## ఆస్తి షెడ్యూలు

హైదరాబాదు నగరపురపాలక సంఘహద్దులలో కాచీగూడెము ఏరియాలో ఒక పెద్ద బిల్డింగు - కాచీగూడ స్టేషను రోడు - ఇంటి నం 3-3-43- మొత్తము వైశాల్యము 5250 చదరపు గజములు, వివరములు ఇందుతో జతపరచబడిన మ్యాప్‌లో చూపబడినవి - హద్దుల వివరణ:

తూర్పు - వాస్ ప్రకాశ్ హోటల్
పడమర - ముబాజరొద్దీన్ గారి ఇల్లు
ఉత్తరము - కాచీగూడ స్టేషను మేన్ సిమెంటు రోడ్డు
దక్షిణము - చెప్పల్ బజారు రోడు

ముఖ్య భవనముతో పాటు - చిల్లరచిన్న ఇండ్లు (వెలుపలవి) షెడ్లు చుట్టు ప్రహరీ గోడ, విద్యుత్పరికరములు, నీటిసరఫరా మున్నగు ఇతరపరికరములు, చెట్లు - వగైరా—

సాక్షులు : ఎన్. బాలకిష్టయ్య
,, ఆముదాల శ్రీరాములు

విక్రేతలు :

1 మహమ్మద్ అసదుల్లా సిద్దీఖి ఉరఫ్ ఆరిఫుల్లా; 2. మహమ్మద్ తలాతుల్లా సిద్దీఖి ఉరఫ్ అజ్మతుల్లా, 3. అనీస్ ఫాతిమా, వీరు మైనరు లగుటచే, కోర్టువారిచే నియమింపబడిన గార్డియన్ అమ్జదుల్లా సిద్దీఖీ చే వ్రాలు.

క్రయకులు :

1. ఎన్. సత్యనారాయణ, 2. అన్నం రామలింగం, 3. ఎ. సత్తయ్య, 4. దడువాయి కిష్టయ్య 5. ఎమ్. రాజయ్య.

ఇన్‌కంటాక్సు మినహా

మున్నూరు కాపు విద్యార్థి వసతిగృహమునకు దానములు ఇచ్చు వారిపై ఇంకంటాక్సు మినహా:

కమీషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్ — శ్రీ ఎన్. నర్సింలు<br>
ఆంధ్రప్రదేశ్ హైద్రాబాద్ — క్లాత్ మర్చంట్<br>
సుల్తాన్‌బజార్, హైద్రాబాద్

విషయం :- ఇన్‌కంటాక్స్ 1961 చట్టం 88 సెక్షన్‌లో మినహా మున్నూరు కాపు (కాపు) విద్యార్థి వసతిగృహం
వివరం : మీ దరఖాస్తు తేది : 7-12-1965.

ఇన్‌కంటాక్స్ 1961 చట్టం 88 సెక్షన్ ప్రకారం ధర్మార్థసంస్థ తీసుకోతగిన మరియు ప్రకటన తెల్పుటలోను ఆ సెక్షన్ లోనిసబ్ సెక్షన్ (5)లో ఉదాహరించబడిన నిబంధనలు తృప్తికరమైనవి. పై సందర్భంలో దిగువ పత్రములు డాక్యుమెంట్లు, ఒరిజనల్ (అసల్)గాని లేక ధృవపరచ బడిన నకళ్ళు కాని పంపవలెను.

1. నియమ నిబంధనలు (ఉన్నచో)
2. రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ (ఉన్నచో)

3. ప్రారంభపు తేదీనుండి డబ్బు చెల్లించిన రసీదులు మీ వద్ద నుండి సమాధానము వచ్చిన తర్వాత, తదుపరి విషయం గురించి పరిశీలన జరుపబడును.

వై. రామచంద్రరావు
ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ (ఎస్.ఐ.బి.)

## మున్నూరుకాపు ప్రముఖుల సమ్మేళనము

దివి, 14-11-64 నాడు శ్రీ పుప్పాల శివశంకర్ అడ్వకేటుగారి గృహమందు మున్నూరుకాపు ప్రముఖులందరు సమావేశమై తీర్మానించబడిన తీర్మానములను క్రియారూపము దాల్చుటకుగాను, "మేము నీలకంఠం నర్సింహులు అన్నం మంకయ్య సంయుక్త అధ్యక్షులుగానున్న మాకు నొసగబడిన అధికారముల ననుసరించి, శ్రీ నీలకంఠ సత్యనారాయణ శ్రీ అన్నం రామలింగం శ్రీ ఏనుగుల సత్తయ్య శ్రీ ధడువై కిష్టయ్య శ్రీ మొరా రాజయ్య అయిదుగురికి అధికారము ఇచ్చుచున్నాము."

### వివరణ :-

(1) ప్రస్తుతము, "మున్నూరుకాపు (కాపు) హాస్టల్ బిల్డింగు ఫండు కమిటి" పేర నడపబడుచున్న పేరుకుబదులు, "మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతిగృహం" అను పేరు వ్యవహరించవలెను.

(2) ఇప్పుడు బ్యాంకులలో నిల్వలను, ముందుకు కార్యకలాపములను నడుపుటకు మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతిగృహము పేరట నడుపుటకు అధికారము ఇవ్వనైనది.

(3) బ్యాంకుల నుండి లావాదేవీలు ఇతర కార్యకలాపములను సర్వశ్రీ నీలకంఠం, సత్యనారాయణ ఏనుగుల సత్తయ్యగార్ల సంతకములద్వారా జరుపబడవలయును.

(4) పై అయిదుగురిని (ట్రస్టు) ధర్మకర్తలగా నియమించుచు మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతిగృహమును అభివృద్ధి పరచుటకు నిశ్చయించనైనది.

భవన క్రయమునకు ఇదివరకు తెచ్చిన అప్పులను భవన నిర్మాణమును పూర్తి చేయుటకు అయ్యేవరకు అప్పుతీరేవరకు పై సభ్యుల నుండి యెవరికిని రాజీనామా ఇచ్చుటకు హక్కు ఉండదు.

ఇట్లు
నీలకంఠం నర్సింహుల్మలు
అన్నం మంకయ్యా
సంయుక్త అధ్యక్షులు

1. బొజ్జం నర్సింలు
2. యస్. క్రిష్ణయ్యా
3. అన్నం విశ్వనాధం
4. ఎట్టం సత్యనారాయణ
5. నారం క్రిష్ణారావు

## ట్రస్ట్ దస్తావేజు

ఈ ట్రస్టు దస్తావేజు 14-11-64 నుండి అమలు జరుగుటకు 16-10-65 న తయారుచేసి ఆంధ్రప్రదేశ్, హైద్రాబాద్ ముకరంజాహి మార్కెట్‌నందు రిజిష్టర్ చేయబడినది.

అనుబంధించిన షెడ్యూల్ 'ఎ'లో, పేర్కొన్న ఆస్తి 5-5-65న, రు: 2,04,000 లకు కొనబడినది. అట్టి విక్రయ దస్తావేజు, హైద్రాబాద్ రిజిస్ట్రారు కార్యాలయంలో 7-5-65 డాక్యుమెంటు నెం. 1414 (1965) బుక్ నెం. 1 నందు మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతి గృహము పేర రిజిష్టర్ చేయనైనది. దాని ప్రతినిధి ప్రమోటర్లు వారి పేర్లు, చిరునామాలు, దిగువప్రకారం గలవు:

(ఎ) శ్రీ నీలకంఠం సత్యనారాయణ, వయస్సు: 48 సం॥ తండ్రి నీలకంఠం నర్సింలు; నివాసం: ఇంటి నెం. 501 బడీచావిడి, సుల్తాన్ బజార్, హైద్రాబాద్.

(బి) శ్రీ అన్నం రామలింగం; వయస్సు : 54 సం॥ తండ్రి రత్నయ్య. నివాసం: ఇంటి నెం. 2482, రంగరేజ్ బజార్, మహంకాళి వీధి, సికింద్రాబాద్.

(సి) శ్రీ యేనుగుల సత్తయ్య, వయస్సు 52 సం॥ తండ్రి పురుషోత్తం, నివాసం: ఇంటి నెం. 13-2-445 ధూల్ పేట, హైద్రాబాద్.

(డి) శ్రీ ధడువై కిష్టయ్య, వయస్సు : 47 సం॥ తండ్రి రామన్న నివాసం : ఇంటి నెం : 5-1-121, సుందర్ భవన్, జాంబాగ్, హైద్రాబాద్.

(ఇ) శ్రీ మోరా రాజయ్య, వయస్సు : 53 సం॥ తండ్రి రంగయ్య నివాసం ఇంటి నెం. 4-2-1068, రామ్‌కోట్, హైద్రాబాద్.

పైన పేర్కొన్న మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతి గృహం ఒక ధర్మార్థ సంస్థ. దాని ధర్మార్థోద్దేశ్యములు ట్రస్టు దస్తావేజులో తగిన చోట పేర్కొనబడినవి. ట్రస్ట్ ధర్మార్థోద్దేశ్యములు నెరవేర్చుటకు అవసరమైన సలహా నిస్తు, ట్రస్ట్ దస్తావేజు వ్రాయబడినది. ఈ ట్రస్ట్ దస్తావేజుకు సాక్షులు దిగువ ప్రకారం గలరు.

| | |
|---|---|
| నీలకంఠం సత్యనారాయణ | అన్నం రామలింగం |
| ఎ. సత్తయ్య | ధడువై కిష్టయ్య |
| మోర రాజయ్య | |

(1) ట్రస్ట్ పేరు :- పైన పేర్కొన్న ప్రకారం ట్రస్టుపేరు. "మున్నూరుకాపు (కాపు) విద్యార్థి వసతి గృహం"

(2) కార్యాలయము :- ట్రస్టు కార్యాలయము : (పేర్కొన్న 'ఎ' షెడ్యూల్) భవనం, ట్రస్టుకు చెందినది. నెం. 3-3-43, కాచిగూడ స్టేషన్ మెయిన్‌రోడ్, హైద్రాబాద్.

(3) ట్రస్టీలు :- (ధర్మకర్తలు).

ప్రమోటర్లుగా ట్రస్టు ప్రారంభమయినప్పటి నుండి పైన పేర్కొన్న 5 గురు వ్యక్తులు ట్రస్టుకు చెందిన డబ్బు మరియు ట్రస్టు ఆస్తిని పోషించుచున్నారు. ప్రస్తుతము పై వారే యీ సంస్థకు ధర్మకర్తలుగా నున్నారు. మూడు సంవత్సరాలలో ఏ ట్రస్టీ అయిన (ధర్మకర్త) మరణించిన లేక అశక్తత వలన లేక రాజీనామా ఇచ్చుట వల్ల, హాజరు కాని యెడల, మిగతా ధర్మకర్తలు అట్టిఖాళీ స్థానమున తమకు నచ్చిన వారిని నియమించుకోవచ్చును.

(4) ధర్మకర్తల హక్కులు, నిర్వహణలు :

పైన పేర్కొన్న ప్రకారం ఇకముందు నుండి ట్రస్టు ఉద్దేశ్యములు కార్యభారములు తృప్తికరముగా నిర్వహించుటకు ధర్మకర్తలకు అధికారం గలదు. ఇతర స్థిరాస్తుల సంపాదించుటకు ట్రస్టు ఆస్తి అమ్ముట మరియు అమ్మకపు డబ్బును ఖర్చుపెట్టుటతో సహా, దస్తావేజులు సరైన కార్యములు ఆస్తుల ఆర్జించుట, నిర్వహణ రక్షణ మొదలగు వాటికి సక్రమమైన పద్ధతులలో ట్రస్టు ఆస్తి వినియోగించవచ్చును. ట్రస్టుకు చెందిన అన్ని నిధులు, ఆస్తులు, లాభములు, మొదలయిన వన్ని ధర్మకర్తల నిర్వహణలోనుండును. ధర్మకర్తలు షెడ్యూల్ ఏ, ఆస్తిపైన బయటి నుండి లేక బ్యాంకు నుండి కాని తాకట్టు వల్ల కాని అవసరమయినచో బాకీలు తెచ్చుటకు హక్కు గలిగియుందురు. లేక మరో విధంగా ట్రస్టు భవనంలో షెడ్యూల్ 'ఏ' ఆస్తి హాస్టల్ ప్రారంభించుటకు అవసరమయిన దిన చర్యల నిర్వహించుటకు 13 మందికి మించనట్టి ఒక సంఘమును నియమించుకొనుటకు వారికి అనుమతి గలదు. అన్ని విధములైన కంట్రాక్టులు, కేసులు డాక్యుమెంట్లపై సంతకం చేయుటకు ధర్మకర్త నీలకంఠం సత్యనారాయణ గారికే హక్కు గలదు. నమ్మకమైన బ్యాంకులో ట్రస్టునిధుల లావాదేవి నిర్వహణ మరియు అన్ని విధములైన చెక్కులు, బిల్లులు, ప్రామిసరి నోట్లు, సెక్యూరిటీల యిచ్చి పుచ్చుకొనుట, దరఖాస్తు చేయుటకువారికే హక్కు యివ్వబడినది. ట్రస్టుకు చెందిన అన్ని నిధులు, బ్యాంకు ద్వారా లేక మరే ఇతర ప్రదేశంలో నైన నమ్మకమైన వారివద్ద వుంచి వాడుటకును ట్రస్టుకు సంబంధించిన ప్రభుత్వ ప్రభుత్వేతర ఉత్తర

ప్రత్యుత్తరముల జరుపుటకు హక్కు గలదు. పైన పేర్కొన్న ధర్మ కర్త లేనప్పుడు వారి బదులు అన్ని పనులు ఏనుగుల సత్తయ్య ధర్మకర్త నిర్వహించగలరు.

## ట్రస్టు ఉద్దేశములు

(5) (a) స్థిరాస్తుల నార్జించుట -

(b) ట్రస్టుభవనము కిరాయికిచ్చుట, నివాస యోగ్యమైన గదులు, కొట్లు నిర్మించుట -

(c) ట్రస్టు ఆస్తినుండి ఆదాయము నార్జించుట

(d) కుల, మత, వివక్షతలేక, ఆర్థికముగా వెనుకబడియున్న భారతీయులందరి, విద్యా, సాంఘికావసరములు, మరియు వారి శ్రేయస్సుపట్ల శ్రద్ధవహించుట -

నెరవేర్చబడును :

i-- విద్యార్థులకు, విద్యావేతనములు (స్కాలర్ షిప్పులు), పాఠశాల ఫీసు, పాఠ్యపుస్తకముల వెల చెల్లించుట - వారిని ట్రస్టుభవనములో ఉచితముగానో లేక నామకార్థమైన నెలఅద్దెపైన నివసించుటకు అనుమతిచ్చుట. ఈ రాబడి, ట్రస్టుభవనముయొక్క మరమ్మతులకు, విద్యుచ్ఛక్తి, నీటిసరఫరాలకై వినియోగించుటకు ఉద్దేశింపబడినది.

ii— ప్రజలకు, ట్రస్టుభవనముయొక్క వెనుకభాగమున, వివాహాదికార్యములను చేసికొనుటకు, ఉచితముగానో లేక అద్దె లేక విరాళము చెల్లింపుపైననో, అనుమతిచ్చుట. ఈ రాబడి, వారు వివాహాది కార్యములు జరుపుకొనుటకు అగు విద్యుచ్ఛక్తి, మరియు నీటి సరఫరా కొరకగు అదనపుచార్జీల చెల్లించుటకు వినియోగింపబడును.

iii— బీదలకు, అంత్యక్రియల కొరకు ద్రవ్యసహాయముచేయుట.

iv— బీదల వివాహములకు ద్రవ్యసహాయము చేయుట - 5 (a) లో ఉదహరింపబడిన ధర్మార్థపు పనులకగు ఖర్చులు ట్రస్టు ఆస్తి

యొక్క మొత్తము స్థూలాదాయము నుండి, ఉద్యోగుల జీతములు, పన్నులు, వడ్డీ, మరమ్మతులు, విద్యుచ్ఛక్తి, నీటిసరఫరాఖర్చులు, కుర్చీలు, బల్లలు, ప్రయాణపు ఖర్చులు, భవనపుభీమా మున్నగున వన్నియుపోగా మిగిలిన నికరాదాయమునుండి చెల్లింపబడును.

(6) ట్రస్టుఆస్తి:— ప్రస్తుతము ట్రస్టుయొక్కఆస్తి, ఈ దస్తావేజుతో జతపరచబడిన 'A' షెడ్యూలులో నమోదుచేయబడినది. మరియు బ్యాంకులో సుమారు రు 1, 387 — 60 పైసలు. నగదుచేతిలో రు 131—00, వెరశి రు 1518—60 పైసలున్నవి.

(7) ట్రస్టువారు ఇతరులకు చెల్లించవలసియున్న అప్పులు — ఇట్టి అప్పులు, ఇందుతో జతపరచబడిన 'B' షెడ్యూలులో చూపబడినవి.

(8) ట్రస్టుయొక్క నిజమైనఆస్తి — A షెడ్యూలులో చూపబడిన, ఆస్తి, 5 (d) ii లో నమోదు చేయబడినదిగాక, దానకర్తలు స్థిరచరాస్తుల రూపమున ట్రస్టుకు ఇచ్చిన విరాళములు చేరియుండును. ఇట్టి విరాళములు ట్రస్టుయొక్క ఋణములు, తీర్చుటకు, ప్రస్తుత భవనమును విస్తృతపరచుటకు, వినియోగింపబడును. ఇవిపోగా, ఏమైన మిగిలినచో 5 (d) లో ఉదహరింపబడిన దానధర్మాది కార్యములకు గూడ వినియోగింపబడును.

(9) ట్రస్టువలన రాబడి - ట్రస్టుఆస్తియొక్క ఆదాయపు వివరములు :

i— ప్రస్తుతము ట్రస్టుభవనమందున్న ప్రభుత్వపు బాలికల ఉన్నతపాఠశాల నుండి వసూలగు అద్దె - (ఈ విద్యాసంస్థ త్వరలోనే ట్రస్టుభవనమును ఖాళీచేయనున్నది.)

ii— **ట్రస్టువారు** నిర్మించుటకు తలపెట్టుచున్న, కొట్లు, **మరియు నివాసయోగ్యమైన ఇండ్లనుండి వచ్చుఅద్దె-**

iii— ట్రస్టుయొక్క (ఖర్చులుపోగా) నిలువయున్న ధనమును ఇతరఆస్తులు లేక వ్యాపారముపై మూలధనముగా వినియోగించినచో, అట్టి మూలధనము పైన వచ్చువడ్డీ -

iv— ట్రస్టీలు (ధర్మకర్తలు) ముందు గృహరూపమైన ఆస్తి సంపాదించినచో, వానిపై వచ్చువడ్డీ —

వివరణ — ఈ ట్రస్టుదస్తావేజులో ఎచటెచట 'భవనము' అను పదము వచ్చినచో, అది A షెడ్యూలులో చూపబడిన ఆస్తి అని భావము.

ఈ క్రింద సంతకముచేసిన సాక్షుల సమక్షమున, మాచే అనగా, ఎన్. సత్యనారాయణ, ఎం. రాజయ్యచే ఈ దస్తావేజు 14 - 11 - 64 నుండి అమలునకు వచ్చునట్లు 16 - 10 - 65న వ్రాయబడినది.

సాక్షులు:

1. శ్రీ బొజ్జం నర్సింలు S/O వెంకయ్య
   రాంకోట్ 4 - 2 - 789
2. ఆముదాల శ్రీరాములు.
   త్రూప్ బజార్

ధర్మకర్తలు

1. ఎన్. సత్యనారాయణ
2. అన్నం రామలింగం
3. A. సత్తయ్య
4. ధడువై కిష్టయ్య
5. ఎం. రాజయ్య

## షెడ్యూల్ "ఏ" (ఆస్తి)

హైద్రాబాద్ నగర మున్సిపల్ హద్దులలో కాచిగూడ ప్రాంతమున కాచిగూడ స్టేషన్ రోడ్‌లో గల మున్సిపల్ నెం.3-3-43 భవనము, 5250 చ. గజముల వైశాల్యము గలది; వివరములు ఇందుతో జతపరచిన ప్లాన్‌లో గలవు. ఇట్టి ఆస్తికి సరిహద్దులు :

తూర్పు : వాస్‌ప్రకాష్ హోటల్

పడమర : ముబాజరొద్దీన్ గారి ఇల్లు

ఉత్తరం : కాచిగూడ స్టేషన్ మెయిన్‌రోడ్

దక్షిణం : చెప్పల్ బజార్ రోడ్

పెద్ద భవనానికి బయటి ఇళ్లు, షెడ్లు, చుట్టూ ప్రహారీ గోడ కలిగి విద్యుత్పరికరములు, నల్లాలు అన్ని ఇతర పరికరములు, చెట్లు మొదలగునవి.

## మున్నూరు కాపు( కాపు) విద్యార్థి వసతి గృహ శంకు స్థాపన

దివి. 23-3-66 ఉదయం 9-30 గంటలకు శంకుస్థాపనమహోత్సవం శ్రీ నీలకంఠం నర్సింహ్ములు, శ్రీ కొంక అంజయ్యగార్లతో గవర్నమెంటు గరల్స్ హైస్కూల్ కాచిగూడ 3-3-43 లో జర్పబడినది. శ్రీ బొజ్జం నర్సింలుగారు ఆధిపత్యము వహించిరి. శ్రీ తోట రామస్వామి ఆంధ్రప్రదేశ్ సహకార శాఖ మంత్రి పుంగవులు ఆశీర్వాదముల నొసగిరి. కుల పెద్దలు ఈ ఉత్సవము సందర్భమున దయతో దిగువ ప్రకారం నిర్మించుటకు వాగ్దానములు జేసిరి.

7000-00 ప్రార్థనహాలు శ్రీ యాదగిరి లక్ష్మి నర్సిహ్మస్వామిది
శ్రీ నీలకంఠం నర్సింహులుగారు

10000-00 శ్రీ కొంక అంజయ్యగారు రెండు మడిగెలు

5000-00 శ్రీ నీలకంఠం నర్సింలుగారు మడిగె

6000-00 శ్రీ ,, ,, బాలక్రిష్ణయ్యగారు ,,

6000-00 శ్రీ ధడువై క్రిష్ణయ్యగారు ,,

6000-00 శ్రీమతి ఏనుగులక్రిష్ణమ్మగారు మడిగె

3000-00 శ్రీహకీం బాలక్రిష్ణయ్యగారు గది

1500-00 శ్రీ మోర రాజయ్యగారు ,,

1500-00 శ్రీ పుష్పాల యాదవరావుగారు ,,

1500-00 శ్రీ పుంజరి దేవయ్యగారు ,,

1500-00 శ్రీ బి. నర్సిములు మెకానిక్ ,,



మున్నూరు కాపు విద్యార్థివసతి గృహమునకు శంకుస్థాపన చేసుకున్న దృశ్యం. దీనిలో శ్రీనీలకంఠం నర్సిములు శ్రీ కొంక అంజయ్యగార్లను చూడనగును.

# షెడ్యూల్ 'బి' (అప్పు)

| పార్టీ పేరు: | అడ్రసు | రు. పై. |
|---|---|---|
| 1. శ్రీ నీలకంఠం నర్సింలు | బట్టల వ్యాపారులు సుల్తాన్‌బజార్, హైద్రాబాద్ | 65,000 - 00 |
| 2. ,, ధడువై కిష్టయ్య | ఉస్మాన్‌గంజ్, ,, | 12,000 - 00 |
| 3. ,, అన్నం రత్నయ్య&సన్స్ | జువెలర్స్, సికింద్రాబాద్ | 11,000 - 00 |
| 4. ,, అలైడ్ బిజినెస్ కార్పొరేషన్ | గోల్‌బంగ్లా, హైద్రాబాద్ | 10,000 - 00 |
| 5. ,, పుప్పాల యాదవరావు | గొల్లఖిడికి, హైద్రాబాద్ | 5.000 - 00 |
| 6. ,, పనుగుల సత్తయ్య | ధూల్‌పేట్, హైద్రాబాద్ | 3,000 - 00 |
| 7. ,, నీలకంఠం నర్సింలు | బడీచావిడి, హైద్రాబాద్ | 2,000 - 00 |
| 8. ,, బి. నర్సింలు మెకానిక్ | గౌలిపుర, హైద్రాబాద్ | 2,000 - 00 |

## షెడ్యూల్ 'బి' (అప్పు)

| పార్టీ పేరు | అడ్రసు | |
|---|---|---|
| 9. ,, బిట్ల చిలకయ్య | గౌలిపుర, హైద్రాబాద్ | 2,000 - 00 |
| 10. ,, పెరగు పురుషోత్తం అండ్ బ్రదర్స్ | ఉస్మాన్‌గంజ్, హైద్రాబాద్ | 1,000 - 00 |
| 11. ,, ఎన్. దేవయ్య | చాదర్‌ఘాట్, హైద్రాబాద్ | 1,000 - 00 |
| 12. ,, మోర రాజయ్య | రామ్‌కోట్, హైద్రాబాద్ | 1,000 - 00 |
| 13. ,, ఎస్. వెంటయ్య | ధూల్‌పేట్, హైద్రాబాద్ | 1,000 - 00 |
| 14. ,, పి. భాస్కరరావు | సికింద్రాబాద్ | 1,000 - 00 |
| 15. ,, పి. నాగయ్య | సికింద్రాబాద్ | 1,000 - 00 |
| 16. ,, పాశం వీరయ్య | సికింద్రాబాద్ | 1,000 - 00 |
| 17. ,, పుంజాల భాషయ్య | హుసేని ఆలం, హైద్రాబాద్ | 1,000 - 00 |
| | మొత్తం : | 1,20,000 - 00 |

# వెనుకబడిన తరగతులు

హిందూమతములో, అనాగరికులైన పెక్కు తెగలవారు, గుణ కర్మ విభేదముల బట్టి ఏర్పడిన నాల్గవవర్ణమునకు జెందినవారు. వీరు ద్రావిడులు. వీరిలో కొందరు ఏ ఋషికులమునకో, ఏ రాజవంశమునకో చెందినవారమని చెప్పికొందురు. ఐతే ఇది పౌరాణికమేగాని, దీనికి చారిత్రకపృష్ఠభూమి లేదు. వర్ణవిభాగములు కర్మ లేకవృత్తుల బట్టి కలిగినవి. ఐతే, అగ్రజాతులవారు తమ ప్రాముఖ్యతను ప్రాబల్యమును నిలబెట్టుటకు నాల్గవవర్ణము వారిని అణగద్రొక్కుచు వచ్చిరి. వారిని అజ్ఞానులుగా, చైతన్యరహితులుగా మార్చివేసిరి. ఈ నాలవజాతి యొక్క సాంఘిక పతనావస్థ నుద్ధరించుటకై ఎందరో ఆచార్యులు, సంఘసంస్కర్తలు కృషిసలిపి, విఫలులైరి. జాతి సమైక్యతకు కుల విభేదములు హానికరములను సత్యమును మన కాంగ్రెసువారు గ్రహించి, సాంఘికముగాను, విద్యావిషయముగాను వెనుకబడియున్న వారిని ఏకస్థాయికి తెచ్చుటకు పూనుకొనిరి.

మహాత్మాగాంధిగారు హరిజనోద్యమము లేవదీసిరి.

ఇప్పటికి నలుబది సంవత్సరముల క్రితము ఈ ఉద్యమము బయలు దేరినది. కాని అప్పటి రాజకీయవాతావరణము, ప్రభుత్వపు నిరంకుశత దృష్ట్యా, లక్ష్యసిద్ధికి ఆటంకములు కల్పింపబడుచుండెను. ఐనను 1920లో, హరిజనుల సామాజికాభివృద్ధికై, ఆది హిందూ సోషల్ సర్వీసు లీగు పేర ఒక సంస్థ రూపొందింపబడెను. ఇది హైదరాబాదులో శ్రీ భాగ్యరెడ్డి, వామననాయక్, మాడపాటి హనుమంతరావు ప్రభృతుల కృషి ఫలితమే. వీరితో కలసి పనిచేయుటకు నాకుగూడ అవకాశము లభించినది.

పండిత జవాహర్ లాల్ నెహ్రూ భారతరాజ్యాంగపు 15వ సెక్షన్ లో (జూన్ 1951) సవరణగా నాల్గవ పేరా ఎక్కువచేయించిరి. ఈ సవరణోద్దేశము ఇది :

"ఈ సెక్షన్ క్రింద లేక రెండవ సెక్షన్ క్రింద, వెనుకబడిన తరగతుల, హరిజనుల, గిరిజనుల సామాజిక, విద్యావైజ్ఞానిక పురోభి

వృద్ధిదృష్ట్యా, ప్రత్యేక సౌకర్యములు కలిగించుటలో, ఏ విషయమైనను రాష్ట్రమును ఆటంకపరచజాలదు."

ఈ సవరణ హైదరాబాదులో ఆశాపూరిత వాతావరణము సృష్టించగా, సర్వశ్రీ మార్గం నర్సింగరావు, ముదిరాజు కిష్టయ్య, పాపయ్య పెర్క టి. నరసింహులు, మేర, కొండ లక్ష్మణ్ బాబూజీ వెంకటాచలం నేనును వెనుకబడియున్న వారిసమస్యను లేవదీసితిమి. ఈ సందర్భమున, వెనుకబడినతరగతులేవి, హరిజనగిరిజనులలో గల భేదమును మనము తెలిసికొనవలయును.

(1) పిడ్యూల్డుకాస్టువారు, హరిజనుల జాబితాలో వ్రాయ బడినవారు.

(2) పిడ్యూల్డుటైబ్సు వీరినే గిరిజనులందురు. వీరు గుట్టలప్రాంత ములపైన నివసించువారు.

(3) వెనుకబడినవారు, హిందూసమాజములో అభివృద్ధి చెందని వారైయున్నారు. హైదరాబాదులో వెనుకబడిన తరగతులకు ప్రాతి నిధ్యముకలిగి, వారిలో జాగృతి కలిగించి భారతరాజ్యాంగములో గల సౌకర్యములు వినియోగపడునట్లు చూచుటకై, ఆగస్టు 1951లో బ్యాక్ వర్డ్ క్లాసెసు కాన్ఫెరన్సు (వెనుకబడిన తరగతులసభ) పేర రూపొందింప బడినది. ఈ సభను సమావేశపరచుటకు, నేను కన్వీనరుగా, జనరల్ సెక్రటరిగా శ్రీ మార్గం నర్సింగరావు నియమింపబడితిమి.

ఆగస్టు 1951 లో రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాదు హైదరా బాదుకు మొదటిసారిగా విచ్చేసినప్పుడు, వారికి పై సభాపక్షమున, కన్వీనరునగు నాకు ఇచ్చటి వెనుకబడిన తరగతుల నానావిధ క్లేశములను, ప్రభుత్వపు వైముఖ్యతను, విన్నవించుచు ఒక విజ్ఞప్తిని సమర్పించు గౌరవము లభించినది.

1941 సం॥ పు జనాభా లెక్కలప్రకారము ముస్లింల సంఖ్య మొత్తము జనాభాకు ప్రతిశతము 20; కాని వారిలో నిరక్షరాస్యత పతిశతము 12 మాత్రమే. రాష్ట్రపు మిగత 80 శాతముకారిలో అక్ష

దాస్యత 6 శాతము మాత్రమే. ఇందులో నుండి అభివృద్ధి జెందినవారిని మినహాయించినచో వెనుకబడి యున్నవారి అక్షరాస్యత యొక్క శాతము ఒకటి లేక అంతకంటె తక్కువగానుండినది.

పార్లిమెంటువారు వెనుకబడినవారికి సమానావకాశములు కల్పించుట కంగీకరించినారు. కావున, హైదరాబాదు ప్రభుత్వమునకు వెనుకబడిన జాతులపట్టిక త్వరగా తయారుచేసి రాజ్యాంగములోగల సౌకర్యములు సమకూర్చుటకు ఆదేశము లివ్వబడవలయుననియు, అప్పుడే వివిధ తెగలలోగల వ్యత్యాసము సమసి బలిష్ఠమైనజాతి నిర్మింపబడుననియు ఆ విజ్ఞప్తిలో విన్నవించబడినది.

మా కృషిఫలితముగా, ప్రభుత్వము 11 సభ్యులుగల ఒక కమిటి నియమించియుండెను. అందులో 4 ప్రభుత్వోద్యోగులు, ఏడ్గురు ప్రభుత్వేతర సభ్యులు చేర్చబడిరి. ఈఏడ్గురిలో నేనొకడను. ఏప్రిల్ 1952 లో కమిటి వారి సిఫారసుపైన తాత్కాలికముగా 53 కులములవారి ఒక పట్టిక ప్రకటింపబడినది. ఇందులో 'మున్నూరు' కూడ కలదు. అసంతృప్తికర మైన ఈ పట్టిక ప్రకటింపబడగానే, మేము ఉస్మానియా విశ్వవిద్యాలయపు వైస్‌చాన్సలర్‌ను కలసికొనగా వారు వెనుకబడిన తెగవిద్యార్థులకు కళాశాలలో ప్రతిశతము 5 స్థానముల కేటాయింపు అంగీకరించిరి. ఇంతలో 1952లో ప్రధాని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ హైద్రాబాద్ విచ్చేయగా వారి సముఖమున ఒక విజ్ఞప్తి సమర్పింపబడెను. ఆతరువాత భారత ప్రభుత్వపు వ్యవసాయ శాఖా మాత్యులు అఖిలభారత వెనుకబడిన తెగల సమాఖ్యాధ్యక్షులు కీ. శే. పంజాబ్‌రావు దేశ్‌ముఖ్ కూడా హైద్రాబాద్‌కు విచ్చేసిరి. వారికి యొక విందు ఏర్పాటు చేయబడెను. అందులో వారు ఈ కృషిలోపము మనదేయనిరి. ఈ మాటలు మనలో ద్విగుణీకృతోత్సాహమునకు కారణమైనవి. చివరకు ప్రభుత్వ 1953లో 129 తెగలుగల ఒక పట్టిక ప్రకటించినది. కాని ఫలితము శూన్యమే. ఇందుకు ప్రభుత్వము తమకు స్వాభావికమైన మౌనము వహించినది. హైదరాబాదుకు పొరుగు రాష్ట్రములైన మైసూరులో వెనుకబడినవారి ఉద్యోగములలో కళాశాలలో విద్యార్థులకు నూటికి 50, సీట్లు మద్రాసులో నూటికి 25, ఆంధ్రలో 35 కేటాయింపబడగా, హైదరాబాదు కళాశాలల్లో 1954లో నూటికి 5

మాత్రమే కేటాయింపబడినవి. మనము నూటికి 35 చొప్పున రక్షణ కలిగించవలయునని కోరినను ప్రభుత్వము మన కోరికలను పెడచెవిన బెట్టుచున్నది. అన్నివర్ణముల వారికి సమాజములో వారి నిష్పత్తిని బట్టి విద్యాసౌకర్యము కలిగించినప్పుడే ఇప్పుడు ప్రబలియున్న అవిద్య, అస్పృశ్యతాభావములు నిర్మూలమగును. ఇప్పట్ల ప్రభుత్వము వెనుకబడియున్న వారికి ఉన్నతపాఠశాలలోను, కళాశాలలందు ఉచిత విద్య, విద్యావేతనములు, వసతిగృహములు, మున్నగు ఏర్పాట్లు విధిగా చేయవలయును. గ్రామీణ ప్రాంతములలో ప్రాథమిక పాఠశాలలు విరివిగా స్థాపింపబడవలయును. ప్రస్తుత విద్యావిధానము మారవలయును. సామాజిక సంస్కరణలను ప్రవేశపెట్టవలయును. సేద్యయోగ్యమై, వృథాగా పడియున్న భూముల పంపిణీ, ఆర్థికసహాయము, గృహవసతులు - ఇవియన్నియు కల్పించుట ప్రభుత్వపు బాధ్యతలు. ప్రస్తుతము ప్రకటింపబడిన 129 కులముల పట్టిక అసంపూర్ణమై యున్నది. బ్యాక్ వర్డ్ క్లాసెసు కమిషను హైదరాబాదులో పర్యటించునప్పుడు మరికొన్ని వర్ణముల ప్రతినిధులు తమను గూడ ఈపటికతో చేర్చికొనుటకు నివేదించిరి. కమిషను అధ్యక్షులు గూడ వీరి స్థితిగతులను స్వయముగా చూచి వారి నివేదనను అంగీకరించిరి. స్థానికముగా నన్ను శ్రీమతి డా॥ శకుంతలదేవిని అసోసియేటెడ్. సభ్యులుగా చేర్చుకొనిరి.

హైదరాబాదులోని వెనుకబడిన వారికొరకు ఒకస్థిరమైన వ్యవస్థావశ్యకత గురించి ఆలోచించుటకు 8 మే 1954 న నా అధ్యక్షతన, ప్రతి వెనుకబడియున్న తెగనుండి అయిదుగురు ప్రతినిధులుగల ఒక సభ సమావేశమై, "హైదరాబాదు ప్రదేశ్ బ్యాక్‌వర్డ్ క్లాసెసు అసోసియేషన్" పేరట ఒక వ్యవస్థ స్థాపింపబడినది. దాని అధ్యక్షతా భారము నాపై మోపబడినది. 7 సభ్యులుగల ఒక కార్యనిర్వాహకవర్గము, వివిధ కులముల నుండి ఒక్క ప్రతినిధిచొప్పున 23 సభ్యులు గల ఒక స్థాయి సంఘము ఏర్పరుపబడినది.

ఈ సంఘోద్దేశము రాజకీయముగాక, వెనుకబడియున్న అన్ని కులములవారి, విద్యా, సామాజిక, ఆర్థిక, వేయేల సర్వతోముఖాభివృద్ధి, వర్ణతారతమ్యములను మాపివేయుటయే యీ సంఘము యొక్క లక్ష్యమని ప్రకటింపబడినది. మన ఈ విధానము దృష్ట్యా అంతకు

పూర్వము కులముల పేరట స్థాపింపబడిన వసతిగృహముల పేర్లు మార్చి వానికి "వెనుకబడియున్న కులముల వసతిగృహము" అని నామకరణము చేయబడినది. సర్వసమ భావము గల (Cosmopolitan) వ్యవస్థ యగుటచే ఇందులో ప్రతి వెనుకబడియున్న తెగ విద్యార్థులకు ప్రవేశము గలదు. విద్యావ్యాప్తికై కేవలము ప్రభుత్వముపైననే ఆధారపడి యుండక, ఈ అసోసియేషను గూడ గ్రామములలో పాఠశాలలు ప్రతి జిల్లా, ప్రతిపట్టణములో పఠనాలయములు స్థాపించ నుద్దేశించినది. అయితే, దీనికి ఆర్థికస్తోమత అవసరము. ఇదిగాక, వివిధవర్ణములలోగల అనవసర ఆచార వ్యవహార భేదములను గూడ రూపుమాపవలసియున్నది.

వెనుక బడియున్నవారు ఎక్కువగా గ్రామీణ ప్రాంతములలో భూములు కౌలుపై తీసికొని వ్యవసాయము చేసికొందురు. కాని వీరు మధ్యవర్తులైన సాహుకార్లచేతులలో చిక్కియున్నారు. వారిని వ్యావసాయక, పారిశ్రామిక వాణిజ్యరంగములలో, మధ్యవర్తుల బారి నుండి తప్పించుటకై సహకార సంఘముల స్థాపించు ప్రణాళిక మాఎదుటనున్నది. కౌల్దారు సహకార సంఘములు, సహకార వ్యవసాయ సంఘములు కొన్నిచోట్ల పనిచేయుచున్నవి. పారిశ్రామిక సహకార సంఘములు స్థాపింపబడనున్నవి. సికందరాబాదులో టేలర్స్ ఇండస్ట్రియల్ కోపరేటివ్ సొసైటీ యున్నది. వీటిన్నిటికి ఈ అసోసియేషన్ సాధ్యమైన సహాయముచేయుచున్నది.

26- జనవరి 1955 భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున శ్రీ కాకాసాహెబు కాలేల్కరుగారి వ్యాసము 'హిందూ' పత్రికలో బడినది. అందులోని కొన్ని ముఖ్యవిషయములిచట పొందుపరచనగుచున్నవి:

"భారతీయులు బ్రిటిషు పరిపాలనా ఫలితములను చూచియున్నారు. స్వాతంత్ర్యము తరువాత జరుగుచున్న అద్భుత ప్రగతిని గూడ అనుభవించుచున్నారు. బ్యాక్‌వర్డ్ క్లాసెసు కమిషను దేశము యొక్క వివిధ రాష్ట్రములలో పర్యటించి, వెనుకబడియున్న కులముల స్థితిగతులను తెలిసికొనుటకు ఒక ప్రశ్నావళిని ప్రకటించినది. ఇది మనకు కనువిప్పుగా పని చేసినది. ప్రతి వ్యక్తిలో తన స్థితి గురించితానే ఆలోచించుకొను చైతన్యము కలిగినది. కాని పైతరగతుల వారిలో

చలనము కలుగలేదు"- ఇది అస్పృశ్యతా నివారణ వంటి సమస్యయని వారి భావము." కాని హరిజనులు లేక గిరిజనులసమస్య ఒక ప్రత్యేకతెగకు సంబంధించినది. వెనకబడియున్న విశేషజన బాహుళ్యమునకు సంబంధించినది; కావున దీనిని బహుజన సమస్య అనవలెను."

"దేశములో నిరక్షరాస్యులగు కోట్లకొలది వెనుకబడియున్న వారికి వయోజన వోటింగుహక్కు కావలయునని మొదటిసారిగా ప్రతిపాదించినది మహాత్మాగాంధీయే. ఈ వోటింగుహక్కువలన అధికారము బహుజనుల హస్తగతమైనది. ముందు దేశవిధాతలు వారే. వారిని మనము ఇప్పుడు చులకనగా చూడగూడదు. వీరిలో త్వరితగతిని విద్యావ్యాప్తి కలిగించినచో, ఇందులో, మన అందరి క్షేమము నిమిడియున్నది. బహుజనులకు (వెనకబడిన వారికి) మహాజనుల (కొన్ని వేల సంవత్సరముల నుండి వచ్చుచున్న జాతి నిర్మాతలు) అవసరములేదు. మహాజనులువై దొలగవలసియుండును.

పై విషయముల దృష్ట్యా, మన కొక నూతన నాయకత్వ మావశ్యకమైయున్నది. సంకుచితకులత్వములనుండి వైదొలగి జాతినంతటిని సమైక్య పరచు నూతన వ్యవస్థీకరణ వాంఛనీయమైయున్నది. అప్పుడే, మనమీ విశాల ప్రపంచమున, నిక్కువమైన మానవసేవ చేయనోచికొందుము."

1961లో శ్రీయుత ఎం. లక్ష్మినర్సయ్యగారు మంత్రిగానున్నప్పుడు రు. 1,50,000 ఆర్థికంగా వెనుకబడిన వర్గాల సంక్షేమమునకు మూల ధనముగా, నిరుద్యోగ సమస్య నిర్మూలనకు, ప్రభుత్వం వారు నొసంగినది. దానిలో రు. 50,000 రూపాయలకు కుట్టు మెషన్లను కొని, రు. 2,50,00ల సిమెంట్ జాలీలు చేయుటకు, ఇటికే బట్టీల నిర్మాణమునకు వినియోగించితిమి. మిగతా డబ్బు రు. 1,40,000లకు ప్రింటింగ్ ప్రెస్ కొనుటకు వినియోగించితిమి. ఇంతలో 1966 మార్చి వచ్చినది. నిరుద్యోగశాఖ, మంత్రి వర్గ మార్పులో డాక్టర్ చెన్నారెడ్డికి మార్చబడినాది. వారు క్యాపిటల్ గా 25 శాతం నగదు చెల్లించవల్సి నట్టుగా సూత్రమును లేవదీసిరి. దానికి కమిటీ వారు అంగీకరించ నందున మొత్తం పని ప్రభుత్వం స్వాధీనం చేయబడినది. ఇప్పుడు ఆపనిని ప్రభుత్వం స్వయంగా నిర్వహించుచున్నది.

# బొంబాయిలో కీర్తిగడించిన మున్నూరు ప్రముఖులు

ఈ పుస్తకములో 'మున్నూరుకాపు కులచరిత్ర' ప్రకరణములో, బొంబాయిలోగల మున్నూరు కాపులు నిజాం రాష్ట్రము నుండి 300 సంవత్సరములు పూర్వము వలసపోయి అచట స్థిరనివాసమేర్పరచుకున్నట్లు తెలిసికొన్నాము. 1665 సం॥లో డా॥జాన్ ఫ్రెయరు బొంబాయి సందర్శించి, వ్రాసిన "ప్రాక్భారత, పర్షియా(ఈరాన్)లో పర్యటనలు" అను గ్రంథములో కామాటీపురము గురించి ప్రస్తావించియున్నాడు. బొంబాయిలో కార్మికులు నివసించు ప్రదేశము కామాటిపురము అనబడినది. ఐతే, ఇప్పటి కామాటిపూరా అప్పటి కామాటిపూరా కాదు. ఇప్పుడు దాని రూపురేఖలే మారిపోయినవి. ఇప్పటికి దాదాపు 150 సంవత్సరములు పూర్వమే ఇచ్చట భవన నిర్మాణమునందు నిపుణులైనవారు. ఇంజనియర్లుండిరి. వీరిలో, మున్నూరుకాపు వారు విశేషము. ప్రశస్తమైన భవనముల నిర్మించి, భారతదేశములో, బొంబాయిని రెండవ సుందరనగరముగా రూపొందించినవారు మనవారే. అందులో కొందరినిగురించి ఈ క్రింద నుదహరించబడినది. వృత్తిదృష్ట్యా వీరు కంట్రాక్టరులైనను, సంఘ సంస్కార ప్రియులు, ప్రజాహితచింతకులు గూడాను.

---



అఖిల భారత తెలుగు మున్నూరుకాపు మహిళా తృతీయ మహాసభ

# మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి
# కీ॥ శే॥ శ్రీ కన్నంవార్ జీవిత విశేషములు

రచయిత :—డా॥ రఫీఖ్ జాకర్యా.
( భవన, రహదార్ల నిర్మాణశాఖా ఉపమంత్రి మహారాష్ట్రము )

చాందాజిల్లాలో 10 జనవరి 1900న వీరు జన్మించారు. లేబ్రాయము ననే కన్నంవార్ స్వాతంత్ర్యోద్యమములో దూకిరి. 1923; 1941 లో



ఖైదు చేయబడ్డారు. 1942 ఆగష్టు ఉద్యమము ప్రారంభమునకన్న చాల ముందు అరెస్టు అయి, 1945 వరకు జైలులో నుంచబడ్డారు. 1938 నుండి అఖిలభారత కాంగ్రెస్ కమిటీలో సభ్యులుగా నుండి నాగపూరు ప్రాంత కాంగ్రెస్ కమిటీకి 1939 నుండి 1948 వరకు కార్యదర్శిగా నుండిరి. తరువాత, ప్రొవిన్షియల్ కాంగ్రెసుకమిటికి అధ్యక్షులై 1952 వరకు ఆ పదవియందుండిరి.

శ్రీ కన్నంవార్ సంఘసేవయొక్క వివిధరంగములలో తమ నేర్పుగల వ్యక్తిత్వమును ప్రకటించిరి. నాగపూర్ ప్రదేశ్ భారత సేవక సమాజమునకును, నాగపూర్ గ్రామోద్ధరణ సంఘమునకును అధ్యక్షులుగా నుండిరి.

విద్యారంగమందు, పత్రికారచనయందును శ్రీ కన్నంవార్ చాల చురుకైనవారు. 1933న బొంబాయిలో. ఇప్పుడు గాంధీ విద్యాలయ మనబడు "నవభారత విద్యాలయమును" స్థాపించిరి. ఒక సంవత్సరము తరువాత, "లోకసేవక్" అను మరాఠీ వారపత్రికను ప్రకటించిరి. తరువాత 'నవసందేశ్' 'గ్రామసేవక్', 'పంచాయత్‌రాజ్'-అను మూడుపత్రికలను వ్యవస్థీకరించిరి. గాంధీ జీవితము విషయముపై రెండు పుస్తకములు రచించిరి,

1963లో శ్రీ ఎం.ఎస్. కన్నంవార్ ఒక సంవత్సరము పూర్వమే ముఖ్యమంత్రియై యుండిరి. ఆయన పూర్వ జీవితము, బీదతనము వల్ల ఉన్నతవిద్య లేమి, వీరి పురోభివృద్ధికి కొంత ఆటంకము కలిగించిన విషయము నిజము. దీనికి సంఘములో గల సంకుచిత భావములే కారణము. ఇట్లుండియు కేవలము ఒక సంవత్సర స్వల్పకాలములోనే వీరు నిరోధములన్నిటిని అతిక్రమించుటయే గాక, మహారాష్ట్రిలకు, వారి స్థితిగతులను చక్కదిద్దు కొనుటలో ప్రతిభాశాలియని రుజువుచేయగల్గుట, మాకందరకు ఆశ్చర్యము కలిగించినది. తమ శ్రోతలకు, ముఖ్యముగా గ్రామీణులకు తమ పూర్వచరిత్ర చెప్పుచుండగా విన్నాను. మానవుడెంత పతనావస్థలోనున్నను ప్రజాప్రభుత్వపు ఈ రోజులలో, స్వయంకృషి వలన ముఖ్యమంత్రి యగుటకు అవకాశమున్నదని వారి భావము.

శ్రీ కన్నంవార్ కు పార్లమెంటరీ వ్యవహారాలలో దీర్ఘకాలానుభవముండెను. వీరు, మధ్యప్రదేశ్, పూర్వపు బొంబాయి రాష్ట్రములో మహారాష్ట్రంలో మంత్రిమండలిలో నుండిరి. స్వతంత్ర భారతదేశపు ప్రథమ పార్లమెంటులో సభ్యులుగా నుండిరి. 1952న జరిగిన సాధారణ ఎన్నికలలో చాందాజిల్లా 'ముల్' నియోజకవర్గము నుండి మధ్యప్రదేశ్ అసెంబ్లీకి ఎన్నికైరి. జైలు, ఆరోగ్యశాఖలకు మంత్రిగా నియమింపబడిరి. నవంబరు 1956లో రాష్ట్రముల పునర్నిర్మాణము తరువాత బొంబాయి మంత్రిమండలిలో ఆరోగ్యశాఖామాత్యులుగా నుండిరి. 1957 లో బొంబాయి జిల్లా సవోలి నియోజకవర్గమునుండి బొంబాయి శాసనసభకు, ఎన్నుకొనబడిరి. చివర బొంబాయి మంత్రిమండలిలో ఆరోగ్యశాఖ మంత్రిగా నుండిరి. మహారాష్ట్రలో భవన, నిర్మాణము రహదారుల మంత్రిగాపనిచేసిరి. 1961 నుండి రాష్ట్ర అసెంబ్లీ కి తిరిగి ఎన్నికైరి.

శ్రీ కన్నంవార్ ఒక సంవత్సరము క్రింద ముఖ్యమంత్రి పదవీ స్వీకారము చేసినప్పుడు కొందరు వీరి శక్తిసామర్థ్యములను, నాయకత్వమును శంకించిరి. కాని వారు భారతదేశపు ముఖ్యమంత్రులలో మిక్కిలి కుశాగ్ర బుద్ధిగలవారుగా రుజువుపరచుకొని, విమర్శకులకు దిగ్భ్రమ కలిగించిరి.

వీరి పాలనలో అతిక్లిష్ట పరిస్థితి, పురపాలక సిబ్బంది సమ్మె, దాని వెంటనే బి. ఇ. ఎస్. టి, సిబ్బంది సమ్మె - తరువాత టెక్సీ డ్రైవర్ల

సమ్మె, ఇవియన్నియు గత ఆగస్టు 20 నాటి బొంబాయి బందు సమ్మె వలన పరాకాష్ఠజెందెను. కాని వీరు అతి సమర్థతతో ఈ పరిస్థితిని ఎదుర్కొనిరి. యూనియనులు, ప్రభుత్వము లొంగిపోవునని చంకలు ఎగరవేసెను. సమ్మె శృతి మీరి రాగమున బడినట్లగుపడుచుండు సమయమున, శ్రీ కన్నంవార్ దృఢ సంకల్పము, వారి రాజనీతిజ్ఞత వలన ఈ ఉద్యమము చప్పున చల్లారిపోయినది.

వీరు హైద్రాబాద్ సందర్శించినప్పుడు హైద్రాబాద్ మున్నూరు కాపు సంఘపక్షమున సన్మానింపబడెను.

## కీ॥ శే॥ శంకరరావు శాయన్న పర్షా

కీ॥ శే॥ శ్రీ శంకరరావు శాయన్న పర్షా, ప్రఖ్యాతి జెందిన మున్నూరు వారి వంశములో 1880 సంవత్సరమున కామాటిపూర (బొంబాయి)లో జన్మించిరి. వీరు ఆరవ తరగతి వరకు ఇంగ్లీషు భాష అభ్యసించిరి. సంఘసేవపట్ల వీరెంతయో ప్రీతి, అభిరుచి కలిగియుండిరి. 1910 సం॥లో తెలుగువారికై విద్యానిధి స్థాపించుటలో నాయకత్వము వహించిరి. తెలుగుసంఘము, ముఖ్యముగా తెలుగు మున్నూరువార్ సంఘటిత మగుట వీరి కృషి ఫలితమే.

1914 సం॥లో వీరు కోర్టుకు వెళ్ళి లింగూబాయి విద్యానిధి ప్రారంభించిన కీర్తి వీరికే చెందుచున్నది. వీరి నాయకత్వము, ప్రోత్సాహముననే, గౌరవనీయులగు శీలం, డాక్టరు ఘూసరత్, కీ॥ శే॥ శంకరరావు పుపాలా, సేఠ్ విఠల్‌రావు ఆల్గొండే, శ్రీ శంకరరావు గాంగ్లే, సంఘసేవ జేసిరి.

వీరు స్వర్గీయ లోకమాన్య తిలకు యొక్క భక్తియుత సహచరులై యుండిరి, వీరు తెలుగువారిలో రాజకీయ చైతన్యము నుకలిగించిరి. వీరు ఎందరో తెలుగు బీద విద్యార్థులకు ద్రవ్యసహాయ మొనరించి తోడ్పడిరి.

బహీరంగసభలలో ప్రొఫెసరు రాధాకృష్ణన్ (రాష్ట్రపతి)మరియు గా॥ చింతామణికి మహారాష్ట్రము పక్షమున సన్మానపత్రముల సమర్పించి, వారికి తెలుగు సంఘమును పరిచయపరచిరి.

1915 సం॥లో ప్రథమ తెలుగువారి మహాసభ, బొంబాయిలో పూనాలో రెండవమహాసభ,వీరికృషివలన, వీరి నాయకత్వముననేజరిగినవి.

'తెలుగు సమాచార్' అను తెలుగు మాసపత్రికల ద్వారా, ఎన్నియో సంవత్సరములు, విద్యా, సాంఘిక, రాజకీయరంగములలో తెలుగువారి సేవ జేసిరి.

వీరు 1938 సం॥లో 58-వ వయస్సున కీర్తిశేషులైనారు. వీరి అకాల మరణము మహారాష్ట్రపు తెలుగువారందరిని దుఃఖ సముద్రమున ముంచినదనుటలో అతిశయోక్తిలేదు. వారికి ఇది ఒక తీరనిలోటు.

వీరి సతీమణి, వీరి ఏకైక పుత్రిక థాకూబాయి పూనానగరమున నివసించుచున్నారు. వీరు హైదరాబాదుకు ఎన్నియో పర్యాయములు విచ్చేసి నగర వాసులలో చైతన్యము కలుగ జేసిరి.

## లెఫ్టనెంట్ గౌర్నర్ శీలం

జననం 18వ మే1896. వీరుB. A.LL.B, పట్టభద్రులు. క్రీ. శ.1946 నుండి 1949 ఆగష్టువరకు బాంబే ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా



నుండిరి. 1941లో వీరు ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షులుగా నుండిరి. బాంబే హిందీ సభకు కార్యదర్శిగా, బాంబె ఆటోమొబాయిల్స్' (Bombay Automobiles) కార్మికుల సంఘమునకు, 'బాంబే జీవితభీమా' (Bombay Insurance) కార్మికుల సంఘమునకు అధ్యక్షులుగా పనిచేసిరి. మద్యనిషేధ ప్రారంభోత్సవ కమిటీకి ఛేర్ మన్ (chairman) గా నుండిరి.

క్రీ॥ శ॥ 1941 వ సం॥లో సత్యాగ్రహిగా ఒక సం॥ర కాలము శ్రీకృష్ణ జన్మస్థానము(కారాగారము)నలంకరించిరి. 9వఆగష్టు 1942 వ

సం॥మున బంధింపబడి 'ఎరవాడా కారాగారము'న రెండుసంవత్సరములు ఉంచబడిరి.

1922 నుండి 1946 సం॥వరకు బొంబే పురపాలక సంఘ సభ్యులుగా నుండిరి. 1946 లో పురపాలక సంఘమునకు రాజీనామా ఇచ్చి 'Legislature' ఎన్నికలలో పాల్గొనిరి. పురపాలక సంఘపు స్థాయి సంఘకు ఛేర్‌మన్‌గా నుండిరి.

బొంబె శాసన సభాధ్యక్షులుగా పదవి నిర్వహించిరి. ప్రస్తుతము లెఫ్టినెంట్ గౌర్నర్ పాండుచేరిలో ఉన్నారు.

## డా॥ వి. ఆర్. భూసరత్

డాక్టరు వి. ఆర్. భూసరత్. ఎం.బి.బి.ఎస్., ఎం. ఆర్. సాన్ 1- మాజీ గౌరవ మెజిస్ట్రేటు, మాజీ ఫెల్లో సీనియర్ అధ్యాపకులు, గ్రాంట్ మెడికల్ కాలేజి బొంబై ప్రభుత్వపు స్కాలర్ - విశ్వవిద్యాలయ లెక్చరర్, గోల్డ్ మెడలిస్టు (సువర్ణ పతాకము పొందినవారు) బొంబై 1941 లో అఖిల భారత తెల్గు మున్నూరు వార్ ప్రథమ, ద్వితీయ మహాసభలకు కార్యదర్శిగా నుండిరి. 1946 లో అఖిల భారత, తెల్గు మున్నూరుకాపు తృతీయ మహాసభ అధ్యక్షులుగా హైదరాబాదులో జరిగినప్పుడు నుండిరి. 1948 లో గౌరవ మెజిస్ట్రేటు, మరియు జె. పి. (జస్టిస్ ఆఫ్‌పీస్)



1949 లో డైరెక్టర్ హోంగార్డ్ - బొంబై రాష్ట్రము.

1955 లో అఖిలభారత వైద్య పట్టభద్రుల 'శిశువారోగ్య విషయమున, జరిగిన వ్యాసపోటీ పరీక్షలో ఉత్తమ వ్యాసరచయితగా బంగారు పతకమును బడసిరి.

1961 - "భవానీ భక్తయుగ కర్త శివాజీ" అను గ్రంథము రచించిరి. ఇది మహారాష్ట్రి భాషాపండితులచే, మహారాష్ట్రి చరిత్ర కారులచే ప్రశంసింపబడినది.

బృహత్తర బొంబాయి తెలుగు మున్నూరు కుల సంఘమునకు 1963 నుండి అధ్యక్షులుగా నున్నారు.

1964 నుండి బొంబై తెలుగు ఫ్రీ లైబ్రరీ (ఉచిత గ్రంథాలయము)కు అధ్యక్షులుగా నున్నారు.

## శ్రీ కరడి లింగూజియ

వీరు విద్యావేత్తలు. వీరు తమ స్వంతరాష్ట్రమైన నిజాం రాష్ట్రములో కొన్ని సంవత్సరములు న్యాయమూర్తిగా పనిచేసిరి. కాని, త్వరలోనే అధికారయుతమైన ఈ పదవిని త్యజించి, బొంబాయిలో భవన నిర్మాణమును వృత్తిగా చేసికొనిరి. వీరికి గల విద్యాసంపద ఈ వృత్తికి బంగారునకు తావి యబ్బినట్లైనది. అపోలో బందరులో "రాయల్ బాంబే యూత్ క్లబ్బు" వాట్సన్ హోటల్ వీరు నిర్మించిన భవనములలో పేరెన్నికగలవి. ఇందులో వీరి నిర్మాణ కళాకౌశలము దృగ్గోచరమగును. సంఘసేవా తత్పరులనుటకు, బొంబాయిలో మొదటిసారి ప్లేగు వ్యాధి ప్రబలినప్పుడు, ధైర్యసాహసములతో, తమ ప్రాణమునైనను లెక్కసేయక రోగుల సేవ చేసిన ఒక్కవిషయమే నిదర్శనము. వీరు పురపాలక సంఘములో పండ్రెండు సంవత్సరములు సభ్యులుగానుండిరి. 1893లో 63వ ఏట కాలధర్మము నొందిరి.

## 2. శ్రీ నర్సు సాయిబూ వాడ్నాల

వీరు భవన నిర్మాతలే గాక, ఇంజనీర్లు. వీరు విశేషమైన న్యాయ శాస్త్ర పరిజ్ఞానము కలవారై యుండిరి. వీరు ఎన్నియో రైల్వే వంతెనలు, మిల్లులను నిర్మించిరి. 1900 వీరికి జె. పి (జస్టిస్ ఆఫ్ పీస్) చేయబడిరి. తీరికసమయములలో, తమ కులము వారి విషయములలో శ్రద్ధ వహించెడివారు.

## శ్రీ శంకర రాజన్న జిల్కార్

లి. గిర్గాం వద్ద "క్షత్రియజ్ఞాతినివాస్" మరియు ఎన్నియో ఇతర భవములు నిర్మించిరి. 'బొంబాయి తెలుగు విద్యానిధి'ని స్థాపించిన వారిలో వీరొకరు. లింగూబాయి విద్యానిధిలో ధర్మకర్తలు. ఇది తెలుగు బాలబాలికల విద్యావిషయమై స్థాపింపబడిన లక్షరూపాయల విలువగలనిధి. ఇంకా, అనేక మత, ధార్మిక నిధులకు ధర్మకర్తలు. వీరు 1927లో కీర్తి శేషులైరి.

## శ్రీ శాయాజీ నాగోజి జె, పి

జననము - బొంబాయినగరము

విద్యాయోగ్యతలు - మెట్రిక్యులేషన్

వీరితండ్రి - రావ్‌సాహెబ్‌ నాగుసేట్

తెలుగువారిలో విద్యావ్యాప్తికై "బొంబాయి తెలుగు విద్యానిధి" మరియు "తెలుగు ఉచిత పఠనాలయము" స్థాపించి, ధనసహాయము చేయుచు గత కొన్ని సంవత్సరములుగా ఈ రెండు సంస్థలకు ఉపాధ్యక్షులుగాను, ధర్మకర్తగాను వ్యవహరించారు. తమ పితృ స్మారక చిహ్నముగా, తెలుగు మున్నూర్ వారిలో బీదల కొరకు కామాటిపుర బజారు రోడ్డు వద్ద ఒక దివ్య భవనము నిర్మించినారు. ఇందు తెలుగు మున్నూరువారు ఉచితముగా నివసించవచ్చును. శ్రీ గోకర్ణ మహా బలేశ్వర ప్రాచీనమందిరమును పునర్నిర్మించిరి. వీరు రైల్వేలో, పురపాలక సంఘములో చేసిన పనులు అమోఘములు, అసంఖ్యాకములు. బొంబాయి తెలుగు మున్నూరు వారి సంఘమునకు 1911 నుంచి పద్నాలుగు సంవత్సరములు అధ్యక్షులుగాను, ఈ సంఘపు ఆస్తికి ధర్మకర్తలలో నొకరుగా నుండిరి. పూనాలో జరిగిన రెండవ తెలుగు మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. ఇండియా ప్రభుత్వము వీరికి 1916 జె. పి. (జస్టిస్ ఆఫ్ పీస్) బిరుదము నొసగగా, వీరి సన్మానార్థము శ్రీ చమన్‌లాల్ సేతల్ వాడ్ అధ్యక్షతన నూర్ బాగ్‌లో జరిగిన ఒక బ్రహ్మాండమైన సభలో ప్రజలు వీరికి ఒక రజితోభరణిలో సన్మానపత్రము సమర్పించిరి.

## శ్రీ సేట్ భూమాజి శివాజి మల్దొడ్డి

బొంబాయిలో స్వయంకృషివలన ఉచ్ఛ స్థితికి వచ్చిన తెలుగు వారిలో వీరొకరు. మొదలు మొదలు పేదరికపు కాఠిన్యముననుభవించి నను, ఇతరుల సహాయము లేకయే మిలిటరీలో ఎన్నియో గొప్ప భవన ముల నిర్మించి, తమ సచ్ఛీలమువలన ఉన్నతాధికారుల మన్ననలకు పాత్రులైరి. తెలుగు వర్ణములో విద్యావ్యాప్తికి, సాంఘిక సంస్కరణల విషయమును తోడ్పడుటకు వీరెల్లప్పుడు సంసిద్ధులు, జనరంజకులు, పిన్న పెద్దలచే గౌరవింపబడుచున్నవారు. భవన నిర్మాణమందు వీరు గడించిన అనుభవ లాభమును ఈ రంగములో ప్రవేశించిన ఎందరో యువకులకు కలిగించిరి. 64-65 సంవత్సరముల వయోవృద్ధులైనెప్ప టికి పనిలో నిమగ్నులై యుండేవారు.

## లెఫ్టినెంటురాయ్ బహాదుర్ డా॥ భూరయ్యా, జాలయ్యా లక్కా- సర్దారు బహాదుర్, గౌ॥ మెజిస్ట్రేటు, పూనా.

జననము—13 జనవరి 1857

విద్యాయోగ్యత— గ్రాంటు మెడికల్ కాలేజి బొంబాయి
నుండి హాస్పిటల్ అసిస్టెంటు పరీక్ష ఉత్తీర్ణత.

1878 నుంచి 1880 సం॥ వరకు బలూచీ సైన్యముతో ఆఫ్గను యుద్ధభూమిలో డాక్టరుగా పనిచేసి, రజిత పతకము బొందిరి. సునాకీ యుద్ధములో వీరుచేసిన ప్రశంసనీయమైన పనికి, 1885 సం॥లో ఇండియా ప్రభుత్వము రజిత పతకము, ఖేడీల్ ప్రభుత్వము 'చాంద్' పతకము బహూకరించినవి. 1887 లో మధోల్ రాష్ట్రములో చీఫ్ మెడికల్ ఆఫీసరుగాను, 1889 లో సావంత్‌వాడి సర్ దేశాయికి చికిత్సజేయుటకు నియమింపబడిరి. 1894-96 లో మధ్య భారతదేశములో వీరుచేసిన నిర్విరామ సేవకు, ఇండియా ప్రభుత్వము వీరికి రాయ్‌బహాదుర్ బిరుదిచ్చి గౌరవించిరి. అట్లే 1897-98 లో రజిత పతకము బహూకరింపబడెను. 1901 లో యుగాండా యుద్ధ సమయ మున నియమితులై 1902 లో రెండవ తరగతి .B . చేయబడి సువర్ణపతకమును, పొందిరి. వీరి సేవానిరతికై 1907 లో ప్రతి సం॥ రు 600/- ల రాబడిగల జాగీరు ప్రభుత్వము మూడు తరముల వరకు

చెల్లునట్లు ప్రసాదించినది. పంచమజార్జి చక్రవర్తి, మేరీరాణీ పట్టాభిషేక సమయమున, బొంబాయి సూబా సబ్ అసిస్టెంటుసర్జనుల ప్రతినిధిగా ఢిల్లీ దర్బారున కాహ్వానింపబడిరి. ఈసందర్భమున ప్రథమశ్రేణి O.B.E. అనగా సర్దార్ బహాదురు బిరుదము తత్సంబంధమగు సనదు, మరియు ఒక పతకము ప్రసాదింపబడెను. తరువాత పూనా గౌరవన్యాయమూర్తిగా నియమింపబడిరి. ప్రభుత్వముచే 'రావ్‌బహాదుర్' బిరుదము బడయుటచే పూనా తెలుగు మున్నూర్ వార్ వర్ణమునకు శాశ్వత ప్రతినిధిగా నియమింపబడిరి. పూనాలో జరిగిన రెండవ ఆంధ్రసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉండి, జయప్రదముగా నిర్వహించిన గౌరవము వీరికి దక్కినది.

## శ్రీ దేవర్‌పల్లి శివయ్యాహుళన్న

వీరు మిలటరీలో హెడ్‌క్లర్కుగా నుండిరి. పూనాలో జరుగు తెలుగువారి కార్యకలాపములలో పాల్గొనుచుండిరి. క్రికెట్ మొదలగు ఖేలనా;వినోదములలో వీరికి అభిరుచిఎక్కువ. వీరి జ్యేష్ఠపుత్రుడు దేవరపల్లి నరసింగ్. ప్రసిద్ధిజెందిన క్రికెట్ ఆటగాడు. బొంబాయిలో జరిగిన మొదటి మహాసభకు, వీరును వీరి మిత్రులు డా॥ దప్పు రామచంద్రనరసు ఉదారముగా సహాయముచేసిరి. వీరు మే 1907 లో హృద్రోగము వలన మరణించిరి.

## శ్రీ శాయాజీ శివాజీ పొరెడ్డి రేటల్.

### డిప్యూటి కలెక్టరు పూనా : ప్రథమ తెలుగు మహాసభాధ్యక్షులు

జననము — 1862

విద్యాయోగ్యతలు — బి. ఏ. ప్రథమ సంవత్సరము.

1882 లో సదరన్ సెక్షను కమిష్నరు కార్యాలయములో ఒక చిన్న ఉద్యోగములో ప్రవేశించి, 1916 వరకు డిప్యూటి కలెక్టరుగాను, ప్రథమతరగతి మేజిస్ట్రేటు పదవివరకు వచ్చి ఉపకారవేతనముపై ఉద్యోగము విరమించుకొనిరి. 1915 లో బొంబాయిలో జరిగిన ప్రథమ తెలుగు మహాసభ కధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. మున్నూరువారిలో తెలుగుభాషా వ్యాప్తికై ప్రబోధము చేయుటేగాక, తాము స్వయముగా, ఉద్యోగములో నున్నప్పుడు, తెలుగు నేర్చుకొని ప్రావీణ్యము సంపాదించుకొనిరి.

## శ్రీ శాయాజి, నాగోజి, జె. పి.

వీరు సుప్రసిద్ధ భవననిర్మాణ నిపుణులు. పురపాలక సంఘమున కెన్నియో భవన నిర్మాణపు పనులుచేసిరి. సాంటాక్రూజు వద్ద మిల టరి కంటోన్మెంటు నిర్మించిరి. వీరు సాంఘిక విషయములందు శ్రద్ధ తీసుకొనుచుండిరి. ప్రభుత్వము వీరికి జస్టిస్ఆఫ్ పీస్ బిరుదము నొసగిన ప్పుడు కులసోదరులు వీరికి అభినందన పత్రము సమర్పించిరి. వీరు 1926లో కీర్తిశేషులైరి.

## శ్రీ లింగయ్య శాయన్నజయ

వీరు చౌపాటిలో ఎదిన్ వాలా మేన్షన్, సాండ్ హర్ట్సరోడులో దాని భవనములు, మాధవాశ్రమము నిర్మించిరి. సర్ దోరాబ్జి జె. టాటా తాలుకు గ్లాడ్ హర్ట్స్ మేన్షన్ పూనాలో నిర్మించిరి. ఇదియొక గొప్ప నిర్మాణము. కొలంబోవెళ్లి గ్రాండ్ ఓర్యాంటయల్ భవనమును, కుర్లాలో ఒక ఎత్తైనకొండపైన క్షయరోగులకు సానిటోరియం నిర్మించిరి. ప్రజాహిత కార్యములందు, సంఘ సేవయందు పాల్గొనెడివారు. వీరి మరణము అకాలముగా సంభవించినది.

## శ్రీ నర్సింగ్‌రావు పుప్పాల

వీరు కామాటిపురాలో 6వ వీధిలో జన్మించిరి. వీరు బొంబాయి మున్సిపాలటీ మేయర్ నియమితులైరి. వీరి సోదరిని రాంచదల్ తులా ఎం.ఎల్.ఎ. కు ఇచ్చారు వీరి పూర్వీకులు నిజామాబాద్ వాస్తవ్యులు.

★

శ్రీ మున్నూరుకాపు సంఘము ఆదిలాబాద్ పక్షమున
శ్రీయుత బొజ్జం నరసింహులు జమీందారు గారికి సమర్పించబడిన
వృష నామ సం॥ ఆశ్వీయుజ శు॥౧౧ న

# సన్మాన పత్రము

స్వకుల సోదరా !

దసరా సమ్మేళన సందర్భమున నేటి వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించుట కంగీకరించినతమకు మేము మనఃపూర్వకముగ కృతజ్ఞతను దెలుపుచున్నాము - స్వాగతం - సుస్వాగతం.

మున్నూరుకాపు వంశప్రదీపికా !

ఎన్ని వ్యాఘాతములు సంభవించినను ధైర్యసాహసములతో నెదుర్కొని మున్నూరుకాపు నామమును స్థిరముగా నిలిపి, కులసోదరులను నిద్రావస్థనుండి మేల్కొలిపితిరి. అనేకచోట్ల సంఘములను స్థాపించితిరి. హైద్రాబాదు సికింద్రాబాదులలో మహాసభలు జరిపితిరి. బొంబాయి నాగపురములో అఖిలభారత తెలుగు మున్నూరు మహాసభలలో పాల్గొని వన్నె దెచ్చితిరి. మున్నూరుకాపు కులముయొక్క భవిష్యత్తు ఇంకను మీ వలన కాంతివంతముగ నున్నదను యాశగలదు.

ప్రజాహిత కార్యసేవా ధురంధరా !

ఆంధ్రమహాసభలు ఖాన్గి పాఠశాలలు వ్యాయామశాలలు, రాత్రి పాఠశాలలు నిమ్న జాత్యుద్ధరణ హిందూస్మశాన వాటికలో సౌకర్యములు ఇవియవియననేల హైద్రాబాదులో జర్గుచున్న ప్రతి ప్రజాహిత కార్యములందు మీరొనర్చిన సేవ అపారమైనది. ప్రజాహిత జీవనమే పరమావధిగా నిడుకొనిన మీరు ధన్యులు.

త్యాగమూర్తి !

సదాచార సంపత్తి గలిగి శరణాగత రక్షకునివలె తోటి మానవులను కష్టములనుండి తరింపజేయు దయార్ద్రహృదయుడవై, చిన్నలలో చిన్నవై, పెద్దలలో పెద్దవై, సర్వజన సమాదరణీయుడవైన నీతిపరుడవు. ఇట్టి మీకు మా వెంకటేశ్వరస్వామి ఆయురారోగ్యైశ్వర్యములను, సంఘోద్ధరణ శక్తిని ప్రసాదించుగాక. తథాస్తు.

## శ్రీయుత, పొలిశెట్టి నర్సయ్యగారి వీడికోలు సందర్భమున అఖిల హైద్రాబాదు మున్నూరుకాపు మహాసభ పక్షమున నొసగబడిన

# సన్మాన పత్రము

27-6-1954

ఆర్యా !

హైద్రాబాద్ సికింద్రాబాదు నగరములోని గత ఇరువది సంవత్సరములు సర్వతోముఖ పరిస్థితులను, నేటి పరిస్థితులలో బోల్చినచో ఎంతయో వ్యత్యాసము కానగును.

జాత్యుద్ధారకా !

కులభేదముల పాటించక ఎందరో బీద విద్యార్థులకు తన, మన, ధనముతో సాయమొనరించి వారిలో స్వయంకృషి విద్యాసక్తి, ధైర్య సాహసములు కలిగించినారనుటకు, వారిప్పుడు బడయుచున్న అభ్యున్నతియే సాక్షి, మీరు స్వయముగా ఎల్లప్పుడు అభ్యుదయములకై పాటుబడు స్వభావము కలిగియుండి యువకులకు మార్గదర్శకులైనారనుట తథ్యము.

బుద్ధిశాలీ !

చిరుత ప్రాయముననే, విదేశముల కేగి, ఉన్నతవిద్య నభ్యసించి గొప్ప విద్యాబిరుదముల బొందివచ్చిన మన సంఘమువారిలో మీరు ప్రథములు. మున్నూరుకాపు విద్యార్థుల వసతిగృహ నిర్మాణమందు నిజాంరాష్ట్ర మున్నూరుకాపు యువకమండలి స్థాపించిన కాలమున మీకు జాత్యభిమానము కులసేవ మున్నగుసుగుణములు మరువరానివి.

కులభూషణా !

మొన్న మొన్ననే భారత ప్రభుత్వము నుండి వెనకబడియున్న వర్గముల స్థితిగతులను, కనుగొనుటకు అధికార రీత్యా నియమితమైన కమీషను యెదుట నిర్భయముగా సాక్ష్యమిచ్చి కులాభిమానమును ప్రకటించి, మున్నూరు కులజులకు ఆదర్శప్రాయములై తిరి.

మీ సత్యసంధత, సేవాపరయణమే మీ ప్రస్తుత అభివృద్ధికి కారణము. ఈ విషయము మున్నూరుకాపు చరిత్రలో సువర్ణాక్షరములతో వ్రాయబడును. భగవంతుడు మీకు ఆయురారోగ్యైశ్వర్యములు నొసగి, సంఘమునకు, జాతికి, అధిక సేవ నొనర్చుటకు తగినశక్తి ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాము.

## శ్రీశ్రీశ్రీ సూధం వెంకటేశం మేయరు సికింద్రాబాదు

### అఖిల హైద్రాబాదు మున్నూరుకాపు మహాసభ
### పక్షమున సమర్పింపబడిన 27-6-1954

# సన్మానపత్రము

మహాశయా !

**మీరు** యువకులయ్యును, మీ జీవితమందలి సర్వతోముఖసేవ జేయు సదవకాశమొసగినందుకు హైద్రాబాదు **మున్నూరు**కాపు సంఘ సభ్యులము అగు మేము భగవానుని స్తుతించుచు, మిమ్ముల అభినందించుచున్నాము. ప్రజాసేవ మీప్రకృతిలో ఉగ్గుపాలతో చేర్చబడినది. ఇందుకు నిదర్శనములు అనేకములు. మీరు ఆదర్శప్రాయులు; మీ సేవ అనుస్మరణీయము.

జాత్యుద్ధారకా ! సేవ మానవుల విధ్యుక్తధర్మము. అట్టి సుగుణసంపద మీలో ప్రసాదింపబడుట మీజననీ జనకుల పూర్వకృత పుణ్యాతపః ఫలము. ఇది అందరికి ఫలితము కాజాలదు. మీ కృషిఫలితము, మీ నైతికబలము, మీ విజ్ఞానము మీ రాజకీయ చైతన్యము, మీ కార్య దీక్షాతత్పరత కడు శ్లాఘనీయములు.

సంఘసేవాపరాయణా !

మేయరుగా మీ నియామకము, యువకులలో సామాన్యముగాను, మున్నూరుకాపులలో ముఖ్యముగాను, ఒక నూతనోత్తేజమును గలిగించినది మీరు సంఘాశయములను, నెరవేర్చగలరని విశ్వసించుచు మీ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికి భగవంతుని ప్రార్థించుచున్నాము.

## శ్రీ బొజ్జం నర్సింహులుగారి

# సంగ్రహ జీవితచరిత్ర

రచయిత్రి : శ్రీమతి సంఘం లక్ష్మీబాయి యం. పి.

శ్రీ బొజ్జం నర్సింహులుగారు బొజ్జం వెంకన్న. వెంకమ్మ పుణ్యాదంపతుల పూర్వకృతతపః ఫలము. 1895 సంవత్సరమున హైదరా



బాదు జిల్లా ఇబ్రాహీంపట్నం తాలూకాలో జన్మించిరి. అననుకూల కారణముల వలన ఉన్నతవిద్య నభ్యసించజాలకపోయినను వీరు లౌకిక ముగా ప్రజ్ఞావంతులు. తెలంగాణా ప్రజానీకానికి, ముఖ్యముగా హైదరా బాదు-సికింద్రాబాదు జంటనగర పౌరులకు వీరు సుపరిచితులు వీరి కార్యకలాపములు బహుముఖములు. వీరు మొదట కొంత వర్తక వ్యాపారముల చవిజూచిరి. కాని వీరి జీవితముయొక్క విశేషభాగము సాంఘిక రాజకీయ రంగములలో గడచినది; గడచుచున్నది.

అవి ఇరవైయవ శతాబ్దపు తొలి రోజులు. దేశమంతట జాతీయో ద్యమ వాయువులు ప్రసరించుచున్న తరుణములో శ్రీనరసింహులుగారు 1920న కాంగ్రెసులో ప్రవేశించిరి. నేటి వరకు ఈ సంస్థతో సంబంధము కలిగియున్నారు. హైదరాబాదు జిల్లాకాంగ్రెసు కమిటీ, హైదరాబాదు నగర కాంగ్రెసు కమిటీకి కొంతకాలము కార్యదర్శిగానుండిరి. హైదరాబాదు ప్రదేశ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమునకు వీరు ప్రత్యేకాహ్వానమునుపొందు శాశ్వత సభ్యులుగా నుండిరి. ఆంధ్ర జిల్లాకాంగ్రెసు కమిటీకి స్వాగత సంఘాధ్యక్షులుగా నుండిరి.



శ్రీమతి సంఘం లక్ష్మీబాయి యం. పి.

1936లో నిజాం ప్రభుత్వములో రాజకీయ కార్యకలాపములు నిషేధింపబడినప్పుడు అకోలాలో రాష్ట్ర రాజకీయ సమావేశము జరిగినది. ఆ సమావేశముతో వీరికి సన్నిహిత సంబంధముండెను. 1946లో వీరు రాజకీయకారణముల వల్ల నిజాంప్రభుత్వముచే ఆరునెలల పాటు డిటెన్యూగా జైలులో నిర్బంధించబడిరి.

విశాలాంధ్ర మహాసభకు కార్యదర్శిగా నుండి, హైదరాబాదులో అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన విశాలాంధ్ర మహాసభ జరిపిరి.

శ్రీ బొజ్జం నరసింహులుగారు ఆదినుండియు సాంఘిక సర్వో దయాది కార్యము లందు గాఢ విశ్వాసముగలవారు. వీరి సంఘసేవ బహువిధములు. సమాజములో అణగారిపోయిన హరిజనుల సంక్షేమానికి విశేషముగా కృషి సలిపి, వారికి అగ్ర వర్గాలవారితో సమాన ప్రతిపత్తి కలిగించుటకు పాటుపడినారు. ఆంధ్రప్రదేశ్ నిమ్నజాతుల ఆర్థిక సంక్షేమ సంఘమునకు అధ్యక్షులుగా నున్నారు.

మొట్టమొదటగా వెనుకబడిన తరగతుల సంఘము నెలకొల్పి, వారి సాంఘిక పురోభివృద్ధికి తోడ్పడిరి. అఖిలభారత హరిజన సేవక సమాజ్ (హైదరాబాదు శాఖ)కు, అఖిలభారత ఆదిమజాతి సంఘము నకు వీరు స్థాయి సంఘసభ్యులు. 1951లో హైదరాబాదు రాష్ట్రి పెద్యూలు జాతుల, గిరిజనుల ex criminal tribes తదితర వెనుక బడిన కులముల వారల సమావేశము జరిగినప్పుడు ఆ సమావేశమునకు వీరు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా నుండిరి. హైదరాబాదు రాష్ట్రములో స్వర్గీయ యం. జి. నాయుడు వామన నాయకు, రామచంద్ర నాయకు, శ్రీ కిషన్ బారిష్టరుతో పాటు హరిజన (వెల్ ఫేర్ వర్క్), ఏర్పాటు చేసిరి. (అది హిందూ సోషల్ సర్వీస్ లీగ్) నెలకొల్పి దానికి కోశాధి పతిగా నుండిరి.

హైదరాబాదు ప్రాంతపు వెనుకబడిన కులాల ప్రతినిధుల సమా వేశము 8 మే 1954న వీరి అధ్యక్షతన జరిగి హైదరాబాదు ప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘము స్థాపింపబడినది.

ఈ రాష్ట్రములోని వెనుకబడిన కులాల స్థితిగతులను పరిశీలించు టకు 1953లో అఖిలభారత వెనుకబడిన కులాల కమీషన్ హైదరా బాదులో పర్యటించిన సందర్భమున అసోసియేటెడ్ సభ్యుడుగా, కమీషన్ అధ్యక్షులైన కాకాసాహెబు లేకల్కర్ గారితో నిజాం రాష్ట్రమంతట పర్యటించిరి. పర్యటనా నంతరం నివేదిక తయారు చేయబడినది. "వెనుకబడిన కులాల సమస్యలు" అను పొత్తమును ఉర్దులో రచించినారు.

గోల్కొండ పత్రికకు సుమారు 12 సం॥లు గౌ॥ మేనేజరుగాను, తెలంగాణ ఉర్దు దినపత్రికకు సంపాదకులుగా నుండిరి.

హరిజనుల వెనుకబడిన జాతుల అభివృద్ధితో పాటు వీరు గత నుప్పదియారు సం॥గా అస్పృశ్యతా నివారణకు తీవ్రముగా కృషి చేయుచున్న శ్రీ బొజ్జం నర్సింహులుగారు గాంధేయపథగామి.

వీరి ఆర్థిక క్రియా కలాపములలో చెప్పుకోదగిన విషయము వీరు జాతీయ లఘు పరిశ్రమల పారిశ్రామిక సంఘమునకు ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామ పరిశ్రమల సమితికి సభ్యులుగా నుండిరి.

హైదరాబాదు పురపాలక సంఘములో ఆరు సంవత్సరములు కౌన్సిలర్ గాను, వివిధ ఉపసంఘములలో సభ్యులుగాను, అధ్యక్షులుగా నుండిరి. ఆల్ హైద్రాబాదు సికింద్రాబాదులోకల్ బాడీస్ కాన్ఫరన్సు సమావేశమునకు ప్రధాన కార్యదర్శిగా నుండిరి. హైదరాబాదులోని హిందూస్మశాన ప్రబంధ కమిటీ, చీఫ్ జస్టిస్ రాయ్ బిశేశర్ నాథ్ గారి అధ్యక్షతన ఏర్పడినప్పుడు శ్రీ నరసింహులుగారు జెనరల్ సెక్రటరిగా నుండిరి.

ఇదిగాక అనేక సాంఘిక సేవా సంస్థలకు, ఆంధ్రపాఠశాలలకు ఎండోమెంటు ట్రస్టులకు ధర్మశాలలకు అధ్యక్షులుగాను, స్థాయి సంఘ సభ్యులుగాను వ్యవహరించుచున్నారు. ఇందిరా సేవాసదనమున సభ్యులుగా నున్నారు. 'రిఫాహె ఆం' ఉన్నత పాఠశాలకమిటీకి సభ్యులుగా నున్నారు. మరియు ఎన్నియో ఆంధ్రపాఠశాలలను నెల కొల్పిరి.

పద్మశ్రీ మాడపాటి హనుమంతరావుగారు శ్రీ బూర్గుల రామ కృష్ణారావు, శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారలతో కలిసి ఆంధ్రభవన మునకు కార్యదర్శిగానుండి సమకూర్చిన రు. 18000/-ల ధనము రాజా బహదూర్ వెంకటరామారెడ్డి బాలికల కాలేజికి ఇచ్చినవారిలో శ్రీ బొజ్జంగారొకరు. నారాయణగూడలో బాలికల పాఠశాల నెల కొల్పుటకు వీరుగూడ ఒక ప్రధాన కారకులు. 1928లో ఆంధ్రమహా సభ ఆవిర్భవించుటకు పెద్దలతో పాటు వీరి కృషికూడ కారణమే.

ఆంధ్ర దేశములోని కొంతభాగము నిజాం పరిపాలనలో తెలుగు తనమును విస్మరించి, బ్రతుకుచున్న తరుణంలో తెలుగు సోదరులను సుసంఘటిత పరచి ఒకే కుటుంబము క్రింద తీర్చిదిద్దుటకు అనేకమంది పెద్దలు పూనుకొనిరి. అయితే ఈ ఉద్యమము రాజకీయ ధోరణిలో గాక మతవిషయముగా సాగినది. ఇట్టి సందర్భములో శ్రీ నరసింహులు గారు కూడ తమ కులములోని ఉత్సాహవంతులైన యువకులను సమీక రించి, వారి సహకారముతో మారుచున్న వర్తమాన వ్యవస్థకు అను గుణముగా తమ కులమువారిని తీర్చిదిద్ది, వారి అభ్యున్నతికి కృషిచేసి నారు. సాంఘిక దురాచారములను నిర్మూలించి నవ చైతన్య బీజముల నాటి, సాంఘిక జీవితములోని వివిధ రంగములలో తమవారు ప్రవే శించునట్లు ప్రబోధించిరి. ఇంతవరకు వ్యవసాయమే ప్రధానవృత్తిగా జీవించుచున్న తమ కులమువారిలో ఆధునికవిద్య, వాణిజ్యము, తది తర రంగములలో వారి అభిలాషను కల్పించి, వారి సర్వతోముఖవికాస మునకు పాటుబడిరి.

మున్నూరుకాపు కుల సంఘమును ప్రప్రథమముగా స్థాపించి, రాష్ట్రస్థాయిన, అఖిలభారత స్థాయిన సభలు సమావేశపరచినారు. ఈసామియాబజారులో గల మున్నూరుకాపు భవనమును శ్రీ పొన్నాల రాజయ్య, శ్రీ ఎంగల అంతయ్యగార్ల సహాయములతో చందాలు సేకరించి నిర్మించిరి. తరువాత దాని నమ్మి రు. 40.000/- లు మున్నూరుకాపు ట్రస్టుఫండుకు విరాళముగా నిచ్చిరి.

అంతమున, శ్రీ బొజ్జం నరసింహులుగారి గుణ విశేషముల నుద్ఘాటించుచు వారి జీవితచరిత్రను ముగించుచున్నాను. మానవసేవ శ్రీ నరసింహులుగారికి ఉగ్గుపాలతో అబ్బినది. నమ్రత, నిరాడంబరత, మృదుభాషణ వీరి సచ్ఛీలములు, వ్యక్తిత్వపు విలువలను బట్టి గౌరవించు తత్త్వము వీరిది. వ్యవహారములందు నిష్పక్షపాతము, నిష్కాపట్యము వీరిలోగల ప్రత్యేకత. శుద్ధ ఖద్దరుధారి. మొత్తముపైన వీరి జీవితము ఆదర్శప్రాయము.

భగవంతుడు వీరికి ఆయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాక !

# శ్రీ పొన్నాల రాజయ్య (రాజయోగి)

వీరు పొన్నాల వెంకన్న, మల్లమాంబ పుణ్యదంపతులకు 10 - 3 - 1899 నాడు జన్మించిన సుపుత్రులు. ఆనాటి సౌకర్యముల



బట్టి వీరి విద్య కొన్ని శతకములు, ప్రాథమికగణితము వరకే సరిపోయి నది. వీరి పెద్దన్నగారగు నరసయ్యగారు వీరిచదువు మాన్పించి తన బట్టలదుకాణములో నియోగించిరి. వీరికి 12 వ ఏటనే వివాహము జరిగి నది. కొంతకాలమునకు వీరి బట్టలదుకాణము నడువని కారణమున,

చదరా కాంతయ్య, ఉడతా యల్లయ్యగార్ల దుకాణములలో నెలకు 100/- ల ఉద్యోగము ప్రాప్తించినది. కాని అది ఎంతోకాలము జరుగ లేదు. వీరికి బాల్యమునుండియే ఆధ్యాత్మికచింతన మెండు. సత్పురుష సాంగత్యము, సజ్జనగోష్ఠివలన వీరిఆత్మజిజ్ఞాస వృద్ధిఅగుచువచ్చినది. వీరికి శ్రీ హనుమంత రాజయోగీంద్రుల సత్సాంగత్యము లభించినది. వీరు వెండి, బంగారు వ్యాపారము చేయువారు. వారికి వ్యాపారములో గిట్టుబాటు లేనందున, రాజయ్యగారితో కలసి సింగరేణిలో 1921 నుండి 1923వరకు తునికాకు (బీడిఆకు) కాంట్రాక్టువ్యాపారముచేసిరి. ఈవ్యాపారములో వీరి కెన్నియో కష్టనష్టముల నెదుర్కొనవలసివచ్చినది. ఈమధ్య కాలముననే వారు ధనుర్విద్య ఓషధక్రియలు, మంత్రములు నేర్చుకొనిరి. శ్రీహనుమంత రాజయోగి రాజయ్యకుగురుతుల్యులు. వీరిగురుభక్తి సేవా నిరతి,అఖండ మేధాసంపత్తిని గమనించిన రాజయోగీంద్రులుకు 1935లో శ్రీమద్రామదుగు శివరామదీక్షితాచల గురుపీఠమునకు పట్టాభిషేకము జరిగినది. పీఠాధికారము రాగిరేకుపై వ్రాసియివ్వబడినది. ఆధ్యాత్మిక చింతనలు, సభలు, ఆరాధనలు 1936 వరకు జరుగుచునే వచ్చినవి. ఈ సంవత్సరముననే వీరు నిజాంరాష్ట్ర మున్నూరుకాపు ద్వితీయ మహా సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. సింగరేణి, ఖమ్మం నుండి వచ్చిన తరువాత, సికింద్రాబాదులో పైరవీల పనిచేయుచుండిరి. వర్తకులలోను, తదిర వ్యవహారస్థులలో కలుగు తగాయిదాలను పరిష్కారము చేయుచుండిరి. కోర్టులద్వారా వారికి సహాయము చేయుచు, కొంత ధనమార్జించిరి. కాని అంతయు తీర్థయాత్రలలో హారతి కర్పూరమువలె కరిగిపోయినది.

1944 లో వీరి సతీమణి కాలధర్మ మొందినది. అదే సంవత్సరమున ద్వితీయ వివాహమాడిరి.

1947 లో ఇచట రజాకారుదౌర్జన్యములు ప్రబలుటచే వీరు తాడేపల్లిగూడెమునకు వెళ్ళిరి. అచట వీరికి ఎందరో శిష్యులైరి. ఐతే, ఓర్వలేని విరోధులుగూడ ఉద్భవించిరి. కాని వాగ్వాదములో వీరు తమ విరోధులను జయించిరి. కందార్థము జెప్పుటలో వీరు నిపుణులు.

వీరు ఆంధ్రప్రాంతముననేగాక తెలంగాణపు అన్ని జిల్లా, తాలూకా, గ్రామాదులలో ఉపపీఠముల స్థాపించిరి. వీరి జ్యేష్ఠపుత్రిక

వివాహము 1945 లో కైలాస ఈశ్వరయ్య M. sc. తో జరిగినది. వీరికి మార్చి 1959 లో షష్ఠిపూర్తి, మే 1959 లో కనకాభిషేకము జరిగినది. రాజయోగి విజయం అను శ్రీసద్గురు చారిత్రమునుండి తీసుకొనబడినది.

సూచన:- ఈసామియాబజారులో మిర్చికాయల యల్లయ్యగారి మూడు శిధిలమైన గదులు శ్రీ రాజయ్యగారే బొజ్జం నరసింహులుగారి పేరటరిజిస్ట్రీ చేయించిరి. కొన్ని కారణములచే బొజ్జం నరసింహులుగారు సమీపముననే 3 గదులుగల ఈ భూమికిబదులు పురపాలక సంఘమునుండి వేరేభూమి తీసికొని మున్నూరుకాపు భవనమును నిర్మానించిరి. దీనిని అమ్మగావచ్చిన రు 40,000/-లు కాచేగూడ స్టేషనురోడ్డులో నిర్మింపబడిన నూతన వసతిగృహము నకై భూమికొనుటకు సాయపడినవి.

## శ్రీ బీరం రంగారావు బి. ఏ., ఎల్. ఎల్. బి., అడ్వకేటు హైదరాబాదు

జననము 1922. వీరు బీరం సత్యనారాయణగారి ఏకైకపుత్రులు. సైన్యములో యోధులుగావచ్చి హైదరాబాదులో స్థిరనివాస మేర్ప



రచు కొనిన మున్నూరుకాపు కుటుంబములో ఒక కుటుంబము వీరిది. పసుపులేటి గోత్రీయులు. వీరు గత 22 సంవత్సరములుగా న్యాయ

వాదిగా పనిచేయు చున్నారు. వీరి కుటుంబములలో ఎవరును ప్రభుత్వో ద్యోగములో నుండకుండుట ఒక విశేషము. 1950 నుండి 1954 వరకు ప్రభుత్వ రెవిన్యూబోరుకు ఇన్‌కంటాక్సు అడ్వైజరు (ఆదాయపుపన్ను సలహాదారు) గాను, 1955 నుండి 1959 వరకు అసిస్టెంటు గవర్న మెంటు ప్లీడరుగా నుండిరి. 1955 లో భువనగిరిలో జరిగిన మున్నూరు కాపు నాల్గవ మహాసభకు అధ్యక్షులుగా నుండిరి.

వెనుకబడిన తరగతులవారి మహాసభకు అధ్యక్షులుగాను, కార్య వర్గసభ్యులుగాను నుండిరి. మున్నూరుకాపు సంఘపు అన్ని కార్యకలా పములలో పాల్గొనుచు చురుకుగా పనిచేయుచున్నారు.

1962 నుండి ఇప్పటివరకు నగర పురపాలక సంఘములో సలహాదారుగానున్నారు.

## కీ॥ శే॥ డాక్టర్ మల్లయ్య M B. B. S.

జననము—1916

కీ॥ శే॥టంగుటూరి డా॥ మల్లయ్యగారు గౌరవనీయమైన కుటుంబ ములో 1916లో జన్మించినారు. నిర్యాణము 18 జులై 1960.

పుష్పము, తత్సౌరభము అభేద్యములు. మల్లయ్యగారి బాల్యము విద్యాభ్యాసము, ప్రభుత్వోద్యోగము ఇవి యన్నియు ఈ పుష్ప సౌరభ ప్రసారితములు. ఒక మాటలో ఈయన జీవితమంతయు దురదృష్ట వశమున స్వల్పమేయైనను, ఒక క్రమశిక్షణకు, కొన్ని హర్షణీయమగు సిద్ధాంతములకు బద్ధమైయుండెను. ఈయన క్రియాకలాపములు మన స్సాక్షి ప్రతిబింబములు. ఈయన వైద్యవిద్య నభ్యసించు కాలమున, వైద్య విద్యార్థులందరు ఒకే విధమైన దుస్తులు (యునిఫార్మ్) ధరించ వలయునను నిర్బంధముండెను. ఆ దుస్తులలో నల్లని షేర్వాని చుడీ దార్ పాయెజామా నల్లని బూట్లు చేరియుండెను. కాని ఈ నిర్బంధ

ముల నుల్లంఘించుచు మల్లయ్య శుద్ధఖద్దరు బట్టలతో పాఠశాలకు వచ్చేవాడు. తత్ఫలితముగా ఆయన బడినుండి వెళ్లగొట్టబడిన సమయములు కూడ కలవు. ఐతే, అంతమాత్రమున తనధర్మసిద్ధాంతమును విడనాడుట ఆయనకు అస్వాభావికమైన పనిగా దోచెడిది.



సత్యశీలము, ఓర్పు, విధినిర్వహణము, పట్టుదల, దయాదాక్షిణ్యము అవసరమైనప్పుడు ధైర్యస్థైర్యములు ఈయన నైజములు.

మల్లయ్య ఉద్యోగ నిర్వహణాకౌశలము చిరస్మరణీయము. డాక్టరుగా ఈయన ప్రవర్తన నిష్పాక్షికము; ఆదర్శనీయము.

రోజు రోగులే . కేవలము వైద్యచికిత్సయేగాక, కనికరము జాలి వలన గూడ రోగులకు మనశ్శాంతి చివరకు రోగోపశమనము కలుగు నను రహస్యమును మల్లయ్య బాగుగా గుర్తెరిగి యుండెను. ఈయన దృష్టిలో బీదలు ధనికులు సమానులు. వీరు మహారాష్ట్రము నుండి బదిలీ అయినప్పుడు అక్కడి ప్రజలు వీరిని వదులుటకు దుఃఖసాగరములో మునిగిరి.

ఈయన ఫీవర్ ఆసుపత్రిలో పనిచేయ మొదలిడినప్పుడు ఆసుపత్రి భవనముల స్థితి శోచనీయముగా నుండెను. రోగులు కుటీరములలో వరండాలలో పరుండబెట్టబడెడివారు. మనమిప్పుడు

చూచుచున్న ఈ దివ్యభవనము, అందులో అమర్చబడిన అనుకూల సౌకర్యములు అన్నియు మల్లయ్యగారి కృషిఫలితములే

ఆయన కోరినచో ప్రైవేటు రంగమున, వివిధరీతుల పుష్కలముగా ద్రవ్యము గడించెడివాడు. కాని ఆయన దీని కియ్యకొనలేదు. ఇది ఈయన త్యాగ శీలమునకు నిదర్శనము.

నిరాడంబర జీవితము ఈయనలోగల విశేషము. అపరిగ్రహము వీరిధ్యేయము. తాను ప్రభుత్వోద్యోగి, ప్రజాసేవకుడు. అన్నసద్భావమే ఈయన లక్ష్యము. వీరు, రీపేఅం, హైయిస్కూలునందు సుమారు పది సంవత్సరములు కార్యదర్శిగా నుండిరి. పాఠశాల అభివృద్ధి మార్గమునకు తెచ్చిరి. కాని కొన్ని అనివార్య కారణాలు. విద్య ప్రియుడు బీద విద్యార్థులకు సహాయము చేయువారు కాని, 45సం ల వయస్సుననే అకాల మృత్యువునకు బలియై మనలను హతాశులుగా జేసినారు.

కొన్ని సంవత్సరములు మాత్రమే నడుపబడిన వెనుకబడిన విద్యార్థి వసతి గృహము వీరి కాలంలోనే స్థాపించబడినది.



శ్రీ దత్తా[illegible]యు మున్నూరు [illegible]పు తమలపా[illegible]ల వర్తక[illegible]

గద్వాల వెనుకబడిన జాతులవారు
శ్రీ బొజ్జం నరసింహులు
హైదరాబాదురాష్ట్ర వెనుకబడిన జాతుల
సంఘాధ్యక్షులగార్కి సమర్పించిన

# సన్మాన పత్రము

ఆర్యా !

గద్వాల పట్టణ వెనుకబడిన జాతుల వారలమగు మేము మీరాకకు హృదయపూర్వక స్వాగతం తెలుపుచున్నాము. మీరు హైదరాబాదురాష్ట్ర వెనుకబడిన జాతుల సంఘ అధ్యక్షుపదవిని స్వీకరించి, వెనుకబడిన జాతులవారి బాగోగుల కొరకు అసమానమైన కృషిసలుపుచున్నందులకు మీకు మా హృదయపూర్వక అభివందనములు.

ఇంకా రాష్ట్రమొత్తంలో వెనుకబడిన జాతులవారి అభివృద్ధికి సరియైన సౌకర్యములులేవు. ప్రభుత్వం కల్పించిన కొద్దిపాటి సౌకర్యాలను కూడా అందుబాటులో లేకుండా బాధపడటం జరుగుచున్నది.

దేశసౌభాగ్య నిర్మాణంలో నాగరికత, సంస్కృతి అభివృద్ధిలో అసమాన దీక్షతో కృషిచేస్తున్న మాకు, దేశాభివృద్ధికి తోడ్పడే ముఖ్యమైన రంగాలలో సరియైన ప్రాతినిధ్యం కల్పించనందుకు విచారించుచున్నాము.

గత సాధారణ ఎన్నికలలో మా తరగతులవారికి సరియైన ప్రాతినిధ్యం దొరకలేదనడంలో సత్యదూర మేమీలేదు. గడచిన 5 సం॥ రములు, అభివృద్ధిని సూచించే ఏమార్పూ లేకుండా అనుభవించ బడినవి.

మళ్ళీ యిప్పుడు సాధారణ యెన్నికలు జరుగనున్నవి. శాసన సభకు లోకసభకు, ప్రజాసంస్థలలో సాంఘిక, సాహిత్యము మున్నగు రంగాలలో యీసారైనా వెనుకబడిన జాతులవారికి సరియైన ప్రాతినిధ్యం కల్పించబడునని అందుకు మీరు శాయశక్తుల ప్రయత్నించ గలరని విశ్వశించు చున్నాము.

మీరుచేసే కృషియందు సంపూర్ణమగు విజయం చేకూర్చి, సంఘ శ్రేయస్సుకై యితోధికమగుశక్తి, సామర్థ్యములను, భగవంతుడు మీకు ప్రసాదించుగాక,

# మున్నూరుకాపు వసతి గృహ ధర్మకర్తలు

5-5-1965 నాడు, కాచీగూడ స్టేషను సిమెంటు రోడ్డుపైన, 3-3-435 నంబరుగల గృహము, 5250 చదరపు గజముల వైశాల్యము గలది వేలములో రు2,04,000 లకు కొనబడినది మొహమ్మద్ అసదుల్లా సిద్దీఖి పుత్రులు (1) అసదుల్లా సిద్దీఖి ఉరఫ్ ఆరిఫుల్లా (2) తలాతుల్లా సిద్దీఖి ఉరఫ్ అజ్మతుల్లా మరియు కీ॥ శే॥ సిద్దీఖి కుమార్తె అనీసు ఫాతిమా అను ముగ్గురు ఇంటి యజమానులు. వీరు మైనర్లగుటచే, తెనాలీలో సబార్డినేటు జడ్జిగా పనిచేయుచున్న అంజదుల్లా సిద్దీఖి అను వారు సంరక్షకులుగా నుండిరి. ఈ భవనము సిటీ సివిల్ కోర్టువారి బహిరంగ వేలములో కొనబడినది. విక్రయ పత్రము, సం॥ 1414(1965) లో 7-వ మే1965 నాడు శ్రీయుతులు 1. నీలకంఠం సత్యనారాయణ బడిచావుడి, హైదరాబాదు 2. అన్నం రామలింగం మహాకాళి వీధి. సికిందరాబాదు 3. ఏనుగుల సత్తయ్యా ధూల్‌పేట, హైద్రాబాదు. 4. ధడవాయి కిష్టయ్యా. ఫీల్ఖానా, హైదరాబాదు. 5. మోర రాజయ్యా రాంకోటు, హైదరాబాదు పేర క్రయకులుగా రిజిష్టరు చేయబడినది.

ఈ వసతి గృహమునకు పై అయిదుగురు క్రయకులే ట్రస్టీలు (ధర్మకర్తలుగా నియమింపబడిరి. వీరిలో నీలకంఠం సత్యనారాయణ ట్రస్టు నిధులకు కోశాధిపతి. ఈ అయిదుగురే మొదటి నుండియు ట్రస్టు ఆస్తికి, ట్రస్టు నిధులకు, దాని సర్వతోముఖాభివృద్ధికి, సర్వాధికారములు కలిగియున్నారు. ట్రస్టు ఉద్దేశములు ట్రస్టు దస్తావేజులో విపులముగా వ్రాయబడినవి.

## మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహ ట్రస్టు ధర్మకర్తల

# జీవిత విశేషములు

### శ్రీ నీలకంఠం సత్యనారాయణ

జననము : 1918 ఈసామియాబజారు; హైదరాబాదు. తండ్రి - కీ॥ శే॥నీలకంఠం నర్సింలు-ప్రఖ్యాత బట్టల వర్తకులు.

**వీరు** ప్రప్రథమమున టోపీల వ్యాపారము స్వంతముగా ప్రారంభించిరి. 1950లో కుటుంబములో విభాగములు జరిగిన **తరువాత** స్వంత



బట్టలదుకాణము నెలకొల్పి, టోకువర్తకము చేయుచుండిరి. ఇప్పుడు నిర్మాణములోనున్న మున్నూరుకాపు భవనమును తమ కుమారుని పేర కొనుటకు కొంత అడ్వాన్సు ఇచ్చియుండిరి. కాని, కులసోదరుల ప్రోత్సాహముపైన సుమారు మూడు లక్షల రూపాయల లాభము రాగల అవకాశమున్నను వదలుకొని ఈ భవనమును మన కులమునకు అర్పించిరి. వీరి తండ్రిగారు కొన్ని వేల రూపాయల విరాళమిచ్చుటకు ఒప్పుకొని, కొంత చెల్లించిరి. మిగత విరాళమును **వీరు** (శ్రీ సత్య

నారాయణగారు) చెల్లించుటకు ఒప్పుకొనినారు. వీరి ప్రోత్సాహము వలననే మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహము నెలకొల్పబడినది. వీరు ఈ ట్రస్టుకు ముఖ్యకార్య నిర్వాహకులు. వీరు తమస్వంత జామీనుపైన లక్షన్నర రూపాయల ఋణము బ్యాంకు నుండి తెచ్చుటయేగాక, తమ తల్లి దండ్రుల నుండి గూడ కొంతధనము అప్పుగా తెచ్చి వసతిగృహము కొరకు 16 మల్గీలను నిర్మించిరి. ఇట్లు ధర్మకర్తలకు నెలకు సుమారు మూడువేల రాబడి కలిగించిరి. వీరిసేవానిరతికి మున్నూరు కాపు వారందరు ఋణపడి యున్నారు.

## శ్రీ అన్నం రామలింగంగారు

వీరితండ్రి శ్రీ రత్నయ్యాగారు. సుప్రసిద్ధ వెండి, బంగారపు వర్తకులు. నివాసము: మహంకాళీ దేవాలయము, రంగ్రేజుబజారు, సికిందరాబాదు. ప్రాథమికవిద్య తెలుగు, కొంత ఇంగ్లీషులో జరిగినది. వీరు ప్రజాహిత కార్యధురంధరులు. సికిందరాబాదులోని ఆర్య సమాజమందిర నిర్మాణమునకు వీరేకారకులు. సికిందరాబాదువ్యాయామ



శాల స్థాపకులలో వీరుగూడ ముఖ్యులు. వీరు వెండి బంగారపు వర్తకులు. మనజాతిలో గొప్పధనవంతులు, ప్రజారంజకులు. తెలంగాణా అన్ని జిల్లాలలో వీరికి పేరు ప్రతిష్ఠలు కలవు. బొంబాయిలో జరిగిన తెలుగు మున్నూరు ప్రథమ ద్వితీయమహాసభలో పాల్గొనిరి. వీరు మున్నూరు

కాపుభవనమునకు వేలరూపాయల విరాళము చేసినారు. కొంత ఋణము గూడ ఇచ్చినారు. మడ్గెకూడ కట్టించినారు. చందాలు వసూలు చేయుటలో చాల కృషిచేసినారు.

## శ్రీ ఏనుగుల సత్తయ్యగారు

జననము : 1913; నివాసము : ధూలుపేట, హైద్రాబాదు. విద్య : ప్రాథమికవిద్య, తెలుగు.

వీరు మొదట ఒక కిరాణము దుకాణములో ఉద్యోగిగానుండిరి. 1939లో డిస్టిలరీ కాంట్రాక్టు పనిచేసిరి. వీరు చిన్నతనము నుండి చాల



కష్టపడిరి. 1942నుండి స్వంత దుకాణము 'దక్కన్ బాటల్ స్టోర్సు హైదరాబాదు' పేర నడుపుచున్నారు. వీరి సోదరులు శ్రీహరిగారు. వీరు తమసచ్చీలము వ్యాపార నిజాయితీ వలన జంటనగరములలోనేకాక మహారాష్ట్ర, మద్రాసులలోపలుకుబడి సంపాదించినారు. వీరు మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహమునకు వేలరూపాయలు విరాళముగా నిచ్చినారు. వీరి తల్లి కిష్టమ్మ పేర మడ్గె కట్టించుటకు వాగ్దానముచేసిరి. మన కులసోదరులలో వసతిగృహమునకై చందాలు ప్రోగుచేయుటలో చాలకష్టపడినారు. వీరు ప్రతిదినము భవనమునకు వచ్చి పనిచూచుకొనుచు, ఒకవిధముగా సహాయపడుచున్నా రనవచ్చును.

# శ్రీధడువై కిష్టయ్య

జననము : 1918 ఆసిఫ్‌నగర్ హైదరాబాదు. విద్య : తెలుగు ప్రాథమికవిద్య, కొంత ఇంగ్లీషు

వీరితండ్రి ధడువై రామన్నగారు. వీరితండ్రికి తాతల నాటి నుండి మహబూబుగంజు (హైదరాబాదు)లో 'రంగన్న రామన్న'పేర అడ్తి



దుకాణముండెను. 1908లో మూసీనది పొంగివచ్చిన తరువాత వీరి ధుకాణము ఉస్మాన్ గంజుకు మార్చబడినది. 1930 నుండి ఉస్మాన్ గంజులో ఈ దుకాణము ధడ్వాయి రామన్న పేర నడపబడుచున్నది. వీరు పంపించు మార్కెటు ధరలు గోలకొండ పత్రికలో ప్రకటింపబడు చుండెడివి. దీని నమూన ఒకటి ఈ గ్రంథములో వేరొకచోట చూడ నగును. తండ్రికాలముననే వీరు చాల ధనవంతులు. తమస్వంత వ్యాపార నైపుణ్యముచే ఇతోధికముగా శ్రీమంతులైరి. వసతి గృహమునకు వేల రూపాయలు విరాళముగా నిచ్చినారు. ఋణముగా గూడ కొంత ధనమిచ్చినారు. యింతేగాక మడ్గెగూడ కట్టించిరి. చందాలు వసూలు చేయుటలో విశేషముగా కృషిచేసినారు.

## శ్రీ మోర రాజయ్య-తండ్రి మోర రంగయ్యగారు

జననం : 1912 గౌలీపురం-ప్రస్తుత నివాసము రామకోటి.

వీరిది మొదలు తమలపాకుల వ్యవహారము. వీరితండ్రిగారు రాజ కుటుంబమునకు తమలపాకులు సరఫరా చేసెడివారు. వీరు కల్లూరు



నాగయ్య పాతరాజలింగంగారి కొట్టులో కేవలము నెలకు రెండురూపా యలపై ఉద్యోగిగానుండిరి. ఈ ఉద్యోగము కొంతకాలమేచేసి స్వంత ఆకుల మోండా వ్యాపారము ప్రారంభించిరి. సినిమాలో కంట్రాక్టు పని చేసిరి. శ్రీ టి. కే. మొదల్యారు యొక్క సిగరెట్ల ఏజన్సీలోగూడ ఉద్యోగముచేసిరి. ఇచటనే వీరు వ్యావహారిక ప్రాపంచికజ్ఞానము సంపా దించిరి. 1940నుండి వీరు సుల్తాన్‌బజారులో National General Stores పేర టోకు వ్యాపారము చేయుచున్నారు. రామకోటి శ్రీ సీతారామాంజనేయ దేవాలయములో రెండుగదులు ధర్మార్థము నిర్మించిరి. ఇట్లు మోర రాజయ్య కొన్ని వ్యాపారస్థుల సమస్థల (Association) లో ముఖ్యకర్తగాపనిచేసి, పేరు ప్రతిష్ఠలు పొందినారు. వ్యాపారరీత్యా దక్షుడనిపించుకోగలిగినారు. మున్నూరు కాపు విద్యార్థి వసతిగృహ నిర్మాణమునకు చందావ్రాసినారు. మనకుల సోద రులలో ప్రతియొక్కరి నుండి చందావసూలు చేయుటలో చాలశ్రమించి నారు. దీనిని తనస్వంతపనిగా భావించుచు అన్నివిధముల సహాయపడు చున్నారు.

# కీ॥ శే॥ గూటాల వీరన్నగారి ఆస్తి ధర్మకర్తలు

## శ్రీ సింగంశెట్టి వెంకటస్వామి

జననము—1894. వీరు తెలుగు, ఉర్దు, ఇంగ్లీషు భాషలందు మంచి ప్రవేశము కలవారు. మొదటితరగతి అడ్వొకేటు (న్యాయవాది)గా



వీరికి మంచి పేరుగలదు. హైదరాబాదు సిటీ కాంగ్రెసు కార్యదర్శిగా నుండిరి. పురపాలక సంఘములో కాంగ్రెసు పార్టీకి కార్యదర్శిగా నుండిరి.

మున్నూరుకాపు ప్రథమ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగాను, ద్వితీయ మహాసభకు అధ్యక్షులుగానుండిరి. బొంబాయి, నాగపూరులో జరిగిన అఖిలభారత తెలుగు మున్నూరువార్ మహాసభలలో పాల్గొనినారు. అ. భా. మున్నూరుకాపు తృతీయ మహాసభయొక్క ఆహ్వానసంఘమునకు కార్యదర్శిగానుండిరి. కేశవ మెమోరియల్ ఉన్నత పాఠశాలకు కార్యదర్శిగాను, ఆర్య ప్రతినిధిసభకు ఉపాధ్యక్షులుగాను పనిచేయుచున్నారు. ఆర్యసమాజపు ముఖ్య కార్యకర్తలలో వీరొకరు. వీరు పర్గి నియోజకవర్గము నుండి కాంగ్రెసు టికటుపైన శాసన సభకు అభ్యర్థిగానిలచిరి. కాని అచటి స్థానికఅభ్యర్థి పోటీవలన గెలుపొందరైరి.

## శ్రీ గోశ్యాల పెంటయ్య

జననము : 1893 సం॥ గౌలీగూడెము-హైదరాబాదు.

వీరు సిటీ ఇంప్రూవ్ మెంటుబోర్డు (గృహనిర్మాణశాఖ) ఓవర్ సీర్ గా చేరిరి. కార్యదక్షత అనుభవమువలన అధికారులమన్ననలను చూర



గొనిరి. వీరు మున్నూరుకాపు కులమువారికెన్నియో గృహముల నిర్మింపజేసిరి. వీరికి తమ కులగౌరవము అభిమానము మెండు. ఎందరో విద్యార్థులను, వారు విద్యాభ్యసించు వరకు తమ యొద్దనే ఉంచుకొనువారు. కులజుల సాంఘికాభివృద్ధికి దురాచారనిర్మూలనమునకు వీరెంతయో కృషిసలిపిరి. ప్రథమమున కాపుసంఘమున సభ్యులుగానుండి, మున్నూరుకాపు సంఘమును మరియు కాపుసంఘమును కలుపుటకు ఎంతయో శ్రమజేసిరి. అఖిలభారత ప్రథమ ద్వితీయ మహాసభలలో పాల్గొనిరి. వీరు మున్నూరుకాపు పరిశోధకసంఘము నేర్పాటుచేసిరి. మున్నూరుకాపు చరిత్రకై పడరాని పాట్లుపడి కొంతసామగ్రిని సమకూర్చిరి. ఇంకను సమకూర్చుచున్నారు.

## శ్రీ సేరి జగన్నాయకులు

జననము : 1895 గౌలీగూడ, హైదరాబాదు. విద్య : ఇంటర్ వరకు

ప్రభుత్వసహకారశాఖలో ఉద్యోగము చేయుచు ఉన్నతాధికారుల మన్ననలనబడసిరి. తుదకు గెజిటడ్ ఉద్యోగిగా ఉపకారవేతనము పొందు

చున్నారు. వీరు సుమారు కొన్ని సంవత్సరములు తోటబలిజ సంఘములో సభ్యులుగా నుండి, తత్సంఘ దురాచారముల రూపుమాప ప్రయత్నించిరి. తదుపరి మున్నూరుకాపు యువకమండలిని చేబట్టిరి. నాగపూరులో జరిగిన అఖిలభారత మున్నూరువార్ ద్వితీయ మహాసభలో మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహమునకు చందాలు ప్రోగుచేసిరి. వీరి కాలమున యువకమండలి మంచి స్థితిలోనుండెను. వీరు రావు బహాదుర్ రాజా ప్రతాప గీర్జికి పర్సనల్ కార్యదర్శిగా నుండిరి. మున్నూరుకాపు సభలు వీరి దేవుడీలోనే జరుగుచుండెడివి. అఖిలభారత తెలుగు మున్నూరుకాపు స్థాయిసంఘ సభ్యులుగానుండిరి. పూనాలోజరిగిన స్థాయి సంఘ సభకు మంచి పాటవము కలిగించిరి. అఖిలభారత మున్నూరుకాపు మహాసభ పనులు తృప్తికరముగా నడవని కారణమున తన సభ్యత్వమును విరమించుకొనిరి.

## (ఇ) శ్రీ ఎల్లం సత్యనారాయణ

జననం: 1918 ఈసామియాబజారు-హైదరాబాదు. విద్య : మిడిల్ వరకు

వీరు శ్రీ ఎల్లం సీతారాంగారిపుత్రులు. వీరు ఖాదీవస్త్రప్రియులు. హరిజన సేవాసమితికి కోశాధిపతిగా నుండిరి. పురపాలక సంఘమునకు 1951 నుండి 1960 వరకు సభ్యులుగా ఎన్నికైరి. మున్నూరుకాపు యువకమండలికి అధ్యక్షులుగాను, ప్రథమమున్నూరు మహాసభకుగాను, కోశాధిపతిగా దళాధిపతి నుండిరి. హైదరాబాదు మున్నూరుకాపు సంఘ స్థాపకులలో వీరొకరు. మున్నూరుకాపు తృతీయ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులుగా నుండిరి. జంటనగరముల కాంగ్రెసుపార్టీకి అధ్యక్షులు. వీరి కాలముననే కాంగ్రెసు ఎన్నికలు జరిగినవి.

## కీ॥ శే॥ నీలకంఠం నర్సిములు

జననము : 1894 నీలకంఠం రామయ్యగారికి జ్యేష్ఠ పుత్రులు విద్య - సుల్తాన్‌బజార్ వీధిబడి.

వీరికి ఉర్దు, ఇంగ్లీషు భాషలుగూడ వచ్చేవి. వీరు బాల్యము నుండి కష్టజీవి. బాల్యములో వీరి జీవితము స్వల్పాదాయముతో గడచి



నది. గడచిన 50 సంవత్సరముల నుండి వీరు స్వతంత్ర వ్యాపారమునకు పూనుకొని యుండిరి. మహారాష్ట్రులు, కర్ణాటకులు వీరి అభిమాన గిరాకులు. మన ఆంధ్రులకు గూడ వీరిపట్ల ప్రత్యేకాభిమానము. మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహము కొనినప్పుడు వీరు ఘనముగా విరాళమిచ్చుటయే గాక, రు 65.000/- వేలు అప్పుగా నిచ్చి సహాయ పడినారు.

యాదగిరి గుట్ట శ్రీ లక్ష్మీనర్సింహ స్వామి దేవాలయముపైన ధర్మసత్రము నిర్మించినారు. జియాగూడ రంగనాథస్వామి దేవాలయములో ఒకగది కట్టించినారు. సీతారామాంజనేయ దేవాలయమునందును ఒక గదిని కట్టించినారు. వీరు మున్నూరు విద్యార్థి వసతి గృహమందు ఒక మడిగ, ప్రార్థనా హాలు కట్టించుటకు వాగ్దానము చేసియుండిరి. వీరి దానధర్మములలో ప్రశంసాపాత్రములు.



## నీలకంఠం బాలకిష్టయ్య

వీరు నీలకంఠం రామన్న కడపటి కుమారుడు. చాలకాలము కీ॥ శే॥ నీలకంఠం నర్సింలు అన్నగారివద్దనే వుండేవారు. 12 సంవత్సరముల ముందు అన్నగారితో వేరుపడి సుల్తానుబజారులో బట్టల కొట్టుపెట్టి, మంచి పేరు గడించిరి. వీరు మున్నూరు కాపు విద్యార్థి వసతి గృహము కొనుటకు 45000 రూపాయలు ఇచ్చి సహాయపడిరి.



శ్రీ ఎంగల అంతయ్య

జననము : లాల్ దర్వాజా, హైద్రాబాద్

కొన్ని కారణాంతరముల వలన సికిందరాబాదులో నివసించవలసి వచ్చినది. స్వంత కష్టముతో పైకివచ్చిన వ్యక్తి. మంచి పలుకుబడిగల

వారు. దానధర్మ పరాయణులు. ఈసామియాబజారులో మున్నూరు కాపు భవనము పై భాగమునకు కప్పు సుమారు రెండు వేలకు మించిన ధనముతో సిమెంటు రేకులు వేయించినారు. ఇటీవల అనారోగ్యము వలన ఇంటిలోనే యుంటున్నారు. వీరి కుమారుడు ఎంగల హనుమంతరావుగారు. వీరు గూడ మున్నూరుకాపు వసతి గృహమునకు రు. 1000 లు దానము చేసిరి.

## వేములవారి సంక్షిప్త పూర్వ చరిత్ర

పూర్వము కొలపాక (నల్లగొండ జిల్లా) గ్రామము. అచట వీరు నాయకులుగా వ్యవహరింపబడేవారు. ఈ వంశీయులలో మొదటిసారిగా



వేముల
వెంకట
క్రిష్టయ్య

హైదరాబాదు వచ్చిన వారిలో వే ము ల అ న ం త ం గా రు అప్పుడు మీర్ ఆ లం త టా క ము నిర్మాణములో నుండినది. వీరు మీర్ ఆలం మండిలో సర్రా దుకాణము స్థాపించుకొని లావాదేవీ వ్యవహారములు చేయుచుండిరి. కొంతకాలము తరువాత అనంతంగారి కుమారుడు వేముల పుల్లయ్య రాజా బహాదూరు స్టేటులో కోశాధికారిగా

నెలసరి ఏబది చల్నీల (అప్పటి నాణెము) భృతిపై నియమితులైరి. రాజాగారి కోశాగారము వీరింటనే యుండెడిది. రాజాగారు వీరిని రప్పించుకొనుటకు అంబారీని పంపేవారట. ఆడంబరముతో వీరి స్త్రీలుగూడ, మేనాఎక్కి వెళ్లేవారట.

పుల్లయ్య తరువాత ఆయన కుమారుడు వెంకట కిష్టయ్యా, రాజాగారి తరువాత శివరాజ బహాదుర్‌గారి స్టేటులో తమ తండ్రిగారి పదవిపై నుండిరి. కిష్టయ్యాకు తమ స్వంత స్టేటు ఆఫీసుండెడిది. రాజాగారి దేవుడీకి తమ స్వంత గుఱ్ఱపు బగ్గీలో పోవుచుండెడివారు.

ఇబ్రాహింపటం తా॥ మీర్ ఖాన్ పేటలో బేగారికంచె వీరికి మక్తాగా ఇవ్వబడినది. వెంకట కిష్టయ్యాగారికి హైదరాబాదులో పలు చోట్ల స్వంత గృహములు కలిగి లక్షాధిపతి యని పేరొందిరి. వెంకట కిష్టయ్యా మరణానంతరము రాజాగారి కోశాగారము వారి దేవుడీకి తరలింపబడినది.

## ఆకులవారి చరిత్ర

హైదరాబాదు రైనుబజారులో : ఆకుల రామన్నగారి జననము

వీరు సరఫెఖాను (నిజాం స్వంత) పల్టనులో హవాల్దారుగా నుండిరి. ఇంటిలో గాజుల వ్యాపారము గూడ చేయుచుండెడివారు. వీరి కుమారుడు రంగన్న గారు కూడ రైనుబజారులో నుండువారు. రంగన్నగారు ఒక బట్టల కొట్టులో గుమాస్తాగా పనిచేయుచుండువారు. వీరి కుమారుడు ఆకుల వెంకట రామయ్యాగారు. 1916లో వీరి బాల్యము ననే వీరి తండ్రి ఆకుల రంగన్నగారు కాలధర్మమొందిరి. వెంకట రామయ్యాగారికి ఆదాయమేమియు లేని కారణమున, యాకూత్ పురాలో వారితాత(తల్లితండ్రి) పగడాల యల్లయ్యాగారిపోషణలో నుండ వలసి వచ్చినది. వీరికి నల్గురు కుమారులు, నల్గురు కూతుళ్ళు. వీరిమొదటి కుమారుడు హనుమయ్యా M.B.B.S.; ప్రస్తుతము వీరు అమెరికాలో M.R.C.P. చదువుచున్నారు. రెండవకుమారుడు.....B.E ఇంగ్లండులో చదువుచున్నారు. వీరు సుల్తాన్ బజారునందు బట్టలవర్తకము చేయు చున్నారు.

## శ్రీ ఎం. పి. అనంత బుచ్చన్న

జననము : షాద్ నగర్ సమీపమునగల జానంపేట గ్రామములో 1905లో జననము విద్య : మెట్రిక్యులేషనువరకు చదివి, న్యాయశాస్త్ర మభ్యసించినారు.

వీరు ప్రప్రథమమున సికిందరాబాదులోని ఒకకొట్టులో సర్రాఫ్‌గా నుండిరి. 1932లో తమ స్వంతముగా నూనె వ్యాపారము ఆరంభించిరి.

స్నేహిత సంఘము, కాపుసంఘము, ఆర్యసమాజమువంటి సాంఘిక, సాంస్కృతిక సంస్థల ద్వారా సంఘములో సాంఘికమార్పులు



ప్రవేశపెట్టుటకై కృషిజేసిరి. తరువాత రాజకీయములలో ప్రవేశించి వార్డు కాంగ్రెసు కమిటికి అధ్యక్షులుగాను, కాంగ్రెసు పార్టీకి ఉప

నాయకులుగాను, కాందిశీకుల సంఘమునకు అధ్యక్షులుగానుండిరి. ఎన్నియో విద్యాసంస్థలకు అధ్యక్షులుగా నుండిరి;

వ్యాపార రీత్యా ప్రస్తుతము వీరు ఎస్సోస్టాండర్డ్ ఈస్టర్న్ ఇన్కార్పొరేషన్‌లోను మెసర్స్ అనంతస్వామి ఎడిబుల్ ఆయిల్స్ కంపెనీ ఏజెంట్లలో ఒకరుగానున్నారు.

1951లో బేగంపేట వార్డు ప్రతినిధిగా కాంగ్రెసు పార్టీనుండి పురపాలక సంఘములో ప్రవేశించినారు. ప్రస్తుతము వీరు అలాట్మెంటు చైర్మన్‌గా నున్నారు. పురపాలక స్థాయి సంఘములో సభ్యులై యుండి ఉపమేయరుగా ఎన్నుకొనబడినారు.

సికిందరాబాదు పురపాలక సంఘము పక్షమున ఇండియా కౌన్సిల్ శిశుసంక్షేమ సంస్థలో ప్రతినిధిగాను, హైదరాబాదు స్థానిక గ్రంథాలయ అథారిటి మరియు సికిందరాబాదు ఇండియన్ రెడ్‌క్రాసు సంస్థలో సభ్యులుగానున్నారు. సికిందరాబాదు శిశుగ్రంథాలయ కమిటికి సికిందరాబాదు కేంద్ర విద్యాసంఘమునకు, గూడ అధ్యక్షులుగా నున్నారు.

పేరెంట్సు ఎజుకేషన్ సంఘము, నల్లగుట్ట బాలికల ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కమిటీసభ్యులు.

వీరు శాంతస్వభావులు. అనుసరణశక్తి కార్యదీక్ష, పురపాలక సంఘములోని క్లిష్ట సమస్యలను విడదీయగల అనుభవజ్ఞులు.

## శ్రీ అన్నం మంకయ్య - సికిందరాబాదు

వీరు సికిందరాబాదులో వెండి, బంగార వర్తకులగు శ్రీ అన్నం రత్నయ్యగారి పుత్రులు. వీరు వ్యాపారమునందు తమ తండ్రి గారికి మించిన కీర్తి ననుభవించినారు. వయోవృద్ధులు. సికిందరాబాదు కాపు సంఘమునకు అధ్యక్షులు వీరు చందాలు విరాళములు సేకరించి కాపు భవనమును నిర్మించినారు. ఈ భవన మిప్పుడు ఒక లక్ష రూప్యముల విలువగలది. మున్నూరుకాపు కులమునందు వీరికి ధనికులలో ఎవరును సాటిలేరనడములో అతిశయోక్తి లేదు.

## శ్రీ అన్నం విశ్వనాథరావు

వీరు వెండి, బంగారు వ్యాపారస్తులగు శ్రీ అన్నం రత్నయ్య గారి పుత్రులు. వీరు బి.ఏ.,బి.ఎల్. పట్టభద్రులు. అడ్వకేటుగా పనిచేయు చున్నారు. పురపాలక సంఘసభ్యులుగా ఎన్నికై సికిందరాబాదు పురపాలక సంఘమునకు మేయర్‌గా 1957 లో ఎన్నికైనారు. సికిందరాబాదు కాంగ్రెసు కమిటీకి అధ్యక్షులుగా నుండిరి. 1960 నుండి మున్నూరు కాపు మహాసభకు అధ్యక్షులుగానున్నారు. వీరికి తమ కులజులేగాక వెనుకబడిన తరగతులపై చాల అభిమానము.

## కీ. శే. డా॥ రాంశెట్టి దుర్గయ్య

జననము ఇబ్రాహీంపటన్, వీరి విద్యాభ్యాసము వీరి బావగారి వద్ద జరిగినది. వీరు 1910 లో దంతపరీక్ష డాక్టరుగా కృతార్థులైనారు.



వీరు కేమిస్టు సంఘమునకు కార్యదర్శి, సభ్యులుగానుండిరి. 1913 లో దంతవైద్య ఆసుపత్రిని స్థాపించినారు. వీరి కుమారుడు డా॥ రామమూర్తి ఈ ఆసుపత్రిని నిర్వహించుచున్నారు. వీరి మందుల దుకాణము సుల్తాన్ బజారులో కలదు. వీరి కొక కూతురుకలదు. ఈమె కుమార్తులు విద్యలో పట్టభద్రులైనారు.

## చామకూర కుటుంబము

చామకూర కుటుంబము, తెలుగులో కవిశ్రేష్ఠులైన చామకూర కవి (1863-1921) వంశమునకు చెందినది. ఈ అదృష్టము, సుగుణసంపద గల కీ॥ శే॥ సి. కిషన్‌రావు ఈ కుటుంబమునకు చెందినవారే. మీర్ మహబూబ్ అలీ, నిజాం ప్రభువు కాలమున అబ్కారీశాఖలో ఉన్నతోద్యోగిగా పనిచేయుచు మంచి అదృష్టము ననుభవించినారు. తన ముగ్గురు కుమారులను, ఇద్దరు కూతుళ్లను, రాజఠీవితో పెంచినారు, వీరికి రెండు గుర్రముల బగ్గీయుండెడిది. తమ పిల్లలను ప్రతిరోజు సాయంత్రము ఈ బగ్గీలో హుసేన్‌సాగర్ చెరువు కట్టకు వాహ్యాళికి పంపేవారు. వీరి జ్యేష్ఠ కుమారుడు మోనయ్యా నిజాం ప్రభుత్వపు అటవీశాఖలో రేంజరుగానుండిరి. వీరి జ్యేష్ఠ కుమార్తె తిరుపతిలో ధర్మశాల నిర్మించి ఎనుబదియవ ఏట, ఒక నెల క్రితము కీర్తిశేషురాలయినది. అతనికి నలుగురు మనుమలు, ప్రస్తుతము విదేశములలో, వైద్యము, సివిల్ ఇంజనియరింగు, వ్యవసాయములో ఉన్నతవిద్యనభ్యసించుచున్నారు. అనగా వీరిలో ముగ్గురు అమెరికాలో ఒకరు డెన్మార్క్‌లో నున్నారు.

శ్రీ చామకూర మోనయ్యా, వీరు శ్రీ చామకూర కిషిన్‌రావు గారి జ్యేష్ఠ పుత్రులు. (1896-1949) వీరు సచ్ఛీలురు. అటవీశాఖలో రేంజరుగా పనిచేయుచు, వీరు ఆయుర్వేదవైద్యమునభ్యసించి, ఇండియన్ మెడిసినులో పట్టముబొందిరి. వీరు బీదలకు ఔషధములు ఉచితముగా ఇచ్చేవారు. అనుసరణీయమైన వీరి చికిత్సా విధానము, దయాళు హృదయము వలన, ముఖ్యముగా కాయస్థులు వీరినిఎంతో గౌరవంగా చూచుచుండిరి. వీరు నిరాడంబరజీవి. రోగులను కొల్లగొట్టి ధనార్జనము చేయుట వీరి ధ్యేయముగాకుండెను.

వీరి ఏకైక పుత్రుడు శ్రీ సి. కిషన్‌రావు డెన్మార్కులో పశు వైద్య విద్య అభ్యసించుచున్నారు. కిష్టయ్యా కుమారుడు ఇంగ్లాండులో గోపాలస్వామి ఇంజనీర్ కుమారుడు ఇంగ్లాండులో చదువుచున్నారు.

## శ్రీ కె. రాములు

జననము నల్లగొండ - ఆగష్టు 1898.

విద్యాభ్యాసము - బడిలో పదవ తరగతి. వీరు చదుకొను రోజులలో ప్రభుత్వ పాఠశాలలో ఉర్దు, ఫార్సీకి ఎక్కువ ప్రాముఖ్యత



కలిగియుండెను. మిడిల్ తరగతిలో వీరి రెండవభాష అరబి-చిన్నతనముననే ఉద్యోగములో ప్రవేశించి స్వయంకృషివలన, ఉస్మానియా మెట్రిక్యులేషను ఫార్సీ రెండవ భాషతోను, ప్రాక్భాష అందు ఫార్సీలో మున్షిపరీక్షలో కృతార్థులైనారు.

నిజాంరాష్ట్రములో ఆంధ్రోద్యమము ప్రారంభమైన రోజులవి - నల్లగొండనుంచి 'నీలగిరి' వరంగల్లుజిల్లా. మహబూబాబాదు తాలుకా 'ఇనుగుర్తి' నుంచి "తెనుగు" వార పత్రికలు వెలువడు చుండెను. అందులో వీరి వ్యాసములు తరుచుగా ప్రకటితము లయ్యేడివి. గోలకొండ పత్రిక - సుజాత మాసపత్రికలో వీరి వ్యాసములు, కథానికలు ప్రకటింపబడుచుండెడివి.

వీరు తెలుగు, ఉర్దు, ఇంగ్లీషు భాషలు చక్కగా వ్రాయగలరు. ఇది వీరికృషి ఫలితము - వాణిజ్యలెక్కలందు ప్రవీణులు. మనవారిలో వ్యాసరచయితలతో వీరొక్కరు.

## కీ॥ శే॥ చుక్క రాజన్న

వీరు నాంపల్లిలో జన్మించారు. వీరి అన్న చుక్క బాగన్న. వీరు బట్టలదుకాణము మహబూబు చౌకునందుండెను. కొంతకాలము వీరు



అన్నవద్దనే వుండిరి. తదుపరి వీరు స్వయంగా బట్టలదుకాణము పెట్టు కొనిరి. వీరికి పిల్లలు లేని కారణమున ద్వితీయ వివాహమాడిరి. వారికి గూడ సంతానము కల్గలేదు. వీరు మూసానదిమధ్య శివాలయం నెల కొల్పిరి. సఖిబాబమందిరమున మున్నూరుకాపు సోదరులు దినాలు చేసు కొనుటకు మండపము నిర్మించిరి. వీరు కాలధర్మమొందగా వీరిభార్యలు సంచులతో రూపాయలనోట్లు, బంగారం పంచుకొనినట్లు వినికిడి.

# శ్రీ వి. రమణరావు

జననం: 17జూన్ 1929, విద్యాయోగ్యతలు: ఎం.ఏ(ఇకనామిక్స్) ఉద్యోగపు హోదా : డెప్యూటీ డైరెక్టరు - ప్రణాళికాశాఖ, సచివాలయము - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

జననం కరీంనగరము జిల్లాలో మంథని. కరీంనగరము మాధ్యమిక పాఠశాలలో, ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసము. ఉస్మానియా విశ్వ



విద్యాలయము నుండి 1951లో ఎం-ఏ (అర్థశాస్త్రము) ప్రత్యేకతతో కృతార్థులైనారు. ఎం-ఏ (అంతిమ సంవత్సరము) చదువుచున్నప్పుడు ప్రజ్ఞావిశేషము వలన విద్యార్థి వేతనము పొందుచుండిరి. 1949 నుండి 1951 వరకు విశ్వవిద్యాలయ వసతిగృహములలో వార్డన్‌గా నుండిరి. హైద్రాబాదు రాష్ట్రి స్వాతంత్ర్యము కొరకు విద్యార్థ్యుద్యమముతో సంబంధము కలిగి యుండిరి.

2. 1951 లో అర్థశాస్త్రమున లెక్చరరుగా నియమింపబడిరి. ఇంటర్మీడియెటు కళాశాల గుల్బర్గా, హైద్రాబాదు రాత్రిపాఠశాల నిజాం కళాశాలలో 1960 వరకు పనిచేసిరి. 1960 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు పబ్లిక్ సర్వీసు కమీషన్‌చే, బ్యూరో ఆఫ్ ఇకనామిక్స్, జనాభాలెక్కల డిప్యూటీ డైరెక్టరుగా ఎన్నుకొనబడి, నియమింపబడిరి. 1963 నుండి రాష్ట్రి ప్రభుత్వపు ప్రణాళికాశాఖలో పనిచేయుచు, రాష్ట్రీప ప్రణాళికా సూత్రనిర్మాణముతో మరియు, ప్రణాళికా పథకముల ప్రగతిని సమీక్షించు పనులతో సంబంధము కలిగి యున్నారు.

## శ్రీ ఇటికాల మధుసూదనరావుగారి సంగ్రహజీవిత చరిత్ర
## మత్వాడా, వరంగల్

జననం: భీంపల్లి, వరంగల్లు జిల్లా, ఏప్రిల్ 5-1918, విద్య: హనుమకొండ ఉన్నత పాఠశాలలో జరిగినది. 1948 నుంచి వరంగల్ నగరకాంగ్రెసులో సభ్యులు. జిల్లాకాంగ్రెసు కమిటీ, ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలో సభ్యులు.

హైదరాబాదు రాజ్య హిందీ ప్రచారసభలో సభ్యులు. కార్యదర్శి వరంగల్లు హిందీ మహావిద్యాలయపు కార్యనిర్వాహకసభకు అధ్యక్షులు.



వరంగల్లు జిల్లా ఆదివాస సేవా సంఘమునకు 1950 నుండి వ్యవస్థాపక అధ్యక్షులు. జిల్లా వెనుకబడిన తరగతుల సంఘమునకును, హరిజన సంఘమునకును 1953 నుండి వ్యవస్థాపక అధ్యక్షులు. తెలంగాణా ఆదివాసి సేవాసంఘమునకు సలహాదారు ఆంధ్రప్రదేశ్ కార్మికుల సలహా సంఘములో సభ్యులు. వరంగల్లు భారతీయ కళామందిరమునకు అధ్యక్షులు. వరంగల్లు జిల్లాపరిషత్తుకు ఉపాధ్యక్షులు. ఆర్థిక ఉపసంఘములో సభ్యులు. రెండవ లోకసభ (1957–62)లో సభ్యులు: 1938లో హైదరాబాదు రాష్ట్రమున ప్రథమ సత్యాగ్రహిగా కారాగార బంధనము

1942లో క్విట్ ఇండియా ఉద్యమములో చేరి ఖైదు చేయబడినారు. 1947లో రజాకారుల క్రూరకృత్యముల నెదుర్కొనుటకు ఒక సాయుధ నిరోధక వర్గమును స్థాపించి, 14 సంవత్సరముల కఠినశైలు శిక్ష బొందిరి.

సాంఘిక క్రియాకలాపములు :- రాత్రిపాఠశాలలు, గ్రంథాలయ స్థాపనలో పాల్గొనినారు హరిజన, గిరిజనులకు. వెనుకబడిన కులముల వారికి బావులు త్రవ్వించినారు. రోగ నిర్మూలనకై ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల స్థాపించినారు. సమాజాభివృద్ధి (కమ్యూనిటి డెవలప్ మెంటు) పంచాయతీరాజ్ కార్యక్రమములలోను, ప్రాంతీయ వైద్య, ఇంజినీరింగు కళాశాలల స్థాపనలో పాల్గొనినారు. వరంగల్లులో పారిశ్రామిక సంస్థ మరియు గోదాములు (ఇండస్ట్రియల్ ఎస్టేటు, వేర్ హౌజెస్) కొత్తగూడెములో ఎరువుల కర్మాగారము స్థాపించుటలో గూడ పాల్గొనినారు.

అభిరుచులు :-తోటపని, ఈత, చిత్రలేఖనము నాటక, సంగీత, నర్తకశాలల వ్యవస్థీకరణ, తోలుబొమ్మల ప్రదర్శనము, గ్రామీణ ప్రాంతములలో ఆటలు, విద్యా వైజ్ఞానిక కార్యక్రమములు. సామాజిక సమావేశములు, సాంస్కృతిక క్రియాకలాపములు, శారీరక బలప్రదర్శనములు, హిందీమరియు ఆర్యమత సాహిత్యావలోకనము.

ప్రత్యేకాభిరుచులు :- హరిజనుల, వెనుకబడిన కులాలవారి సేవ. సంఘసంస్కరణ, ముఖ్యముగా వితంతూద్వాహములు, అంతర్జాతీయ వివాహములు, వరశుల్క నిర్మూలనము. హిందీ ప్రచారకులు. గ్రామోద్ధరణ కార్మిక సంఘముల, ఇతరతగాదాల పరిష్కరించుట.

ఆటలు, క్లబ్బులు :- పురపాలక సంఘ క్లబ్బులో సభ్యులు రషీద్ మెమోరియల్ టూర్నమెంటుతో సంబంధము యువకులకై వరంగల్లులో వ్యాయామశాల స్థాపించినారు. వరంగల్ జిల్లా మున్నూరు కాపు అధ్యక్షులు.

## శ్రీ టి. (రామదాసు పుత్రుడు) గోపాల్

జననము 20 ఆగష్టు 1941: విద్యాభ్యాసము: కేశవ మెమోరి యల్ ఉన్నత పాఠశాల నుండి హిందీబోధనా భాషతో మెట్రిక్యు



లేషను, నిజాం కాలేజునుండి పి. యు. సి. లో కృతార్థులైరి. ప్రస్తుతము వివేకవర్ధనీ కాలేజు రాత్రిపాఠశాలలో బి. ఏ. పూర్తిచేయుచున్నారు.

మెట్రిక్యులేషను కాగానే సిటి రిజర్వుపోలీసులో సబ్ ఇన్స్పెక్టరుగా, అప్రయత్నముగా స్థానికపోలీసు అధికారులచే ఉద్యోగములో తీసికొనబడిరి. వీరు విద్యార్థిదశలో ఖేలనా కార్యకలాపములలో ఎంత చురుకో, విద్యాభ్యాసములో గూడ అంత కుశాగ్రత కలిగియుండిరి.

వీరు ముఖ్యముగా వాలీబాల్ ఆటలో మిక్కిలి ప్రవీణులు. 1957 నుండి వీరు ఈ ఆట ప్రారంభించినారు. ప్రప్రథమమున, వీరు ఇన్టర్ స్కూల్స్ మేచ్ లలో కలకత్తాలో వాలీబాల్ ఆటాడిరి. ఆ తరువాత భారత దేశపు వివిధ నగరాలలోనేకాక విదేశములలోగూడ ఆటలు ఆడి, ఆల్ ఇండియా వాలీశాల్ చాంపియన్ గా ప్రఖ్యాతిబడసిరి. ఉస్మానియా

విశ్వవిద్యాలయము పక్షమున, 1958 లో తిరువంతపురం (కేరళ) లో 1962 చండీగర్ (పంజాబు)లో; 1964 పాట్నా (బీహార్)లో కెప్టెనుగా 1965 హైదరాబాదులో ఆడిరి.

వీరు Sprinting High jumping లో గూడ ప్రవీణులు. 1960 నవంబరులో జరిగిన ఆంధ్రపోలీసు ఆటలలో 400 మీటర్ల దూరమును 52-2 సెకండ్లలో పరుగిడి, అంతకుపూర్వపు రికార్డును 1-1 సెకెండువరకు, మద్రాసుపోలీసు రికార్డును 0-3 సెకెండ్లు వరకు తగ్గించిరి.

జబల్పూరులో High jump ఆటకు ఒక కేడెము బహూకరింప బడినది.

1961 నుండి ఆల్ ఇండియా పక్షముననే గాక, గత తొమ్మిది సంవత్సరముల నుండి హైదరాబాదు రాష్ట్రము పక్షమున ఆటలు సాగించుచున్నారు.

ఇవిగాక — 1961 లో జపాన్ జట్టుతో కలకత్తానగరమున 1962 లో నాల్గవ ఏషియన్ గేమ్సు - జకర్తా (ఇండోనీషియా) లో 1963లో వాల్గోగ్రాడు మరియు కీఫ్ (రష్యా)లో జరిగిన ఇండోకల్చరల్ ఎక్స్చేంగ్ ప్రోగ్రాములో; 1964లో ప్రో - ఒలంపిక్ గేమ్ - క్రొత్త ఢిల్లీలో; 1965లో సింహళజట్టుతో ఆడుటకు ఎన్నికైనారు. 1966 లో అయిదవ ఏషియన్ గేమ్సులో.

భారతదేశమంతటికి కేప్టెనుగా బెంకాకు (థాయిలెండు) లో వాల్ బుర్రా (మధ్యప్రదేశ్)లో వీరికి బంగారుపతకము, మీరత్ (ఉత్తర ప్రదేశ్)లో రోడుమాస్టరు సైకిల్ బహూకరింపబడినది. వాలీబాల్ ఆటలో ఆసియాఖండ మందే గాక ప్రపంచమంతట అత్యుత్తమ షెమీర్ గా పేరు బడసినారు.

## జిల్లా రాయచూరు మున్నూరు కాపులు

ఒక్క రాయచూరు పట్టణములోనే మున్నూరుకాపులవి రమారమి మూడువేల కుటుంబములున్నవి. అనగా పదైదునుండి ఇరువదివేల మున్నూరుకాపుల జనాభా కలదన్నమాట. తాలూకాలలో, గ్రామములలో గలవారు అదనము. వీరిలో ప్రతిశతము తొంబదిమంది కర్షకులు, న్యాయవాదులు, గుత్తేదారులు, వర్తకులు గూడ కలరు. వీరిలో రాయచూరు నివాసులు శ్రీ గుల్దాసు తిమ్మయ్యగారు పలుకుబడిగల ప్రముఖులు. వీరివయస్సు ఇప్పుడు 61 సంవత్సరములు. వీరొక పెద్దనూనె కర్మాగారమునకు, ప్రత్తిగిర్నిలకు యజమానులు. అడ్తి వ్యాపారమేగా పెద్ద స్థాయిన కర్షకులు, కమిషన్ఏజెంట్లు, గుత్తేదారులు.

వీరి పుత్రులలో నొకరు శ్రీ గుల్దాసు తిమ్మారెడ్డి బి. ఏ. (ఫిజ్యాలొజీ) వయసు 33 సంవత్సరములు రాయచూరు మార్కెటింగు కమిటీకి చేర్మేన్. వాలీబాల్ ఆటలలో నిపుణులు. కలకత్తా, టిృవేంద్రం (తిరువనంతపురం) టాటానగర్ (జంషీదుపూరు) మున్నగు ప్రదేశములలో తమ ఈ ఖేలనా ప్రదర్శనములలో విజయవంతముగా పాల్గొనిరి.

రాయచూరులో రైతు యువకసంఘమునకు శ్రీ తిమ్మారెడ్డి గారే అధ్యక్షులు. శ్రీయుతులు జి. నారాయణరెడ్డి బి. ఏ; వి. రాజన్న గారలు పెద్ద గుత్తేదారులు; సంఘసేవా తత్పరులు. ఇచ్చట మున్నూరు కాపుల గ్రంధాలయం కలదు.

### శ్రీ గుల్దాస్ తిమ్మయ్య (తండ్రి-నరసప్పగారు) రాయచూరు.

జననం-1905

ప్రాథమికవిద్య కన్నడములో నభ్యసించి 22 సంవత్సరముల ప్రాయముననే వ్యాపార రంగములో ప్రవేశించినారు. వీరు గడచిన ఖది సంవత్సరములనుండి అడ్తి (కమిషన్ ఏజెన్సి) వ్యాపారము ఇరు

పది సంవత్సరములనుంచి నూనెగిర్నీ టోకువ్యవహారము నడుపు చున్నారు. ఇదిగాక జిన్నింగు ఫ్యాక్టరీ (ప్రత్తిగిర్నీ) విస్తీర్ణమైన



వ్యవసాయము కలదు. రాయచూరులో ప్రత్తిగిర్నీ వ్యవహారమును మొదటిసారిగా ఆరంభించినవారు వీరే పుత్ర పౌత్రాదులు సిరిసంపద కలిగి దాదాపు ఇరువదివేల మున్నూరుకాపు జనాభాగల రాయచూరు పట్టణమున పరిసర ప్రాంతములలోను, ప్రభుత్వములోను విశేషపలుకుబడి గలిగి యున్నారు.

వీరు 32 సంవత్సరముల క్రితమే కాంగ్రెసు సంస్థలోచేరి పోలీసు చర్యసందర్భమున మూడువారముల జైలుశిక్ష అనుభవించినారు. వీరిప్పటికి కాంగ్రెసువాదులే.

వీరి ద్వితీయపుత్రుడు (34 సంవత్సరములు) శ్రీ గుల్దాస్ తిమ్మారెడ్డి నిజాంకాలేజీనుండి బి. ఏ పట్టము పొందినారు. వీరు వాలీబాల్ ఆటయందు ప్రజ్ఞావంతులు. వీరు మొన్న మొన్నటి వరకు రాయచూరు మార్కెటింగు కమిటీ చేర్మన్‌గా నుండిరి. సంఘసంస్కర్తలు రాయచూరులో ఎన్నియో విద్యాసంస్థలకు అధ్యక్షులు.

శ్రీ తిమ్మయ్యగారి ఇతర ముగ్గురు కుమారులు పి. డబ్ల్యు. డి లో ఉన్నత శ్రేణికి జెందిన కంట్రాక్టర్లు.

# శ్రీ దామర రామన్న గుత్తేదారు, గౌలీగూడ

వ్యవహారములో నిజాయితీవలన ఒకవ్యక్తి ఎట్లు ఉచ్చదశకు వచ్చి జీవిత సౌఖ్యము ననుభవించగలరో అనువిషయమును తెలిసికొనుటకు



నిదర్శనము శ్రీ దామర రామన్నగారు వీరు హైదరాబాదులో గౌలీగూడ నివాసులు. వీరు 1874 ఆ ప్రాంతమున జన్మించిరి. వీరు హైదరాబాదు వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో భవనములు, జలాధారములు, కాల్వలు గుత్తాపై నిర్మించిరి. ఇతరులకు అసాధ్యమైన పనులనుగూడ వీరు చేయగలిగిరి. స్వయంకృషివలన కలుగు ఫలితములను వీరినుండి నేర్చుకొనదగును.

వీరు 64వ ఏట (1938) ఒకనాటి ఉదయము యోగాభ్యాసము చేయుచు అసువులబాసిరి. ధన్యజీవి.

## కీ॥ శే॥ డిచుపల్లి రాజన్న

(నిజామాబాదు)

వీరు నడివయస్సు గలవారు. నిజామాబాదు ఉస్మానుగంజులో అడ్తిదుకాణం లోడింగులారీలు కలవు. మంచి ఉత్సాహవంతులు. మున్నూరుకాపు విద్యార్థివసతి గృహమునకు 1500 దానమిచ్చినదే గాక నిజామాబాదునుండి రు. 6000 లు వసూలుచేసి పంపిరి. ఎల్లారెడ్డి తా॥నుండి రు 2000 లు ఇప్పించిరి. ఆ జిల్లానుండి 40000 వేలకు భర్తీ చేసియుంచుటకు కుతూహలము వెల్లడించిరి. ఇటీవలే ఈయన అకాల మృత్యువుకు గురిఅయినారు. వీరు లేనికారణాన సంఘమునకు చాల నష్టము వాటిల్లినది.



## శ్రీ తుంగ సాంబయ్యగారు

ప్రథమ మున్నూరుకాపు మహాసభ కోశాధికారి. మహాసభ స్థాపకులలో ఒకరు. సుల్తానుబజారులో మంచి బట్టల వర్తకులు.



మార్గం నర్సింగ్‌రావు,
B.A., B.Sc., LL.B.

వెనుకబడిన తరగతుల
మున్నూరుకాపు తృతీయ
మహాసభ కార్యదర్శులు

కీ॥ శే॥ బాదే రామన్న



(జననము) రామకోట్ కంద స్వామిమార్కెటు సరాపుదుకాణము అబిద్ షాపువద్ద లావాదేవీలు చేయువారు. వీరు, 110 ధర్మపెండ్లిళ్ళుచేసి కీర్తిగడించిరి. వీరి కుమారుడు బాదే శివరత్నం గారు సాగర్ టాకీస్ మేనేజరుగా పని చేయుచున్నారు. సినిమాలు నడపడములో మంచి అనుభవము ఉంది.

## శ్రీ జుట్టు గజరాం

జననము 1918 కుంటాల తా॥ నిర్మల్

ఉర్దు తెలుగు బాగనేర్చుకొనిరి. 32 గ్రామాదులకు ఘనశాలి (పెద్దకాపు) మంచిభూస్వామి, కరనీగం గూడవుంది. వెంకటరావు



లక్ష్మీబాయి దేశపాండె గందె భోజన్న వొలెంగార్లకు ముఖురీరెఆంలా వీరు యెన్నియో ప్రజాహిత కార్యములను నెరవేర్చిరి. బాలబాలికల బాఠశాలలను స్థాపించుటము నందు రహదార్లను నిర్మించటములో సహాయపడిరి. వీరు గాంధివాది. ప్రతిసోమవారం మౌన వ్రతము వహింతురు. వీరు ఆర్య సమాజీకులు, శుద్ధశాఖహారి. వీరి తండ్రిగారు జుట్టు పెద్దరామన్నగారియింటికి ఇల్లిటమునకు వచ్చిరి.

## కీ॥ శే॥ కోట్ల వెంకన్న

వీరి జననం రాంకోటిలో జరిగినది. రెసిడెన్సి పరిపాలనము నందు న్యాయశాఖలో వీరు జమేదారుగా నుండేవారు. ఆజానుబాహుడు, మంచిరసికుడు; శేఠ్ సాహుకార్లను అదుపులో నుంచుకొన్నవారు మంచి పలుకుబడి గలవారు. వీరి ఏకైకపుత్రుడు గతించగానే అతని స్మారకచిహ్నంగా రాంకోటి మహాకాళి దేవాలయములో మున్నూరు కాపులకోసం గదిని నిర్మించారు.

## డి. విశ్వనాథం

### అడ్వకేటు

వీరు యువకులు చర్రినాక గొలిపురంలో జన్మించిరి. వీరు ఆతు రాపుజిల్లా గ్రామాదుల బీదలకు చాలాసహాయ పడుచుండెడివారు. శ్రీ మిట్టా లక్ష్మినరసయ్య అడ్వకేటు సొంతభూమి అభియోగము వీరు నడుపుచుండెడివారు. కొన్నికారణముల వలన భూమిని చూచుటకు కప్పర్ వద్దకుపోగ వారిని మున్నూరుకాపులే వీరిని చంపిరి. వీరు మున్నూరుకాపు భవనమునకు ఎలక్ట్రికు మరియు రంగులు వేయించిరి చతుర్థమహాసభ కార్యదర్శిగనుండి ఎంతోసహాయపడిరి.





మున్నూరుకాపు చతుర్థ మహాసభ, భువనగిరి

# బొజ్జం కుటుంబీకులు



1. కూర్చున్నవారు: బొజ్జం రామస్వామి (కీర్తిశేషులు) చిన్ననాయన
2. నిల్చున్నవారు : కుడినుండి గొల్లపల్లి రామస్వామి మేనబావ
3. ,, బొజ్జం పెంటయ్యా వీరు 1914 లో దేశము వదలి ఇంతవరకు జాడ తెలియదు. చిన్ననాయన



బొజ్జం బాలయ్యా 1913 నిర్యాణం
చిన్ననాయన

## శ్రీమతి ముత్యాల బాగమ్మ

జననము 1880. వీరు బొజ్జం ఆగమ్మగారికూతురు. కాచీగూడలో జన్మించిరి. బొజ్జంవారి మేనత్త. వీరి వివాహము ఇబ్రహీంపట్నంలోని ముత్యాల కుటుంబముతో జరిగినది. ఇప్పటికిని వీరు సంపూర్ణారోగ్యవంతులు. ఇబ్రాహింపటన్ నుండి హైదరాబాదునకు నడచి రాగలరు. వీరి కుమారుడు శ్రీ ముత్యాల బుచ్చయ్య మరియు ఇద్దరు కుమార్తెలు ఉన్నారు.



## కీ॥ శే॥ గొల్లపల్లి మంకయ్య

జననము : 1901 : కాచిగూడ.

శ్రీ బొజ్జం వెంకయ్య సోదరి గొల్లపల్లి రుక్కమగారిపుత్రుడు. బొజ్జంవారి మేనబావ. విద్యాభ్యాసము తెలుగు వీధిబడి. బట్టల దుకాణ

ములో, బ్యాంకులో ఉద్యోగముచేసిన అనుభవజ్ఞులు. నిపుణులైన ఫొటోగ్రాఫర్లు (ఛాయా చిత్రకారులు). వీరు మున్నూరుకాపు సంఘమునకు



చేసిన సేవ శ్లాఘనీయము. నాటకసమాజములలో హాస్యనటుడుగా ఎన్నియో నాటకములలో పాల్గొనినారు.



## గొల్లపల్లి అంజయ్య

జననము 1918 యిబ్రహీంపట్నం. వీరితండ్రి గొల్లపల్లి రామస్వామి. విద్య మిడిలు వరకు. వీరి తండ్రి పేరొందిన బీడి వర్తకులు. తండ్రి కాలముచేసిన తరువాత పోలీస్ ఆక్షన్ తదుపరి కొన్ని రోజులు కాంగ్రెస్‌లో ప్రచారకులుగా నియమింపబడి జైలులో రెండు మాసములుండిరి. తదుపరి జిల్లాలలో నుండు మున్నూరుకాపుల అభివృద్ధికి ప్రచారకులుగా నుండిరి. ఇప్పుడుఆరోగ్యము సరిలేనికారణమున

మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహమునందు నిగురానుకారుగా నున్నారు. వీరు బొజ్జం మేన బావమరిది. వీరి సోదరినే శ్రీ బొజ్జం అడివయ్యకు ఇచ్చినారు.



**శ్రీమతి ఏ. ఆర్. సుజాతాదేవి**
(బొజ్జం కూతురు)
జననము : ఏప్రిల్ 1925
వయస్సు : 42 సంవత్సరములు.
జన్మస్థానము : కాచీగూడ
హైదరాబాదు
విద్యాయోగ్యత: మెట్రిక్యులేషను
భర్తపేరు: కీ.శే.ఏ.ఆర్. బాబయ్యా బి. ఏ.
సూపర్నెండెంట్ (ఆర్థికశాఖ)

చిత్రలేఖనలో ఇంటర్మీడియేటు, వయోజన అధ్యాపకుల శిక్షణ పూర్తిచేసినారు. మహిళా ఆరోగ్య అకాడమీ వారిచే నిర్వహింప బడిన అంతిమపరీక్షలందు ఈ క్రింది విషయములలో కృతార్థులైనారు.

(1) ప్రథమచికిత్స, మరియు గృహోపచారము. (2) మంత్ర సానిపని, శిశుసంక్షేమము. (3) ఆరోగ్యము - పరిశుభ్రత (4) సామాన్య వ్యాధులు. (5) క్రియాత్మక విషయములు.

అంబర్‌పేట నియోజకవర్గమునుండి పురపాలక సంఘమునకు సభ్యురాలుగా ఎన్నికైనారు.

వీరి అభిమానాభ్యాసములు మరికొన్ని ముఖ్యమైన క్రియాకలాపములు:

(1) ఆటలలో చురుకైనపాత్ర నిర్వహించినారు. (2) గర్ల్స్ గైడులో సభ్యురాలు. (3) హైదరాబాదు మున్నూరుకాపు మహిళా మహాసభకు అధ్యక్షురాలు. (4) ఆంధ్ర మహిళామహాసభలో ముఖ్యపాత్ర వహించినారు. (5) పెద్ద్యాలు జాతివారి వివిధమహిళాసభలను వ్యవస్థీక

రించారు. (6) వివిధ వీధులలో మెడ్మ్యాలుజాతుల మరియు ఇతర వెనుక బడియున్న తెగలవారికొరకు వయోజ మహిళాసభల వ్యవస్థీకరించి నిర్వహించినారు. (7) ఓల్డ్ గర్ల్స్ సంఘములో సభ్యురాలు. (8) కాంగ్రెసు యొక్క నిర్మాణాత్మకమైన పనులలో ప్రముఖపాత్ర వహించినారు.

1956 నుండి 1960 వరకు హైదరాబాదు పురపాలక సంఘములో ప్రథమ మహిళ సభ్యురాలుగా పనిచేసి, వివిధకమిటీలకు అధ్యక్షురాలుగా ఉపాధ్యక్షురాలుగ పదవుల నిర్వహించిరి.

అఖిలభారత తెలుగు మున్నూరుకాపు తృతీయ మహాసభ, మహిళాశాఖకు కార్యదర్శిగా నుండిరి.

## కీ. శే. ముత్యాల అంజయ్య

వీరు కీ. శే. ముత్యాల రామన్నగారి కుమారులు. స్వయంకృషి వలన పైకివచ్చినవారు. మంచి ఆస్తిపరు లనిపించుకొనినవారు. వీరు



డిఫెన్సు (దేశరక్షణ) నిధికి రు. 1116/-ల విరాళమిచ్చిన ఉదార పురుషులు. దురదృష్టవశాత్తున నిండు వయస్సులోనే మృతిజెందినారు. వీరు బొజ్జం బావమరిది.

## కీ॥ శే॥ రెబ్బ నర్సింలు

వీరి జననము అలియాబాదులో జరిగింది. వీరు తేజాబు దుకాణము చారుకమానువద్ద ఉండెడిది. టంగుసాలలో బంగారము వెండి మూసా పెట్టి శుద్ధిచేయుటలో నిపుణులు.

మీరు నవాబు మీర్ ఉస్మాన్ అలిఖాన్ బంగారము మూస పెట్టించుటకు అవసరమున్నపుడు, నగర కొత్వాల్ రాజబహదూర్ వెంకట రామరెడ్డి గారి ద్వారా వీరిని పిలిపించి, బంగారము వెండిని మూసా పెట్టించువారు.

వీరి నిజాయితీపై నవాబు గారికి నమ్మకము మెండు. వీరి కాలముననే అలియాబాదు మున్నూరుకాపులలో ఐకమత్యము, కుల కట్టుబాట్లు, పంచాయితీల తగాదాల తీర్పు జరిగేవి. వీరి సమకాలికులు కావేటి లక్ష్మీపతి, బండారి బుచ్చయ్యగార్లు వీరికి తోడ్పడుచుండెవారు. సహకార పద్ధతుల ద్వారా మున్నూరుకాపు బీదలకు అప్పులనిచ్చేవారు. ఇప్పుడు దాని మూలధనం రు 40,000/ల వరకు పెర్గినది. వీరి కుమారుడు రెబ్బ అంజయ్య. వీరు కొన్నిరోజులు గోలుకొండ పత్రికలో పనిచేసిరి. కాంగ్రెస్ పురపాలకసభ్యులై ఇప్పుడు జనసంఘులో పనిచేయుచున్నారు.



### శ్రీ పుప్పాల రాంమోహన్
(తండ్రి పుప్పాల సత్యానారాయణరావు)

1935 లో వీరు జన్మించారు. 1952 లో హెచ్.ఎస్.సి. పరీక్షలో ఉత్తీర్ణులైనారు. ఆ తర్వాత బి. ఏ. పట్టభద్రులైనారు. ప్రస్తుతం రైల్వే అకౌంట్సు, ఆఫీస్‌లో పని చేస్తున్నారు. వీరెంతో మున్నూరుకాపు విద్యార్థుల సంఘమునకు సేవచేశారు.

## శ్రీ పుప్పాల ప్రకాశరావు

వీరిజననం 1937 లో జరిగింది. 1953 లో వీరు హెచ్. ఎస్. సి. ప్యాస్‌చేశారు. 1959 లో ఉస్మానియా యూనివర్సిటీనందు బి. వి. ఎస్. సి. అండ్ ఎ. హెచ్. వెటర్నరీకాలేజీలో 1960 న ఉన్నారు.



1964 లో ఎం. ఎస్. కోసం, ప్రభుత్వపక్షంగా యు. ఎస్. ఎ. కు, డిప్యూట్ చేయబడ్డారు. కార్యక్రమాన్ని విజయవంతంచేసి 1966 లో వారు తిరిగి వచ్చారు. ఆంధ్రప్రదేశ్ అగ్రికల్చరల్ యూనివర్సిటీ వెటర్నరీకాలేజిలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా ప్రస్తుతం పనిచేస్తున్నారు. వీరికి బొజ్జం నర్సింలుగారి మనుమరాలితో వివాహం జరిగినది. ఈమె పేరు స్వరాజ్య లక్ష్మి. ప్రిఫైనల్ M.B.B.S. కాకతీయ కాలేజి వరంగల్.

## శ్రీ నారం నరసింగరావు (కాచీగూడ-తుల్జాభవనం హైదరాబాదు)

వీరు దాదాపు 38 సంవత్సరములు ఇండియా స్టేటు బ్యాంకులో పనిచేసి, పేరుప్రతిష్ఠల బొంది, ఇప్పుడు విశ్రాంతి తీసుకొనుచున్నారు. వీరు వాణిజ్యము, కంట్రాక్టు పనిలో అభిరుచిగలవారై వ్యవహారము సాగించిరి. కాని, నష్టము కలిగినది. తుంగభద్రా ప్రాజెక్టులో మొదటిసారిగా సినిమా (టాకీస్) ప్రారంభించినది వీరే. ఇందులో గూడ వీరికి నష్టమే ప్రాప్తించినది. వీరి కుమారుడు నారం కృష్ణరావు సూపరిన్ టెన్‌డెంటు ఇంజనీర్‌గా పనిచేయుచున్నారు.

## కీ॥ శే॥ డాక్టరు నారం అనంతస్వామి(మహంత్)

వీరు సికిందరాబాదులో ఆస్తిపరులు-ప్రథమ దశలో వీరు చేయు వ్యాపారములో అభిలాష లేక, ఆ వృత్తిని మాని ఆయుర్వేద వైద్యములో కృతకృత్యులై ప్రశంసకు పాత్రులైరి. కొన్ని సంవత్సరములు వీరి నివాసము గుంటూరులో నుండెను. వీరు భరత ఖండములో నున్న అన్ని ఆయుర్వేద సంస్థల నుండి ప్రశంసా పత్రముల బడసినారు. నిజాంసాగర్ ప్రాజెక్టు నిర్మాణమప్పుడు అచట వీరే ప్రథమ వైద్యులు. అచ్చటి, చీఫ్ ఇంజనీయరు, మరియు అచటి కంట్రాక్టరు కుమారుల, విరిగిన కాళ్ళకు చికిత్స చేసి బహుమతుల నొందిరి. తత్ఫలితముగా వారు వీరికి ఒక ఆసుపత్రిని నిర్మించియిచ్చిరి. దీర్ఘ కాల రోగులను కూడ ఆరోగ్యవంతులుగ జేయు నిపుణులు.

శ్రీ లక్ష్మణస్వామి ప్రభువు గురు పీఠమునకు వీరు ప్రథమ శిష్యులు. బేగంపేట అల్లాబద్దీన్ బిల్డింగు వెనుకనున్న ఈ గురు పీఠము సీతాఫల్ మండికి మార్చబడినది. వీరు గొప్ప తత్వజ్ఞానులలో నొకరు. వీరు మార్చి 1966 లో అస్తమించినారు. వీరి పెద్ద కుమారుడు డాక్టర్ గా రెండవ కుమారుడు స్టేటుబ్యాంకులో ఉద్యోగిగా పనిచేస్తున్నారు. వీరు మంచి వృద్ధిలో నున్నారు.



## కీ॥ శే॥ నారం నరసింహం (శాస్త్రి, విద్వాన్)

వీరు సికిందరాబాదు నగర నివాసి. వీరు ప్రప్రథమమున వరంగల్లు, దుండిగల్, ఆలేరు, జనగామలో వాణిజ్య వ్యాపారములు జేసి నష్టపడి తన 30 (ముప్పదియవ) సంవత్సరముల ప్రాయములో జ్యోతిష



శాస్త్ర మభ్యసించి, మంచి అనుభవము గడించారు. మద్రాసు, మైసూరు, బళ్లారి, రాయలసీమ, గద్వాల సంస్థానములలో పోటీలలో పాల్గొని ప్రథమస్థాయి నందుకొనినారు. పారితోషికముగా బంగారు జందెముల బొందినారు. పెద్ద లింగంపల్లి దొరవారు వీరిని తమ ఆస్థాన పండితులుగా నియమించుకొనినారు. వీరికి మైసూరు మహారాజా వారితో స్నేహము కలదు. మహారాజావారు వీరిని గొప్పగా ప్రశంసిస్తూ యోగ్యతా పత్ర మొసంగినారు. వీరు అష్టాదశ పురాణ పండితులు. వనపర్తి మరియు ఇతర మహారాజు లందరు వీరిని గౌరవించినవారే. వీరు వారణాసి, హిమాలయ పర్వతముల, కన్యాకుమారి మున్నగు పవిత్ర క్షేత్రముల దర్శించిన పుణ్యాత్ములు.

తన జపతపములతో ఒక కుంటి యువతిని, బాగుపరచి, అసంభవమైన, ఒక వైవాహిక సంబంధము కుదిరించిన విషయములు గూడ కలవు.

వీరికి నల్గురు కుమార్తెలు ముగ్గురు కుమారులు కలరు. అందరు మంచి స్థితిలో నున్నారు.

## హైదరాబాదు రాష్ట్ర (వరహాల) వారి సేవక సంఘము

వెనుకబడ్డ తరగతులవారి అధ్యక్షులగు

### శ్రీ బొజ్జం నరసింహులుగారికి సమర్పించిన

# స న్మా న ప త్రి ము

మహనీయా !

తమ త్యాగబుద్ధి, దేశసేవ, రాజకీయ చతురత, సాహిత్య సేవ సమాజసేవ, హైద్రాబాదు ప్రజలకు చిరస్మరణీయము.

త్యాగమూర్తీ !

తాము తమజీవితము చిన్నప్పటినుండి నేటివరకుహోరాత్రములు తన మన ధనము దేశము కొరకు త్యాగముచేసి స్వాతంత్ర్య సముపార్జనమందు తామొనరించిన మహాకార్యములు ఎన్నటికిని మరువరానివి.

రాజకీయధురంధరా !

హైద్రాబాదు రాజ్యప్రజలలో రాజకీయ చైతన్యము కల్పించుటకై ఆంధ్రమహాసభను స్థాపించిన నాయకులలో తామొకరై దేశదాస్య శృంఖలములను రూపుమాపుటకై నిర్విరామముతో కృషిచేసి తాము తమ సహచరుల త్యాగ్యమే నేటి ప్రజాస్వామ్యయుగములో కాంగ్రెసు సంస్థగా మారినది.

సాహిత్యపోషకా !

తాము నిరక్షరాస్యతను నిర్మూలించ గలందులకు ఆంధ్రసారస్వత పరిషత్తుకు చేసినసేవ వలన నేడు రాష్ట్రములో లక్షల కొలది నిరక్షరాస్యత నిర్మూలింపబడినట్లు కళాశాలవారు అంగీకరించినారు.

సమాజసేవకా !

రాష్ట్రములోఉన్న అన్ని వెనుకబడ్డకులమువారిని ఐక్యపరిచి వారికి సామాజిక రాజకీయ సాంఘిక ఆర్థికహక్కులను ప్రభుత్వముతోఇప్పించి వారి కందరికి ఏకైక నాయకుడగుట మాకు గర్వకారణము.

మా ఇబ్బందులు !

తరతరాలనుండి వెనుకబడిన మమ్ములను నేటివరకు ప్రభుత్వము వెనుకబడ్డ తరగతులవారి పట్టికలో చేర్చలేదు. మాకు నాయకత్వము వహించి, ప్రభుత్వము వెనుకబడవారి పట్టికలో చేర్పించి, మాకు మహోపకార మొనర్తురని ప్రార్థన.

విశాల హైదరాబాదు పట్టణకాంగ్రెసుకమిటి అధ్యక్షపదవి నలంకరించిన

## శ్రీ ఎట్టం సత్యనారాయణ, యం.యల్.సి. గారికి

మున్నూరుకాపుకులసోదరులు, శ్రేయోభిలాషులు, సమిష్టిగాసమర్పించిన

# సన్మానపత్రము

ఆర్యా !

తాము హైద్రాబాదు మరియు సికింద్రాబాదు జంటనగరముల కాంగ్రెసు కమిటీ అధ్యక్షపదవి నలంకరించిన ఈ శుభసమయంలో, మిమ్మభినందించ గలగడం మా యొక్క అదృష్టముగా భావిస్తున్నాము.

మహోదయా !

అటు స్వాతంత్ర్యానికి, పూర్వం, యిటు స్వాతంత్ర్యా నంతరం దేశానికి ఎనలేని సేవజేసిన ఏకైక జాతీయ సంస్థ కాంగ్రెసుమాత్రమే! ఈనాడు జాతి అనన్య సామాన్యమైన ప్రగతిని, ప్రణాళికా బద్ధమైన, పురోభివృద్ధిని సాధిస్తున్నది. అట్టి ఖ్యాతి కాంగ్రెసు సంస్థకే చంద వలసియున్నది. ఇప్పుడు దేశానికి, కాంగ్రెసు సంస్థకు యువక నాయ కత్వం, నిర్మాణకార్యకర్తల అవసరం ఎంతైనావుంది. ఇట్టి తరుణంలో, మీవంటివారు విశాల హైద్రాబాదు పట్టణ కాంగ్రెసు కమిటీలో బాధ్యతాయుతమైన అధ్యక్ష పదవి నలంకరించడం బహుధాప్రశంసనీయము. మీ నాయకత్వంలో స్థానిక కాంగ్రెసు కార్యక్రమాల్లో నూతన చైతన్యం వెల్లివిరియగలదని విశ్వసిస్తున్నాము.

మున్నూరుకాపు కులనాయకా !

దేశములో ఈనాడు ప్రవేశపెట్టబడిన విస్తరణ పథకాలమూలంగా అనేకలాభాలు అందరికి లభిస్తున్నప్పటికి, మా సమస్యలు, సమస్యలుగానే వున్నాయి. ముఖ్యంగా వెనకబడినజాతులవారి వ్యాపార వ్యవసాయాలు, ఉద్యోగాది విషయాలు చెప్పుకోదగిన ప్రోత్సాహంలేక ఎప్పటి మాదిరె సాధారణస్థితిలో వున్నాయనడం అతిశయోక్తికాదు. ప్రభుత్వం ఎప్పటి కప్పుడు కల్పిస్తున్న సౌకర్యాలుకూడా అందుబాటులోకి రాకపోవడం

మరీ విచారకరమైనవిషయం. ఇంతేగాక-కాంగ్రెసు సంస్థకు శక్తివంచన లేని తోడ్పాటు మావారితో లభిస్తున్నా, మాకు సరియైన ప్రాతినిధ్యం లేదు. గత ఎన్నికల్లోను వెనుకబడిన జాతులవారిని చిన్నచూపుచూడడం జరిగినది. గడచిన పదిహేనుసంవత్సరాల దీర్ఘ చరిత్ర ఈవిషయాన్ని ఋజువుపరుస్తుంది. దీనికై మీరు మీ శక్తివంచనలేనికృషి సలుపవలసిందిగా మరిమరికోరుచున్నాము. కనుక ఈనాడు వెనకబడిన జాతులవారి ఆర్థిక, సాంఘిక, వ్యవహారజీవితం ఒకకొత్త మలుపు తిరిగివెలుగును చూడడం అత్యంత అవసరం.

ఇప్పుడు శాసనసభలోను, కౌన్సిలులోను కొంత ప్రాతినిధ్యం యివ్వబడినప్పటికి మంత్రి పదవిలో మాకు సంబందించినవారు ఎవరూ లేరు. ఉన్నఒక్కస్థానము యింతవరకు భర్తీచేయబడలేదు.

యశోమూర్తీ!

మీరు ఈనాటి వరకు వేరువేరు పదువుల్లో తనుసేవను జాతికందిస్తు, చెరగని శాశ్విత కీర్తినిపొందారు. ఇప్పుడు యిదోపైమెట్టు. ఈ పదవిలోను మీరు కృతకృత్యులు కాగలరనడంలో మా కెటువంటి సందేహములేదు. మున్నూరుకాపు విద్యార్థి వసతిగృహ నిర్మాణమందు నాగపూరు అఖిలభారత తెలుగు మున్నూరు కాపు ద్వితీయ మహాసభ సందర్భమున, మీరు కనబరచిననిర్మాణ కార్యదీక్షత మీ యందు, మాకు భవిష్యత్తులోను ఆశనే పురికొలుపుచున్నది. మీ సేవలతో కాంగ్రెసు సంస్థతో పాటు మున్నూరుకాపు కుల ప్రతిష్ఠలు కూడ యినుమడించగలవని ముమ్మాటికి విశ్వసిస్తున్నాము.

దేశానికి యితోధిక సేవచేయగలుగుటకై భగవంతుడు మీకు పూర్ణాయురారోగ్యములు ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాము. సర్వేజనాః సుఖినోభవంతు.

నీలకంఠం నర్సింలు

# హైద్రాబాద్ ప్రదేశ్ బ్యాక్‌వర్డు క్లాసెస్ అసోసియేషన్

## అధ్యక్షులు :
## శ్రీయుత బొజ్జం నర్సింలుగారికి

భువనగిరి విశ్వకర్మ సభవారు సమర్పణజేయు సన్మానపత్రము

**జాతీయ సేవాధురంధరా !**

తామావిర్భవించిన వంశమునకేగాని జాతికేగాని యుపకారంబు చేయవలయునను సంకుచిత భావంబులేక, సర్వమానవ కళ్యాణంబపేక్షించి నైజాము నిరంకుశ ప్రభుత్వము నిర్మూలింప దీక్షవహించిన ఆంధ్రమహా సభలో తాముజేసిన నిస్వార్థసేవయే, ఈనాడు భాగ్యనగర భాగ్య దేవతా ప్రధానామాత్య పదవీ సౌభాగ్యం బాంధవ్యులకు లభించిన దనుటలో అతిశయోక్తి ఏ మాత్రము లేదనుటకు ప్రతి ఆంధ్రుడు గర్వించదగినదై యున్నది.

**స్వాతంత్ర్య ప్రియా !**

పాశ్చాత్య పరిపాలనంబున భారతీయులు సర్వస్వాతంత్ర్యంబులు గోల్పోయి, పంజరంబులలో నున్న సింగంబుల పగిది, యణగియున్న సమయంబున భాగ్యనగరపు ఏకైక తెలుగు పత్రికయగు గోలుకొండ పత్రికయందు తాముజేసినసేవ అపార మనకతప్పదు.

**మాతృభాషాభిలాషీ !**

పురుషులవలెనే స్త్రీలకును, సర్వ స్వాతంత్ర్యంబులు గలవనియు స్త్రీలు సర్వకార్యంబులు నెరవేర్చ సామర్థ్యంబులు కలవారనియు స్త్రీలను దాసీజనంబుగా పరిగణించుట భారతీయుల నాగరికతకు దూరంబనియెంచి, వారి యభ్యుదయమునకై మీరు బాలికల యున్నత పాఠశాల యందొనరించిన అనుపమ సేవయే నేడు మహిళాకళాశాలగా ఆవిర్భవించి ఆదర్శనిగా ఉన్నది.

పతితోద్ధారకా !

కొన్ని శతాబ్దముల నుండి నాటుకొని పెద్దదైన అస్పృశ్యతా వృక్షంబును ఆది హిందుమహాసభ యనుపేర నొక గొప్ప నిశితఖడ్గంబున మొదలంట నిర్మూలించి, అంత్యజులని, అంటరాని వారని అధికార వర్గముల వారిచే ఈర్ష్యాభావంబున పీడింప బడుచుండిన జాతుల యభివృద్ధికై తాము పాటుబడినప్పుడు అన్య జాతీయుల నెదుర్కొనుటలో మీ ధైర్యసాహసంబు లెవ్వరు వర్ణింపకుందురు.

దీక్షానురాగీ !

ప్రప్రథమమున మనప్రభుత్వమువారు వెనుకబడియున్న వర్గాలు నాలుగుమాత్రమే యని నించుకయు విమర్శింపక నిరూపించియుండిరి. కాని నేటిజాతీయ ప్రభుత్వమునం దిట్టి శ్రద్ధారహిత యుద్యోగుల యొక్క పక్షపాతంబున కార్యంబు గావించు అధికారులయొక్క నేత్రంబుల తెరపించి, వారుముందుకు అట్టియభివృద్ధినిరోధముల గావించ నటుల వారె డంబముల నడగించి తమ స్థితిగతులను విన్నవించుకో లేనటువంటి కులంబుల నెల్ల క్రోడీకరించి సుమారు ౧౨౯ కులముల విద్యాభివృద్ధికిని వసతి గృహములకున్ను లభింపజేయుచున్న ఆర్థిక సహాయము మరువ దగినది కాజాలదు.

ప్రస్తుతము ప్రభుత్వమువారు కేటాయించిన విద్యార్థి సీట్లు లెక్కకురానివిగా యుండడమేగాక ఉద్యోగస్థులకే మాత్రము అవకాశ మివ్వకుండ అవరోధము గలిగించుచున్న కాలాహరణమును త్వరలో మాన్పించి, అధోగతి పాలగుచున్న నిరుద్యోగులయొక్క దారిద్ర్యమును నిర్మూలింపజేయు శక్తి సామర్థ్యంబులు పరమేశ్వరుడు ప్రసాదించి తమకు ఆయురారోగ్యంబులు గల్పించి, ఆదర్శనీయునిగా జేయవలయునని ప్రార్థించుచున్నాము.

వెనుకబడిన వర్గాల పక్షమున నాగరకర్నూలు వాస్తవ్యులు

శ్రీయుత బొజ్జం నరసింహులుగారికి సమర్పించబడిన

# స న్మా న ప త్ర ము

పూజనీయా!

తెలంగాణములో ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి గతపాతిక సంవత్సరముల నుండి చేయబడుచున్న కృషియందు తాముగూడ పాల్గొనుచు, చేసిన సేవ అపారమైన త్యాగదీక్షతో గూడుకొనినదని చెప్పుటకు మేమెంతయో గర్వించు చున్నాము. అఖిల హైదరాబాదు మున్నూరుకాపు స్థాయిసంఘ సమావేశము ఇచ్చట జరుపబడు సందర్భములో తామిచ్చటికి విచ్చేయుటచేత తమ దర్శన భాగ్యమున నాగర కర్నూల్ వాస్తవ్యులమగు మేము ధన్యులమైతిమి. ప్రజాహితకార్య తత్పరత, సరళజీవనము, జాతి, మత వివక్షతలేక నిరుపేదలకు సహాయ సంపత్తి నొనగూర్చు నిరంతర సేవాదీక్ష మున్నగు తమ జీవిత లక్ష్య లక్షణములు ఆదర్శ ప్రాయములని భావించు చున్నాము.

పతితోద్ధారకా!

పతితావస్థలోమునిగి అంత్యజులనియు, అస్పృశ్యులనియు అగ్రజాతి వారిచే హేయముగ జూడబడుచున్న కాలములో తాము ముందంజ వేసి సాంఘిక సేవా సమితిద్వారా తీవ్రమైన కృషిని సలిపి అన్నితెగల ఆదిహిందువుల అభ్యుదయమునకు జేసిన సేవ విస్మరించరానిది. కుల కట్టుబాట్లకు జంకక అస్పృశ్యతా నివారణకు, అంత్యజనోద్ధారణకు అన్నిరంగములయందు తాము ప్రవేశ పెట్టిన అభివృద్ధిమార్గములే తొలి సోపానములై వికాసమునంది హైదరాబాదు రాష్ట్రమునకు కీర్తిని చేకూర్చినవి.

దీనబంధూ!

హైదరాబాదులో అత్యధిక సంఖ్యాకులుగానున్న వెనుకబడిన వర్గాల సాంఘిక విద్యా వైజ్ఞానిక ఆర్థిక రంగములలో చాల నికృష్టముగా నుండుట గమనించి, వారి అభివృద్ధికై శ్రద్ధతోబూనుకొని చేయుచున్న తమ కృషి ఫలవంతమగు నన్న సూచనలు బొడగట్టుచున్నవి. తామీవిషయమున జేయుచున్న ప్రయత్నములు శ్లాఘనీయములై హైదరాబాదు చరిత్రలో దేదీప్యమానముగ ప్రకాశించగలవన్న నమ్మకము గలదు. వెనుకబడియున్న వర్గాలకు జెందినమాకు, అంధకారమున దరిగానక తపించుచున్న మాకు తమ మూలమున ఆశాంకుర జ్యోతి గన్పించుచున్నది. ప్రజాశ్రేయస్సు నిమిత్తము పాటుబడుటకు మీకు పరమేశ్వరుడు ఇతోధికమైన శక్తి, సామర్థ్యములను ఆయురారోగ్యములను ప్రసాదించుగాక!

★

---

## కీ॥ శే॥ ముత్యాలస్వామి

వీరు కీ॥శే॥ ముత్యాల యల్లయ్యగారి కుమారులు-జననము. ఖుత్బీగూడ. 1894 విద్య హెచ్. యస్. సి. వరకు వృత్తి తమలపాకుల వర్తకము. వీరు ముత్యాల రామన్నగారి దత్తపుత్రులు. కొంతకాలము పొలిటికల్ ప్రైవేటు సెక్రెటేరియట్ యందు సర్రాపుగా పనిజేసిరి. మరి కొంత కాలము సిటీ ఇంప్రువ్‌మెంటు బోర్డులో క్లర్కుగా నుండిరి. 1917లో అప్పటి నవాబు మీర్ ఉస్మానలిఖాన్ గారిని రాజ్యభ్రష్టుని జేయు కుట్రలో పాల్గొనిరి. కాని విఫల మనోరథులైరి. తత్కారణమున తప్పించుకొని బొంబాయి వెళ్లి ఒక బట్టలు కుట్టు కొట్టులో జీవనోపాధిని సంపాదించుకొనిరి, తరువాత బట్టలుకుట్టు దుకాణమును స్వయంగా స్థాపించుకొనిరి. ఈ మధ్యన వీరి భార్య మరణించ ద్వితీయ వివాహమాడిరి. వీరు తమ్ముడు ముత్యాల నరసింహ వీరిని బొంబాయి నుండి హైద్రాబాదు తీసికొని వచ్చుచుండగా, వీరు కార్నివాల్ చూచుటకు వెళ్లిరి. కాని అచటనే వీరు పైనుంచి క్రిందపడి మరణించిరి.

రాయల్ సినిమాహోటలు నడుపు ముత్యాల రంగయ్య వీరిసోదరుడు. సాగర్ టాకీస్ హోటలు నడుపుచుండిన ముత్యాల నరసయ్య కుమారుడు ముత్యాలపాండు. వీరందరు బొజ్జం కుటుంబీకులు,

# గత పది హేడుసంవత్సరములలో హైదరాబాదు పురపాలక సంఘములో పాల్గొనిన మున్నూరుకాపు కులసభ్యులు

1950-56 :

శ్రీయుతులు స్థాయిసంఘసభ్యులు ఎస్. వెంకటస్వామి హైకోర్టు వకీలు బొజ్జం నరసింహులు, కే. రంగారావు అడ్వకేటు, ఎట్టెం సత్యనారాయణగారు.

1956-60 :

శ్రీయుతులు ఎట్టెం సత్యనారాయణగారు, ధడువై నర్సింలు, డి. యాదవరావు ప్యాట్ల శ్రీనివాసరావు, బెంకు నారాయణరెడ్డి శ్రీమతి సుజాతాదేవి, సభ్యురాలు; కాసుల శ్రీనివాసరావు రెబ్బ అంజయ్య బాబురెడ్డి రాజరెడ్డి వీరు ఢిల్లీలో మరణించినారు.

1960-64 :

శ్రీయుతులు భండారి మాణిక్యం ఎట్టెం రంగనాయకులు, పి. ద్వారకదాస్, ముయ్యు హనుమంతరావు, రామలింగము సభ్యులు.

1964-67 :

శ్రీ డి. యాదవరావు, ఉపమేయరు, డి. ద్వారకదాసు, రామదాసు, కౌసుల శ్రీనివాసు, పి. శ్రీనివాసు ముయ్యు హనుమంతరావు, ముల్లె బాలయ్య, సూర్యనారాయణరెడ్డి, ఆకుల రంగయ్య, మ్యాడం రామచంద్రయ్య, భండారి మాణిక్యం, సాంసన్ సభ్యులు.

## శ్రీ కొంక అంజయ్య (కంట్రాక్టర్)

వీరు 1908 న రావల్ కోల్, తాలుకా మేడిచల్, (జిల్లా హైద్రాబాద్, కీ.శే. కొంకాబాగయ్య తల్లి మల్లమాంబ పుణ్యదంపతులకు



జన్మించారు. ఆనాడు భాగ్యవంతులైన ఆకుల లచ్చయ్య, మక్తెదార్ పేరొందిన కుటుంబీకులు. మహారాజా బహదూర్ కిషన్ ప్రషాద్, మరియు వీరితల్లి కుటుంబమువారు కలిసి వ్యవసాయము చేయుచుండేవారు. ఐదవ ఏటనే ప్లేగ్ రావడం వల్ల వీరి తల్లిదండ్రులు పరమపదించిరి. వీరి చిన్నమ్మ వీరిని ధూలెపల్లికి తీసుక పోయిరి. తదుపరి వీరి చిన్నమామ 14వ యేట వీరిని సికింద్రాబాద్ ఆవులమందకు తీసుకవచ్చి, తన కుమార్తెను ఇచ్చి వివాహముచేసి తన వద్దనే ఉంచుకొనిరి. **వారు,** వీరు కలిసి గృహ నిర్మాణంపనులు చేసేవారు. ఈయిన పెద్దవారై గొప్ప కంట్రార్ గా పేరు పొంది, తుంగభద్రప్రాజెక్టు వద్ద ఆంజనేయదేవాలయమును నిర్మించిరి. సీతాఫల్ మండివద్ద దత్తాత్రేయ దేవాలయమునకు గాలిగోపురం కట్టించిరి. మెట్టుగడ్డవద్ద ఆంజనేయదేవాలయమునకు మంటపము వేయించిరి. సికింద్రాబాద్ లో చిక్కుతోట వద్దనున్న కాళికాగుడిని దండు వెంటయ్య ఈయన కలిసి కట్టించిరి. ముషీరాబాద్ జైల్ ఎదుట సచ్చిదానంద ఆశ్రమమునకు రెండువేల రూప్యములు దానం చేసిరి. భద్రాచలమునందు శ్రీ కుసుమహరనాథ్ దేవాలయమునకు రెండువేల రూపాయలు దానంచేసిరి. మున్నూరుకాపు వసతిగృహమునకు రెండుమడిగెలు కట్టించిరి. ఇంకా ఎన్నియో ధర్మకార్యములకు ఆర్థిక సహాయం చేయుచున్నారు.

## శ్రీ మిఠా లక్ష్మినర్సయ్య అడ్వకేట్

వీరిజననం 1891న హరిబావిలి, వద్ద కీ.శే. కాటిక ముత్యాలుగారి ఇంటిలో జరిగినది. వీరు తెలుగు, ఉర్దు, ఆంగ్లములో పాండిత్యమును గడిం

చిరి. ఉపాధ్యాయులుగా కొన్నిరోజులు గడిపి, న్యాయవాది వృత్తిని అవలంబించి, ఉత్తరహిందుస్థాన్‌లో పేరొందిన ముఖ్య న్యాయాధిపతి కీ.శే. రాయ్ విశ్వేశ్వరనాథ్ వద్ద కొన్ని రోజులు న్యాయవాదిగ పని చేసి, కీర్తి గడించిన న్యాయవాదులలో వీరొకరు. న్యాయవాదులకు అవసరమగు కొన్ని న్యాయవాద గ్రంథములను ఉర్దులో రచించిరి. విద్యావిధానమునకు సభ్యులుగా, ఆకాశవాణికి ఎగ్జామినర్‌గా ఉండిరి. బాదెపల్లిలో జరిగిన గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులుగా నుండిరి. హైద్రాబాద్‌నందు కాపు సంఘమును స్థాపించిరి. రిఫాయ్‌ఆమ్ హైస్కూల్‌కు సుమారు 20సంవత్సరములు కార్యదర్శిగా ఉండిరి. ఆంధ్రమహాసభ కార్యకారణీ సభకు సభ్యులుగాను, బ్రహ్మ సమాజం, ఆర్యసమాజమునకు సభ్యులుగా నుండిరి. మున్నూరుకాపు మహాసభలలో సదాపాల్గొను చుందురు.

## శ్రీ హడిగల్ రామయ్య, బి. ఎ. బి. ఇడి.

వీరు 1910లో హైద్రాబాద్ పట్టణంలో జన్మించిరి. వీరు ప్రభుత్వ విద్యాశాఖలోచేరి కరీంనగర్, ఖమ్మం. వరంగల్ జిల్లాలలో విద్యాశాఖాధికారిగా పనిచేసిరి. ప్రస్తుతం ఉపకారవేతనం పొందు చున్నారు. వీరిఇద్దరుకూతుళ్లు ఎం. బి. బి. ఎస్ పట్టభద్రులైనారు. కుమారుడు ఎం. బి. బి, ఎస్ చదువుతున్నాడు. వీరిఅన్న కీర్తిశేషులగు అంజయ్య విద్యాశాఖలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి. వీరి కుమారుడు ఉన్నతపదవులలో ఉన్నారు. వీరు వరంగల్‌లో నివసించుచు, బాలబాలికల వసతిగృహ నిర్మాణమునకు స్థలసేకరణకై అన్నిశాఖ లతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నారు. సాటిలేని వీరిసేవలు సంఘమువకు అభినందనీయములు.

## డా॥ సి. కె. గోవిందరావు

గౌరనీయులగు శ్రీ బొజ్జం నర్సింలు గారికి

మీరు జాబు వ్రాసినందుకు చాలా సంతోషము అయినది. మీయొక్క ఉత్తరము చాలారోజుల క్రితము ముట్టినది. ఉత్తరమునకు జవాబు ఆలస్యముగ వ్రాయుచున్నందుకు నన్ను క్షమింప వలయును.

ఇక్కడ U. S. A. లో మనకుల సోదరులు ఇద్దరుమాత్రమే నాకు తెలిసినంతవరకు, చదువుతున్నారు. మా పెద్ద అన్నయ్య Dr. M. Krishna Rao, Denmarkలో, F. A. O fellowshipగ Veterinary Sceince లో చదువుతున్నారు.

(1) Dr. కావేటివినోదబాబు వీరు ఫీలుకానలోయుంటారు. ఇతను Children Speciality (Pediatries) చేయుచున్నారు ఇతనిని నేను కలసేందుకు చాలాసార్లు ప్రయత్నముచేసినాను. వీరు ఇప్పుడు సెలవులు తీసికొని కొన్నిరోజులవరకు Bahama Islandకు పోయినారట.

(2) Dr. కీసరి రామమోహనరావు, శ్రీ కీసరి శ్రీరాములు యొక్కపుత్రుడు. Massachusette లో (400 మైలు Newyork నుండి) Psychiatry specialisation చేయుచున్నారు. వీరు ఇక్కడ నాలుగు సంవత్సరములనుండి యున్నారు. వీరి Hospital మరియు ఇంటి అడ్రెసునాకు తెలియదు.

(3) మాపెద్ద అన్నయ్య M. Krishna Rao D. T. V. Sc. B. V. Sc. Denmark లో F. A. O Fellowship చేయుచున్నారు. వీరు మన ఇంటికి July 67లో రాగలరు. ఇతను చామకూర మోనయ్య పుత్రుడు.

(4) చామకూర గోపాలస్వామి రెండవపుత్రుడు C. G. శ్రీనివాసరావు, (నాకు అన్న) Taxes U. S. A లో Agriculture M. S. చేయుచున్నారు.

(5) నాతమ్ముడు, C. K. పాండురంగరావు, శ్రీ చామకూర కిష్టయ్య మూడవపుత్రుడు, Newyork లో Civil Engineeeing, లో M. S. చదువుచున్నాడు.

(6) Dr. Krishna, శ్రీ ధడవయ్ కిష్టయ్య అల్లుడు, England U. K. లో F. R. C. S. చేయుచున్నారు.

నాకు ఇంతేమంది మరియు వీరియొక్క చరిత్ర ఇంతేతెలిసికొనగలిగినాను.

## శ్రీ ఆకుల మల్లయ్య

వీరు ఆకుల గట్టయ్య, జగ్గమ్మ దంపతుల ఏకైక పుత్రులు. జననము: సుల్తానాబాదు, జిల్లా కరీంనగరము, అక్టోబరు 1926 జరిగింది. విద్యాభ్యాసము స్థానిక పాఠశాలలో నాల్గవతరగతి వరకు ఉర్దుక్రమేణ,



ఉర్దుతోపాటు తెలుగు, కొద్ది ఇంగ్లీషు కూడ నేర్చికొనినారు. వీరు 13 సంవత్సరముల చిఱుత ప్రాయమున ఒక కిళ్లీ కొట్టుతో జీవనోపాధి మొదలిడి, నేడు ఒక పేరెన్నిక గనిన ప్రముఖ వ్యాపారస్తుడుగా నున్నారు. తోటి వ్యాపారస్థుల సహకారముతో సుల్తానాబాదు గ్రామములో శ్రీ రామభక్త ఆంజనేయస్వామి వారి దేవాలయమును స్థాపించి నిర్వహించుచున్నారు. దైవభక్తి వీరికి ఉగ్గుపాలతో లభించినది.

# శ్రీ గుమ్మళ్ళ చుక్కయ్య కుమారుడు
# శ్రీ గుమ్మళ్ళ నారాయణస్వామి

గొల్లఖిడ్కిలో - జననము 1886—నిర్యాణము 20-2-1963



వీరు ఆంధ్ర బాలికాపాఠశాలను తమ స్వగృహములో స్థాపించిరి. 1905 లో సరఫెఖాసు బగ్గీఖానాలో సర్రాఫుగా పనిచేసిరి. జీయోరుగూడ రంగనాథస్వామి దేవాలయమునకు కార్యదర్శిగా నుండిరి. వీరి కిద్దరు కుమారులు:- 1. గుమ్మళ్ళ బాల కిష్టయ్య 2. గుమ్మళ్ళ వెంకటరత్నం. 1931లో బాలాజీ బైఖాతా దుకాణము హైదరాబాదులో స్థాపించిరి. దీని శాఖ సికిందరాబాదులో కలదు.

## శ్రీ మంగిని రామన్నగారు

1898లో ఈయన ఉరుదు బజార్ లో జన్మించారు. చిన్నతనమున బట్టల దుకాణంలో పనిచేసిరి. 1930 నుండి గుత్తాలు ప్రారంభించి, ప్రస్తుతం 'ఎ' క్లాస్ కంట్రాక్టరుగా పేరు పొందిరి, శ్రీ యాదగిరి లక్ష్మి నరసింహ స్వామిగుట్టపై గర్భాలయము కట్టించి, రామాయణం. దశావతార చిత్రములు వ్రాయించిరి. ఉస్మానియాఆస్పత్రిఎదుట ఉన్న దేవాలయంపై రామాయణ ప్రతిమలను నిర్మించి రంగులు వేయించిరి. జియోర్ గూడ రంగనాథస్వామి దేవాలయములో రామాయణం, దశావతారముల ప్రతిమలు నిర్మింప జేసి రంగులు వేయించిరి. జీడికంటి రామస్వామి దేవాలయములో ప్రతిమలు చేయించిరి. బీదల వివాహా లెన్నియో చేయించారు.



## కీ. శే. ద్వారం వెంకటస్వామి నాయుఁడు

గొప్ప సంగీత విద్వాంసుడు, కళాకారుడు, మన రాష్ట్రము లోనేగాక తదితర రాష్ట్రాలలో వైలన్ వాయించుటలో గొప్పకీర్తి



కీ. శే. పుంజాల బాషయ



ప్రతిష్ఠలు గడించారు. శ్రీ పి. శివశంకర (రెడ్డి) హైకోర్టు లీడింగ్ లాయరుకు వీరి మనుమరాలునుఇచ్చి వివాహం చేశారు. ద్వారం వేంకటస్వామి నాయుఁడు అంత్యక్రియఁకు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తదితర మంత్రులు విచ్చేసి యుండిరి. ఈ శ్రీ పి. శివ శంకర్ మున్నూరు కాపులలో ప్రముఖులైన కీ. శే. పుంజాల బాషయ్యా కుమారుడు. ఇతడు ఆకులవర్తకములో పేరొందిన కమీషన్ ఏజంట్. వీరిమామ తోటగూడ లింగంపల్లిలో పేరొందిన పటేల్ కీ. శే. నోముల రామన్నగారు.

## శ్రీ ఏనుగుల శ్రీరాములు (షాండో)

వీరి జననం 1903. ఈయన చిన్నతనము నుండి వ్యాయామంచేసే అలవాటు. ఈయన ఇంటిపేరు ఏనుగులున్నందున తనరొమ్ముపై ఏనుగును నిలుపుకొనుటకు సంకల్పించుకొనిరి. ఈయన కీ. శే. లక్ష్మినారాయణ నాయుడు ష్యాండోగారి వద్ద చేరి వారితో వ్యాయామ విద్యలో నిపుణత గడించిరి. ఆయన తన శరీరమును దృఢపరచుకొని ఏనుగను తుదకు ? నిమిషముల వరకు రొమ్ముపై నిలబెట్టే సాధన, సాధించిరి. 800 కిలోల బరువును ఎత్తుకొని నడిచేవారు. అతని తలపై బరువైన రాయిని

పెట్టి పగులగొట్టేవారు. ఆయన ప్రదర్శనలు బొంబాయి, కామాటి



పుర రామమందిరములో, తదితర నగరాలలో జరిపించి మెడిల్సు పొంది నారు. గౌర్నర్ నగేష్ ఉన్నప్పుడు దేశరక్షణ నిధికై 144 గ్రాముల బంగారము దానంచేసిరి. ఎందరో విధవలకు ఆర్థిక సహాయం చేసి నారు. యాదగిరి పాతలక్ష్మినర్సింహస్వామి గుడి ధర్మకర్త. ఈయన ప్రతి సంవత్సరం ఉత్సవం వీరి ద్వారా జరుగును.

## కీ. శే. ఫర్మా వేంకటస్వామి (వారాల)

ఈయన గోలకొండ పత్రికా ఆఫీసుకు సమీపములో ఒక గృహ ములో జన్మించారు. ఈయన విద్య వీధిబడిలో జరిగినది. చిన్నతన మునుండి కష్టజీవులు. పది సంవత్సరముల వయస్సునుండి 42 సంవత్స రముల వయస్సువరకు కీ. శే. బాదె రామన్నవద్ద గుమాస్తాగా పనిచేసి నారు. సిగిరేట్ల అమ్మకం చేసినారు. ఆ తర్వాత ఆబిద్‌షాపులో స్వంతంగ స్టేషనరీ నోట్‌బుక్కుల దుకాణం పెట్టుకొని వ్యాపారం చేయుచుండిరి. కీ. శే. రాజాబహద్దూర్ వెంకట్రామా రెడ్డిగారి అనుగ్రహం వీరిపై చాలా ఉండింది. శ్రీయాదగిరి నరసింహ స్వామి దేవాలయము వద్ద ఒక ధర్మశాల కట్టించిరి. ఇతని చిన్నకుమారుడు నర్సింగ్‌రావు వరకట్నంలేకుండా, ఒక బీద కుటుంబీకుల అమ్మాయిని వివాహమాడి తదితరుల ప్రశంసలకు పాత్రులైనారు.

## కీ. శే. లింగిశెట్టి కన్నయ్య

ఈయన మైలారంలో జన్మించారు. ఉసేనిఆలంలో ఈయన నివసించేవారు. ఉర్దు తెలుగు బాగగా అభ్యసించి ఆస్మాజాహియగాలో ముంతజింగాపని చేసినారు. రాజా మోహన్ లాల్ స్టేట్ లో ముంతజింగా పనిచేసినారు. మూసానది ఉప్పొంగినప్పుడు ఈయన ప్రజలకు చేసిన సేవకు గుర్తింపుగా నిజాం ప్రభుత్వం ప్రశంసాపత్రము నందజేస్తు గౌరవించిరి. ఈయన కుమారుడు డా॥ గోవిందరాజులు, మున్నూరుకాపు వారిలో ప్రథమ డాక్టర్ వీరే. 1912 డాక్టర్ పట్టము పొందారు.



## శ్రీ కాసుల శ్రీనివాసరావు

ఈయన 1929 బొందలేసాహెబ్ ఖిడ్కి హైద్రాబాద్ లో, శ్రీ కాసుల వేంకటస్వామికి జన్మించారు. మెట్రిక్యులేషన్ చదువుకున్నారు. రజాకార్ల ఉద్యమారంభము నుండి ప్రజారంగములో ప్రవేశించి ప్రజాసేవ చేస్తున్నారు. ఆటలలో అమితోత్సాహం కలవారు. ఈయన మామ భువనగిరి చంద్రయ్య వద్ద తమలపాకుల వ్యాపారంలో ప్రవేశించిరి. తర్వాత హోల్ సేల్ పండ్లవ్యాపారం చేయుటకు పూనుకొనిరి. ఈయన పండ్ల దుకాణం జాంబాగ్ శ్రీరాం అండ్ కో., పేర నడుపబడుచున్నది, 1956లో పురపాలక సంఘ ఎన్నికలకు కాంగ్రెస్ టికట్ లభించనందున స్వంతముగా పోటీ చేసి ఆ నియోజకవర్గంలో నెగ్గిరి. 1964లో తిరిగి పురపాలక ఎన్నికలలో పాల్గొని మళ్లీ సభ్యునిగా ఎన్నుకొనబడిరి. డబిర్ పుర గాంధీ మెమోరియల్ ఉన్నతపాఠశాలను స్థాపించినప్పటి నుండి కార్యదర్శిగా ఉన్నారు.



## శ్రీ ఎర్రం సత్యనారాయణ

1914 ఆగష్టు 26న పేరొందిన వర్తకులగు శ్రీ ఎర్రం సీతా రామయ్యగార్కి ఈసామియా బజారునందు జన్మించారు. వీరు మెట్రిక్ వరకు విద్యనభ్యసించిరి. వీరు బట్టల వర్తకులు.

వీరు రాజకీయరంగములో, ప్రజారంగములో 1946 నుండి ప్రవేశించిరి. ఇంతకుపూర్వం మున్నూరుకాపు మహాసభ, యువకమండలి ఉత్సాహకరంగా నడుపబడినది.

ఇప్పుడు వీరు నగరకాంగ్రెస్ అధ్యక్షులుగా ఆం.ప్ర.విధానమండలి సభ్యులు పదవుల నిర్వహిస్తున్నారు. వీరు ప్రస్తుతం ఈ దిగువ పదవులలో తమ పాత్రను నిర్వహిస్తున్నారు. హైద్రాబాద్ బట్టల వర్తక సంఘం, అనీసుల్‌గుర్బా, సర్దార్ పటేల్ భవన ట్రస్టు, గూటాల వీరణ్ణ ఎడ్యుకేషన్ ట్రస్టులకు అధ్యక్షులుగా, బట్టల వర్తక సంఘం ట్రస్టు సెక్రటరీ, హనుమాన్ వ్యాయామశాల ట్రస్టుసభ్యులుగా, ఎండోమెంట్ ఫండ్స్ కమిటీ సభ్యులుగా, హైద్రాబాద్ హౌసింగ్ కో ఆపరేటివ్ సొసైటీ, ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతి సేవా సంఘాలకు కోశాధిపతిగా, నెహ్రూ ఎడ్యుకేషనల్ సొసైటీ ఉపాధ్యక్షులుగా, హజ్ కమిటి సభ్యుడుగా, హైద్రాబాద్ జిల్లా పరిషత్, ఇబ్రాహీం పట్నంపంచాయితీ సమితి సభ్యులు, ఎన్నియో ఇతర ప్రజాహిత సంస్థలకు సభ్యులుగా ఉన్నారు.



## కీ. శే. మాదాస్ పటేల్ నరహరిగారు

ఈయన 1894న ఉప్పుగూడలో జన్మించారు. తెలుగు, ఉర్దు బాగుగా నేర్చుకొనిరి. వీరు పటేల్ పట్వారి గుమాస్తాగ పనిచేసిరి. పటేలుగిరి వతన్ కలదు. 1926లో తోట బలిజవారి సభ సికింద్రాబాద్‌లో

జరిగినప్పుడు, మున్నూరు కాపు వారి కరపత్రములు తీసుకవెళ్ళి ఆ సభలో పంచి సభను చిందరవందర చేసినారట. మున్నూరుకాపు కుల



శ్రీ నరహరి పటేల్



శ్రీ నరసింహ (నరహరి కుమారుడు)

అభిమాని. వీరి కొమారుడు పటేల్ నరసింహ్మా. వీరుగూడ తండ్రి అడుగు జాడలలో నడిచారు. 1967లో కాలధర్మము జెందారు.

## కీ. శే ఏనుగుల తుల్జయ్య

వీరి జననము కారువాన్ సాహు నందులో 1896లో జరిగినది. వీరి తండ్రి ఏనుగుల వెంకటస్వామి. వీరు చిన్నప్పటి నుండి కష్టజీవి. వీరు గిర్వీగాటా వ్యవహారము నడ్పుచుండేవారు. ఆకాలములలో శ్రీపతి రంగయ్యగారి వెంబడి పంచాయతులలో పాల్గొనేవారు కీ. శే. టి. ఆగయ్యగారు నూతనముగా కనిపెట్టిన మున్నూరు కాపు సంఘముపై అభిమానం గల్గివుండిరి. వీరు1964లో కీర్తిశేషులైరి.



## కీ. శే. చల్వాది వేంకటస్వామి

చల్వాది ఎంబరయ్యా, వెంకమ్మ పుణ్యదంపతులకు కార్వానునందు 1896లో జన్మించిరి. తెలుగు, హిందీభాషలలో ప్రావీణ్యత సంపాదించిరి



ఇత్తడిసామానుల వ్యాపారిఅగు మార్వాడి. వద్ద రోకడ్ వ్రాయుటకు గుమాస్తాగా పర్పడి, 25 సంవత్సరములు అనుభవము సంపాదించిరి. తదుపరి స్వంతముగా ఇత్తడి బాసండ్ల దుకాణం బేగంబజారులో పెట్టుకొనిరి. మున్నూరు కాపు సోదరు లెందరికో బాసండ్ల వ్యాపారం నేర్పిరి. వీరు 1967 లో 71టవ ప్రాయములో పరమపదించిరి. వీరు వైష్ణవ సాంప్రదాయకులు. జియోర్ గూడా శ్రీ రంగనాథ స్వామి భక్తులు. వీరికి ఇద్దరు కుమారులు నలుగురు కూతుళ్లు.

## కీ. శే. పెరుగు లక్ష్మయ్యగారు

ఈయన రిసాల అబ్దుల్లలో జన్మించారు. ఈయన తండ్రి పెరుగు రంగయ్య అచటనే 1908వరకు భూమి కౌలుకు తీసుకొని వరి పండించు



చుండిరి. ఇండ్లు కట్టడం ప్రారంభమైన తర్వాత ఇతని ఇల్లు మాత్రం ఒకటి స్వంతంగా నిర్మాణం చేసుకొని ఆస్తి కలిగించుకున్నారు. ఈయన తండ్రి రంగయ్య గోషామహల్ తోప్ ఖానాలో పోతేదారుగాపనిచేసిరి. ఈయనబారూద్ ఖానాలో పోతేదారుగా పని చేసిరి. ఈయనకు ముగ్గురు కుమారులు, శ్రీయుతులు పెరుగు పురుషోత్తం, పెరుగు నరహరి, విఠల్ రావు. వీరు శ్రీ యాదగిరి నరసింహస్వామి దేవాలయం వద్ద ఒక ధర్మసత్రం కట్టించిరి.

## శ్రీ హాకీం పుష్పాల బాలక్రిష్ణయ్య

వీరి జననము 1898(మరికల్)మహబూబు నగరములో జరిగినది.

వీరి యెనిమిదవ ఏట తండ్రిగారు కాలము చేసిరి. వీరి తల్లి పదవ ఏట వీరిని, వీరి తమ్ముని తీసుకొని హైదరాబాదు విచ్చేసి, జిన్సీచౌరాహాలో నివాస మేర్పరచుకొనిరి. వీరు తెల్గు. ఉర్దును వీధి బడిలో నేర్చుకొనిరి.



వీరి 18వ ఏట హాకీం హరిగోవిందు గారి దగ్గర శిష్యులుగా జేరిరి. మంచి అనుభవమును సంపాదించిరి. వీరికి నిజాం నవాబువద్ద ప్రత్యేకముగా వైద్యము చేయుటకు అవకాశ మిచ్చి యుండిరి. వీరికి పిల్లలకు, క్షయ రోగులకు బాగుచేయుటయందు వీరికి ప్రత్యేక నైపుణ్యా ముండెను. వీరికి ఒకే కూతురు. వీరి అల్లుడు పేరు ప్రతిష్ఠలు పొందిన శ్రీ నీలకఠం సత్యనారాయణగారు. మున్నూరుకాపు వసతిగృహము ధర్మకర్తలలో వీరొకరు.



## శ్రీ పుంజాల రాంమూర్తి

వీరు జననము గొల్లఖిడ్కీలో జరిగినది. మున్నూరుకాపుకుల అభిమాని కార్యకర్త. మహిళ విభాగమునందు శ్రద్ధ తీసుకొని ప్రతి సంవత్సరం గణపతి ఉత్సవ సందర్భమున సభ ఏర్పాటు చేసేవారు.

గాండ్ల క్రిష్టయ్య
రాజకీయ బాధితులు జిల్లాల





గాండ్ల కిష్టయ్య రాజకీయబాధితులుగా వండి
విడుదలయైన సందర్భమున తీసిన ఛాయా చిత్రం
తాలూకా సిరిసిల్లాం జిల్లాల గ్రామ మున్నూరుకాపు సంఘం సభ్యులగు
సెట్టి దుర్గయ్య. కోరుగంటి రోశయ్య. కోరుగంటి బాలయ్య.
గాండ్ల క్రిష్టయ్య. బల్‌రాం రామయ్య కోరుకంటి మల్లయ్యలను
ఈ చిత్రంలో చూడవచ్చును

## పోలీస్ మల్లయ్యగారు ఆర్మూర్ ముస్తాజర్

ఈయన 1940లో నిజామాబాద్ జిల్లాలోని తా॥ ఆర్మూర్లో రాజయ్య, లింగమ్మ పుణ్యదంపతులకు జన్మించారు. ఇతని చిన్న వయస్సుననే ఈయన మాత, పితరులు పరమపదించిరి. కీ. శే. పోలీస్ సబ్ ఇన్స్పెక్టర్ శ్రీ రాజేశ్వర్ వద్ద ఉండి, ఈయన మెట్రిక్ వరకు చదువు కున్నారు. ఆయన మామ వెంబడి ఆర్మూర్ వెళ్ళి తునికి ఆకుల గుత్తే దారుగా, స్వంత వ్యవసాయముచేస్తు అచటే స్థిరపడిపోయిరి. ప్రస్తుతం బీడీల కార్ఖానా నిర్వహించబడున్నది.1000 మంది కార్మికులు పని చేస్తున్నారు. సంస్కరణల బహిష్కరణ ప్రచార సందర్భమున శ్రీ కె. వి. రంగారెడ్డి, బొజ్జం నర్సిములు ఆర్మూర్ వెళ్ళి



నప్పుడు సభా కార్యక్రమాలు నిర్వహించుటలో ఉత్సాహం చూపినందున పోలీసు నిర్బంధించి పోలీసు ఆక్షను వరకు జైలు లోనే ఉంచారు. రాజకీయ బాధితునిగ పరిగణింపబడి ఈయనకు, ఈయన స్నేహితుడు సత్యనారాయణ నాయక్కు కూడా 10 ఎకరముల భూమిలభించినది. ఈయన హైదరాబాద్ శ్రీ నీలకంఠం సత్యనారాయణతో వియ్యమందు కున్నారు. ప్రజాసేవ అభిలాష గలవారు.

## రంగనాథ్స్వామి దేవాలయం

### జీయోరుగుడా, హైద్రాబాదు

హైద్రాబాదునందు పాతవారధి సమీపమున, జీయోరుగూడ వద్దనున్న దేవాలయము మన పూర్వీకులైన జిల్లా కరీము నగరములోని ఎలగందల దేశమును పరిపాలించి మన్నెసుల్తాన్ బిరుదాంకితులు, మున్నూరు పెద్దరామన్నగారు గోలకొండకిలాలో నివసించు నవాబు

లతో కలియుటకు వచ్చినప్పుడు ఈ దేవాలయమునందు నివసించువారు, కీర్తిశేషులగు వామననాయకు దేశముఖుగారు అప్పుడప్పుడు వార్షిక సమావేశమునందు వీరినిగూర్చి చెప్పువారు. వార్షికచందాలు అభిమాన



దేవాలయ మండపము

ముతో నొసగువారు. నిజాంతండ్రి కాలమున సర్ఫఖాసులోని చేవెళ్లి యందు మాన్యమున్నట్లును, ఈ దేవాలయమునందు మున్నూరుకాపుల



రంగనాథస్వామి దేవాలయము
గర్భగుడి

అభివృద్ధిమార్గములను గనిపెట్టుటకు సభలు సమావేశములు జర్పుట శ్రీయుతులు కీర్తిశేషులగు గుమ్మళ్ల నారాయణస్వామి శ్రీపతి రంగయ్య, శ్రీ కీసరి సత్తయ్య శ్రీ గొళ్ళాల పెంటయ్యగార్లు ఎంతో కృషి సల్పిరి. ౧౩౫౦ ఫస్లీలలో మతశాఖ నుండి దేవాలయమును రిజిస్ట్రి చేయించుకొనగా శ్రీపతి రంగయ్యగారి పేర దేవాలయ అధికారిగా నియుతులైరి. వారి తదుపరి శ్రీపతి సుందెరావుగారు ప్రస్తుతము వారి స్వాధీనములో నున్నది.

# అంకెలతో వాక్యమాల

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | క | చ | ట | గ | జ | డ | మ | ౦। |

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఈ | ణ | ద | త | ప | భ | ల | న | ౦।। |

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | |
|---|---|---|---|---|---|---|---|---|
| య | ర | ల | వ | శ | ష | స | హ | ౦।।। |

ము న్నా రు    కా పు మ హా స భ

౮।ు ౮।।్నా ౨।।।ు ౨ా ౫।।ు ౮। ౮।।। ౭।।। ౬।।

## గమనిక

వెనుక 14వ శతాబ్దమున మున్నూరు నాయకులు, ఆంధ్రుల సైన్యములను ఢిల్లీ బాదుషాల దొమ్ములను (దోపిడీలు)గోదావరి ఒడ్డున తమ ధీరశక్తులతో అడ్డగించిరి. దుష్టశక్తుల నెదుర్కొనుట వీరి వంశపరంపరగా వస్తున్న యోగ్యత.

వీరగంధ, వీరపనేని సూరపనేని, సూరనేని, వీరమాచనేని, మన్నే సుల్తాన్, మన్నే సర్దార్. మున్నూరునాయక్ ఇత్యాది బిరుదాంకితులు ఆనాటి భారత వీరులు. ఈ బిరుదులకు వివరణములు ఈ గ్రంథపు రెండవ సంపుటములో చూడనగును.



## పెద్ది నర్సయ్య

వీరు తోటబల్జి సంఘ స్థాపకులలో ఒకరు. బీద విద్యార్థులకు సహాయము చేయువారు. మొట్ట మొదటి గజిటడ్ ఆఫీసర్. వీరి కుమార్తె డా॥ సరస్వతీదేవి డా॥ నారాయణ అల్లుడు బీదర్.



## డిచుపల్లి రాజన్నగారు

వీరు మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహమునకు నిజామాబాద్ జిల్లా నుండి నలుబది వేల రూపాయలు సహాయము చేయుటకు వాగ్దానము జేసిరి. కాని అకాలమృత్యువుకు పాల్పడిరి.



ఈచిత్రంలో ఎడమనుంచి వరుసగ ముందున్నవారిలో చంద్రమోహన్, బొజ్జం నర్సిములు, శ్రీధర్. వెనుక నున్నవారిలో కుమారి త్రివేణి, సుజాతాదేవి, కుమారి దీపక్ లున్నారు.



ఏనుగుల శ్రీరాములు

కీ. శే. లక్ష్మినారాయణ స్వాండో శిష్యులు మూడు నిమిషముల వరకు ఏనుగును తమ రొమ్ముపై నిలపెట్ట గల్గిరి.

## 1930 సం॥లో ఉన్న జనాభా వివరాలు:

| వరుస నం. | కులము | మొత్తము జనాభా | నిరక్షరాస్యులు | అక్షరాస్యులు | సగటు నిరక్షరాస్యులు శతము | ఉర్దు వచ్చినవారు | ఇంగ్లీషు వచ్చిన వారు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. | బ్రాహ్మణులు (హిందువులు) | 3,63,296 | 93,132 | 2,70,164 | 74.04 | 1,06,482 | 95,542 |
| 2. | ఇతర హిందువులు | 91,71,318 | 86,88,990 | 4,82,328 | 5.35 | 79,348 | 40,858 |
| 3. | హరిజనులు | 29,28,040 | 20,01,187 | 26,853 | 0.90 | 3,000 | 1,424 |
| 4. | వీరశైవులు | 8,06,095 | 7,34,653 | 71,442 | 8.75 | 10,886 | 1,475 |
| 5. | ఆర్యులు | 40,900 | 28,615 | 12,285 | 29.35 | 2,439 | 348 |
| 6. | ముస్లింలు | 20,97,475 | 17,42,537 | 3,54,938 | 12.00 | 2,37,588 | 25,252 |
| 7. | క్రైస్తవులు | 2,20,464 | 1,83,839 | 36,625 | 16.55 | 4,653 | 15,380 |
| 8. | జైనులు | 24,853 | 19,184 | 5,669 | 23.45 | 651 | 347 |
| 9. | సిక్కులు | 5,330 | 3,313 | 2,017 | 35.75 | 640 | 332 |
| 10. | పార్సీలు | 1,974 | 320 | 1,654 | 83.75 | 812 | 1,522 |
| 11. | కొండజాతులవారు (గిరిజనులు) | 6,78,149 | 6,73,663 | 4,486 | 0.05 | 318 | 93 |
| 12. | ఇతరులు | 640 | 97 | 543 | 84.75 | 12 | 504 |
| | మొత్తము : | 1,63,38,534 | 1,50,69,530 | 12,69,004 | - | 4,46,829 | 1,83,077 |

బజారు ధరలు



ధడువై రామన్నగారు

## ఉస్మానుగంజు 1935

| సరుకు | ధర |
|---|---|
| బన్సీ గోధుమలు పల్లా 1కి | ౧౪-౦౦ |
| మామూలు ,, | ౧౨-౦౦ |
| బియ్యము దొడ్డువి | ౧౨-౦౦ |
| నానకురాంలు | ౧౫-౦౦ |
| కిచిడిసాంబర్లు | ౧౬-౦౦ |
| రామసాగర్లు | ౧౪-౦౦ |
| పిచోడిలు | ౨౦-నుండి-౨౫ |
| అమురల్ సర్లు | ౩౫-౪౦ |
| కందులు | ౯-౮ |
| కందిపప్పు | ౧౩-౧౪ |
| పెసలు | ౮-౮॥ |
| పెసరపప్పు | ౧౪-౧౪॥ |
| మినుపపప్పు | ౧౫-౧౬ |
| తెల్లజొన్నలు | ౯॥-౮ |
| సెనగలు | ౮-౧౦ |
| సెనగపప్పు | ౧౨-౧౨॥ |
| బటానీలు | ౯-౯॥ |
| తెల్లనువ్వులు | ౨౨-౨౪ |

| సరుకు | ధర |
|---|---|
| బెల్లం (శే ౪౦ కి) | ౧౦-౧౧ |
| తెల్లచక్కెర (శే ౫౦ కి) | ౧౩-౧౪ |
| మదరాసు చక్కెర ,, | ౧౫-౧౬ |
| పసుపు పల్లా | ౧౩-౧౦ |
| మిర్చి ,, | ౧౯-౨౪ |
| చింతపండు ,, | ౧౩-౧। |
| వేరుసెనగనూనె (శే ౧౨) | ౩॥-౩।౫ |
| అల్లం ,, | ౨॥-౨॥। |
| ఎల్లిగడ ,, | ౨+౨। |
| దనియాలు (శే ౧౬ కి) | ౧।+ |
| వోము ,, | ౧।+ |
| ఆవాలు | ౨-౦౦ |
| మెంతులు | ౨ |
| వెండి (౧౦౦ తు) | ౬౦-౬౦॥ |
| బంగారము ,, | ౪౧-౪౧॥ |
| సవరను ,, | ౨౬॥ |
| సొంపు (శే ౪౦ కి) | ౯-౦౦ |
| నెయి ,, | ౪౦-౪౦॥ |

అఖిల హైద్రాబాద్

# మున్నూరుకాపు మహాసభ

# నియమావళి

## పేరు

ఈ మహాసభ అఖిల హైద్రాబాద్ మున్నూరుకాపు మహాసభ యని పిలువబడును. ఇకముందు ఈ నియమావళిలో "మహాసభ" అని వ్యవహరింపబడును.

## స్వభావము

ఈ మహాసభ రాజకీయేతర సంస్థగా నుండును.

## కార్యాలయము

ఈ మహాసభయొక్క కార్యాలయము హైద్రాబాద్ పట్టణమునందుండగలదు.

## ఉద్దేశాలు, ఆశయాలు

ఈ మహాసభ ఉద్దేశాలు ఈ క్రింది విధముగా నుండును.

అ. విద్యా, సాంఘిక, ఆర్థికంగా ఈ జాతిని పెంపొందించుటకు తగు ప్రయత్నములు సలుపుట.

ఆ. పీలునుబట్టి, కుల మతముల పేర పీడింపబడు విధానములను తొలగించి వర్ణ రహితసమాజ నిర్మాణము మరియు అన్ని వర్గాలకు సంబంధించిన ప్రజలలో నిజ సహోదర భావాన్ని పెంపొందింపజేస్తూ సర్వ సాంఘిక రంగాలలో దేశాభివృద్ధివైపు వారి దృష్టిని మరల్చుట.

## మార్గములు, మరియు సాధనాలు

ఈ మహాసభ ఉద్దేశాలు ఈ క్రింది సాధన, మార్గాల ద్వారా సాధింపబడ వచ్చును.

అ. జిల్లాలలో నుండు మున్నూరు కాపుకులమునకు జెందినవారి సంఘాలను ఏర్పాటు చేయుట.

ఆ. మహాసభకు జెందిన బాలబాలికలకు విద్యాసంఘాలను, వసతి గృహాము లను వృత్తి, విద్యావిధానములను నెలకొల్పుట.

ఇ. మహాసభకు జెందిన వారిని వ్యావసాయక, వర్తక, సహకార పద్ధతులపై పెంపొందించుట.

ఈ. మహాసభ క్షేమాభివృద్ధికి అవసరమైన మార్గములను అవలంబించుట.

## సభ్యత్వము

ఈ మహాసభ సభ్యత్వము ఈ క్రింది విధముగా నుండును.

1. జిల్లా సంఘాల సభ్యత్వము.
2. వ్యక్తిగత సభ్యత్వము.

హైదరాబాదు ప్రభుత్వముచే ప్రకటింపబడిన వెనుకబడిన వర్గములకు జెందిన అంగీకరింపబడి, మున్నూరు, మున్నూరుకాపు, పూల్‌మాలి తుల్లేరి తెలగ, తోటబల్జి, నామములతో వ్యవహరింపబడువారు మహాసభ ఆశయ ఉద్దేశాలు మరియు నియమావళిని అంగీకరించుచు నిర్ణీతమైన సుంకము చెల్లించి నచో సభ్యులు గావచ్చును.

## చందా వివరములు

జిల్లా సంఘమువారు సంవత్సరమునకు 25 యిరువది అయిదు రూపా యలు చెల్లించి మహాసభ సభ్యత్వం పొందగలరు.

అ. కనీసం 100 నూరు రూపాయలు చెల్లించిన వ్యక్తి జీవితకాల సభ్యు డుగా నుండును. ఈ మహాసభకు 18 సంవత్సరములు అంతకు మించిన వయస్సు గల్గిన, నిర్ణీతమైన సుంకము చెల్లించి వ్రాతమూలకముగా ప్రకటన గావించినవారు మహాసభ సభ్యులు కావచ్చును.

ఆ. నెలకు రూపాయి, సంవత్సరమునకు రూ. 10 లు చెల్లించిన ప్రాథమిక సభ్యులే అధికార సభ్యులుగా భావింపబడుదురు.

ఇ. ఈ మహాసభకు సంవత్సరమునకు అణా సుంకము చెల్లించు వ్యక్తి మహా సభ ప్రాథమిక సభ్యుడగును.

## నిర్మాణము

మహాసభ ఈ క్రింది నుదహరింపబడిన సంఘాలచే నిర్మింపబడును.

1. మహాసభ, 2 స్థాయిసంఘము, 3. మహాసభా కార్యకారిణీ సభ, 4. జిల్లా సంఘము, 6. తాలూకాసంఘము, 6. గ్రామ మరియు పట్టి కమిటీలు.

అ. ఈ మహాసభ అనుమతిపొంది నిర్ణీతకాలములో గ్రామము గాని లేక దగ్గరగా మూడు గ్రామములు చేరి, కనీసం 25 సభ్యులు అయినచో గ్రామము లేక పట్టీ కమెటీయొక్క సర్వసభ్య ప్రథమ సమావేశము నందు ఆ గ్రామము లేక పట్టీ కమిటీలయొక్క కార్యకారిణి కమెటీ ఎన్నికలు జరుపబడును.

ఆ. కనీసము పది పట్టీ కమిటీలు చేరి ఈ మహాసభయొక్క అనుమతిపొందిన నిర్ణీతకాలములో గ్రామము లేక పట్టీ కమిటీల యొక్క కార్యకారిణీ సభ్యుల ప్రథమ సమావేశమునందు తాలూకా కమిటీ ఎన్నికలు జరుపగలవు.

ఇ. కనీసము అయిదు తాలూకాలు చేరి ఈ మహాసభయొక్క అనుమతి పొందిన నిర్ణీతకాలములలో తాలూకా కమిటి కార్యకారిణీ సభ్యులతో కూడిన ప్రథమ సమావేశమునందు జిల్లా కమిటీ ఎన్నికలు జరుగును.

ఈ. జిల్లాకమిటి అధీనమునందు తాలూకా, గ్రామ మరియు పట్టికమిటీలు ఉండును. వారివారి అనుకూలతను బట్టి సంవత్సరము రుసుము నిర్ణయించుదురు.

ఉ. జిల్లాసంఘ సర్వసభ్య సమావేశము తాలూకా, పట్టీ, గ్రామ కమిటీ కార్యకారిణీ సభ్యులతో కూడినదై మహాసభ అధ్యక్షునికి తెలియపరచి సమావేశమగును.

## మహాసభ నిర్మాణము

ఈ మహాసభ సర్వసభ్య నిర్మాణము ఈ క్రింది విధముగా నుండును.

1. ఆహ్వాన సంఘ కార్యకారిణీ సభ్యులు.
2. జిల్లాకు పది, పదుగురు సభ్యులు.
3. హైద్రాబాద్, సికింద్రాబాదు పట్టణములకు 10గురు చొప్పున.
4. మహాసభ అధ్యక్షులు నియమించు 10 గురు సభ్యులు.
5. మాజీ ముగ్గురు అధ్యక్షులు జీవితకాల సభ్యులు.

అ. ఈ మహాసభ సభ్యులలో 10 గురికి ఒకరి వంతున స్థాయీ సంఘము నకు సభ్యునిగా జిల్లా ప్రతినిధులు పంపుదురు. ఆహ్వాన సంఘ కార్య కారిణీసభ్యులు యిద్దరిని పంపుదురు. హైద్రాబాద్, సికింద్రాబాద్ వారు యిద్దరిని పంపుదురు.

ఆ. అధ్యక్షులవారు మొదటి సమావేశములో తమతోసహా 15 గురు స్థాయి సంఘ సభ్యులతో, ఉపాధ్యక్షులు, కార్యదర్శి, కోశాధిపతి సహాయ కార్యదర్శి ఒక కార్యకారిణీ వర్గమును నియమించెదరు.

ఇ. స్థాయిసంఘ సమావేశము సంవత్సరంలో సాధారణంగా రెండు సార్లు జరుగును. నాల్గవ వంతు కోరముండును.

ఈ. ఈ మహాసభ సాధారణముగా సంవత్సరమునకు ఒకసారి స్థాయీ సంఘమువారు స్థలము నిర్ణయించినచోట జరుగును. మహాసభ కోరం మూడవ వంతుగా నుండును.

## స్థాయి సంఘ కర్తవ్యము

ఈ మహాసభ సమావేశము కొరకై చోటు నిర్ణయించుట మహాసభ కార్యకారిణీవారి నివేదికలు పరిశీలించుట, అత్యవసరమైన సమయమునందు (7) ఏడుగురు సభ్యుల సంతకముతో అసాధారణ స్థాయిసంఘ సమా వేశమును పిలుచుట, మహాసభకు విరుద్ధముగాని ఉప నియమావళిని సిద్ధపరచుట, వివిధ కార్యక్రమాలపై తాత్కాలిక ఉపసంఘములను వాటి నియమావళిని సిద్ధపరచుట, ఆహ్వాన సంఘ నియమావళిని సిద్ధ పరచుట, జిల్లా సంఘాల ఎన్నికలను పర్యవేక్షించుట, మహాసభకు విరుద్ధముగా నడచిన వారిపై క్రమశిక్షణచర్య తీసుకొనుట, వారిని తొలగించుట.

## మహాసభ కార్యకారిణి కర్తవ్యములు

మహాసభ ఆదాయ వ్యయముల పట్టిక సిద్ధపరచుట, సభ్యత్వ రుసుమును వ్యక్తిగత చందాలను ప్రోగుచేయుట, మరియు వాటిని పంచువిధానము అధ్య క్షునకు, కార్యదర్శులకు, స్థాయిసంఘమునకు ఖర్చులుపెట్టు విధానము స్థిర పరచుట.

## మహాసభ అంగీకారము

ఈ మహాసభ నియమావళి 5-6-55 నాటినుండి అమలులోకి వచ్చినది. సభ్యత్వం పూర్తి అయి నియమావళిని అనుసరించి ఎన్నికలు జరిగి. ఉప నియమావళి పూర్తియగు వరకు యిప్పుడు పని చేయుచున్న మహాసభ తాత్కాలిక జిల్లాకమిటీలను ఏర్పాటుగావించి వాటిని చట్టబద్ధమైన విధిగా స్థాయిసంఘము యొక్క అంగీకారము పొందేవరకు ఈ మహాసభ పని చేయు టకు సంపూర్ణ అధికారము కలిగి యుండును.

రజిస్టర్డు

నివేదిక 1967.

3-3-43 కాచిగూడ

హైదరాబాదు. 27.



మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహము

# అనుబంధము 1.

ధర్మాకర్తల సంస్థ

## మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహము

(రిజిస్టర్డ్)     3-2-43, కాచీగూడ, హైదరాబాదు.

### : ఆ దా య ము :

| | | | |
|---|---|---|---|
| ముఖ్యనిధి | రు | | 126547.68 |
| ఇండియన్ బ్యాంక్ ఓవర్సీస్ లిమిటెడ్ యివ్వవలసినది | ,, | | 142500.00 |
| ఇతరతరగతుల వారివలన రావలసిన ధనము | ,, | | 78481.80 |
| యస్. సత్యనారాయణగారి వద్దు | ,, | | 235.79 |
| మొత్తం | రు. | | 347765.27 |

### : వ్య య ము :

| | | | |
|---|---|---|---|
| భూమితో సహా భవనముల విలువ | రు. | | 234640.36 |
| అదనపు విశాలమైన భవన నిర్మాణ ఖర్చు | ,, | | 91871.62 |
| కాంక్రీటు మిశ్రమ యంత్రము ఖరీదు | ,, | | 664.80 |
| విద్యుత్ మోటారు పంపుల ఖరీదు | ,, | | 614.18 |
| ఇతరతరగతుల వారికివ్వవలసిన ధనము | ,, | | 19069.94 |
| విద్యుత్శక్తి కొరకు నిల్వయుంచిన ధనము | ,, | | 100.00 |
| దబ్బుగాను, బ్యాంకులో యుంచబడిన ధనము | | | |
| చేతిలో ఉన్నదబ్బు | రు. | 462.44 | |
| ఇండియన్ ఓవర్సీస్ బ్యాంకులో అడిగినప్పుడు | | | |
| ఒసంగు ధనము | రు | 341.93 | 804.37 |
| మొత్తము | రు. | | 347768.27 |

# అనుబంధము 2.

ధర్మకర్త్రుల సంస్థ

# మున్నూరుకాపు విద్యార్థి వసతి గృహము

[ రిజిష్టర్డ్ ]　　　3-3-43 కాచీగూడ, హైదరాబాదు-27

14-11-1964 నుండి 19-10-1965 వరకు ... మరియు ...

20-10-1965 నుండి 31-10-1966 వరకు

: ఆ దా య ము :

| | | | |
|---|---|---|---|
| 1. | మొదటిదళ అనగా 14. 11. 64. నుండి 19. 10. 65 వరకు వచ్చిన విరాళములు | | రు. 127167.00 |
| | శ్రీ బొజ్జం నరసింహులుగారి ద్వారా ఈసా మియాబజారులో మున్నూరుకాపు భవనము విక్రయించిన బాపతు చేరియున్నవి. | రు. 40000.00 | |
| | చందారూపమున రాబడి | రు. 87167.00 | |
| 2. | రెండవదళ 20. 10. 65 నుండి 31. 10. 66 | | |
| | చందాల రూపముల రాబడి | రు. 14149.00 | |
| | ప్రభుత్వ బాలికోన్నతపాఠశాల భవనపు అద్దె | | రు. 4400.00 |
| | వడ్డీమూలమున వచ్చిన బాపతు | | రు. 610.00 |
| | ఇతర ఆదాయములు | | రు. 150.00 |
| | **మొత్తం ఆదాయము** | | **రు. 146476.00** |

: వ్య య ము :

మొదటి తూరి జరిగిన వ్యయము :-

| | |
|---|---|
| పెట్రోలు వెల | రు. 926.07 |
| అచ్చుపనులు, సాదరుఖర్చులు (కాగితములు వగైరా) | ,, 888.59 |

| | | |
|---|---|---|
| ప్రయాణపు ఖర్చులు | ,, | 198.33 |
| మరమ్మతులు | ,, | 112.75 |
| ప్రకటనలు | ,, | 231.60 |
| తపాల ఖర్చులు | ,, | 40.00 |
| ట్రస్టుదస్తావేజు కొరకు స్టాంపులు | ,, | 61.00 |
| సభలు, సమావేశములకు | ,, | 289.00 |
| బ్యాంకు పాసుబుక్కులకు | ,, | 6.00 |
| కూలీలకు | ,, | 32.00 |
| లెక్కల పరిశీలకులకు | ,, | 250.33 |
| ఇతర వ్యయములకు | ,, | 485.32 |
| మొత్తము | ,, | 3520.99 |

రెండవతూరి జరిగిన వ్యయము :

| | | |
|---|---|---|
| పెట్రోలునకు, ప్రయాణములకు | రు. | 386.90 |
| శంఖుస్థాపన మహోత్సవమునకు | ,, | 1167.15 |
| ముఖ్యభవనమునకు పురపాలక సంఘమువారు విధించినపన్ను | ,, | 1181.91 |
| ట్రస్ట్ దస్తావేజు రిజిస్ట్రేషనుకు | ,, | 1625.75 |
| చందాలకొఱకు, ప్రచారమునకు | ,, | 270.00 |
| ఇన్సూరెన్సుకు కట్టినది | ,, | 303.60 |
| ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ వడ్డీచెల్లించిన బాపతు | ,, | 8925.20 |
| కాగితములకు, కలములకు, తపాలాకు, పూజాదులకు | ,, | 310.78 |
| బ్యాంకునుండి వడ్డి | ,, | 45.03 |
| జీతములు | ,, | 920.00 |
| భవనములోని వారిని ఖాళీచేయించుటకు | ,, | 1021.00 |
| లెక్కల పరిశీలకులకు | ,, | 250.00 |
| ఆదాయంకంటే అధికము అయినది | ,, | 126547.68 |
| మొత్తము | రు. | 146476.00 |



ఆదాయవ్యయ పట్టిక పరిశీలకుడు : మూర్తి అండ్ కో

సంస్థ ధర్మకర్తలు చెల్లించవలసిన ఋణములు :

శ్రీయుతులు.

| | | |
|---|---|---|
| మెసర్స్ ఎన్. నర్సింలు ఫర్మ్ | రు. | 23050.00 |
| బొజ్జం నర్సింలు | ,, | 15000.00 |
| అన్నం రత్నయ్య & సన్స్ ఫర్మ్ | ,, | 11000.00 |
| పుప్పాల యాదవరావు | ,, | 5000.00 |
| ఏనుగుల సత్తయ్య | ,, | 3000.00 |
| బిట్ల చిలకయ్య | ,, | 2000.00 |
| ఎన్. నర్సింలు వ్యక్తిగతముగా | ,, | 2000.00 |
| ఎన్. సత్యనారాయణ | ,, | 1789.30 |
| పి. భాస్కరరావు | ,, | 1000.00 |
| పాశం వీరయ్య | ,, | 1000.00 |
| పిల్లి నాగయ్య | ,, | 1000.00 |
| ఎ. పురుషోత్తం | ,, | 1000.00 |
| మూర్తి అండ్ కంపనీ | ,, | 700.00 |
| మున్నూరుకాపు మహాసభ | ,, | 275.00 |
| కే. అంజయ్య | ,, | 140.00 |
| అల్లాడి శ్రీనివాసు | ,, | 27.50 |
| శ్రీమతి ఎన్. రత్నమ్మ | ,, | 5500.00 |
| శ్రీమతి ఏనుగుల అనసూయమ్మ | ,, | 5000.00 |
| మొత్తము | ,, | 78481.80 |

ధర్మకర్తలకు బాకీదార్లుల వలన రాబడి :

| | | |
|---|---|---|
| అహ్మదుల్లా సిద్దఖీ | రు. | 4500.00 |
| మొహమ్మద్ ఇల్యాస్ యాకూబ్ అలీ | ,, | 2500.00 |
| కే.వీ చంద్రయ్య | ,, | 1200.00 |
| పాతాళ జంగయ్య | ,, | 300.00 |
| శోభా ప్రింటింగ్ ప్రెస్ (ముద్రణాలయము) | ,, | 95.00 |
| శ్రీ సి. బాబూరావు సెంటరింగ్ అడ్వాన్సు | ,, | 6568.00 |
| శ్రీ నర్సింహులయ్య కాన్క్రీట్ అడ్వాన్సు | ,, | 1245.00 |
| మున్నూరుకాపు మహాసభ కార్యకారిణీ సంఘం | ,, | 700.00 |

శ్రీయుతులు.

| | | |
|---|---|---|
| మొహమ్మద్ హుసేను ఇసుక అడ్వాన్సు | ,, | 300.00 |
| అడిగల జ్ఞానచందర్ | ,, | 291.00 |
| రీజనల్ ఇంజినియర్ ఎలక్ట్రిక్ ఆపరేషను | ,, | 263.00 |
| దంగు మల్లయ్య | ,, | 10.00 |
| గొల్లపల్లి అంజయ్య | ,, | 135.00 |
| రావలసినవి రాశిములు : | | |
| పర్వతాల నారాయణ | ,, | 251.00 |
| సి ఆర్. సత్యనారాయాణ | ,, | 251.00 |
| విఠల్ | ,, | 216.90 |
| పాపయ్య పార్స | ,, | 151.00 |
| శెట్టి బాబూరావు | ,, | 80.00 |
| సెట్టి శ్రీనివాసు | ,, | 5100 |
| ధనం హనుమంతరావు | ,, | 51.00 |
| **మొత్తం** | ,, | 19069.94 |

: ధర్మకర్తలు :



మోరరాజయ్య, నీలకఠం సత్యనారాయణ, అన్నం రామలింగం,
ఏనుగుల సత్తయ్య, దదువై కిష్టయ్య.

ఆదాయ వ్యయపట్టికపరిశీలకుడు : మూర్తి అండ్ కో